# స్వాతంత్ర్య సమర జ్వాలలు



నా. వి. కాకత్కర్

నవభారతి ప్రచురణలు
హైదరాబాద్

# స్వాతంత్ర్య సమర జ్వాలలు




నా. వి. కాకతకర్

నవభారతి ప్రచురణలు
హైదరాబాద్

ద్వితీయ ముద్రణ
2000 ప్రతులు
జూన్, 1984



**వెల : రు. 20-00**

ప్రచురణ :

**నవభారతి ప్రచురణలు**

3-4-705/4, నారాయణగూడ
హైదరాబాదు - 500 029

ప్రతులకు :

**సాహిత్య నికేతన్**

3-4-852, బరకత్‌పురా
హైదరాబాదు — 500 027

**సాహిత్య నికేతన్**

ఏలూరు రోడ్డు
విజయవాడ — 500 002

ముద్రణ :

**భారత ముద్రణాలయం**

3-4-705/4, నారాయణగూడ
హైదరాబాదు - 500 029

# పరిచయం

శ్రీ నా. వి. కాకత్కర్ రచించిన ఈ గ్రంథ విషయం పూనె నుండి వెలువడే ప్రసిద్ధ మరాఠీ దినపత్రిక "తరుణభారత్" లో ధారావాహికంగా ప్రచురింపబడింది. బాలురనుద్దేశించి సంక్షిప్తంగా వ్రాసినా, స్పష్టమైన వివరణ, సరసమైన భాష కారణంగా అన్ని వర్గాలవారిని ఆకర్షించింది. అందుచేతనే తెలుగులో కూడ దీనిని 1968 లోనే ప్రచురించటం జరిగింది. ప్రథమ ముద్రణ జాగృతి ప్రచురణల తరపున జరిగింది. ఈనాటి యువతరానికి కూడ మన స్వాతంత్ర్య సమర చరిత్ర పఠనం అవసరమనే భావనతో ద్వితీయ ముద్రణకు మేము పూనుకొన్నాం.

మన స్వరాజ్య సంగ్రామ చరిత్ర ఉజ్వలమూ, ఆకర్షణీయమూ, ప్రేరణదాయకమూను. ఎందరో తమ మాతృభూమి దాస్యశృంఖలాలను త్రెంచటానికై తమ సర్వస్వాన్ని పణంగా ఒడ్డి కృషిచేసారు. వారి ధ్యేయనిష్ట, త్యాగం, సేవావ్రతం మనకు ఆచరణీయాలు. చరిత్ర కారులచే గుర్తించబడే భాగ్యం లభ్యమయినవారు కొందరే. అజ్ఞాత

వీరులు అసంఖ్యాకం. వారందరి బలిదానఫలితమే మన స్వరాజ్యం. వారికి మనం సదా కృతజ్ఞులము.

ఈ గ్రంథం బాలురకేగాక అందరికీ ఉపయోగకారిగా ఉండగలదని మా విశ్వాసం. దీనిని తెలుగులో ప్రచురించుటకు అనుమతించిన శ్రీ కాకర్‌కర్‌కు, "తరుణభారత్" పత్రికవారికి, అనువదించి ఇచ్చిన శ్రీ ఉత్తమ్‌కు మా ధన్యవాదాలు.

హైదరాబాదు
జూన్, 1984

సంపాదకులు
నవభారతి ప్రచురణలు

# వి ష య సూ చి క

# ఉపోద్ఘాతము

## స్వతంత్రతా దివ్యలోక ఆకర్షణ

మిత్రులారా! 1947 సంవత్సరము ఆగష్టు 15వ తేదీ మన స్వాతంత్ర్య దినము. ఈనాడే మన భారతదేశము ఆంగ్లేయుల దాస్యము నుండి విముక్తి పొందింది. వందలాది సంవత్సరాల అవిచ్ఛిన్న భీషణ సంగ్రామము తర్వాత మనము స్వతంత్రులమైనాము.

ఏ వాతావరణంలో చిత్తము భయరహితమౌతుందో,
ఎచ్చట తలఎత్తి తిరగడానికి సంకోచము ఉండదో,
ఏ స్థానంలో జ్ఞాన సంపాదనా మార్గంలో అవరోధాలుండవో,
ఎక్కడ సంకుచిత ప్రవర్తన మచ్చుకైన లేదో.
ఎక్కడ శుద్ధ సత్యముతప్ప, ఇతరశబ్దము నోటినుండి వెలువడదో,
ఎక్కడ పరిపూర్ణతను పొందడానికి విశ్రాంతి యెరుగని
క్రియాశక్తి ఎల్లప్పుడు జనం చేతులను ముందుకు చాచునట్లు చేస్తుందో
ఎక్కడ నిర్మల విచక్షణా స్రవంతి, పాడుపడిన ఆచారాల
భయంకర మరుభూమిలో ఇంకిపోదో,
ఎక్కడ నివసించే ప్రజల మనస్సులు ఎల్లప్పుడు
విస్తరించే భావాలవైపును, ప్రయత్నాల వెనుక మొగ్గుతాయో
అటువంటి స్వతంత్ర దివ్యలోకములోనికి నా ప్రియ
భారతదేశము జాగ్రతమైంది.

మిత్రులారా, మీరు చాల అదృష్టవంతులు. స్వతంత్ర వాతావరణంలో జన్మించే భాగ్యము మీకు లభించింది. కాని అరువది సంవత్సరాల క్రితము మన మాతృభూమికి జై కొట్టడం ఒక మహాపరాధంగా పరిగణింపబడుతుండేది. ఆ కాలమే చాల చిత్రమైనది దాస్యయుగము. బానిస జీవనము చాల సిగ్గుచేటైనది.

పైన ఉల్లేఖింపబడిన స్వతంత్రతా దివ్యలోకము*యొక్క కావ్య పంక్తులు విశ్వకవి రవీంద్రనాథఠాకూర్ రచించినవి. వారు విశ్వవంద్యులైన మహాకవి మన జాతీయగీతము "జనగణమన" రచించినది వారే. ప్రపంచమంతటిలో ప్రశస్తమైనదని కొనియాడబడిన నోబెల్ పారితోషికమును గ్రహించిన తదుపరి వారు ప్రపంచ పర్యటన చేస్తుండినారు. పలుచోట్ల వారు ఉపన్యసిస్తుండేవారు. ఆఉపన్యాసాలు వినడానికి విద్వాంసులు, జ్ఞానులు, కళాకారులు మొదలైన విశిష్ట వ్యక్తులు అన్ని చోట్లలో గుమికూడుతుండేవారు. కాని, వ్యక్తిగతంగా రవీంద్రనాథఠాకూర్ ఎంతగొప్పవారైనా, వారొక దాసదేశపు పౌరులేకదా! ఆ కారణం చేత అనేకులు వారిని తిరస్కార దృష్టితో చూసేవారు. వారి ప్రసంగాలను పరిహసించేవారు.

"భారతీయులు, కుక్కలు ఈ ఉపాహారశాలలో ప్రవేశించరాదు" ఇటువంటి వ్రాతలు ఇంగ్లాండులాంటి పురోగామి దేశంలో ఆ రోజుల్లో ప్రముఖంగా కనపడుతుండేవి. ఆనాడు అగౌరవానికి, అప్రతిష్ఠకు అంతు అంటూ ఉండేదికాదు.

అశేష పరిశ్రమతో శివాజీ స్థాపించిన హైందవ స్వరాజ్యము క్రీ.శ. 1818 లో అస్తమించింది. భారతదేశమంతా దాస్యమనే గాండాంధకారంలో పూర్తిగా మునిగిపోయింది. అటుతర్వాత 130 సంవత్సరాలకు స్వాతంత్ర్యభానుడు ఈ దేశంలో ఉదయించాడు. ఈ చీకటి రోజుల్లో భారతీయులమైన మనము ఒక భయంకర సంగ్రామము సాగించాము.

మంచిగంధముతో పూలనుముంచి భగవంతుని చరణాలమీద అర్పిస్తూ "తండ్రీ, నా మాతృభూమికి స్వాతంత్ర్యము ప్రసాదించు" అని వేడుకునే అతి అమాయకమైన సరళ స్వభావులనుండి తమ చేతులతో తమశిరస్సుల నుంచుకొని నాల్కలు చాచే అగ్ని గుండంలో యజ్ఞవేదికమీద బలిదానం చేసే త్యాగమూర్తుల వరకు అనేకులు అనేక విధాల కృషి చేసారు. ఎందుకు చేసారు? ఈ మాతృభూమి స్వాతంత్రం కాపడం కోసమే.

1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామము, వాసుదేవ బలవంత్ తెచ్చిన విప్లవము పం. రామసింహ కూకా సాగించిన ఆందోళన, లాల్ బాల్, పాల్‌ల పోరాటము శరీరాలు పులకింపజేసే విప్లవకారుల సాయుధ సంఘర్షణలు, సత్యాగ్రహ పర్వము, "క్విట్ ఇండియా" అనే ప్రజా విప్లవము, "ఢిల్లీచలో" మహా ప్రస్థానము మొదలైన వివిధ ఘట్టములతో నుండి మనము సాగిరావలసివచ్చింది. ధ్యేయనిష్ఠ, త్యాగము కష్ట సహిష్ణుత, సేవా వ్రతము మొదలైన సుగుణ సంపదను మనము అలవరచుకున్నాము. ఆ పిమ్మటనే స్వాతంత్ర్య సూర్యదర్శనము లభించింది.

ఈ స్వాతంత్ర్య యజ్ఞంలో కొందరు సమిధలైనారు కొందరు యజ్ఞవేదిక పైనున్న పూవులైనారు. కొందరు గంధపు చెక్కలై మరణ పర్యంతము అరిగిపోతూనే ఉండినారు మరికొందరు ఈ అగ్ని ఆరిపోకుండా ఎల్లప్పుడు ప్రజ్వలించడానికి ఇంధనాలైనారు.

అసంఖ్యాకంగా ఉన్న ఈ జ్ఞాత, అజ్ఞాత బంధువులకు మనము కృతజ్ఞులము. మహోగ్రమైన ఈ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను మనము తెలుసుకుందాము. ఈ విధంగా మనము కృతజ్ఞత చూపుదాము.

జయ్ హింద్ ! జయ్ భారత్ ! !

# మొదటి అధ్యాయము

# నవప్రభాతము

శుభ్ర ధవళ హిమాలయము నుండి కన్యాకుమారి వరకు వ్యాపించి యున్న ఈ విశాల హిందూస్థానము మనదేశము. స్వదేశము. ఇది మనకు స్వర్గాన్ని మించిన ప్రియతమ జన్మభూమి. పరమ పవిత్ర మాతృభూమి. ఈ దేశపు అత్యున్నత వైభవంకోసం మన పూర్వులు తమ జీవితాలను అర్పించారు. కృతార్థులైనారు. ఈ భూమిలోని కణ కణము, ప్రతిజలకణము మనము పవిత్రంగా ఎంచుకుంటూ వస్తున్నాం. మనము ఈ గడ్డమీద జన్మించాము. ధర్మజ్ఞులవలన సత్ప్రవర్తనకు, సదాచారానికి ఒరపడి దిద్దుకున్నాము. ఈదేశపు సంస్కృతవాణి 'కృణ్వంతో విశ్వ మార్యం' అని సాకర్ధంగా, ప్రభావయుతంగా ప్రపంచంలో ఉద్ఘోషించింది. ఒకటి, రెండు కాదు— అయిదువేల సంవత్సరాల అఖండ సర్వ శ్రేష్ఠ గౌరవపూర్ణ పరంపర దానివెనకాల నిలచిఉంది. మర్యాదా పురుషోత్తముడు శ్రీరామచంద్ర ప్రభువు, శ్రీ కృష్ణ భగవానుడు, గోబ్రాహ్మణ ప్రతిపాలకుడు శ్రీ ఛత్రపతి శివాజీ మహారాజు, విశ్వ వంద్యుడు స్వామి వివేకానంద, ప్రాతః స్మరణీయుడు శ్రీ లోకమాన్య తిలక్ మొదలైన భారతమాత సుపుత్రు లెందరో మన యీ మాతృభూమి యొక్క, మన యీ హిందూ సంస్కృతియొక్క పరువు ప్రతిష్ఠలను పెంపొందించారు. క్రొత్త తరాలవారిని ఒక అత్యున్నతాదర్శానికి వారసులుగా చేశారు.

## మాతృభూమి చిత్రపటము

మన మాతృభూమియొక్క చిత్రపటాన్ని మీ కనులముందుకు తెచ్చుకోండి. ఈ నాటి భారతదేశ చిత్రపటము కనిపించగానే మనస్సు దుఃఖముతో విలవిల్లాడుతుంది. ఏ సింధు నదీ పవిత్ర తీరంలో మహర్షులు, మహామునులు గొప్ప గొప్ప యజ్ఞాలు చేశారో, ఆ సింధునది నేటి భారతమాత చిత్రంలో కనిపించనే కనిపించదు. బ్రహ్మపుత్రానది, కైలాసముకూడ కనిపించవు. మానసరోవరము మాయమైంది. చిన్నతనంలో మన మనస్సులలో నించిన భారతదేశ చిత్రపటంలో సింధునది ఉంది. బ్రహ్మపుత్ర, కైలాసముకూడ ఉండినవి. ఆ చిత్రం ఈనాడున్నంత సంకుచితముగా ఉండేదికాదు అది విశాలమైంది 1500 సంవత్సరాలకంటె ముందు నుండి మనము ఆ విశాల భారతదేశాన్నే మాతృభూమిగా ఎంచుకుంటూవచ్చాము దానినే భరతఖండ మని పిలుస్తూ వచ్చాము అదే మన రాష్ట్రము, ప్రియతమ భారతదేశము.

చారిత్రక యుగంలో పైన చెప్పబడిన భారత వర్షాన్ని హరించే ప్రయత్నాలు గ్రీకులు చేశారు. హూణులు చేశారు. శకులు కూడ కబళించే ప్రయత్నాలు చేశారు. కాని చంద్రగుప్తుడు గ్రీకులను తన్ని తరిమివేసాడు విక్రమాదిత్యుడు హూణులను, శాలివాహనుడు శకులను హతమార్చారు. ఈ గడ్డమీద ఆక్రమణదారుల ఊరూ, పేరు కూడ లేకుండా చేసారు. దీని తర్వాత వచ్చింది ఇస్లాము. ఢిల్లీ మీద ప్రభుత్వాన్ని సాగించిందది. క్రీ. శ 1500 నుండి 1800 వరకు, దాదాపు 300 సంవత్సరాలు ఈ దేశంలో మొగలులు విజేతలుగా ఉండినారు. క్రీ శ 1600 లో ఈ దేశమంతా పాకిస్తాన్ అయిపోయింది. అయితే రాయగఢ్ కోటలో ఛత్రపతి శివాజీ హైందవ స్వారాజ్య స్థాపనచేశాడు. శివాజీ భారతదేశానికి రాజైనాడు. ఛత్రపతి శివాజీ విజయధ్వజ మగు భగవాధ్వజము అశ్వమేధ యజ్ఞాశ్వములాగా, అజేయంగా, సగౌరవంగా

రామేశ్వరము నుండి కటక్ వరకు భారత భూమిలో విహరించింది. క్రీ శ. 1700 నుండి 1798 వరకు భారత సమ్రాట్టులు హిందువులే. మొగలుల సింహాసనము ముక్కచెక్కలై పోయింది. ముసల్మాను ప్రభుత్వ అధికారం నుండి పంజాబు ప్రాంతాన్నంతా సిక్కులు విముక్తం చేసారు. వారి రాజ్యము కాబూల్ వరకు వ్యాపించి ఉంది నేపాల్ లో గూర్ఖాల రాజ్యముండింది

## నూతన రాహుగ్రహము

అయితే ఈ సమయంలో సప్తసముద్రాలు దాటుకొని ఒక నూతన రాహుగ్రహము ఇక్కడకు వచ్చింది. ఈ రాహువు పేరు ఆంగ్లేయులు. వాళ్ళు చాలా ధూర్తులు, నేర్పరులు. కపటనీతిపరులు. నెత్తిమీద టోపీ ఒక చేతిలో త్రాసు, మరొక చేతిలో విచ్చుకత్తి — ఈ టోపీ వాలాలు మొదట్లో వ్యాపారమనే మిషతో పలుచోట్ల వ్యాపార కేంద్రాలు తెరచారు. వాటి సంరక్షణకు సేనలను తయారు చేసారు. ఆనాటి భారతదేశ పరిస్థితిని వాళ్ళు అతి సూక్ష్మంగా పరిశీలించారు అధ్యయనం చేశారు. ఎంతో సంపన్నమైన దేశం వేలకొలది సంవత్సరాల పోరాటాలతో అలసిపోయిన దేశం, అంతఃకలహాలతో మరీ బలహీనమైన దీనస్థితిలో ఉన్నదేశం. ఇదే అదను అని గ్రహించారు వాళ్ళు. భారతదేశము మీద తాను సార్వభౌమత్వము స్థాపించినట్లు ఈస్ట్ ఇండియా కంపెనీకి మధురస్వప్నాలు కనపడ సాగాయి. క్రీ శ, 1688 లో ఆ కంపెనీ ఇంగ్లాండు రాజు నుండి ఒక విశేషాధికార పత్రాన్ని పొంది, సేనను సమకూర్చుకొని హిందూస్థానమును జయించడానికి నాంది జరిపింది.

సప్తసముద్రాలుదాటి గుప్పెడు మంది ఆంగ్లేయులు మన దేశానికి వచ్చిచేరారు.వారివద్ద అతి నూతన ఆయుధాలు ఉండినవి. పూర్తిగా అనుశాసనబద్ధమైన సేన ఉండింది. దానితోపాటు అత్యుత్తమ చాతుర్యము.

కూడ వారి కుండింది. మెల్ల మెల్లగానే అయినా దృఢంగా ముందడుగు వేస్తూ 1805 నాటికి భారతదేశపు తూర్పుతీర ప్రాంతాన్ని వాళ్ళు తమ స్వాధీనము చేసుకున్నారు. ఆనాడు భారత చక్రవర్తులు మహారాష్ట్రులు. కాని అంతఃకలహాలతో వాళ్ళ రాజ్యశక్తి గుల్లబారి బలహీనమై ఉండింది. సింధియా, హోల్కార్, గాయక్వాడ్, నాగపూర్ భోంస్లాలు ఒకరికొకరు శత్రువులుగా ఉంటూ కేంద్ర ప్రభుత్వాధికారి అయిన పీష్వాను ద్వేషిస్తూ ఉండినారు. ఆంగ్లేయులు ఒక్కొక్కరినే బుజ్జగిస్తూ, దగ్గరకుదీస్తూ, తమ ఆధీనంలోకి తెచ్చుకుంటూ పీష్వాను ఓడించారు. రెండవ బాజీరావు 8 లక్షల రూపాయలు పెన్షన్ తీసుకొని ఉత్తర భారత దేశంలో కాన్పూరుకు సమీపాన బ్రహ్మవర్తంలో నివసించడానికి వెళ్ళి పోయాడు. దక్షిణాన టిప్పు సుల్తాన్ అంతకుముందే ఓడిపోయాడు. అతి దైన్య స్థితిలో నైజాము ఆంగ్లేయుల శరణు జొచ్చాడు. పంజాబులో రంజిత్‌సింహ ఓడిపోయాడు. సింధియా హోల్కార్, గాయక్వాడ్, నాగపూర్ భోంస్లాలు ఆంగ్లేయులకు లొంగి తమ జీవన యాత్ర సాగింప పూనుకున్నారు. స్వరాజ్యము తుదముట్టింది. స్వధర్మము మంటగలిసింది.

## భగవా ధ్వజము అవనతము

కొలది దినాల తర్వాతిమాట. ఛత్రపతి శివాజీ అధిష్టించిన సింహాసనాన్ని అధిష్టించి అతని వంశీయులు పరిపాలన చేస్తూవచ్చిన సతారా రాజ్యము పరిసమాప్తము చేయబడింది. హిందూ సమాజ హృదయానికి ఒక భయంకరాఘాతము తగిలింది. బ్రహ్మవర్తములో పీష్వా హతాశుడైనాడు. స్వధర్మము, స్వరాజ్యముల సంరక్షణకు నిర్మింపబడి ఇప్పటివరకు ఈ దేశములో సగౌరవముగా రెపరెపలాడుతూ ఉండిన భగవాధ్వజము పరాభూతమై క్రిందికి దింపబడింది. బ్రహ్మవర్తంలోని పీష్వా రాజభవనంలో శ్రీ నానాసాహెబ్ పెరిగి పెద్ద అవుతున్నాడు. అతనితోపాటే

రణసేనాని తాత్యాటోపే కూడా పెరుగుతున్నాడు. తాంబే కులంలో జన్మించిన కుమారి మనూ కూడా పెరుగుతున్నది. స్వరాజ్యము యొక్క భవ్యస్వప్న దృశ్యాన్ని ఆ రాజభవనము చూడసాగింది. కాని ఆ భవ్యస్వప్నము చెరగిపోయింది. కష్టమయకాలము దాపురించింది.

ఇక్కడ సతారాలో హాహాకారాలు చెలరేగాయి. ఛత్రపతి ప్రతాప సింహునకు దిక్కుతోచలేదు. ఆయనకు విశ్వాసపాత్రుడైన రంగో బాపుజీ కళవళపడ్డాడు. ఆయన యేమీ మాట్లాడడు. అన్నము, నీరు ముట్టడు. 'అజింక్య తారా' అను పేరుగల కోటలో కూర్చొని పిచ్చివానిలాగా ఆకాశమువైపు చూస్తుండేవాడు. ఒకనా దొక చమత్కారము జరిగింది. రంగో బాపుజీ ఎక్కడికో వెళ్ళిపోయాడు. అయన ఉనికి కూడా తెలియదు. కాని, అకస్మాత్తుగా ఒక రోజున రంగోబాపుజీ సప్త సముద్రాల కావల ఉన్న ఆంగ్లేయుల రాజధాని లండన్‌లో ఉన్నట్లు తెలియవచ్చింది. అందరూ ఆశ్చర్యచకితులైనారు. ఆంగ్లేయులకు కూడ ఇది భయసంభ్రమాలను కలిగించింది. ఈస్ట్ ఇండియా కంపెనీకి ఆచూకి అయినా తెలియకుండా ఈ సాహసి ఇంగ్లాండు చేరుకున్నాడు. ఔరంగజేబును మోసగించి ఆగ్రా నుండి మాయమైపోయిన ఛత్రపతి శివాజీలాగే రంగోబాపుజీ సతారానుండి, బయలుదేరి తిన్నగా కైబరు కనుమదాటి అరబ్ యాత్రికులతో పాటు బేరూత్ చేరాడు తనను ఇతరులు గుర్తించ కుండా మారు వేషంలో ఈ యాత్ర సాగించాడు. అనేకమైన కష్టాలు ఎదుర్కొంటూ ఆయన బేరూత్ నుండి మాల్టా చేరుకున్నాడు. ఇక్కడ అదృష్టం ఆయనకు చేయూతనివ్వడం మానుకుంది. తెచ్చుకున్న డబ్బంతా వ్యయమయిపోయింది. కాని ఈ మహాసాహసి అధైర్య పడలేదు. ఎన్నో విధాల పరిశ్రమించి చివరకు ఆయన లండన్ చేరుకున్నాడు.

## శత్రు శిబిరములో

1840 నుండి 1853 వరకు పూర్తి 13 సంవత్సరాలు ఆయన ఇంగ్లండులో నివసించాడు. శత్రు శిబిరంలోకి వెళ్ళి ఛత్రపతియొక్క రాజదూతగా ఒంటరిగానే పోరాటము సాగించాడు. వంటిమీద లాల్చి, భుజంమీద ఉత్తరీయం, తలమీద తలపాగా, నొసట తిలకము— ఈభారతీయ వేషంలో ఈ వ్యక్తి పలుతావులలో ఉపన్యసిస్తుండేవాడు. పరిశుద్ధమైన ఆంగ్లభాషలో మాట్లాడుతూ ఈస్టిండియా కంపెనీయొక్క అన్యాయ ప్రవర్తన. అది భారతదేశంలో సాగిస్తూ ఉన్న దౌర్జన్యాలు, అత్యాచారాల నిజస్వరూపం ఆంగ్లేయ ప్రజా బాహుళ్యానికి తెలియజెప్పే ప్రయత్నం చేస్తూ ఉండినాడు. రంగోబాపుజీ అనేకమైన సభలలో ఉపన్యసించాడు అనేక స్థానాలలో పర్యటించాడు. వార్తాపత్రికలలో వ్యాసాలు వ్రాసాడు.



లండన్‌లో ఈస్ట్ ఇండియా కంపెనీ సంచాలకులసమావేశంలో ఆంగ్లేయుల అన్యాయాలను, అత్యాచారాలను గురించి ప్రసంగిస్తున్న శ్రీ రంగోబాపుజీ

పార్లమెంటు సభ్యులను కలిసి మాట్లాడాడు. ఆంగ్లేయ ప్రజకు ఈస్టిండియా కంపెనీ యొక్క సత్య స్వరూపాన్ని తెలియబరచి మేల్కొలిపాడు. ఎంత ప్రచండమైన తీవ్ర ప్రయత్నము! పార్లమెంటు సమక్షంలో అయన ఈస్టిండియా కంపెనీ చేసే అత్యాచారాల వేదనామయ గాథను తెలియబరచి న్యాయాన్ని గూర్చి బడాయిలు చెప్పే ఆంగ్లేయ ప్రభుత్వాన్ని "ఇదేనా మీ న్యాయము ? ఇదేనా న్యాయంగా నడిచే మీ శాసనం ?" అని సవాల్ చేసి అడిగాడు. అరవైవేల సంతకాలతో వందకు మించి వినతి పత్రాలను రంగోబాపుజీ పార్లమెంటుకు సమర్పించాడు. దీనికి ఋజువులు ఈనాడు కూడ మనకు దొరుకుతాయి.

రంగోబాపుజీ చేసిననిర్విరామ కృషి ఫలితంగా 1848 ఫిబ్రవరిలో ఈస్టిండియా కంపెనీ రంగోబాపుజీ నాహ్వానించి అయన చెప్పదలచుకొన్న విషయాన్ని సంచాలకుల ముందుంచడానికి అవకాశమిచ్చింది. రంగోబాపుజీ ఆంగ్లంలో విద్వాంసుడే. అయినా కంపెనీ సంచాలకుల ముందు ఆయన ఆంగ్లంలో మాట్లాడలేదు. స్వాభిమానము, రాష్ట్రభక్తి ప్రకటిస్తూ ఆయన మాతృభాషలో ఉపన్యసించాడు. ఆయన స్నేహితుడైన మేజర్ గ్రహం ఆ ఉపన్యాసాన్ని అనువదించాడు. ఆ ఉపన్యాసము ఎంతో ఉత్సాహ పూరితంగాను, ఉత్కంఠతోను స్వదేశ ప్రేమ భరితంగాను ఉండినది.

కాని అదృష్టం కలిసిరాలేదు. ఈ ప్రయత్నాల తరువాత స్వరాజ్య ప్రాప్తికి ఇది మార్గం కాదని రంగోబాపుజీ తెలుసుకున్నాడు. "దొంగల గుంపుకు న్యాయం-అన్యాయం, ప్రతిష్ట-అప్రతిష్ట- ఈ ఆలోచనల ఆవశ్యకత లేదు" అని తనకు తాను నచ్చచెప్పుకున్నాడు. హిందూ స్వరాజ్యాన్ని నశింపజేయడం ఆంగ్లేయుల ఏకైక వాంఛ. ఇది ఆయన చక్కగా గ్రహించాడు. అటు పిమ్మట ఆయన క్రొత్త ప్రయత్నాలలో నిమగ్నుడైనాడు.

# సమస్యా పూరణము

ఇట బ్రహ్మావర్తంలో వ్యాకులత హెచ్చైంది. నానా సాహెబ్ పీష్వా అజీముల్లాను లండన్‌కు పంపాడు. అక్కడ అజీముల్లా రంగో బాపుజీలు కలుసుకున్నారు. వర్తక కంపెనీ నీతి యేమిటో పీష్వా రాయబారికి రంగో బాపుజీ తెలియజేశాడు. ఆంగ్లేయులను భారతదేశం నుండి పారద్రోలడానికి యుద్ధమొక్కటే సాధనమని రంగో బాపుజీ అజీముల్లా మనఃఫలకంమీద చెరగని ముద్ర వేశాడు. అన్ని విషయాల మీద సమాలోచన సమగ్రంగా అతి రహస్యంగా జరిగింది. అటు పిమ్మట రంగో బాపుజీ భారతదేశానికి పయనమైనాడు. అజీముల్లా ఆంగ్లేయుల బలాబలాలు అంచనా వేసుకోడానికి యూరోపు పర్యటనకు బయలుదేరివెళ్ళాడు. ఆయన అనేకులను కలుస్తూ వారితో సమాలోచనలు చేస్తూ రష్యా చేరుకున్నాడు. శత్రువుయొక్క శత్రువు మనకు మిత్రుడౌతాడనే నీతి ననుసరించి ఆయన రష్యా స్నేహాన్ని పొందాడు. ప్రత్యక్షంగా సహాయం చేస్తామనే హామీతో, మనస్సులో ఒకానొక పెద్ద ఎత్తుగడతో ఆయన బ్రహ్మావర్తానికి తిరిగి వచ్చాడు.

బ్రహ్మావర్తంలో నానా సాహెబ్ పీష్వా ఉద్విగ్న హృదయంతో తన రాజభవనంలో పచారుచేస్తూ ఉన్నాడు. మధ్య మధ్య సమర వీరుడు తాత్యాటోపేతో ఆలోచిస్తూ ఉన్నాడు. ఏదో చేయాలి అని మనస్సులో ఆరాటము ఉన్నట్లుంది. పీష్వా సమర్థ రామదాసస్వామి సూక్తిని 'కేల్యానే హోత ఆహేరే' (సాధనమున సర్వము సమకూడును) ప్రారంభిస్తాడు. వెంటనే తాత్యాటోపే దానినందుకుని 'అధికే రేచే పాహిజే' (కాబట్టి ముందు కార్యారంభము చేయాలి) అని మిగిలిన భాగము పూర్తి చేస్తాడు. శ్రీ సమర్థ రామదాసస్వామి సూక్తిలో ఈ సగభాగమే వాళ్ళకు గుర్తుంది. మిగిలిన సగము గుర్తుకు రాలేదు. దానితో సమస్యా పూరణం జరగలేదు.

# సమర్థ రామదాసస్వామి సాక్షాత్కారము

కాన్పూరులోని ఒక జనసంచారములేని మైదానం. సేనాపతి తాత్యా టోపే ఒంటరిగా నిలచి, శూన్యమనస్సుతో ఆకాశములోని తారలను లెక్కిస్తున్నాడు. నాల్గువైపుల చీకట్లు ముసురుతున్నాయి. అకస్మాత్తుగా 'జయ జయ రఘువీర' అనే గంభీర ధ్వని వినిపించింది. ఆ ధ్వని ఆగిపోతూ ఉండగానే రామదాసస్వామి అనుయాయి వేషంలో ఒకసన్యాసి కనపడ్డాడు. ఆయన తాత్యాను సూటిగా యిలా ప్రశ్నించాడు ! "తాత్యా దేని కోసము ఇంతగా ఆలోచిస్తున్నావు?' సేనాపతి తాత్యా ఆశ్చర్య చకితుడైనాడు. మనస్సును కుదటపరచుకొని స్వామీజీకి నమస్కరించాడు. స్వామీజీ తాత్యాను తన చేతులతో లేవనెత్తి మరలా అడిగాడు. 'ఇంతగా దేనికోసము మధనపడుతున్నావు ?' తాత్యా టోపే ఇలా బదులు చెప్పాడు. 'భారతీయ స్వరాజ్య భవితవ్యాన్ని గూర్చి. 'సాధనమున సర్వము సమకూరుతుంది. ముమ్మందుగా కార్యారంభము చేయాలి'—సమర్థ రామదాసస్వామి సూక్తిలోని ఈ రెండు పంక్తులే జ్ఞాపకమున్నాయి. ఆ తరువాత భాగము నాకేమీ స్ఫురించడంలేదు. స్వామీజీ, తమరు నా సమస్య పూర్తి చేయండి' అని అంటాడు

స్వామీజీ ఎంతో ఆప్యాయతతో తేలికగా నవ్వి ఇలా అంటాడు. "పిచ్చివాడా ! సమర్థ రామదాస స్వామిని మరచిపోయాము. కాబట్టి ఇటువంటి కాలము దాపురించింది. స్వరాజ్యము మట్టిగలిసింది. స్వధర్మము ఇంకిపోయింది. బాగా విను ! "వన్హీతో చేతవావారే. చేతవిత్రా చ చేతతో కీల్యానే హోత అహేరే, అధికే లేదిపాహిలే." (చిచ్చు రగించాలి. రగిలిన చిచ్చు నాల్కలు చాచుతుంది. సాధనమున సర్వము సమకూడుతుంది, అయితే ముమ్మందుగా కార్యారంభం చేయాలి.) తాత్యాటోపే సమస్య తీరిపోయింది. ఆకాశంలో చంద్రుడుదయించాడు. నలువైపుల వెన్నెలలు విరిసాయి.

తాత్యాటోపే కలుసుకున్న సాధువు ఎవరో కాదు మన రంగోబాపుజీయే. సాధువేషంలో తాత్యాను కలుసుకొని రంగోబాపుజీ తాను ఇంగ్లాండులో చేసిన కృషినంతా వివరించాడు. అజీముల్లా కొనసాగిస్తున్న కృషి తీరుతెన్నులను కూడ తెలియజేశాడు. తాత్యాటోపే ఆ ఆనందంతో ఉక్కిరిబిక్కిరైనాడు. అతని ఉత్సాహము నూరు రెట్లు పెరిగింది. తాత్యాటోపే, రంగోబాపుజీ, నానాసాహెబ్ పీష్వా, అజీముల్లాల రహస్య సమావేశము జరిగింది. ఆనాడు భారత స్వాతంత్ర్యము కోసము ఒక భవ్య. దివ్య, మంగళమయ, మహోగ్ర యజ్ఞానికి రూపురేఖలకు ప్రాతిపదిక తయారు చేయబడింది. అది 1856 వ సంవత్సరము.



## రెండవ అధ్యాయము

# రక్తకమలము - రొట్టె

శత్రుశిబిరంలో, ముఖ్యంగా లండన్ నగరంలో నివసించినందుననే రంగో బాపుజీకి ఆంగ్లేయుల కపటనీతి పూర్తిగా అవగాహన అయింది. ఆ రోజుల్లో ఆంగ్లేయ ధూర్తులు ఇలా అంటుండేవారు. "హిందుస్థాన్‌లో ఒక మూలనుండి మరొక మూలకు సర్వత్ర క్రైస్తవ మత పతాకను ఎగరవేయడం కోసము, భారతదేశ విశాల సామ్రాజ్యాన్ని అంగ్లేయులకు భగవంతుడే ప్రసాదించాడు ఏ విధంగా గానీ హిందుస్థానాన్ని పూర్తిగా క్రైస్తవము చేసేయాలి; ఈ మహత్తర కార్యంలో ఏ కొంచెము కూడ ఆలస్యం జరగకూడదు అందుకని ప్రతివ్యక్తి నిర్విరామ కృషి జరపాలి.

## అజీముల్లా యూరోపు పర్యటన

రంగో బాపుజీ ఇంగ్లాండులో ఉండగానే ఒక మహత్తర రణ యజ్ఞానికి స్థూలంగా ప్రణాళిక వేసి ఉంచాడు. అక్కడే ఆయన షిష్వారాయబారి అజీముల్లాను కలుసుకోవడం జరిగింది. ఇద్దరు కూడ రాజనీతి నిపుణులు. ఇద్దరూ కలిసి ఒక కార్యక్రమాన్ని నిశ్చయించుకున్నారు. ఆ మేరకు రంగోబాపుజీ తిన్నగా హిందుస్థాన్‌కు తిరిగి వచ్చాడు. అజీముల్లా సూక్ష్మ పరిశీలన జరపడానికి యూరోపుకు వెళ్ళాడు. మొదట అజీముల్లా టర్కీ వెళ్ళాడు. అప్పుడు టర్కీ, రష్యాలలో యుద్ధము జరుగుతూ ఉన్నది. ఇంగ్లండు కూడా అందులో పాల్గొంటూ ఉన్నది. 'సెబాసపూల్'లో టర్కీ చేతిలో ఇంగ్లండు ఘోర పరాజయము పొందింది. అక్కడనుండి

అజీముల్లా ఈజిప్టు, రష్యా దేశాలకు వెళ్ళాడు. రష్యాలో ఆయన పీష్వా తరపున రాజకీయ సమాలోచనలు కూడ జరిపాడు. భారతదేశంలో పీష్వా విప్లవ పతాకను ఎగరవేయటంతోటే, తాను ఇరాన్‌గుండా సహాయం చేయడానికి వస్తానని రష్యా మాట యిచ్చింది. ఈ విధంగా ఇంగ్లాండు శక్తి సామర్థ్యాలు అంచనా వేసుకొని అజీముల్లా బ్రహ్మావర్తానికి తిరిగి వచ్చాడు.

ఇక్కడ రంగోబాపుజీ సతారాకు వెళ్ళి ఛత్రపతి సింహాసనానికి ప్రణామ మర్పించి బ్రహ్మావర్తంలో పీష్వాను కలుసుకోడానికి బైరాగి వేషంలో బయలుదేరాడు. ఆ వేషంలోనే కాన్పూరులో తాత్యాటోపేను కలుసుకున్నాడు. "చిచ్చు రగిలించాలి" అనే సూత్రంతో తాత్యాటోపే సమధి కోత్సాహంతో రంగో బాపుజీని వెంటబెట్టుకొని బ్రహ్మావర్తానికి పయనమయినాడు.

బ్రహ్మావర్తంలో పీష్వా రాజభవనంలో నలుగురు వ్యక్తులు-పీష్వా సేనాపతి తాత్యా, రంగోబాపుజీ, అజీముల్లా రహస్యంగాసమావేశమయినారు ఆ సభలో ప్రత్యక్షంగా తేజస్సు, శౌర్యము, ప్రజ్ఞ, అచంచల శ్రద్ధ సాకారంగా నిలచినట్లనిపించింది. బ్రహ్మావర్తమెక్కడ? కన్యాకుమారీతీరధీర సాగర మెక్కడ ? అనుకున్న మహాయజ్ఞము సువ్యవస్థితంగా నిర్వర్తింప బడడానికి ఆ మహాసముద్రము తన గాంభీర్యాన్ని ఆ సమావేశానికి అందించింది. సభామధ్యంలో ఒక రక్తకమలము తన కాంతులను నలు దిక్కుల విరజిమ్ముతూ ఉంది. ఆ సమావేశ భవనంలోని మహాపురుషుల చిత్రాలు పీష్వాతో "శ్రీమంత్ పీష్వా, కత్తిదూసి ముందడుగువేసే తమరు ఏయే క్రొత్త కలలు కంటున్నారు? శ్రీమంత్, నూతన సంవత్సరములో తమరు ఏయే క్రొత్త బీజాలు నాటుతున్నారు?" అని అడుగుతున్నట్లని పించింది.

మింటికెగసే అగ్నికీలలలాగా పౌరుషము, పరాక్రమము ఆ రహస్య రమ్య వాతావరణాన్ని క్రమ్మివేశాయి. అందరు ఆ తేజస్సులో మునకలిడినారు. ఏ మాత్రము శబ్దంకూడ వినపడడం లేదు. అయితే సంభాషణలు జరుగుతూనే ఉన్నాయి. ఒక మహాయజ్ఞ సంకల్పము ఆకారాన్ని ధరిస్తూ ఉంది.

నానాసాహెబ్ పీష్వా ఆ రక్తకమలాన్ని చేతిలోకి తీసుకున్నాడు. స్వధర్మానికి చిహ్నమైన ఆ పుష్పము, స్వధర్మ రక్షణార్థము. హైందవ స్వరాజ్య పునరుద్ధణకోసము సంకల్పింపబడిన రణయజ్ఞానికి శపథము. ఖడ్గాన్నేకాదు, త్యాగము, తపస్సు సాధనలకోసము ఎలుగెత్తి పిలిచే భేరీ కాహళధ్వానమది. యుగయుగాల సమృద్ధిని, సాఫల్యాన్ని ఆహ్వానించే రణవాద్యమది.

సాధన తానై రక్తహస్తాలతో వేచి నిలిచింది. విస్ఫులింగాలతో ప్రకాశించే ఒక ప్రచండ వహ్ని ప్రజ్వలించబోతున్నది. ప్రతియొక్కరి హృదయంలో ఈ అగ్నిజ్వలించినపుడు, ప్రళయమెంత దారుణంగా ఉంటుందో ప్రపంచానికి ప్రత్యక్షం చేస్తుంది ఖడ్గధారి అయిన భరత ఖండము ఎంత చండ ప్రచండంగా ఉంటుందో తెలుపుతుంది.

## శంభాజీ ఆత్మాహుతి

రక్తకమలము రూపంలో హిందూస్థాన్‌యొక్క సమగ్ర తేజోమయ చరిత్ర సాకారమై నిలిచింది. శౌర్యాగ్ని నవరసాన్ని ఉత్సాహపూరితం చేసింది. ఛత్రపతి శంభాజీ మహారాజు ధర్మంకోసం, ధర్మరక్షణకోసం అనేక కష్టాలను వీరత్వంతో సహించి మరణించాడు. ఆయన చేసిన బలిదానము ఆ రక్తకమలము రూపంలో "శూలము, ఖడ్గము, అగ్నివీటితో మన పూర్వులు మనము ఆడుకుంటున్నాము. క్రీడాప్రాయంగాఆత్మాహుతి చేసి భారతమాత స్వాతంత్ర్య తిలకాన్ని తేజోమయం చేశాం. అట్టి మన

తల్లిని బానిసగా చేసేదెవరు? మంటలెగసే అగ్నిని చేతిలోకి తీసుకునే దెవరు?" అని అడుగుతున్నది.

పీష్వా గంభీరంగా ఉన్నాడు. సమస్త తేజాస్ని బలాన్ని అస్వాదించి తేజస్వి అయి భయంకర నరసింహమూర్తిగా తోచినాడు. ఆయన రక్త కమలము నందుకొన్న తన చేతిని పైకెత్తినాడు. యుగయుగాల చిరనిద్రను చెదరగొట్టుతూ ఒక దివ్యధ్వని అనాయాసంగా వినిపించింది. హఠాత్తుగా ముగ్గురిచేతులు ముందుకు వచ్చాయి. ఓ రక్తకమలమా! నీవు చీకటిని తొలగించు, మరల జ్యోతిని వెలిగించు, నరసింహుని వంశం నీది.



నానాసాహబ్ పీష్వా ఆ రక్త కమలాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు. ఆయన చేయి పైకెత్తాడు. యుగయుగాల నిద్రను భంగపరచే దివ్యము, రహస్య మయము అయిన ఒక ధ్వని సహజంగా నినదించింది. ముగ్గురి చేతులూ ఒకేసారి ముందుకు వచ్చాయి.

ఆ రక్తకమలాన్ని మొదట తాత్యాటోపే చేతులలోకి తీసుకున్నాడు. దానిని గుండెకదుముకొని రంగోబాపుజీకి ఇచ్చాడు. శ్రీ రంగో బాపుజీ భావోద్రేకంతో కంపించి పోయినాడు. అయన ఆ పుష్పాన్ని అజీముల్లాకు ఇచ్చాడు. అజీముల్లా మహోన్నత ఆత్మ విశ్వాసంతోను, అత్యంత శ్రద్ధాభక్తులతోను ఆ రక్తకమలాన్ని పీష్వా చరణ కమలాల మీద ఉంచాడు.

## క్రాంతి కావ్య జనయిత్రి

భారతదేశ ప్రథమ స్వాతంత్ర్య యుద్ధానికి ప్రతిజ్ఞా స్వీకార మహోత్సవమది. పులకరింతను కలిగించే ఈ ప్రతిజ్ఞా స్వీకారము బ్రహ్మావర్తంలో పీష్వా రాజభవనంలో ఈ విధంగా సంపూర్ణమైంది. నానాసాహెబ్ చివరి పీష్వా హిందుస్థాన్ మీద పరాయి ప్రభుత్వబంధాన్ని సడలించి, స్వధర్మ సంరక్షణకోసం స్వరాజ్య ప్రతిష్ఠాపన చేసే బాధ్యత వంశపరంపరానుగతంగా శ్రీ నానాసాహెబ్ మీదనే ఉంది. ఈ దృష్టి తోనే బాల్యంనుండి రాజనీతిలోని సూక్ష్మాలు మెలకువలు ఆయనకు నేర్పబడినాయి. స్వాభిమానము అయనకు జన్మతః వచ్చింది. రత్నస్థగిత కిరీటముతో మఖమల్ దుస్తులలో ఆయనసంచరిస్తున్నప్పుడు ఆ తేజోమయ మూర్తి అనేకులకు శ్రద్ధాకేంద్రమైంది. 1857 నాటి అతిగంభీర విప్లవము అనే మహాకావ్యానికి జనయిత్రి శ్రీ నానాసాహెబ్ పీష్వాయొక్క అపూర్వ ప్రతిభ.

ప్లాసీ యుద్ధంతో హైందవ స్వారాజ్యాన్ని ఆంగ్లేయులు హస్త గతం చేసుకోనారంభించారు. కపటనీతి నిపుణులైన ఆంగ్లేయులు 1818 లో మరాఠా సామ్రాజ్యాన్ని పూర్తిగా కబళించివేశారు. స్వరాజ్యం అస్తమించిన తర్వాత 1857 స్వాతంత్ర్య సమరమునకు దాదాపు 40

సంవత్సరాల కాలము రాజ్య శాసకుల నిరంకుశ నీతి కారణంగా భారత దేశమంతటిలో ప్రజానీకంలోని అన్ని స్థాయిలలో ఒక విధమైన అసంతుష్టి వ్యాపించింది. 1856 లో డల్‌హౌసీయొక్క అన్యాయాలు పెచ్చు పెరిగి పరాకాష్ఠ నందుకున్నాయి. ఆంగ్లేయుల మిత్రుడయిన రంజిత్ సింహ చనిపోగానే అతని ఏకైక పుత్రుని ఆంగ్లేయులు క్రైస్తవునిగా చేసారు. రాణి జిందాకౌర్‌ను అవమానించడంలో, పరిహసించడంలో వారు తక్కువేమీ చేయలేదు. ఒకదాని తర్వాత మరొకటిగా రాజ్యాలను కబళించే భయంకర విధానాన్ని డల్‌హౌసీ అమలుపరచాడు. అయోధ్య నాగపూర్, బుందేల్‌ఖండ్, రోహిలఖండ్, బెనారస్, బంగాల్, మైసూర్ మొదలైన రాజ్యాలన్నీ అపహరింప బడినాయి. వినడానికే ఆశ్చర్యమౌతుంది. కేవలము పది సంవత్సరాలలో దాదాపు 85000 ఇనామ్ భూములు, 21000 జాగీరులు ఆంగ్లేయుల కంపెనీ ప్రభుత్వం హస్తగతం చేసుకుంది.

క్రైస్తవ మత ప్రచారము, విస్తరణల ఉద్యమము మొదలైంది. భారతదేశంలో ఒక్కడైనా హిందువుగాని, విగ్రహారాధకుడు గాని ఉండకుండా చేయడానికి ఆంగ్లేయులు విద్య అనే మిషతో ఒక పెద్ద కుట్ర పన్నారు. భారతదేశ సంపదనంతా దోచుకుని హిందువులను నగ్నంగా క్షుధార్తులుగా చేయడానికి ప్రయత్నాలు సాగాయి. జీవయాత్ర సాగించడానికి మరోమార్గం లేక ప్రజలు ఉదరపోషణకు ఆంగ్లేయుల సేనలో చేరసాగారు. అక్కడకూడ వాళ్ళను ధర్మభ్రష్టుం చేయడానికి ప్రయత్నాలు సాగాయి. క్రొత్తరకము తూటాలకు ఆవుక్రొవ్వు పూయబడుతుండేది. ఈ తూటాల పైనున్న పూతంను సైనికులు పండ్లతో లాగివేయాలని కఠినంగా శాసించారు.

## ఆంగ్లేయులను హతమార్చాలి

నానాసాహెబ్ పీష్వా ఆనాటి పరిస్థితిని పూర్తిగా చక్కగా అవగాహన చేసుకున్నాడు. అందుచేత స్వాతంత్ర్య యుద్ధం రూపురేఖలు తానే ప్రథమంగా తయారుచేసాడు. ఈ యుద్ధం స్వదేశీ, స్వధర్మ విముక్తికోసము, సంపూర్ణ భారతదేశంలో ఒక్కనాడే విప్లవము చెలరేగవలెనని నిర్ణయింపబడింది. ఆరోజు 1857 మేనెల 31 వ తేదీ ఆదివారము, ఆంగ్లేయులు ప్రార్థనలు చేయడానికి చర్చిలలో సమావేశమౌతారు అప్పుడు భారతదేశంలోని ఆంగ్లేయులు ఒక్కరుకూడ మిగలకుండ చంపివేయడానికి పథకము తయారైంది. ఆ మహత్తర సన్నివేశము కోసము ప్రజలలో, సైనికులలో, పదభ్రష్టులైన రాజులలో, సంస్థానాధిపతులలో అంకురించిన అసంతృప్తి అనే నిప్పురవ్వలను ప్రజ్వలింప జేయడానికి కార్యక్రమము రూపొందించబడింది. స్వరాజ్య మహామంత్రముతో ప్రజా సముదాయాన్ని ఏ విధముగా ఉత్తేజితము చేయవలెనో, ఆ రూపురేఖలను కూడ పీష్వా నిశ్చయించాడు. చిన్నవి, పెద్దవి అనే తేడా లేకుండా అన్ని అంశాలమీద చర్చ జరిగింది. ఉద్యమ ప్రారంభదినము నిశ్చయింపబడింది. అక్కడనుండి అందరు రుద్రసామర్థ్యంతో నలువైపులకు కదలి వెళ్ళారు.

## విప్లవ వైతాళికుల ప్రస్థానము

పీష్వా ఆజ్ఞానుసారము ఫకీర్లు, మౌల్వీలు, బ్రాహ్మణులు తాపసులు, కార్యార్థులై కదిలివెళ్ళారు. అనేక వేషాలలో వారు తిరుగసాగారు. కొందరు మాంత్రికులు, కొందరు పగటి వేషగాండ్రు, కొందరు జ్యోతిష్కులు ఈ విధంగా వేషధారణ చేసుకున్నారు. అయితే వీరంతా కూడ ఆ మహాసంగ్రామ సంసిద్ధతకు సైనికులే. వారిది గరుత్మంతునిగతి. ఫైజాబాద్‌కు చెందిన మౌల్వీ అహ్మద్‌షా దేశామంతా పర్యటించాడు.

బారక్‌పూర్, మీరట్, అంబాలా, పెషావర్ మొదలైన వేలాది సైనిక స్థావరాలలో ఈ విప్లవ వైతాళికులు, మౌల్వీలు, పండితుల రూపంలో ప్రవేశించారు. చిచ్చురగిల్చి మంటలెగసేలా చేశారు. ధర్మ యుద్ధ సైనికుడుగా ఒక్కొక్కవ్యక్తి ప్రతిజ్ఞ తీసుకోసాగాడు.

స్వాతంత్ర్యం యుద్ధచిహ్నమైన రక్తకమలము ఒక సైనికుని చేతినుండి మరొక సైనికునిచేతికి అందింపబడేది. ఈ విధంగా రక్తకమల సంచారము ప్రారంభమైంది. ఆ రక్తకమలమును తాకగానే సైనికులు పులకించి పోయేవారు. 'సమస్తము రక్త రంజితము చేయడానికి సంఘటితుల మౌదాము'—అనే విప్లవ సందేశానికి అది గుర్తు. ఈ విధంగా శక్తిశాలురైన సైనికులు వేలసంఖ్యలో త్వరితగతిని ఈ విప్లవధ్యేయ సూత్రానికి కట్టుబడసాగారు

## పల్లెపట్టున రొట్టెల సంచారం

సైనికులు ప్రతిజ్ఞ తీసుకోడానికి ఒక్కొక్క సైనిక స్థావరంలో రక్తకమలము సంచరించిన విధంగానే సామాన్యపౌరులకు విప్లవ ప్రతిజ్ఞ యిప్పించడానికి రొట్టెల రూపంలో విప్లవదూత మెరుపులాంటి వేగంతో గ్రామగ్రామానికి చేరుతుండేది. ఊరి పెద్దవద్దకు మొదట్లో ఆరొట్టెలు వస్తుండేవి. అందులో ఒక చిన్నముక్క తీసి ఆయన తినేవాడు. మిగిలింది ప్రసాదము రూపంలో ఇతరులకు పంచిపెట్టబడుతుండేది. ప్రసాదము తీసుకోడానికి అర్థము విప్లవ ప్రతిజ్ఞ తీసుకోవడమే గ్రామంలో పరం అన్నిరొట్టెలు తయారుకాబడి పొరుగు గ్రామానికి పంపబడుతుండేవి. ఈవిధంగా రొట్టెల సంచారం ద్వారా విప్లవసంఘటన విస్తరించింది.

పీష్వాకు విశ్వాసపాత్రులైన ప్రత్యేక దూతలు భారతదేశంలోని ప్రముఖ స్థానాలకు వెళ్ళారు. ఢిల్లీనుండి మైసూరు వరకుగల సంస్థానాధిపతులందరు విప్లవంలో పాల్గొనవలసిందిగా ఆహ్వానింపబడినారు.

రంగోబాపుజీ స్వయంగా దక్షిణాపథానికి వెళ్లాడు. ఢిల్లీలో పాదుషా దర్బారులోని ప్రముఖుల సభలో (దీవాన్-ఏ-ఖాస్) విప్లవబీజాలు నాటబడినాయి. బహదూర్‌షా, రాజసిరి చతుర రాణి జీనత్ మహల్ కూడా విప్లవోద్యమములో కలిశారు. ఒక సింహాసనము తర్వాత మరి యొకటి. ఒక సైనికుని తర్వాత మరియొకరు. ఒక నగరము తర్వాత వేరొకటి—ఈవిధముగా విప్లవ ప్రతిజ్ఞను స్వీకరించడము జరుగసాగింది విప్లవజ్వాలలెగసే ఆ మహత్తర శుభఘడియ 31-5-1857 కోసము ప్రతి వ్యక్తి ఎదురుచూడసాగారు. గంగాజలము చేతిలోనికి తీసుకొని ప్రతిజ్ఞ తీసుకొనేవారు ఖురాన్‌పై ప్రతిజ్ఞ చేసేవారు. విప్లవకార్యము నిమిత్తము ధనవంతులు తమ డబ్బును వెదజల్లుతుండేవారు. ఇదంతాకూడా ఎంతో రహస్యంగా, ప్రణాళికాబద్ధంగా, అపార సంఘటనా చాతుర్యంతో జరుగు తుండేది. దీన్నిచూచి ఒళ్ళుమండి ఒక ఆంగ్లేయ చరిత్రకారుడు ఇలా వ్రాశాడు—

"రాజద్రోహము, సామూహిక మరణము—ఈ భావాల ప్రసారము నిమిత్తము ఆ దుష్టులు ఎంత నిర్దుష్టమైన ప్రణాళికను కార్యరూపములోకి తేగలిగారో, అంతచక్కని సంపూర్ణ ప్రణాళికను, అంత కౌశల్యంతో కార్యరంగంలోకి తేవడం, శాంతి, సద్భావము ప్రచారము చేయడానికి కంకణం కట్టుకున్న ప్రగతిశీల, ధనిక క్రైస్తవ సమాజానికి కూడ సాధ్యంకాదు."

నానాసాహెబ్ పీష్వా సంఘటనా కౌశల్యం ఎంత అపూర్వము ఆంగ్లేయులు ఈ స్వాతంత్ర్య యుద్ధాన్ని "సిపాయీల తిరుగుబాటు" అని పిలుస్తారు. నానాసాహెబ్‌ను దుర్మార్గుడంటారు. వీరాంగన రాణీ లక్ష్మీ బాయిని రాజద్రోహి అంటారు. సేనాపతి తాత్యాటోపేను సామూహిక మారణ కారకుడు అని అంటారు. ఈ స్వాతంత్ర్య సమర ప్రథమ భాష్య కారుడు స్వాతంత్ర్య వీరసావర్కార్ ఇలా వ్రాస్తాడు :

"పదిలక్షల రూపాయల పెన్షన్‌ఇచ్చి కత్తి బలముమీద బాజీరావ్‌తో ఏ సంధి చేసుకొనబడిందో ఆ సంధి పత్రము మీదనే-వెనుక భాగంలో కాక, రెండేసి పంక్తులనడిమి ఖాళీ ప్రదేశంలోనే వ్రాయబడని అక్షరాలతో 'ఆయుధాలు చేకూడినప్పుడు నేను నాదేశము కోల్పోయిన స్వాతంత్ర్యాన్ని మరల సంపాదించి తీరుతాను' అని ఉల్లేఖించబడి ఉంది. ఇందులో నీతిశూన్యత యేమీలేదు. ఏనాడు పరరాష్ట్రము ఆక్రమణ జరుపుతుందో, ఆక్షణమునుండే పరతంత్ర రాష్ట్రము స్వాతంత్ర్య యుద్ధము చేయడానికి ఎల్లప్పుడు సిద్ధమౌతూనే ఉంటుందని గుర్తించాలి. ఈ యుద్ధాన్ని సిపాయీల కలహము అని ఎలాఅనగలము? నానాసాహెబ్ పీష్వా సిపాయియా? సేనాపతి తాత్యాటోపే ఆంగ్లేయుల సేనానియా? ఆ యుద్ధంలో ఢిల్లీ పాదుషా కూడ భాగస్వామియే. జాతి యావత్తు సాగించిన స్వాతంత్ర్య సమరమది. ఎందరో రాజులు ఆ యుద్ధంలో పాల్గొన్నారు.

## ఉద్యమముయొక్క ప్రత్యక్ష పర్యవేక్షణ

ఈ స్వాతంత్ర్య యుద్ధముయొక్క మూలరహస్యము "ఒక్కుమ్మడి చెలరేగడం". 1857 మేనెల 31వ తేదీ ఈ శుభకార్య ప్రారంభానికై నిర్దేశింపబడిన దినము. ఈ విప్లవ అగ్నిపర్వతము బ్రద్దలు కావడానికి తగిన సన్నద్ధత కోసము స్వయంగా పర్యవేక్షణ చేయడం, ప్రముఖ కేంద్రాలకు వెళ్ళి వారిని కలియడం అత్యావశ్యకమయుంది. అందుకని శ్రీ నానాసాహెబ్ పీష్వా స్వయంగా బ్రహ్మావర్తంనుండి పర్యటన ప్రారంభించాడు-తీర్థయాత్రల నెపంతో. ఆయన తన బంధువైన బాలాసాహెబ్‌ను రాజనీతి నిపుణుడైన అజీముల్లాను వెంటతీసుకొని బయలుదేరాడు. ఢిల్లీ,అంబాలా, సిమ్లా, లక్నో, కాల్పీ మొదలైన అనేక భావి పుణ్యతీర్థాలను సందర్శించాడు. లక్నోలో ఆయన సమావేశము అపూర్వము. ఆయన రాకతో ప్రజల భావనలు పొంగులు వారాయి. లక్నో

విభాగపు ఛీఫ్ కమీషనర్ సర్ హెన్రీ లారెన్సు సన్మానమును కూడ ఆ సందర్భములో వారు త్రోసిపుచ్చారు. ఆ శుభదినమున శ్రీ నానాసాహెబ్ గౌరవార్థం ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు ఏర్పాటుచేసి దానిలో ప్రజలు విరివిగా పాల్గొన్నారు. అయినప్పటికీ, రాజనీతి నిపుణుడైన శ్రీ నానా సాహెబ్ పీష్వా, సర్ లారెన్సును కలుసుకొని ఆయనపట్ల అత్యంత ఆదరభావాన్ని ప్రకటించాడు. ఈ విధంగా శత్రువును మోసపుచ్చాడు. లక్నోలో ఉన్నప్పుడే నానాసాహెబ్ జగదీశపూర్ రాజాకుమార సింహ చేత విప్లవ ప్రతిజ్ఞా స్వీకారము చేయించి విప్లవోద్యమములో పాల్గొనేటట్లు చేసాడు.

## అగ్నిపర్వతము ప్రజ్వలిస్తోంది

స్వాతంత్ర్య యుద్ధానికి అవసరమైన సంసిద్ధత అతి రహస్యంగా అత్యంత చాతుర్యంతో కల్పించబడుతూ ఉండినది. అగ్నిపర్వతము లోలోపల తుకతుక-ఉడికిపోసాగింది. ఆంగ్లేయులపై ద్వేషము అనే లావాద్రవము వేడెక్కి తెర్లసాగింది. అదనుకాని సమయములో అగ్ని పర్వతము బ్రద్దలౌతుందేమోనని విప్లవ నాయకులు అతి మెలకువతో ప్రవర్తింప సాగారు. కాని, విప్లవకార్యము గడియారపు ముళ్ళలాగా నడువదు.

# మూడవ అధ్యాయము

# నగారా మ్రోగింది

విప్లవ కార్యము గడియారము లాంటిదికాదు; అగ్నిపర్వతము వంటిది. సలసలకాగే లావాద్రవము ఎప్పుడు పెల్లుబికి బయటకు వస్తుందో ఎవరూ కూడ నిశ్చితంగా చెప్పలేరు. ఒకనాడు అగ్నిపర్వతము బ్రద్ధలౌతుంది. పుడమి కంపించిపోతుంది.

## ఆ మహా శుభదినము

1857 విప్లవము కూడ అలాగే జరిగింది. ఒకనాడు హఠాత్తుగా ఆశ్చర్యజనకంగా అది ప్రారంభమైంది ఎవ్వరూ అది వూహించనైనా లేదు దేశభక్తులంతా ఆనందసాగరంలో మునిగితేలారు. దేశ శత్రువుల మనస్సులలో భయము మొలకెత్తింది. "మారో ఫిరంగీకో" (విదేశీయుల వధించు) నినాదము మూడు ఖండాలలో ప్రతిధ్వనించింది. నగారా మ్రోగింది స్వాతంత్ర్య లక్ష్మి జయ జయ ధ్వానము స్వాతంత్ర్య వీరులను ఉద్రేకపరిచింది. "బలిదానము" సాకారంగా ఈ భూమికి దిగివచ్చింది. స్వాతంత్ర్య యుద్ధ విజయ శంఖధ్వని మ్రోగింది. కంపెనీ ప్రభుత్వాన్ని కూలద్రోసే ఒక తూటా దూసుకొనివచ్చి తనపని పూర్తి చేసింది. కంపెనీ శాసనము విరిగి ముక్కలై పడింది. మృత్యువాత పడింది. శాశ్వతంగా నశించి పోయింది.

ఈ మహా శుభదినము 1857 మార్చినెల 29 వ తేది. మొదటి తూటా పేల్చిన స్వాతంత్ర్య వీరుడు మంగళ్ పాండే. హుతాత్ముడు మంగళ్ పాండే. శిశుపాలుని నూరు అపరాధాలు పూర్తి అయిన పిదప

శిరచ్ఛేదనకు సుదర్శన చక్రాన్ని పంపిన శ్రీ కృష్ణునియొక్క ఒక పుణ్యమయ అంశమే మంగళ్‌పాండే.

## స్వాభిమానానికి అఘాతము

మంగళ్‌పాండే ఒక సర్వసాధారణ వ్యక్తి. పరిస్థితుల ఒత్తిడి వలన సేనలోచేరిన ఒక సామాన్య సైనికుడు. మనపని మంచిది. మనము మంచివాళ్ళము—అనే సరళ విధానంతో పని చేస్తుండేవాడు. జాగీర్లు కావాలని కాని, పొగడ్తలు పొందాలని కాని కోరిక లేదు. నాలుగు రాళ్ళు, సంపాదించి జానెడుపొట్ట గౌరవంగా నింపుకోవడంలో సంతోషము. అంతే; అయితే ఎవరైనా సరే, తన స్వాభిమానాన్ని దెబ్బ కొట్టరాదు.

ఆంగ్లేయుల సేనలో చేరిన భారతీయ సైనికులకు మొదట్లో ఏ విషయంలో కూడ కష్టము ఉండేదికాదు. బాగా పరాక్రమము చూపినపుడు ప్రశంసలు కూడ లభిస్తుండేవి. అయితే ఈ ప్రశంసలు కేవలము మాట ల్లోనే అది వేరేవిషయము. సైనికుల ధార్మిక భావాలకు అఘాతము తగిలేదికాదు. తర్వాతరోజుల్లో ఈపరిస్థితి మారిపోయింది. అప్పుడప్పుడు ఉచితానుచితాలు గమనించకుండా ఆంగ్లేయ అధికారులు హిందూ దేవత లను హిందువుల ఎదుటనే నిందిస్తుండేవారు. క్రైస్తవ పాదరీలు ఎలాంటి అడ్డంకులు లేకుండా సైనిక శిబిరాంలో అన్నిటావుల తిరుగుతుండేవారు. విచ్చలవిడిగా విశేష సంఖ్యలో ప్రజలను మత పరివర్తనము చేస్తుండే వారు. క్రైస్తవ మతం పుచ్చుకున్నవారికి సైన్యంలో ప్రత్యేక ప్రాముఖ్యం ఇవ్వబడేవి. వారికి ప్రమోషన్‌లు కూడా ఇవ్వబడేవి.

ఈ మారుతున్న పరిస్థితి సైనికులమీద ప్రభావము చూపసాగింది. సైనికులనేకులు ఆంగ్లేయుల సేవ చేస్తున్నందుకు పశ్చాత్తాప పడసాగారు. ఆంగ్లేయుల సేవలో చేరినందుకు అర్థము స్వధర్మాన్ని, స్వాభిమానాన్ని తాకట్టు పెట్టడముకాదు. ఆంగ్లేయ అధికారులు హిందూ ధర్మాన్ని

నిందిస్తూ మాట్లాడేటప్పుడు సైనికుల గుండెలలో మంటలెగస్తుండేవి. సైనికుల నుదుట తిలకముగాని గంధముగాని పెట్టుకోరాదని ప్రభుత్వము వేలూరులో ఉత్తరువు జారీచేసినపుడు, ఈ అత్యాచారపు టుత్తరువుకు ప్రతిరేకంగా చప్పట్లు చరచి నిలువబడ్డారు. సముద్రము దాటకూడదని హిందువులకు ఒక అమాయకమైన నమ్మకము ఈ విశ్వాసానికి దెబ్బ తగిలినపుడు బారక్‌పూర్ సైనిక శిబిరంలో ఎదురుతిరిగారు.

ఆ బారక్‌పూర్ శిబిరానికి చెందినవాడే మంగళ్‌పాండే. 35 వ ప్లాటూన్‌లో అరడొక సిపాయి. అతిసాధారణ సైనికుడు. మంచి శరీర సౌందర్యము, చాకచక్యము, స్వభావముతో సారళ్యము, స్వాభిమానము కలవాడు కర్మిష్ఠి అయిన బ్రాహ్మణుడు.

ఆ రోజుల్లో ఆంగ్లేయ అధికారవర్గము ఉద్దేశ పూర్వకముగా భార తీయ సైనికుల స్వాభిమానాన్ని దెబ్బకొట్టాలని చూస్తుండేది. అప్పటి ఒక బెంగాలీ పదాతి సైనికాధికారి ఇలా వ్రాశాడు. "గత 18 సంవత్సర ములనుండి సైనికులను క్రైస్తవులుగా మార్చేపని నేను నిరంతరము చేస్తూ ఉన్నాను దీనికి కారణము భారతీయులను సైతాను పంజా నుండి విడిపించి ప్రభువుయొక్క పరివారములోనికి తేవడము మా సైనిక విధులలో ఒకటి"

ఈ విధముగా ఇబ్బందులకు గురికావడం ఆంగ్లేయుల సేనలో చేరే భారతీయులకు సహింపరానిదైంది. పొట్టకోసము ఒక విధంగా పశువులలాగా ఆంగ్లేయులవద్ద సేవ చేస్తున్నప్పటికీ వాళ్ళు ఎప్పుడుకూడ పశువులై పోలేదు. వాళ్ళు మానవులుగానే ఉండినారు. వాళ్ళ స్వధర్మాభి మానము పూర్తిగా చైతన్యవంతంగా ఉంచినది. క్రూరుడు, మత పరభి మాని అయిన ఔరంగజేబు అనే తోడేలు క్రౌర్యానికి తలవంచని హిందూ జాతి వారసులు ఆంగ్లేయులనే గొల్లవాని ఎదుట తల వంచుతారా? ఈ ధర్మనిందవలన సైనికులలో అసంతుష్టి తో రోపల నిప్పులా మంద

సాగింది. ఇటువంటి స్థితిలో ఒక విలక్షణమైన దుష్టవార్త సైన్యములో సుడిగాలిలా వ్యాపించింది.

## క్రొవ్వుపూసిన తూటాలు

కలకత్తాదగ్గర డమ్ డమ్ సైనిక శిబిరములోని వార్తయిది. రోజూ లాగే "పేరేడ్" తర్వాత విశ్రాంతికాలము, ప్రతి ఒక్కడు తమ తమ పనులలో మునిగిపోయి ఉండినారు. కొందరు స్నానము చేస్తున్నారు. మరికొందరు సంధ్య వారుస్తున్నారు. కొందరు పడుకొని చదువుకుంటు న్నారు కొందరు తమ ఆయుధాలను శుభ్రపరచుకుంటున్నారు. మరి కొందరు మాట్లాడుకుంటున్నారు. అందరూ ఏదో ఒక పనిలో నిమగ్నులై ఉన్నారు.

ఒక బ్రాహ్మణ సైనికుడు స్నానంచేసి తడిగుడ్డ కట్టుకొని సైనిక శిబిరానికి తిరిగివస్తున్నాడు. భుజముమీద ఉతికిన తడిగుడ్డలున్నాయి. చేతిలో నీళ్ళ చెంబుంది. భగవన్నామము జపిస్తూ వస్తున్నాడతడు. దారిలో ఒక ప్రక్క అస్పృశ్యకులజుడైన ఒక సైనికుడు రొట్టె తింటు న్నాడు. అతనికి నీప్ళ కావలసివచ్చింది. దూరముపోయి నీళ్లుత్రాగి తిరిగి వచ్చేంత శ్రమపడదలచుకో లేదతడు. ఇంతలోనే చెంబునిండా నీళ్ళు తీసుకొని వచ్చే మిత్రుడు ఎదురుగా కనిపించాడు. ఉన్నచోటినుండి కదలకుండానే అతడు "మిత్రమా, దాహం దప్పిక అవుతున్నది. ఆ చెంబు యిట్లా యియ్యి" అన్నాడు. స్నానంచేసి తిరిగివస్తున్న సైనికుడు చకితుడై నిలువబడ్డాడు. కళ్ళు పెద్దవిచేసి అతనివైపు తిరిగిచూస్తూ 'పిచ్చిపట్టిందా యేం నీకు? దేవుడు, ధర్మము అంతా వదిలేశావా? కొంచెము అదికూడా గుర్తుంచుకో' అనిఅన్నాడు. ఆ అస్పృశ్యుడు కూర్చునే ఇలా అన్నాడు. 'మిత్రమా, ఆ చెంబు నాకియ్యి, నీవు శిబిరానికి వెళ్ళేలోపున ఆ చెంబు మళ్లా నింపుకొని తెస్తాను భయపడకు. 'ఈమాటలకు ఆ బ్రాహ్మణ

సైనికుడు మరికొంచెము మండిపడ్డాడు. 'మూర్ఖుడా, నేను బ్రాహ్మణుడను. నీవు అంటరానివాడివి, నేను స్నానంచేసి పవిత్రంగా వెళ్తుంటే నీవు నా చెంబు అడుగుతావా? నీవు ధర్మాన్ని వదిలేశావా?'' అని గర్జించాడు. అతడలాగే కూర్చొని నవ్వేశాడు. ఆ నవ్వుచూసి బ్రాహ్మణ సైనికుడు ఉడికిపోయాడు. కనుబొమ్మలు ముడిపడ్డాయి. ముఖము జేవురించింది. ఆ అస్పృశ్య సైనికుడు మెల్లగాలేచి నచ్చచెబుతున్నట్లుగా హేళనచేస్తూ ఇలా అన్నాడు. 'మిత్రమా, నీదేవుడు ' ధర్మము అనే బూటకాలన్నీ అలా ఉండనీ స్పృశ్యాస్పృశ్యతల గూర్చిన నీ అహంకారపు మాటలుకూడ ఉండనీ. రేపుగట్టిగా కండ్లుమూసుకొని, ఆవుక్రొవ్వు పూయబడిన తూటాలు పండ్లతో లాగవలసి ఉంటుంది. అప్పుడు తెలిసి వస్తుంది. ఆ కొత్త తూటాలు కూడ వచ్చేశాయి ఇప్పుడు...'ఈ మాటలు వింటూనే పిచ్చివానిలాగా ఆ బ్రాహ్మణ సైనికుడు పరుగెత్తుకుంటూ వచ్చి శిబిరంలో జొరబడ్డాడు. ఈ భయంకర, అమంగళకర వార్తను కనుపించిన వారందరితో చెప్పసాగాడు. నలువైపుల గందరగోళము వ్యాపించింది అందరూ కళవళ పడ్డారు. ఇప్పుడు మనము తప్పకుండా మతభ్రష్టులమై పోతామనే భయము సైనికులందరి మనస్సులలో వ్యాపించింది. ఆంగ్లేయుల కపటనాటకము ఇప్పుడు అందరికి అర్థమైంది. లోలోపల మండుతున్న నిప్పురవ్వలను చిమ్మ నారంభించింది.

## ఉగ్రరూపాన్ని ధరించిన స్వాభిమానం

సైనికుల ఉపయోగం కోసము చాల దూరము పోవునట్లు తూటాలు ప్రేల్చగం క్రొత్తరకము తుపాకులు వచ్చాయి. ఇది వాస్తవము. వాటి కోసము క్రొత్తతూటాలు కూడ తయారుకాబడ్డాయి. ఈ తూటాలు చేసేటప్పుడు వానిపైన ఒక సన్నని కాగితము అంటించబడుతుండేది. ఆ కాగితంమీద ఒక నునుపైన ద్రవపదార్థము పూయబడుతుండేది. ఆ

ద్రవపదార్థము ఆవు కొవ్వుతోను, పంది కొవ్వుతోను తయారు చేయబడేది ఈ విషయం కూడ వాస్తవమే.

క్రొత్తతూటాలు దారకపూరు సైనిక స్థావరానికి వచ్చేముందే ఈ తూటాలు మతభ్రష్ఠులను చేసేవిఅనే సమాచారమందింది. ధర్మ నాశనానికి కారణమైన ఈ తూటాల విషయం అందరికీ తెలుసు. ప్రతి సైనికుని హృదయముమీద ఒక లోతైన గాయము పడిపోయింది. ఈ సమయంలో పీష్వాయొక్క విప్లవదూతలు అక్కడికివచ్చి తమపని పూర్తిచేసి వెళ్ళిపోయారు. వారు ప్రతి సైనికునితోను ధర్మమనే నిప్పును రగిలించారు. రాష్ట్రభక్తి జ్యోతి వెలుగసాగింది. సైనికులంతా విప్లవ ప్రతిజ్ఞ తీసుకున్నారు.

విప్లవమనే నూతనమారుతపు స్పర్శచే ప్రతివ్యక్తిహృదయంలో ఒక విశ్వాసము ఏర్పడింది ప్రతిసైనికుడు ఎంతో ఆతురతతో ఆ మహత్తర విప్లవదినంకోసము ఎదురుచూడసాగారు. ప్లాసీ యుద్ధము జరిగి అప్పటికి వంద సంవత్సరాలు నిండుతున్నాయి. ఆ యుద్ధమునుండి ఆంగ్లేయులు దేశంలో దృఢంగా కాలూనుకోగలిగారు. వంద సంవత్సరాల తదుపరి 1857 జూన్ 21 నాడు ఉదయించే సూర్యుడు ఆంగ్లేయుల ఊరూ పేరు ఈ దేశంలో మిగలడం చూడడు; మేనెల 31 నాటికి కంపెనీ ప్రభుత్వము, ఆంగ్లేయుడైన ప్రతివ్యక్తి ఈ నేలలో లోతుగా పూడ్చిపెట్టబడతాడు-అనే విశ్వాసం వారిలో జనించింది. విదేశీయుల పథించు (మారో ఫిరంగీ కో). ఇది విప్లవ యుద్ధ విజయఘోష అయింది.

## 19వ ప్లాటూన్‌కు దండన

ఇటువంటి ఉద్రేకపూరిత వాతావరణంలో ఆంగ్లేయ అధికారులు 19 వ ప్లాటూన్‌కు క్రొత్త తూటాలు యివ్వడానికి నిశ్చయించారు. 'పేరెడ్ గ్రౌండ్' లో అక్కడక్కడ గుంపులు గుంపులుగా సైనికులు

నిలబడి ఉండినారు. క్రొత్తతూటాలు పంచడం ప్రారంభమైంది. కాని ఒక్క సైనికుడు కూడా ఆ తూటాలను చేతితో తాకలేదు. సాహసించి అందరూ ఒక్కుమ్మడిగా క్రొత్తతూటాలు తీసుకొనడానికి నిరాకరించారు. అంతే కాదు. అవసరమువస్తే ప్రతీకారము చేయడానికి కత్తులు దూస్తామని బెదిరించారు. మెరసే విచ్చుకత్తులను తలుచుకుంటూనే అధికారులు హడలి పోయారు. వారు మారుమాట లేకుండా ఓటమిని అంగీకరించారు. పంచ డానికి తెచ్చిన తూటాలన్నీ అలాగే వెనుకకు తీసుకవెళ్లాయి, ఎవ్వరూ నోరుమెదపలేదు.

రెండవరోజు తెల్లవారేసరికి తెల్లసైనికుల సమూహ మొకటి బారక్‌పూర్ స్థావరానికి వచ్చిచేరింది. ఆంగ్లేయుల దమననీతి యెంతటిదో అర్థమైంది. కాని, 19 వ ప్లాటూన్ లొంగిపోలేదు. దాని నిశ్చయానికి తిరుగులేదు. 'క్రొత్త తూటాలు తాకము' అనే నిశ్చయాన్ని సైనికులంతా ఒక్కటిగా నొక్కిచెప్పారు బలవంతం చేస్తే రక్తపాతం తప్పదని తెల్లసైనికులు గుర్తించారు. సేవయొక్క అనుశాసనము ఎగిరిపోతుంది. ఇంతలో తెల్లసైనికుల ప్లాటూన్, 19 వ ప్లాటూన్‌ను హఠాత్తుగా చుట్టు ముట్టి అణచివేసింది. ఒక్కొక్క సైనికుని ఆయుధాలు బలవంతాన లాగుకొని, అతనిని శిబిరమునుండి వెలివేశారు.

## మొదటి తూటా పేలింది

తమ ధర్మ బాంధవుల 'కర్మ బాంధవుల యీ భయంకర అవమా నాన్ని ఎవరు సహిస్తారు? మంగళ్‌పాండే 34వ ప్లాటూన్‌లో ఉంటున్నాడు. అతని కోపము సముద్రపు కెరటాల్లాగా రెచ్చిపోయింది. నియమాల సంకెళ్ళు తెగిపోయినాయి. అతని కళ్ళు నిప్పురవ్వలను చెరుగు తున్నాయి. తుపాకిని దట్టించి, స్వాతంత్ర్య దేవతను స్మరించి "మారో ఫిరంగీ కో" అని గర్జిస్తూ అతడు మైదానములోనికి దుమికినాడు.

మంగళ్ పాండే యొక్క రుద్రావతారము చూచి తెల్లవారంతా తెల్ల బోయారు. జంకారు. సార్జెంట్ మేజర్ హ్యూసన్ పరిస్థితిని గుర్తించి ముందుకువచ్చాడు. తోటి సైనికులను చూచి "ఆ కుక్కను పట్టుకోండి" అని ఆజ్ఞాపించాడు. కాని, ఒక్క సైనికుడైనా తన స్థానము నుండి కదల లేదు. ఈ లోపల మంగళ్ పాండే తుపాకీ నుండి తూటా దూసుకొని వచ్చింది. 'కుక్క' అన్న హ్యూసన్ నేలకొరిగాడు. అప్పుడు లెఫ్టినెంట్



మంగళ్ పాండే తుపాకి నుండి మొదటి గుండు వెలువడింది. అది సార్జంట్ మేజర్‌ను యమపురికి పంపింది.

బేంక్ ముందుకు వచ్చాడు. మంగళ్ పాండే అతనిని కూడ మృత్యువాత పడద్రోశాడు. ఇంతలో ఒక ఆంగ్లేయుడు మంగళ్‌పాండేను చంపడానికి తుపాకీ పైకెత్తాడు. కథ అడ్డం తిరిగింది. ఒక్క్షణము, అయితే ఆ క్షణములో అతని తలమీద తుపాకి మడమతో గట్టి దెబ్బపడింది. దానితో తలపగిలి ఆతెల్లసైనికుడు నేలకూలాడు. అంతలో కర్నల్ వ్హీలర్ ముఖ్య సంరక్షకుల దండుతో అక్కడకు వచ్చాడు. క్రోధోన్మత్తుడై నాల్గువైపులా చూచాడు. మంగళ్ పాండే తుపాకీ దట్టించుకొని నిలబడి ఉన్నాడు. అతని కాళ్ళ వద్ద ముగ్గురు తెల్ల సిపాయీల పీనుగులు పడి ఉన్నాయి. వాతావరణము భయంకరంగా ఉంది. మిగిలిన సిపాయిలు తమ తమ స్థానాలలో నిలబడిఉన్నారు కర్నల్ వ్హీలర్ సైనికుల తుపాకుల ఆవైపుకు గురిపెట్టించి మంగళ్‌పాండే వైపుకు చకచకా సాగిపోయాడు. ఆ క్షణాన స్తబ్ధసైనిక బృందము ఒక్కసారిగా "జాగ్రత్త, మంగళ్‌పాండే వెంట్రుకనైనా తాకావో..." అని గర్జించి తమ తుపాకులు అతనివైపుకు గురిపెట్టారు. వ్హీలర్ చల్లబడ్డాడు. ఒక్క అడుగు వెనక్కు వేశాడు కొంచెము ఆగి ఆ సైనికులంతో అన్నాడు "మంచిది. అయితే మీరే అతన్ని పట్టి యివ్వండి. మా క్రమశిక్షణ మీకు తెలుసుగా". గానికి అందరు దృఢంగా ఇలా అన్నారు. "మాలో ఎవ్వరుకూడ ఈ దేశభక్తుని తాకనైన తాకము. ఎలా వచ్చావో అలాగే వెళ్ళిపో. లేకుంటే మరలా..."

కర్నల్ వ్హీలర్ తెల్లసిపాయిలను తీసుకొని మారు మాటాడకుండా వెనక్కు తిరిగి వెళ్ళాడు. వాళ్ళు తిరిగి వెళ్ళడంతోటే జనరల్ హియర్స్ కోపంతో ఊగిపోతూ అక్కడకు వచ్చాడు. జనరల్ హియర్స్ 34వ ప్లాటూన్‌ను చుట్టుముట్టాడు. మంగళ్ పాండే, అతని సహచరులు చక్రవ్యూహంలో చిక్కుకున్నారు.

మంగళ్ పాండే సాహసము ప్రథమ విప్లవాగ్ని కణాన్ని ఎగజిమ్మింది. తెల్లవారి నునువెచ్చని రక్తస్పర్శతో మాతృభూమిఆనందపులకిత

మైంది. రక్తవర్ణపు జ్వాలలను ఆమ దర్శించింది. పౌరుషం ఆనందంతో ఉప్పొంగింది. సాహసము పులకరించింది. స్వాభిమానము కవోష్ణమైంది

## వివేకానికి వైఫల్యం

కాని...... విప్లవము ప్రారంభము కావలసిన దినము ఇంకా ముందున్నది. తమ దుడుకుతనము వలన విప్లవానికి భంగపాటు కలుగ రాదనీ, కేవలం అందుకోసమే, సైనికులు అవమానాలు సహించి నోరెత్తక అయుధాలు క్రిందపెట్టారు. సైనికులను శస్త్రత్యాగము శస్త్రప్రహారాన్ని మించి బాధిస్తుంది. ఘోరయుద్ధాన్ని మించి భయాన్ని కలిగిస్తుంది. చాల అమంగళ కరమది.

మంగళ్‌పాండేకు తన భవితవ్యము స్పష్టంగా తెలుసు. తెలిసి తెలిసి అతడు మరణశిక్ష అనే వ్రతాన్ని గ్రహించాడు. ప్రతి విప్లవకార్యము కష్ట సహితంగానే ఉంటుంది. ఈ విషయం అతనికి తెలుసు. ఇంతలో ఎవరో దూరంనుంచి నవ్వుతున్నారు. రాబోయే అశుభాన్ని గూర్చి ఎవరో గొనగొన మాట్లాడుతున్నారు. ఓ వీరుడా: ఒక విషయం గుర్తుంచుకో. జీవితం ఏనాడో పరిసమాప్తమయ్యేదే. కాని, రణరంగంలో ప్రవహించే రక్తంలోనే స్వాతంత్ర్య కమలము వికసిస్తుంది.

## బలిదానము పులకితమైంది

రాం ఠాం ఠాం: తూటాలు పేలినధ్వని వినవచ్చింది. మంగళ్ పాండే తనను తానే పేల్చుకొని గాయపడ్డాడు. అతని రక్తాన్ని భూమాత దోసిలొగ్గి గ్రహించింది. మంగళ్ పాండే పవిత్ర శరీరము నేలకొరిగింది. భారత మాత హృదయంలో ఒక తీవ్రవేదన అంకురించింది. ఆ తాకిడికి భూమాత కంపించిపోయింది, తెల్లసైనికులు పరుగునవచ్చి మంగళ్

పాండేను చుట్టివేశారు. మంగళ్ పాండే రక్తాన్ని తిలకంగా ఉంచుకోడానికి బలిదానము ముందుకు వంగింది. కాని ఇంతలో ఆంగ్ల సైనికులు ఆతనిని ఎత్తుకొని వెళ్ళిపోయారు మంగళ్‌పాండే బ్రతికాడు. బలిదానాన్ని మరింత తేజోవంతము చేయడానికే అతడు బ్రతికాడని పిస్తుంది— ఆ దినము మార్చి 29వ తేదీ. 1857 విప్లవ జ్వాలాముఖి నిశ్చితమైన రోజున కాకుండా ముందుగానే అనుకోని విధంగా బ్రద్దలైంది. సలసలమరిగేలావా ద్రవపు ఉద్రేకము కారణంగా రాష్ట్రీ స్వాతంత్ర్య ప్రాప్తికై ఏర్పడిన దృఢసంకల్ప సినాదము ప్రపంచానికంతా వినిపింపజేయబడింది

## రాజమర్యాదలతో శ్రద్ధాంజలి

మంగళ్‌పాండేపై అభియోగం తేబడింది. ఏప్రిల్ నెల 8వ తేదీన ఆయనను ఉరితీసినారు. మంగళ్‌పాండే హుతాత్ముడైనాడు. అమరవీరుడైనాడు. ఆయన మరణంతో విప్లవానికి వన్నె హెచ్చింది. ప్రజలలో, సైనికులలో ఒక నూతన వజ్ర సంకల్పము ఏర్పడింది. తర్వాతకాలంలో దేశభక్తులలో స్వాతంత్ర్యం కోసము బలిదానం చేసినవారిలో 'పాండే' పేరు గౌరవ చిహ్నమై నిలచింది.

ఈ సంఘటన జరిగినప్పుడు విప్లవ నాయకుడు శ్రీ నానాసాహెబ్ పీష్వా, విప్లవానికి పూర్వము సంసిద్ధత కోసము పర్యటన చేస్తుండినాడు. మంగళపాండే యొక్క మంగళమయ బలిదానము ఆయనను పులకరింప జేసింది. కృతజ్ఞతా పూర్వకముగా ఆయన ఆ హుతాత్మునికి రాజమర్యాదతో ప్రణామము చేశాడు.

# నాల్గవ అధ్యాయము

# విశ్వాన్ని వెరగుపరచిన విప్లవ జ్యోతి

మంగళ్ పాండే బలిదానము స్ఫూర్తిమంతము. అతడు చిందించిన ప్రతి రక్తబిందువునుండి స్వాతంత్ర్య యోధులు జన్మించారు. ఏప్రిల్ 8వ తేదీ ఆయన హుతాత్ముడైన పుణ్యదినము. ఈనాడు అస్తమించే సూర్యునితో పాటే మంగళ్ పాండే జీవనజ్యోతి ఆరిపోయింది. నలుదెసల చీకట్లు వ్యాపించాయి. పొగరుబోతులకు మంచిగుణపాఠము నేర్పామనుకున్నారు తెల్లసిపాయిలు. ఇకమీదట ఒక్క భారతీయ సైనికుడు కూడా ఇటువంటి దుస్సాహసం చేయడనుకున్నారు. కాని, చీకటుల చిమ్మ రాత్రి గర్భంలో వెలుగును కొనివచ్చే ఉషఃకాలము పెరుగుతున్నదని వాళ్ళకేం తెలుసు? వాళ్ళు మరొక కల్పనా జగత్తులో కలలు కంటున్నారు. డాంబికంలో మునిగి తేలుతూ, పలువిధాలైన కారణాలు చూపి వాళ్ళు ఒక్కొక్క రాజ్యాన్నే కబళిస్తూ వచ్చారు. జనసామాన్యపు ధార్మిక భావనలను దెబ్బకొట్టుతూ ఉండినారు. దేశసంపదనంతా అక్షరాలా ఊడిచి పెట్టి తమ దేశానికి కొనిపోయారు. హిందువుల మనస్సులు శాశ్వతంగా దాస్య శృంఖలాలలో చిక్కి ఉండటానికి రోజు రోజుకు క్రొత్త క్రొత్త సంస్కరణలు ప్రవేశపెడుతూ ఉండేవారు.

## 31 మే నాటి విప్లవ ప్రణాళిక

ఆంగ్లేయులు చేసే ఈ పనులకు స్వాభిమానయుత హృదయాలు విసిగిపోయాయి. ఏదో ఒకటి చేసి ఈ క్రొత్త శత్రువును భారత భూమి నుండి తరిమి వేయాలనే ఆలోచన అనేక మనస్సులలో ఉ[illegible]గించింది,

లో లోపల రగుల్కొనే ఈ సంతోషాగ్నిని ప్రజ్వలింపజేసి, ఒక మహత్తర విరాట్ శక్తిని సమకూర్చి. ఆ శక్తిని ప్రయోగించి ఒకే దెబ్బతో కంపెనీ ప్రభుత్వాన్ని సప్తసముద్రాల కావల పారద్రోలడం నీష్వా ఆశయము. దీనికోసము ఆయన చాం శ్రమించాడు. ఒక నిర్దుష్ట మైన ప్రణాళిక రచించాడు. ఒక శక్తిశాలి అయిన సంఘటనను నిర్మిం చాడు. ఒక పథకము ప్రకారము విప్లవము ప్రారంభించడానికి ఒకరోజును, కార్యక్రమాన్ని నిశ్చయించాడు. మే నెల 31వ తేదీ విప్లవము అన్ని చోట్ల చెలరేగడానికి నిశ్చయింపబడిన శుభదినము. ఆనాడు ఆదివారము, తెల్లవారంతా చర్చీలలో ప్రార్థనలకోసము సమావేశమౌతారు. ప్రార్థనలో లీనమౌతారు. ఆక్షణాన భారత విప్లవము అన్నిచోట్ల ప్రారంభము కావలసి ఉంది. "విదేశీయుల వధించు" అనే నినాదముతో తెల్లవారి నంతా సంహ రించి, ఈ దేశముయొక్క సమస్తపాపాలను క్షాళనం చేయవలసి ఉంది.

"భారతదేశము నలుమూలల నుండి చెలరేగిన ఈ తుఫానులో ఆంగ్లేయులు అజాగ్రతగా చిక్కుకొని ఉంటే, మాలో చాలతక్కువ మంది మాత్రమే ప్రాణాలతో బయట పడగలిగేవారు. మరల హిందూ స్థానాన్ని జయించడం అత్యంత కఠినమైయుండేది. తూర్పుదేశాలలో మన సామ్రాజ్యము శాశ్వతంగా చేయిజారిపోయి ఉండేది" అని మాల్‌సన్ ఆనాటి పరిస్థితిని వర్ణించాడు.

## రణ యజ్ఞానికి సంకల్పము

నానాసాహెబ్ నీష్వా ప్రతిభ అపూర్వము, సంఘటనా కౌశల్యము అసామాన్యము. ఆయన రచించిన పథకము నెరవేరకపోతే, దేశదౌర్భా గ్యము ఇప్పుడప్పుడే తుదముట్టబోనట్లే, స్వాతంత్ర్యదేవతను ప్రసన్ను రాలిని చేసుకోడానికి సాగవలసిన ఆత్మాహుతి సమాప్తము కానట్లే.

త్యాగములో ఉన్నతస్థాయిని మనము అందుకోవలసిఉంది ఉదాసీనత, అసూయ, స్వార్థపరత్వము మొదలైన పాపాలు త్యాగాగ్నిలో భస్మీభూతం కావలసిఉంది. అందుకోసం జ్వాలామయమయిన యజ్ఞకుండాన్ని ప్రజ్వలింపజేయడం అవసరము ఆనాటి స్వతంత్రతకు వారసుడుగా శ్రీ మంత్ నానాసాహెబ్ షీష్వా ఈ రణయజ్ఞాన్ని సంకల్పించాడు. దేశం లోని వివిధ రాజ్యాలలో సైనికులలో రక్తకమలము తిరుగసాగింది. అది నాయకులలో, సైనికులలో, ప్రజలలో దాగియున్న క్రోధాగ్నికి ఉగ్రమైన జాతీయ విప్లవరూప మిచ్చింది. ఈ రణయజ్ఞానికి పునాది స్వధర్మము స్వరాజ్యము.

## పాలు పొంగాయి

షీష్వా రచించిన ప్రణాళిక అందరికీ ఉత్సాహాన్నిచ్చింది. పాలు నిప్పుల మీద ఉంచారు. సెగ ఎక్కువ కాజొచ్చింది. ప్రకృతి నియమాల ప్రకారము ఏమి జరగవలెనో, అదే జరిగింది. అకస్మాత్తుగా పాలుపొంగి పొర్లిపోయినాయి. మార్చి 29న హుతాత్ముడు మంగళ్ పాండే తూటా ప్రేల్చినాడు. స్వాతంత్ర్య యుద్ధము అనుకోకుండా ఆరంభమైంది. తుపాకి మందు రాశిలో అదను కానివేళ నిప్పు రవ్వపడింది నానా సాహెబ్ ఉలిక్కి పడ్డాడు. ధైర్యంతో ప్రశాంతంగా ఉండవలసిందని అన్నిచోట్లకు ఆయన వెంటనే సందేశాలు పంపాడు. కాని, పొంగి నిప్పులో దూకే పాలస్పర్శ, వేడిమి దేశాన్నిధర్మాన్ని ప్రేమించే సైనికుల తలకెక్కాయి. బారక్‌పూర్‌లో హుతాత్ముడు మంగళ్ పాండే ఉన్న 19వ ప్లాటూన్‌లోని ప్రముఖులను అధికారులు చంపివేసారు సిపాయిలు ఉడికి పోయారు. వారు అప్పుడే దాస్యానికి గురుతైన సైనిక దుస్తులు చించివేసి అధికారులను తుచ్ఛులుగా భావించి, తృణీకరించి సరాసరి గంగా తీరానికి వెళ్ళారు. గంగా స్నానము చేసిన తర్వాతగాని వారి కోపము చల్లారలేదు

# మీరట్‌లో కార్చిచ్చు

ఇటువంటిదే మరొక సన్నివేశము మీరట్‌లో జరిగింది. ఆనాడు మే నెల 6వ తేదీ. ఆ రోజు గుఱ్ఱపు దళానికి క్రొత్త తూటాలు ఇవ్వ జూచారు. కాని సైనికులంతా వాటిని తీసుకొనడానికి నిరాకరించారు. అందుచేత వారిని బంధించి వారి ఆయుధాలు లాక్కున్నారు. వారిని సైనిక న్యాయస్థానమందు నిలిపారు. వారు 85గురు. ఆ న్యాయ స్థానము వారం దరినీ తిరుగుబాటు దారులుగా ప్రకటించింది. వారికి 8 మొదలు 10 సంవత్సరాలవరకు కఠిన కారాగారశిక్ష విధించింది. ఆ సైనికుల చేతులకు సంకెళ్ళువేసి చెరసాలకు నడిపించారు.

ఇప్పటికి అన్యాయము శిఖరాగ్రాన్ని అందుకున్నది. ఈ అవమా నాన్ని సహించడము శక్తికి మించిన పనైంది. సైనికులు ఓర్చుకోలేక పోయారు. మీరట్ లోని స్వాతంత్ర్య సైనికుల అత్యవసర సమావేశము రహస్యంగా జరిగింది. మే 31 తేదీ దాకా ఆగియుండడం ఇక కుదరదు అని ఆ సమావేశంలో నిశ్చయించారు. విప్లవ పోరాటము మే నెల 10వ తేదికే ప్రారంభం కావాలని బ్రహ్మావర్తానికి వర్తమానము పంపారు దీనికి పీష్వా అంగీకారము తప్పక లభిస్తుందని వారి విశ్వాసము. ఈ పథకము ప్రకారము 10–5–1857 సాయంకాలము 5 గంటలకు ఈ మహా జ్వాలా ముఖి భయంకరంగా బ్రద్దలైంది. మహత్తరమైన దేశ ప్రేమ, తీవ్రమైన ధర్మాభిమానము, సాటిలేని పరాక్రమము అత్యున్నత త్యాగభావన– ఈ సద్గుణాల లావా ప్రవాహము ఉష్ణాతి ఉష్ణంగా, చండ ప్రచండంగా మీరట్‌లోని సుప్తజ్వాలాముఖి వదన గహ్వరం నుండి వెల్లుబికి వచ్చింది.

## "ఢిల్లీ చలో" జయగర్జన

మే నెల 10 వతేది ఆదివారము. సమయము సాయంకాలము. ఆంగ్లేయులు ప్రార్థనల కోసం చర్చిలలో సమావేశ మయ్యారు. ఇంతలో "మారో ఫిరంగీ కో" (విదేశీయుల వధించు) అనే విజయఘోష విన వచ్చింది. శబ్దవేగాన్నిమించి ఆంగ్లేయుల సామూహిక మారణ హోమం ప్రారంభమైంది. చర్చిలలో, బజారులలో, వీధులలో, ఇటి.ట్లో, తెల్ల వారున్న ప్రతిస్థలంలో వారిని ఏరి ఏరి మిత్తి కెర జేయడం జరిగింది. మధ్యాహ్నకాలపు చండాంశునికి తెల్లజాతి వెచ్చని నెత్తురు అర్ఘ్యమివ్వ బడింది. ఆంగ్లేయులలో హాహాకారాలు అలముకున్నాయి. సైనికులు, ప్రజలు, ఆనందంతో ఉప్పొంగిపోయారు. మీరట్‌లోని సిపాయీల స్థావరము స్వాతంత్ర్య సైనికుల శిబిరమైంది. సైనికులు స్వతంత్రులై నారు. మందుగుండు సామాగ్రి నిలవలు, ఖజానా, ఆయుధాలు మొదలైన వన్నీ స్వాతంత్ర్య సైనికుల హస్తగతమైనాయి. ఆ రాత్రే మీరట్ స్వతంత్ర మైందని ప్రకటింపబడింది. స్వాతంత్ర్య చిహ్నమైన రక్త ధ్వజము ఆకాశంలో నిటారుగా తలయెత్తి ఎగుర సాగింది. స్వాతంత్ర్య సేన"చలో ఢిల్లీ" అని విజయ వినాదాలు చేస్తూ ఢిల్లీ వైపుకు పురోగ మించింది

## ఢిల్లీ విముక్తి

మీరట్‌కు ఢిల్లీ 32 మైళ్ళు. విజయశాలి అయిన ఆ సేన ఈ దూరా న్నంతా రాత్రికి రాత్రే నడిచింది. సూర్యోదయముతో యమునానదిని దాటి భారత రాజధానిని ప్రవేశించింది. ఎదురుగా ఎఱ్ఱకోట ఈ స్వాతంత్ర్య సైనికులకు స్వాగతం పలకడానికి ఆసక్తితో ఎదురుచూస్తూ ఉంది ఎఱ్ఱకోటకు రక్షకుడైన కర్నల్ రిప్లే వీరిని చూచి స్తంభించి పోయాడు

ఏమి జరుగుతున్నదో తెలుసుకునే లోపలనే అతడొక తూటాకుగురి అయినాడు. ఎఱ్ఱకోట స్వతంత్రమైంది. స్వాతంత్ర్యలక్ష్మి జయధ్వానాలతో ఆకాశము మారుమ్రోగిపోయింది. అప్పుడు చెలరేగిన ధూళి ఆకాసాన్ని కప్పివేసింది. ముసలి పాదుషా బహదూర్ షా ఆనందం తో తబ్బిబ్బైనాడు. సైనికులు ఆయనను పాదుషాగా ప్రకటించారు. ఈ విధంగా ఢిల్లీ రాజధాని స్వతంత్రమైంది.

ఢిల్లీ తర్వాత వెంటనే అలీఘర్ స్వతంత్రమైంది. నసీరాబాద్, రోహిల్ ఖండ్‌లు విముక్తి పొందాయి. అలహాబాద్, జలంధర్, మురాదాబాద్, షాజహాన్‌పూర్ స్వేచ్ఛావాయువులను పీల్చాయి. ప్రతిచోట సైనికులు తిరుగుబాటు చేశారు. తెల్లవారిని చంపివేసారు. ప్రజలంతా ఉత్సాహోద్రేకాంలో ఈ యుద్ధంలో పాల్గొన్నారు. ప్రతిచోట ఆంగ్లేయుల రక్తంతో నేల తడపబడింది. విజేతలైన సైన్యాలు 'ఢిల్లీ చలో', అని నినాదాలు చేస్తూ ఢిల్లీ వైపుకు పురోగమింప సాగాయి.

ఈ వార్తలన్నీ బ్రహ్మావర్తంలో పీష్వా విన్నాడు. ఈ జరిగిన విషయాల వలన ఆయన బాధ్యత మరింత క్లిష్టంగా తయారైంది. ఆయన తన సహచరులతో సుదీర్ఘంగా చర్చలు జరిపాడు. ఈ ఆకస్మిక విప్లవాన్ని ప్రయోజనకారిగా చేయడంకోసము మరొక క్రొత్త ప్రణాళిక రచింపబడింది. ఆ కాలంలో ఢిల్లీ నుండి బారక్‌పూరు వరకు 750 మైళ్ళ ప్రదేశములో ఒకే ఒక తెల్లసిపాయిల ప్లాటూన్ ఉండేది. ఇరాన్ సరిహద్దులలో కొంత సైన్యం, చైనా మార్గంలో కొంత సైన్యం ఉంచబడింది. ఇలా, తెల్లవారి సైన్యం విభజింపబడింది కంపెనీ గవర్నరు దూరంగా కలకత్తాలో ఉండినారు. సైన్యాధిపతి సిమ్లాలో విశ్రాంతి తీసుకుంటూ ఉండినాడు. పీష్వా ఈ సదవకాశము నుపయోగించుకొని వీలైనంత ఎక్కువ ప్రయోజనము పొందాలని నిశ్చయించుకున్నాడు.

## కాన్పూరు విజయం

కాన్పూరు ఆంగ్లేయులకు గట్టి స్థావరము. ఇక్కడి కలెక్టరు భయంతో పిల్లిపోయినాడు. అతడు పీష్వాను సత్వర సహాయం కోసము అర్థించాడు. పీష్వా కూట నీతిజ్ఞుడు అమాయికంగా, ఉదారంగా, స్నేహంగా ఉన్నట్లు ఆయన నటించాడు. ఒక్క నెత్తుటి బొట్టైనా చిందించకుండా కాన్పూరును తన అధికారంలోకి తెచ్చుకున్నాడు. ఆయుధాగారము, ఖజానా అంతా పీష్వా హస్తగతమైంది. ఇంతలో లక్నోలో విప్లవము చెలరేగిందని వార్త అందింది. దానిని అదుపులోనికి తేవడానికి కాన్పూరులోని తెల్లసైన్యము లక్నోవైపుకు బయలుదేరి వెళ్ళింది. దానితో పీష్వా కాన్పూరులో సునాయాసంగా సర్వాధికారాన్ని స్థాపించాడు. జూన్ 4వ తేదీ ఆ శుభదినం. ఆదేరోజున ఝూన్సీ స్వాతంత్ర్య దేవి వీరాంగన రాణిలక్ష్మీబాయి స్వాతంత్ర్య ప్రకటన చేసింది. యుద్ధాన్ని ప్రారంభించింది ఝూన్సీ కోటలో మూడురోజులవరకు దారుణమైన యుద్ధము జరిగింది. జూన్ చివరకు ఆంగ్లేయ సేన ఆయుధాలు విసర్జించి రాణి లక్ష్మీబాయిని శరణుజొచ్చింది. రాకుమారుడు దామోదర్ రాజుగా ప్రకటింపబడినాడు. "ప్రపంచము భగవంతునిది; దేశము 'పాదుషాది; ప్రభుత్వము రాణీ లక్ష్మీబాయిది-" ఈ విధంగా ఝూన్సీ రాజ్యము స్వతంత్రమైంది.

సీతాపూర్ సైనికస్థావరంలో విప్లవము చెలరేగింది. ఆంగ్లేయులను మృత్యువాత పడద్రోసినారు. చుట్టుపట్ల ఉన్న ప్రదేశమంతా ఆంగ్లేయ దాస్యమునుండి విముక్తి పొందింది. ఫైజాబాద్ రాజు రాజామానసింహ, మౌల్వీ అహమద్‌షాలు విప్లవనాయకులు. ఆసమయంలో మౌల్వీ అహమద్‌షా ఆంగ్లేయుల బందీగా ఉండినాడు. మెడకు ఉరిత్రాడు తగిలింపబడిన ఆ క్షణంలో స్వాతంత్ర్య సైనికులు ఆయనకు విముక్తి కల్పించారు.

సైనికులు అతని నేతృత్వములో అయోధ్య ప్రాంతమంతా—కొద్ది కాలము లోనే ఆంగ్లేయ దాస్యము నుండి విముక్తం చేశరు.

## భీష్మాచార్యులు కుమారసింహ

బీహారులోని, శాహబాద్ జిల్లాలో జగదీశపూర్ రాజా కుమారసింహ సాక్షాత్తు అగ్ని, 80 సంవత్సరాల ఈ వృద్ధనాయకుడు భీష్మాచార్యుడా అనిపిస్తాడు. విప్లవయుద్ధంలో ఈయన ఒక నాయకుడు. ఆయన నెదుర్కొని యుద్ధం చేయడం కంటె పారిపోవడమే మేలని ఆంగ్లేయులు భావించేవారు. ఆయనతో జరిపిన ఒక యుద్ధంలో నాల్గు వందల మంది ఆంగ్లేయులలో 50 మంది మాత్రమే మిగిలారు. ఎలాగో ఈ విప్లవ వార్త ను వారు పాట్నాకు చేరవేశారు.

ఈ విధంగా ఉత్తర భారతంలో పడమరన ఢిల్లీనుండి, తూర్పున బీహార్ లోని కొన్ని భాగాలవరకు విప్లవం విజయవంతంగా సాగింది. దక్షిణ భారతంలో కొల్హాపూర్, సాంగ్లీ, నరగుండ్, సతారా మొదలైన చోట్లకు ఈ మహా విప్లవయజ్ఞకీలలు విస్తరించాయి. ఈ విప్లవం వలన కలకత్తాలోని గవర్నర్ నిశ్చేష్టుడైనాడు. ఈ యుద్ధాన్ని అణచివేయడం కోసము అలహాబాద్ కోటకు చేరుకున్నాడు. అంబాలానుండి బర్నార్డ్ ఢిల్లీకి ప్రయాణమైనాడు. మద్రాసునుండి జనరల్ నీల్ కూడ ఢిల్లీకి ప్రయాణము కట్టాడు. హవలాక్ కాన్పూరును ఆక్రమించడానికి బయలు దేరి వెళ్ళాడు. కాంప్‌బెల్, సర్ హ్యూరోజ్‌లు ఇంగ్లాండునుండి నవోత్సాహంతో భారతదేశము చేరారు. ఆంగ్లేయులు స్వాతంత్ర్య యుద్ధాన్ని అణచివేయడానికి చాల పెద్ద ప్రయత్నమే చేశారు

## ఆంగ్లేయుల పాశవిక అత్యాచారాలు

సేనాధిపతి బర్నార్డ్ అంబాలానుండి ఢిల్లీవైపుకు సాగిపోయాడు. అతడు సాగించిన క్రూర హత్యాకాండ వింటేనే శరీరము గగుర్పాటు

స్తుంది. దారిలో ఎదురైన వారినంతా బంధింపజేసేవాడు. వారిని సైనిక న్యాయస్థానము ముందు నిలిపి ఉరిశిక్షలు వేయించేవాడు. బందీల తల వెంట్రుకలు ఒక్కొకటే పీకించేవాడు. వారి కుడుపులోకి బాయొనెట్లతో పొడిపించేవాడు. వారినోటిలో ఆవుమాంసము బలవంతాన జొప్పించే వాడు.

జనరల్ నీల్ మద్రాసునుండి బయలుదేరాడు. అతడు కూడా ఇలాంటి దారుణమైన అత్యాచారాలు సాగించాడు. మొదట అతడొక గ్రామాన్ని చుట్టుముట్టేవాడు. తర్వాత దానికి నిప్పుపెట్టబడేది. ముసలి వారు, స్త్రీలు, పిల్లలు బయటికి రావడానికి ప్రయత్నిస్తేవారిని బాయొనెట్లకు బలిచేసి ఆ నిప్పుల్లోకి విసరివేయించేవాడు.

## హత్య-ప్రతిక్రియగా హత్య

ఈ క్రూరత్వము భయంకరము పీష్వా సాత్విక ప్రవర్తనకు ఇది ఒక పరీక్ష. పీష్వా మనస్సులో సత్వ,తమోగుణాల మధ్య సంఘర్షణ చెలరేగింది. అప్పుడు పీష్వా ఆధీనంలో ఒక వేయిమంది తెల్లవారున్నారు. వారు ఆయన చెరసాలలో సుఖంగా నిశ్చింతగా ఉండినారు. అయినప్పటికీ ఆంగ్లేయ అధికారులు వారి క్షేమాన్నిగూర్చి సందేహ పడుతుండేవారు; ఆదుర్దా పడుతుండేవారు। ఆంగ్లేయ అధికారులు సంధిమాటలు ప్రారంభించారు. వీరిని అలహాబాద్‌కు చేర్చే బాధ్యతను పీష్వా తీసుకున్నాడు. 'సత్తీబేరా ఘాట్'లో 40 నౌకలు సిద్ధపరచారు. ఆంగ్లేయుల పిల్లలు,స్త్రీలు ఆ నౌకలోని కెక్కారు;నౌకలు బయలుదేరాయి నౌకలన్నీ ప్రవాహ మధ్యములోనికి వెళ్ళాయి. అనేకులు ఈ దృశ్యము చూస్తూ ఉన్నారు. ఆంగ్లేయ అధికారులుచేసే భయంకర అమానుషఅత్యాచారాల వార్త విని విప్లవసైనికులు, ప్రజలు కసితీర్చుకోవాలనే భావనతో తపించిపోసాగారు. ప్రశాంతంగా సైనికులు, ప్రజలు ఆంగ్లేయ స్త్రీలు, బాలలు వెళ్ళిపోవడం

చూస్తూ ఉన్నారు. అకస్మాత్తుగా శంఖ ధ్వని వినవచ్చింది, అసంతృప్తి అవమానాల అగ్ని భగ్గనిచెలరేగాయి. వారి ఉగ్రులై పోయారు తుపాకి, కత్తి ఏదో ఒకటి చేతికందిన ఆయుధము తీసుకొని సైనికులు, ప్రజలు గంగానదిలో దూకారు. అక్కడ భయంకర హత్యాకాండ జరిగింది. నౌకలు అగ్నికాహుతి చేయబడినాయి. నౌకలోని తెల్లజాతి స్త్రీలు, బాలలు గంగలో దూకారు. ఈ గంగాస్నాన దృశ్యము మహాద్భుతము. గతంలో చెట్టు చెట్టుకు వ్రేలాడదీసి భారతీయులను ఆంగ్లేయులు చంపారు. ఊరు ఊరంతా తగులబెట్టారు, ఆ అత్యాచారాలకు ఇదే సరియైన ప్రతిక్రియ. తెల్లవా రెందరో నీటిలో మునిగిపోయి మరణించారు. మరెందరో తుపాకి కాల్పులకు గురి అయినారు. గంగానది ఆంగ్లేయుల నెత్తుటితోను, వారి శిరస్సులతోను ఎఱ్ఱగా భయంకరంగా తయారైంది.

## హిందూ సామ్రాజ్య పునరుత్థానము

నానాసాహెబ్ వజ్రకఠోరహృదయము ఈ సన్నివేశముతో వెన్నలా మెత్తబడిపోయింది. ఆంగ్లేయులకు వారిదుష్కృత్యాలకు సరిపడ శిక్ష లభించింది. ఈ ఉద్దేశముతో మిగిలిన తెల్లవారిని రక్షించవలసిందని నానా సాహెబ్ ఆజ్ఞాపించాడు. ఈ ఆజ్ఞానుసారము 125 మంది తెల్లజాతి స్త్రీ పురుషులు రక్షింపబడినారు. వీరిని బంధించి కాన్పూరుకు తీసుకవచ్చారు, నానాసాహెబ్ వారిని చెరసాలలో సగౌరవంగా ఉంచాడు.

జూన్ 28న కాన్పూరులో నానాసాహెబ్ దర్బారు జరిగింది. ఆ దర్బారులో భగవా జండా స్వతంత్రమైనదని ప్రకటింపబడింది. వీరులకు శూరులకు తగిన సన్మానము చేయబడింది. హిందూ స్వరాజ్య పునరుత్థానము జరిగింది. యుద్ధము ప్రారంభమైతే, అందులో జయము, పరాజయము ఉంటూ ఉంటాయి. ఇది సహజమే. ఢిల్లీ విజయము, కాన్పూరు గెలుపు, లక్నో, ఝాన్సీలలో జయముమొదలైనవి చాలా అపూర్వమైనవి. శౌర్యము,

పరాక్రమము, దేశభక్తి, ధర్మ నిష్ఠల భావోత్కర్ష పరాకాష్ఠ నందుకున్నది. అయితే దానితోపాటే అంతఃకలహాలు దేశద్రోహము, విశ్వాసఘాతుకత కూడ ఉన్నాయి. క్రొత్త క్రొత్త ఆయుధాలు, కూటనీతి, రైలు, టపా, టెలిఫోను మొదలైన నూతన సాధనాలు, బాగా శిక్షణ పొందిన సేన ఆంగ్లేయుల వద్ద ఉన్నాయి. వారి సేనానులు, విలక్షణమైన చురుకుదనంతో సేనలను నడిపింపసాగారు. హేవలాక్, కాంప్‌బెల్, సర్ హ్యూరోజ్‌లు నడుముకట్టి యుద్ధానికి పయనమయ్యారు. వారి లక్ష్యము కాన్పూరు, ఢిల్లీ, లక్నో, ఝాన్సీలు.

## బాలుర రక్తం పానం చేసిన హడ్సన్

కాన్పూరుకు దాపున ఉన్న ఒక చిన్న గ్రామం ఫతేపూర్. అక్కడ ఒక భయంకర యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ఆంగ్లేయులు గెలిచారు. జయించిన తర్వాత ఆంగ్లేయులు ఫతేపూర్‌లోని ఇండ్లన్నిటినీ తగులబెట్టారు. ఊరిలోని వారందరినీ చంపివేసారు. ఒక్కరినికూడ ప్రాణాలతో వదలలేదు. ఈ దారుణవార్త కాన్పూరుకు ప్రాకింది. దానికి ప్రతీకారము చేయాలనే భావన తీవ్రంగా రగుల్కొన్నది. ఒకనాటి ఉదయం ఆ ప్రతిక్రియాగ్ని భగ్గని మండింది. కాన్పూరులోని 'బీబీఘర్'ను ఈ జ్వాలలు చుట్టుముట్టాయి. అక్కడ 150 మంది ఆంగ్లేయులున్నారు. వారందరినీ చంపి ఆ శవాలను నూతిలో పారవేశారు. ఇదే కాన్పూరు లోని "మెమోరియల్ వెల్" తర్వాతి రోజుల్లో హేవలాక్ దీనికి కసి తీర్చుకున్నాడు. కాన్పూరు అతని అధికారములోనికి వచ్చినప్పుడు, అతడు అక్కడి బ్రాహ్మణులను పట్టుకొని ఆ నూతిలోని నెత్తురు నాకు నట్లు ఒత్తిడి చేశాడు. ఇదే విధంగా ఢిల్లీలో కూడ జరిగింది. పాదుషా అపజయము పొందాడు. అతని బిడ్డలిద్దరు ఆంగ్లేయ సేనాపతి చేతికి

చిక్కారు. సేనాపతి పేరు హడసన్. అతడు అనోరెరుగని బాలురిద్దరిని వధించి వారి వెచ్చని నెత్తురు త్రాగివేశాడు.

ఢిల్లీ పతనమైంది. కాన్పూరు ఆంగ్లేయుల చేజిక్కింది. వెను వెంటనే లక్నో కూడ విప్లవ వీరుల చేయి జారిపోయింది. అటు తర్వాత ఆంగ్లేయ సేనానులు ఝాన్సీ మీద విరుచుక పడ్డారు. ఆంగ్ల సైన్యాలను సర్ హ్యూరోజ్ నడిపిస్తూ ఉండినాడు. ఇక్కడ రాణి ఏకాకి. రాణి సాహసంతో ఆంగ్లేయుల నెదిరించి యుద్ధము చేసింది. పరాక్రమము పరాకాష్ట నందుకున్నది. చివరలో తన కుమారుని వీపున కట్టుకొని ఆంగ్లేయుల గుండెమీద చరచి ఆ రణ రాగిణి రాణీ లక్ష్మీబాయి మెరుపులాంటి వేగంతో ఆంగ్లేయ సేనావాహినిని చీల్చుకొని వెళ్ళిపోయింది. రాణి కాల్పికి వెళ్ళి అక్కడ సేనాపతి తాత్యాటోపేను కలుసుకుంది.

## గ్వాలియర్‌పై ఝాన్సీరాణి విజయము

తాత్యాటోపే ఒక గొప్ప సేనాని. ఈ స్వాతంత్ర్య యుద్ధ మహా శిల్పులలో ఒకడు. సేనాపతి తాత్యాటోపే అపూర్వ ప్రతిభాపలన ఇకముందు యుద్ధము, దాని సంఘటన, సంచాలనం జరిగాయి. ఝాన్సీ రాణి, తాత్యాటోపే తమ సేనలను గ్వాలియర్ వైపుకు నడిపించారు. గ్వాలియర్‌రాజు సింధియా విప్లవానికి అనుకూలుడు కాదు. రాణి సింధియాను ఓడించి గ్వాలియర్‌పై తన అధికారాన్ని స్థాపించింది అక్కడి నుండి యుద్ధం మరల సాగింది.

రాణి పరాక్రమము సర్ హ్యూరోజ్ కళ్ళకు మిరుమిట్లు గొల్పింది. సేనాపతి తాత్యాటోపే రణకౌశల్యము అతనికి దిక్కు తోచనీయలేదు. అతడు గ్వాలియర్‌ను ముట్టడించాడు భయంకరమైన యుద్ధం జరిగింది. ఇక్కడకూడ రాణీ లక్ష్మీబాయి అసాధారణ పరాక్రమము చూపింది. తూర్పు ద్వారాన్ని సంరక్షించే బాధ్యత పూర్తిగా రాణిమీద ఉంది. ఆమె

పురుషవేషం ధరించింది. ఆమె ప్రక్కన కాశీ, మందార అనే చెలికత్తె లిద్దరున్నారు. జనరల్ స్మిత్ సంభ్రాంతుడై నాడు. అతనిని కాపాడడానికి సర్ హ్యూరోజ్ పరుగెత్తాడు. ఇద్దరుకలసి రాణిని ఎదుర్కొన్నారు. రివ్వున వచ్చి ఒక తూటా మందారను నేలగూల్చింది. రాణి కోపము మేరమీరింది. ఆ క్షణంలోనే మందార హత్యకు ప్రతిక్రియ చేసింది. ఆంగ్లేయులను యమ సదనానికి పంపింది. శత్రుసైన్యాలను చీల్చుకుంటూ ఆమె మెరపుతీగలాగా ముందుకు వెళ్ళింది. ఆమెవెళ్ళి విప్లవసైన్యాలతో కలియుడం అవసరము.

## విశ్వాన్ని వెరగు పరచిన విప్లవ జ్యోతి

ఆమె ఏకాకి, పైగా అబల. కాని ఆ సమయంలో మహిషాసుర మర్దని అనిపించింది. ఒక గొప్ప ఆంగ్లేయ సేనాపతి ఆమెను వెన్నంటి తరుముతున్నాడు అతనికి దుమ్ముతినిపించి ఆమె ముందుకు సాగివెళ్ళింది. దారిలో అమె దురదృష్టం—కాదు. భారతమాత దురదృష్టం—ఒక కాలువ రూపంలో ఎదురైంది. ఆమె గుఱ్ఱము ఒక్కసారిగా ఆగిపోయింది. ఇంతలో వెనుకనుండి ఒక ఆంగ్ల సైనికుడు రాణి భుజం మీద కత్తి దెబ్బ వేసాడు. ఆమె చేయి తెగిపోయింది. ఆ స్థితిలోకూడా ఆ మహిషాసుర మర్దని వానిని ముక్కలు ముక్కలుగా నరికివేసింది. ఇంతలో మరొక తెల్లసిపాయి వచ్చిపడ్డాడు. అతనికత్తి దెబ్బతో రాణి కన్ను తెగి వ్రేలాడ సాగింది. రాణి అతన్నికూడ ముక్కలుగా చెండివేసింది. ఈ లోపల వేరొక తెల్లసిపాయి వచ్చిచేరాడు. అతడు రాణి వక్షఃస్థలము మీద కత్తి దెబ్బవేసాడు. కాని రాణి అతన్నికూడా చంపివేసింది. ఇప్పుడు రాణిచుట్టు పట్లలోనేగాక కనుచూపుమేరలోకూడ ఒక్కతెల్లసిపాయి మిగలలేదు ఇది చూచి రాణి తన శరీరాన్ని భూమాత ఒడిలోనికి చేర్చింది. ఆ చేరువనే బాబాగంగాదాస్ పర్ణకుటీరము ఉంది. బాబాగంగాదాస్ పరుగెత్తుకుంటూ



వీరాంగన ఝాన్సీ రాణి అంతిమ సంగ్రామం.

వచ్చి ఝాన్సీ, రాణిని కుటీరములోనికి తీసుకవెళ్ళాడు రాణి చివరి కోరిక ననుసరించి తెల్లజాతివారల చూపు ఆమె దేహంమీద పడకముందే, ఆ పుణ్య పవిత్ర శరీరము అగ్ని కర్పణ చేయబడింది. అగ్నికి ప్రియమైన తేజస్సు అగ్నిని చేరింది. ఒక వెలుగు విశ్వాన్ని వెరగు పరచి అగ్నిలో విలీనమైంది. ఇంతలో సర్ హ్యూరోజ్ అక్కడకు వచ్చిచేరాడు. శిలా హృదయుడు, నృశంసుడు కృతఘ్నుడు అయిన హ్యూరోజ్‌కూడ ఈ త్యాగశీల యెదుట తలవంచి కన్నీరు నించాడు. మూర్తీభవించిన శూరత్వము గల రాణి లక్ష్మీబాయికి అతడుకూడ ప్రణమిల్లినాడు. జ్వాలాముఖి నుండి వెలువడిన ఈ పావనజ్యోతికి శతకోటి ప్రణామములు.

### ఐదవ అధ్యాయము

# విజయప్రాప్తి పర్యంతము యుద్ధము సాగింప ప్రతిజ్ఞ

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామములో మనవీరులు సాహసము, రాష్ట్రప్రేమ, శౌర్యము యుద్ధనైపుణ్యము, బలిదానములలో దీప్తివంతమైన మహత్తరాదర్శమును నిర్మించారు. స్వాతంత్ర్యము సిద్ధించేవరకు అది దీపస్తంభంగా నిలబడి అనేకులకు దారి చూపుతూనే ఉండినది. 1857 నాటి స్వాతంత్ర సమరానికి ప్రతిభాశాలులైన ఉద్గాతలు నానాసాహెబ్, పీష్వా, ఆయన తమ్ముడు బాలాసాహెబ్, అన్న కొడుకు రావుసాహెబ్ సేనాపతి తాత్యాటోపే, సోదరి ఝాన్సీ రాణి లక్ష్మీబాయి, వృద్ధ ఢిల్లీ బాదుషా బహదూర్‌షా, బేగం జీనత్ మహల్, జగదీశపూర్ రాజా కుమారసింహ, ఫైజాబాద్ మౌల్వీ అహమద్‌షా అనే నవరత్నాలు వీరిలో ప్రతియొక్కరు ఈ దేశ చరిత్రలో ఒక్కొక్క పుట సువర్ణాక్షరాలలో వ్రాసియుంచారు.

## వీరసాధ్వి రాణియొక్క దిగంతకీర్తి

రాణీ లక్ష్మీబాయి వీరసాధ్వి. భారతదేశానికి అమరమైన కీర్తి పతాక. రాణి లక్ష్మీబాయిని గూర్చి స్వాతంత్ర్య వీర సావర్కర్ ఇలా వ్రాశారు "సద్గుణాల సారము ఆమెలో గూడుకట్టుకొని ఉంది ముప్పదిఒక్క సంవత్సరాల ముద్దరాలు. గులాబి పూవులాంటి అందగత్తె పరిశుద్ధ శీలసంపన్న. ఆమె చూపించిన సంఘటనా కౌశల్యము సాటిలేనిది,

దేశప్రేమ ఆమె అంతఃకరణలో జ్యోతిలా నిరంతరము వెలుగుతుండేది యుద్ధకళలో ఆమె ప్రావీణ్యము అపారము. ఇట్టి సద్గుణ సంపన్న మన దేశానికి లభించడం మనదేశపు పరమసౌభాగ్యము. ఇటువంటి అదృష్టము ఇంగ్లాండునకుగాని, ఇటలీకిగాని లభింపలేదు. ఇటలీదేశ విప్లవ చరిత్రలో ఉదాత్త ధ్యేయానికి, మహత్తర పరాక్రమానికి ఎన్నో ఉదాహరణలు లభిస్తాయి కాని అట్టి వైభవయుగంలో కూడ ఇటలీజాతి ఒక రాణి లక్ష్మీబాయిని సృష్టించలేకపోయింది. 1857లో మన మాతృభూమి అంతఃకరణంలో వెలిగిన జ్యోతి ముమ్మందు విప్లవాన్నే నిర్మించింది మీరట్‌లో చిచ్చురగలడానికి ఇంకాఆలస్యముండినది డల్‌హౌసీ దమన చక్రము క్రిందపడి నలిగి నశించిపోయిన ఈ దేశము తుపాకిమందు భాండాగారమైంది. నలువైపుల భీషణయుద్ధము, ఫిరంగుల మ్రోతలు మార్మోగాయి. అది జ్వాలాముఖి భయంకర ప్రకోపమాఅనిపించింది. గంగాదాస్‌బాబా కుటీరసమంచెంత మండుతున్న చితి మంటలు 1857 స్వాతంత్ర్యయుద్ధ జ్వాలాముఖి నుండి వెలువడిన దుర్నిరీక్ష్య అగ్ని జ్వాలలైనాయి.

## గెలుపోటముల ఆట

ఇప్పటివరకు యుద్ధము గెలుపోటములనే కొండలు లోయలలో నాట్యమాడుతున్నది ఆంగ్లేయులు తమ ప్రథమ శ్రేణి యుద్ధవీరులను పణమొడ్డి అందులో నియోగించారు. ఝాన్సీరాణి యుద్ధం చేస్తూ చేస్తూ ధారా తీర్థంలో నేల వ్రాలింది. ఢిల్లీపాదుషా ఓడిపోయాడు. అతని ఇద్దరి బిడ్డల నెత్తురు హడసన్ చవిచూచాడు వారి పీనుగులను ఆ నరాధముడు కోట వాకిట పారవేయించాడు. దీనినే 'ఖూనీదర్వాజా' అంటారు. దీనినే 'శహీదోం కా దర్వాజా' (హుతాత్ముల ద్వారము) అని కూడ అంటారు. లక్నో యుద్ధంలో స్వాతంత్ర్య సైనికులు ఈ హడసన్‌ను హతమార్చి పగ తీర్చుకున్నారు. అయితే లక్నోకు కూడ అవమానము జరిగింది.

జగదీశపూర్ భీష్మాచార్యులుకూడ శరపంజరంలో చిక్కారు. మౌల్వీ అహమ్మద్‌షా యుద్ధంలో హతుడైనాడు. కాన్పూరు పతనమైన తర్వాత శ్రీమంత్ నానాసాహెబ్ పీష్వా నేపాల్ రాజును స్వాతంత్ర్య సంగ్రామములో పాల్గొనేటట్టు చేసే ఉద్దేశంతో నేపాల్‌కు వెళ్ళాడు. ఆయన చిర స్ఫూర్తిని ప్రసాదించే అజ్ఞాత జ్యోతి అయినాడు. ఇప్పుడు ఈ మహా యుద్ధము యొక్క బాధ్యత పూర్తిగా సేనాపతి టోపే భుజస్కంధాల మీద వచ్చి పడింది సేనాపతి తాత్యా ఈ బాధ్యతను చక్కగా నెరవేర్చారు సేనాపతి నిర్వహించిన కార్యము సాటిలేనిది. స్వాతంత్ర్య వీర సావర్కార్ శ్రీ తాత్యా టోపేను శివాజీతో ధీటైన శ్రేష్ఠ సేనానిగా భావిస్తారు. వారిలా వ్రాసారు· "శ్రీ తాత్యా టోపే అపజయము వరించిన అపర శివాజీ ఛత్రపతి మహారాజు ప్రయత్నాలు సఫలమైనాయి. సేనాపతి తాత్యా టోపే ప్రయత్నాలు సఫలం కాలేదు. ఇంతే భేదం, కానీ సేనాపతిత్వంలో ఇద్దరూ సమానులే."

సేనాపతి తాత్యా టోపే ఈ స్వాతంత్ర్య సంగ్రామాన్ని రెండు సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా నడిపాడు. ఈ కాలంలో చిన్నవి, పెద్దవి నూటయాభై పోరాటాలలో పాల్గొన్నాడు. శూన్యంలోనుంచి సుదృఢ సైన్యాన్ని వేలసంఖ్యలో (20 వేలవరకుకూడ) నిలపగల ఇంద్రజాలాన్ని ఆయన చేసి చూపాడు ఈదృష్ట్యా ప్రపంచంలోని ప్రముఖ సేనానులలో తాత్యాటోపే అద్వితీయంగా నిలుస్తాడు. యుద్ధరంగంలో అతని కదలికలు అతిచురుకుగా, వేగవంతంగా ఉండేవి. వాటినిచూచి మహామహా సేనాపతులు ముక్కుమీద వ్రేలు వేసుకునేవారు "హిందూ స్వరాజ్య సేనాపతిని నేను." అని తాత్యాటోపే సగర్వంగా చెప్పకొనేవాడు. సేనాపతులకు ప్రీతిపాత్ర మైన మృత్యువు కారణంగా ఆయన అమరుడైనాడు.

## అసహాయ రణశూరుడు

గ్వాలియర్ లోని భీషణ సమరములో అతని ప్రియసోదరి ఝాన్సీ రాణి లక్ష్మీబాయి ధారాతీర్థంలో నేలకొరిగింది. అందుకు తాత్యా ఎంత గానో దుఃఖించాడు. గ్వాలియర్ చుట్టుపట్ల ఆయన తీవ్రమైన తిరుగుబాటు లేవదీసాడు నలువైపుల భయంకర హత్యాకాండ చెలరేగింది. విజయలక్ష్మి వరించిన ఆంగ్లేయులలో హాహాకారాలు చెలరేగినాయి. తాత్యా అకస్మాత్తుగా అదృశ్యుడైనాడు. అపుడు సేనాపతి టోపే కేవలం ఒంటరిగా ఉండినాడు. శ్రీమంత్ పీష్వా సహాయంగాని. సోదరి మనూబాయి రాణీ లక్ష్మీబాయి-తోడుగాని లేదు. సేన, ధనము, సంపద-యేదీలేదు.

సేనాపతి తాత్యాశక్తి ఒక విషయంమీద ఆధారపడి ఉంది. అది అతని అజేయ ఆత్మ విశ్వాసము, ఆత్మసమర్పణకు సంసిద్ధత. విజయము లభించేవరకు ఈ పోరాటము సాగుతూనే ఉంటుంది. ఇది సేనాపతి ప్రతిన. కొలదికాలములోనే మధ్య భారత రణాంగణములో సేనాపతి విజయగాథ ఇంటింటా గానము చేయబడసాగింది.

గ్వాలియర్ చేయిజారిన తర్వాత సేనాపతి సారంగపూర్ గ్రామము చేరుకున్నాడు. ఇక్కడ ఆయన అటుతర్వాతి ప్రణాళికను యుద్ధనీతిని నిశ్చయంచేసుకున్నాడు సాధ్యమైనంతవరకు ఆరుబయళ్ళలో యుద్ధము చేయరాదని నిశ్చయించుకున్నాడు సురక్షితంకాని ప్రదేశాలలో ముఖ్యముగా మహారాష్ట్రి "వృకయుద్ధ" పద్ధతిలో (గెరిల్లాయుద్ధము) ఆయన పోరాటము నడిపించ దలచాడు. దారిలో ఉన్న రాజ్యాల రాజుల నుండి ఆయన ఆయుధాలు, ధనము సేకరించ దలచాడు. సేనను నిర్మించి ఏదోవిధంగా ఆ సేనతో నర్మదానదిని దాటి దక్షిణాపథానికి వెళ్ళాలని ఆయన మనస్సులో ఒక తీవ్రమైన కోరిక ఉండేది. దక్షిణ భారతం ఈ రణయజ్ఞంలో నడుంకట్టి నిలచేలా చేయాలని ఆయన మనసార కోరినాడు.

## సేనాపతి నర్మదను దాటాడు

జూన్ 22 దాపు దాపున సేనాపతి టోపే ప్రోత్సాహంతో భరతపూర్, జయపూర్‌లలో విప్లవము చెలరేగింది. బ్రిగేడియర్ రాబర్ట్స్ సేనాపతిని ఎదుర్కొనడానికి పూనుకున్నాడు. అతడు సేనాపతి దారి నడ్డగించాడు. ఈ రోజుల్లో సేనాపతి కదలికలు మెరుపులాగా వేగవంతంగా ఉండేవి. టోంక్, ఇంద్రగఢ్, బూందీ, ఉదయపూర్, నాథ్‌ద్వారా-ఈ పేర్లు చదవడానికి కొంచెము సేపు పట్టవచ్చు కాని, సేనాపతి అంతకంటె ముందే అక్కడకు చేరిపోతుండేవాడు. ఈసారి మూడు ఆంగ్లేయుల ప్లాటూన్‌లు తాత్యా వెంటబడ్డాయి ఒక ప్లాటూన్ కన్నుగప్పి సేనాపతి టోపే రెండవ ప్లాటూన్ మీద విరుచుకపడేవాడు. దాన్ని ఓడించి మూడవ ప్లాటూన్ కంట్లో కారం చల్లి అకస్మాత్తుగా అదృశ్యుడయ్యేవాడు. చూస్తూ చూస్తూ ఉండగానే సేనాపతి చంబల్ నదిని దాటి ఝాలరా పాటణ్ చేరాడు. ఇక్కడి గులామ్ రాజా సేనాపతి నెదిరించి, అతనిని ఆపడానికి ప్రయత్నించాడు. అయితే క్షణంలో తాత్యా టోపే అతని అహంకారాన్ని నగ్గునూచము చేశాడు. రాజు 14 లక్షల రూపాయలు యియ్యవలసి వచ్చింది. అతని సేన అంతా సేనాపతి టోపేను చూడగానే స్ఫూర్తిని పొంది అతని జండా నీడలో ఏకత్రితమైంది.

సేనాపతి చూపిన ఈ ఇంద్రజాలము చూచి ఆంగ్లేయ సేనాపతుల గుండె డిగజారిపోయింది. రాబర్ట్స్, హోమ్స్, పార్క్, మిచేల్, హోప్ గ్రాంట్, లాక్‌హార్ట్ - ఈ ఆర్గురు సేనాపతులు సేనాపతి టోపేను నలువైపుల చుట్టివేసి పట్టుకోవాలని పథకము వన్ని సాగిపోయారు. మూడు వైపుల ఆంగ్లేయుల భారీ ప్లాటూన్‌లు, నాల్గవ వైపున నర్మదానది. సేనాపతి టోపేను నర్మదను దాటనీయరాదని ఆ ఆర్గురు సేనానుల ప్రతిజ్ఞ.

దానికి తగినట్లు నర్మదకు అవలిఒడ్డున కూడ సంసిద్ధత ఉంది, కాని సేనాపతి టోపే వీరందరిని మోసగించి అక్టోబరు 26, 1858న హోశంగాబాద్ నకు 40 క్రోసుల దూరములో నర్మదానది దాటి అవలిఒడ్డు చేరాడు. సేనాపతి టోపే ఇప్పుడు నాగపూర్ ప్రాంతంలో ప్రవేశించాడు.

సేనాపతి నర్మదను దాటి దక్షిణ భారతంలో ప్రవేశించాడు. ఆ నాడు ఈ వార్త అత్యంత ప్రముఖంగా గుర్తించబడింది. ప్రత్యేకించి లండన్ నగరములోని ప్రతివ్యక్తి సేనాపతిని గూర్చి ఆసక్తి కనుపరుప సాగాడు. ఈ సంఘటనను గూర్చి మాలిసన్ ఇలా వ్రాశాడు: "ఈ ప్రముఖ సంఘటన ఒక సంవత్సరము క్రిందట జరిగిఉంటే నిజాము ప్రాంతము దక్షిణ దేశంలోని ఇతర విప్లవకారులతో చేయి గలిపి ఉండేది. ఆంగ్లేయుల స్థితి క్లిష్టతరమై ఉండేది, నర్మదను దాటడానికి ఏర్పరచిన ప్రణాళికను కార్యరూపంలోకి తేగలిగిన సాహసము ప్రశంసనీయము. దానిని పొగడలేక పోవడము పూర్తిగా అసంభవము."

సేనాపతి టోపే నర్మదను దాటుతూనే, నాగాపూర్, ఖాందేశ్, గుజరాత్ ఈ మూడువైపుం అతని మార్గాన్ని బ్రిగేడియర్ హిల్, హ్యూరోజ్, రాబర్ట్సులు అడ్డగించారు. అందుచేత తూర్పున చొరరాని కొండలు దక్షిణాన నర్మదానది మధ్య సేనాపతి టోపే చిక్కుకున్నాడు ఈవిధంగా సేనాపతి టోపే చుట్టివేయబడ్డాడు. మరల నర్మదను దాటి బరోడాలో ప్రవేశించడానికి ఆయన ప్రయత్నించాడు. కాని ఈ ప్రయత్నం కూడా సఫలంకాలేదు అందుచేత సేనాపతి టోపే దేవగఢ్ బారీ అరణ్యములోనికి చొచ్చుకు వెళ్ళాడు. అక్కడ రెండురోజులు విశ్రాంతి తీసుకొని ఆయన బాంస్‌బారా అడవికి చేరుకున్నాడు. డిశంబర్ 11వ తేదీన ఆయన ఉదయపూర్ వైపుకు వెళ్ళసాగాడు. అయిత ఇక్కడ కూడ ఆంగ్లేయ సేనానులు తమ సేనలతో అతని దారి నడ్డగించడానికి సిద్ధమయ్యారు.

ఇప్పుడు ఖిల్‌వాడా అరణ్యం ప్రవేశించడము తప్ప మరొక ఉపాయమే గోచరించలేదు ఇక్కడ, ఈ అరణ్యంలో కూడ ఆయన ఒక మంచి సేనను సమకూర్చుకొని ఒక నెలలోపలనే ఆంగ్లేయుల సేనపై ఆక్రమణ, ప్రత్యాక్రమణలు ప్రారంభించాడు. 21 జనవరినాడు మరొకసారి సేనాపతి టోపే ఓటమిని అంగీకరించవలసి వచ్చింది. ఇది దురదృష్టానికి ఆఖరిమెట్టు.

## లండన్ టైమ్సు ప్రశంస

ఆ రోజుల్లో లండన్ టైమ్సు ఇలా వ్రాసింది· "మనము ముఖ్యంగా గుర్తింపదగిన మిత్రుడు తాత్యాటోపే. ఆయన చాల భయంకరుడు, చతురుడు అయిన శత్రువు అందుకనే మేము అతనిని ప్రశంసింపలేక పోతున్నాము. గత జూన్ నెలనుండి ఆతడు మధ్య భారత్‌లో గగ్గోలు పుట్టిస్తున్నాడు. ఆతడు ఎన్నో రైల్వేస్టేషన్‌లను తగులబెట్టాడు. ఖజానాలు దోచుకున్నాడు. మందుగుండుసామగ్రి భండారాలు హస్తగతం చేసుకున్నాడు. సేనలను కూర్చాడు; పోగొట్టుకున్నాడు కూడ. యుద్ధాలు చేసాడు. పరాజయాన్ని వరించాడుకూడ. భారతీయ రాజులవద్ద నుండి అతడు తుపాకులు, ఆయుధాలు సంపాదించాడు. వాటిని పోగొట్టుకున్నాడు. మరల తుపాకులు సంపాదించి వాటినీ పోగొట్టుకున్నాడు. అతడు ఒకప్పుడు మన సేనలముందుకు, మరొకప్పుడు వెనకకు, వేరొకప్పుడు మధ్యకువచ్చి తప్పించుకపోయాడు. చాల మంచి సాధనాలు కల 'ఏరియల్' కూడ రంగస్థలంమీద ఇంత చంచలంగా, నేర్పుగా, మోసకారిగా ఉండలేదు కొండలమీద, నదులలో, గుహాలలో, ముందు-వెనుక కుడి-యెడమ, ఒక క్షణాన ఇటు, మరుక్షణాన అటు. ఈ విధమైన నడకలతో ఎటుచూసినా సేనాపతి టోపే సంచరిస్తున్నాడు. అకస్మాత్తుగా ఏదో ఒక గ్రామాన్ని అతడాక్రమిస్తాడు. దాన్ని దోచుకోపడమూ, తగుల

బెట్టడమో చేస్తాడు. మరుసటి నిమిషంలో అతడు మెయిలు బండి మీదకు దూకి బొంబాయికి వెళ్ళే తపాలును ఎత్తుకపోతాడు. కాని ప్రొట్యూస్ లాగే చేతికందడంలేదు. అతడు ముందుకు, మరికాస్త ముందుకు వెళ్ళి పోతున్నాడు.'

## మీడ్ గుఱ్ఱపుదళంకూడ ఓడిపోయింది

ఆటు తర్వాత సేనాపతి టోపేను పట్టుకునే విషయంలో ఆంగ్లేయ సేనానులకు కలిగిన భయం అంతా యింతా కాదు. సేనాపతిని పట్టుకునే కార్యంలో ఒక ఒంటెల దళంలోని కొన్ని వందల ఒంటెలు చాల దూరము పరుగెత్తినందున, నోట చొంగకార్చి చనిపోయినవి. కాని సేనాపతి మాత్రము ఈ మోసగాండ్ర చేతిలో చిక్కలేదు. తాత్యాటోపేను బంధించే కార్యంలో సర్ రిచర్డు మీడ్‌ను నియోగించారు. 150 మంది నేర్పరులయిన అశ్వికులతో త్వరితగతిని వెళ్ళగల ఒక ప్రత్యేక దళాన్ని మీడ్ నిర్మించాడు. కాని ఈ క్రొత్త దళము కూడ అలసిపోయింది, భయపడింది, ఓడిపోయింది. అటు పిమ్మట ఆంగ్లేయులు మోసాన్ని ఉప యోగింపదలచారు. సేనాపతితో పాటు అతని స్నేహితుడు మానసింహ నారాయణసింహ అని ఒకడుండేవాడు. సామ, దాన, భేద, దండోపాయా లను ఉపయోగించి ఈ వ్యక్తిని వారు తన అదుపులో ఉంచుకున్నారు. సామదాన చక్రంలో చిక్కుకున్న మానసింహ ఆంగ్లేయులతో కలిసాడు. ఒకనాటి రాత్రి నిర్విరామ పరిశ్రమతో అలసి, సేనాపతి గాఢంగా నిద్ర పోతుండగా, ఆ నడిరాత్రి శూర వీరశిఖామణి రిచర్డ్ మీడ్ పిల్లిలా అడుగులు వేసుకుంటూతుపాకీ తీసుకుని సేనాపతి పడక దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు. అలికిడి విని సేనాపతి మేల్కొన్నాడు. ఎదురుగా మగతనం చాలని సర్ రిచర్డ్‌మీడ్ భీరువులాగా గుండెకు తుపాకి గురిపెట్టి ఉన్నాడు. అది 1859 ఏప్రిల్ 7నాటి భయానక కాళరాత్రి. గుర్తగూటలు గుండెలలిసేలా

కూస్తున్నాయి. ఎటుజూచినా అపశకునాలే. స్వాతంత్ర్య దేవతకు చివరి సారి నమస్కరించి సేనాపతి టోపే తొంగిపోయాడు. వెంటనే టోపేమీద సైనిక న్యాయస్థానములో దోషారోపణ జరిగింది, 1859 ఏప్రిల్ 18వ తేది నాడు హిందూ సామ్రాజపు ఈ చివరి సేనానికి ఉరిశిక్ష విధించ బడింది.

## ఉరికంబము గద్గదమైంది

సాయంకాలము నాల్గు గంటలవేళ, స్త్రీ పుణ్యభూమిలో ఈమహా మానవ వీరాత్మునికి స్వాగతము పలకడానికి ఉరికంబము సిద్ధమైంది.



సేనాపతి తాత్యాటోపే ఆ ఉరిత్రాడును తన చేతులతో తన మెడకు బిగించుకున్నాడు.

ఆ ఉరికంబము ఈనాడు గౌరవింపబడుతున్నది. మూర్తీభవించిన బలిదానము. ఈనాడు ఆ వధస్తంభాన్ని కౌగలించుకొనడానికి వస్తూ ఉన్నాడు. సేనాపతి టోపే సంకెళ్ళు విడిపడ్డాయి. చూస్తూ చూస్తూ సేనాపతి టోపే చిరునవ్వుతో యజ్ఞవేదిక మెట్లుఎక్కి పైకివచ్చాడు. అక్కడ ఉరితీసేవాడు సేనాపతి కాళ్ళుచేతులు కట్టివేయడానికి సిద్ధంగా నిల్చొని ఉన్నాడు సేనాపతి అతనికి నమస్కరించి "మిత్రమా, మీరే నాకు నిజమైన తోడు చివరి క్షణంవరకు, యజ్ఞవేది చేరేవరకు మీరు నాకు నమ్మకంగా తోడ్పడినారు. మృత్యువు అమరత్వము ప్రసాదించే ప్రియ మిత్రుడునాకు నన్ను ఒంటరిగా నా రాముని కలసి కోనియ్యండి. ఉండండి తమ రక్కడే ఆగండి నాదేశ బంధువులకు నా చివరి నమస్కారము అందజేయండి" అని అంటాడు. ఇలా అని సేనాపతి తాత్యా ఆ ఉచ్చును స్వయంగా తన చేతులతో తన మెడకు తగిలించుకున్నాడు. కాలి క్రింది పలక ప్రక్కకు తొలగింది. ఒక ఊపుతో సేనాపతి పార్థివ శరీరము కందకంలోకి వ్రేలాడింది. ఒక జ్వాజ్వల్యమానమైన జ్యోతి అనంతంలో కలసిపోయింది. మృత్యువు అతనికి చావు లేకుండా చేసింది.

1857 మే నెల 10వ తేది ప్రారంభమైన ప్రథమ స్వాతంత్ర్య యుద్ధము ఈ విధంగా 18-4-1859 న ముగిసింది. ఏదో తేల్చుకుందా మనే ఉద్దేశంతోనే ఈ యుద్ధం జరిగింది. ఈ యుద్ధము ముఖ్యోద్దేశ్యము ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వాన్ని కూలద్రోయడం. ఆ ఉద్దేశ్యం నెరవేరింది. కంపెనీ ప్రభుత్వము ఈ భారత భూమి నుండి సమూలంగా పెకలించి వేయబడింది. ఈ మహోద్దేశ్యము సేనాపతి టోపే మరణానికి ఆరు నెలల ముందే ఫలించింది. 1858 నవంబర్ 7 వ తేదీన కంపెనీ రాజ్యము పరిసమాప్తమైంది. దాని పెత్తనం నశించింది. వ్యాపారము కోసము 1600 లో స్థాపింపబడిన ఈ కంపెనీ 1858 లో ఒక గొప్ప

సామ్రాజ్యాన్ని పొందింది. పోగొట్టుకొని నశించింది. ఇంగ్లండు రాణి పాలన ఈ దేశంలో ప్రారంభమైంది.

పాలుత్రాగాలనే కోరిక మజ్జిగ తాగితే తీరదు. ఈస్టిండియా కంపెనీసమాప్తం గావడం నిజమే. కాని, అంతకంటె బలీయమైన బ్రిటిషు సామ్రాజ్య శక్తియొక్క బరువైన కాడి మన మెడలమీద ఉంచబడింది ఈ కాడిని సప్త సముద్రాల కావల విసరివేయడానికి అటు తర్వాత 90 సంవత్సరాలపాటు మనము పోరాడాము.



## అరవ అధ్యాయము

# కూకాల
# తేజోమయ బలిదానము

1857 మే 10 వ తేదీన ప్రారంభమైన స్వాతంత్ర్య సంగ్రామము సమాప్తమయిందని అన్నారు. వాస్తవానికి అది 1857 మార్చి 29 వతేది మంగళ్ పాండే బలిదానముతో ప్రారంభమై విప్లవ నాయకులలో ఒకరైన రావుసా హెపీష్వాను 1859 ఆగష్టు 30 వ తేదీన ఉరితీయడంతో సమాప్తమైంది. కాని ఈ యుద్ధము. రాష్ట్రీయ స్వాతంత్ర్య సంపాదనకు ఆరంభింపబడిన మహత్తర రణ యజ్ఞము. ఈ యజ్ఞము స్వాతంత్ర్యము సిద్ధించకుండా ఆగిపోయేదికాదు. స్వాతంత్ర్య యుద్ధము వంటి మహా కార్యములో కష్టాలు వస్తూనే ఉంటాయి, వాటికి భయపడి పిరికివాళ్ళు దాస్యపంకంలో దిగబడి పోతుంటారు. చిక్కుకొని పోతుంటారు కాని సాహసికులు కష్టాల నెదిర్చి స్వాతంత్ర్యము సంపాదిస్తారు ఈ యుద్ధము తరతరాలు అఖండంగా సాగుతూ ఉంటుంది, వెనుకటి తరము రాబోవు తరానికి తన తేజస్సును వారసత్వంగా అందిస్తూ ఉంటుంది

## కంపెనీ ప్రభుత్వానికి సమాధి

నానాసాహెబ్ రచించిన ప్రణాళిక భవ్యమైంది దాని రూపురేఖలు ఎంతో చాకచక్యముతో ఏర్పరచపడినాయి. కాని ఆ యుద్ధంలో మనము ఓడిపోయాము. కంపెనీ ప్రభుత్వము నశించినది; కానీ బ్రిటిష ప్రభుత్వపు కాడి మన మెడల మీదికి ఎక్కింది. అప్పుడు ఇంగ్లాండు దేశానికి రాణి విక్టోరియా. ఆమె ఒక ప్రకటన పత్రము ద్వారా కంపెనీ ప్రభుత్వము

సంపాదించిన హిందుదేశ భూభాగంలోని రాజకార్యాలు సర్వము తన చేతి లోకి తీసుకుంది. భారతదేశము అనే అమూల్యరత్నము బ్రిటిషు సామ్రాజ్య మనే తిమింగలము కడుపులోకి సునాయాసంగా చేరింది. 90 సంవత్సరాల తరువాత ఈ రత్నము వలన తన కడుపు పగిలి పోతుందని తోచగానే ఇంగ్లాండు దానిని వెళ్ళగ్రక్కవలసి వచ్చింది. రాణి ప్రకటన పత్రముతో హిందూ దేశంలోని సమస్త రాజకార్యాలు విక్టోరియా రాణి చేతిలోకి వచ్చాయి. 1858 నవంబర్ 1 వ తేది అలహాబాద్‌లో ఒక పెద్ద దర్బారు జరుపబడింది. అందులో రాణి ప్రతినిధి లార్డ్ కానింగ్ ఆ పత్రాన్ని చదివి వినిపించాడు.

## రాణి ప్రకటన పత్రము

ఈ ప్రకటన పత్రములో మన దృష్ట్యా మూడు ముఖ్యమైన అంశా లున్నాయి. (1) ఈస్టిండియా కంపెనీనుండి తాము కార్యభారాన్ని గ్రహి స్తున్నామని ప్రకటించడం; (2) ఆయుధాలు వదలివేసి లొంగిపోయేవారిని క్షమించగలమని ఆశ చూపడం; (3) మత విషయాలలో జోక్యం కలిగించు కొనబోమని హామీ యివ్వడం.

అంగ్లేయులు అత్యంత ధూర్తులు, చతురులు గనుక ప్రపంచంలో విశాల సామ్రాజ్యాన్ని స్థాపించగలిగారు. "బ్రిటిషు సామ్రాజ్యములోసూర్యు డెన్నడూ అస్తమించడు" అని వారు సగర్వంగా ఘోషిస్తారు. ఈ మాటలో నిజముంది. హిందుస్థానాన్ని కబళించడంలో వారు ఆశ్చర్యకర మైన కూట నీతిని ప్రయోగించారు. భారతీయుల హృదయాలలో 'స్వ' (తమది) అనే భావము పూర్తిగా తొలగింపచేయడానికి వారొక అందమైన పంజరాన్ని అమర్చారు. దురదృష్టవశాత్తు మనము అందులో చిక్కు కున్నాము. మన మెవరము ? మనదేశ మేది ? మన ధర్మ మేది ? మన సంస్కృతి యెటువంటిది ? వీటన్నిటినీ మనము క్రమంగా మరచిపోతూ

వచ్చాము. పంజరంలో నుండి మనము బయటపడ్డాము. కానీ బాగా గాయ పడి-దేశ శరీరాన్ని రెండు ముక్కలు చేసి, ఆ ఆత్మ విస్మృతి మత్తు ఈనాడు కూడ విడిపోలేదు.

## కళ్లకు బంగారు కట్టి కాశీ యాత్ర

విక్టోరియా రాణి ప్రభుత్వము మన దేశంలో ప్రారంభమైంది. మన మనస్సులలో క్షోభను చల్లార్చడానికి సూత్రబద్ధమైన ప్రయత్నాలు ప్రారంభింపబడినాయి. ఆంగ్లేయ విద్యాబోధన ఆరంభమైంది. కలకత్తా, బొంబాయి, మద్రాసులలో విశ్వవిద్యాలయాల స్థాపన జరిగింది సైన్యము సంస్కరింపబడి మరల సుసంఘటితము చేయబడింది. ఉన్నత న్యాయ స్థానము స్థాపింపబడింది. విధాన సభలు ప్రారంభింపబడినాయి. వ్యవసా యము, వ్యాపారము, పరిశ్రమల విషయంలో క్రొత్త చట్టాలు తయారై నాయి. సామాన్య జనుల క్షేమాన్ని గూర్చి ప్రకటనలు చేయబడినాయి. రైలు, తపాల వ్యవస్థలు ఏర్పడినాయి. మెల్లమెల్లగా భారతదేశంలో రాణి యొక్క ఏకచ్ఛత్రాధిపత్యము ప్రారంభమైంది. హిందూదేశ హితంకోసం స్వయంగా భగవంతుడే ఈ ఎఱ్ఱమూతుల దేవదూతలను పంపాడని ఇక్కడ బడలిపోయి, భ్రమపడి, మధ్యకాలపు అశాంతితో భయపడి పోయిన ప్రజలు అనుకోసాగారు. ఇప్పుడు కళ్ల చివర బంగారు కట్టి బాహాటంగా ప్రదర్శిస్తూ నిర్భయంగా కాశీ యాత్ర చేయగలుగుతామని పదిమందీ అనుకోసాగారు. రాజా రామమోహనరాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, దాదాభాయి నౌరోజీ, జగన్నాథ శంకరసేఠ్, స్వామి దయానంద, రామకృష్ణ పరమ హంస వంటి ద్రష్టలు ఈ పరిస్థితిలో కూడ కలతపడకుండా, భ్రాంతిలో మునిగిన ప్రజలలో వివేకాన్ని వికశింపజేస్తూ, ఆయా పరిస్థితుల కను గుణంగా వారిని జ్ఞానవంతులను చేసే ప్రయత్నాలు ప్రారంభించారు ఈ ప్రథమ కాలఖండంలో మహారాష్ట్రములో ఇటువంటి ఒక ద్రష్ట

జన్మించాడు. ఇనుపగుండులాగా చల్లబడి పోయిన ఈ సమాజములో ఆయన పూర్వ స్మృతులను మేల్కొలిపాడు ఈ మహాపురుషుని పేరే మహాదేవ గోవింద రానడే.

## న్యాయమూర్తి రానడే

న్యాయమూర్తి రానడే ఆనాడు పెద్ద పదవుల నలంకరించిన భారతీయులలో అగ్రగణ్యుడు. రాష్ట్ర కల్పన విషయములలో ఆయనకు ఎటువంటి సందేహమూలేదు. 'హిందుస్థాన్ మనరాష్ట్రము. ఈనాడు పరిస్థితుల ప్రాబల్యానికి లొంగి అది దాస్యములో చిక్కుకొని ఉన్నప్పటికి, ఈ పారతంత్ర్యము పరిసమాప్తమై అది గౌరవ స్థానాన్ని స్వాభిమాన పూర్వకంగా పెంచవలసి ఉంది' ఈ లక్ష్యము మీది తన దృష్టిని ఆయన ఏనాడు కూడ చలింపచేయలేదు అందుకొరకు రాజకీయ, సాంఘిక, పారిశ్రామిక, ధార్మిక సాంస్కృతిక విద్యారంగాలలో సమన్విత రూపంలో ఉన్నతిని చేయడానికి ఆయన ప్రయత్నాలు సాగించాడు.

## పండిత రామసింహ కూకా వ్యక్తిత్వము

ఆ రోజుల్లో పంజాబులో మరొక విధమైన పశ్చాత్తాప భావన మొలకెత్తింది. 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామములో పంజాబు ఉచిత రీతిలో తన బాధ్యతను నెరవేర్చలేదు. ఇది వారి గుండెలలో గుచ్చుకుంటూ ఉండేది. ఆర్యులు హోమాగ్నిని ప్రజ్వలింపజేసినచోటు, గురుగోవింద సింహ బహదూర్ల రణ క్షేత్రము అయిన ఆ భూమాత సంతానానికి ఇది హృదయశల్యమై ఎల్లప్పుడు బాధిస్తుండేది. అందుచేత పండిత రామసింహ కూకా ఒక రణయజ్ఞాన్ని ప్రారంభించాడు ఈ యజ్ఞ జ్వాలల దుర్నిరీక్షమైన కాంతి ఆంగ్లేయ ప్రభుత్వపు కళ్ళు మూసుకుపోయేలా చేసింది.

పండిత రామసింహ కూకా 1824 లో లూధియానా జిల్లాలోని భేణీ గ్రామంలో జన్మించాడు. పంజాబీవ్యక్తులకుండే సహజమైన మంచిఎత్తు బలిష్ఠమైన శరీరము ఆయనకు వచ్చాయి. ప్రకృతే ఆయనకు గొప్పవ్యక్తిత్వాన్ని యిచ్చింది మొదట్లో ఆయన మహారాజా రంజిత్‌సింహ సైన్యంలో చేరాడు. మహారాజా చనిపోయిన తర్వాత ఆయన మనస్సు చాల వికలమైంది. మహారాజు కుమారుని ఆయన కుటుంబాన్ని ఆంగ్లేయులు ఎగతాళి పాలు చేయడం స్వాభిమానం కల ఆయన సహించలేకపోయాడు. విదేశీయులైన ఆంగ్లేయుల వద్ద ఉద్యోగం చేయడానికి ఆయన మనస్సు ఎదురు తిరిగింది. ఉద్యోగం వదిలిపెట్టి తిన్నగా స్వగ్రామానికి వెళ్ళిపోయాడు. విక్రమము, వైరాగ్యము ఆయనలో అపూర్వంగా సమ్మిశితమైనాయి. ఆయన భగవంతుని సేవ ఒక్కటే చేయాలని సంకల్పించాడు. స్వధర్మ, ప్రచారం కోసము ఆయన తన జీవితాన్ని అర్పించాడు. ఆయన మనో వేదన అంతా యింతా కాదు. ఆయన స్వదేశభక్తినిరూపమానము. ఆయన తేజస్సు చూచి అనేకులు ఆయన వద్దకు ఆకర్షింపబడేవారు ఆయన ఉపదేశాలతో ప్రభావితులయ్యేవారు. ప్రతి ఒక్కరు ఆయనను స్వధర్మానికి పూజ్యులైన సద్గురువుగా ఎంచుకునేవారు. ఆయన కొద్ది కాలములోనే ఒక సామాన్య సంఘటనను నిర్మించాడు. సంఘ దురాచారాల మీద దెబ్బతీయ సాగాడు. సామాజిక ధార్మిక విప్లవఘోష వినిపింపసాగింది. ఒక సాంప్రదాయము జన్మించింది. దీనికి 'నామధారీ' సంప్రదాయమని పేరు దీనికే కూకా సంప్రదాయమనీ, దీని అనుయాయులను 'కూకాలు' అనీ అంటుంటారు.

## సాధు రామదాస్ గురు మంత్రము

మొదట్లో ఈ సంప్రదాయ స్వరూపము ధార్మికంగానే ఉండింది. కాని, ఆ సమయంలో పండిట్‌జీని ఒకానొక సాధు రామదాస్ కలిసినాడు.

ఈ రామదాస్ గురు మంత్రముతో ఒక్కసారిగా ఈ సంప్రదాయము రాజకీయ స్వరూపాన్ని ధరించింది. గోవధ నిషేధము ఈ సంప్రదాయము చేపట్టిన ప్రముఖ కార్యము. ఈ ప్రతిన కోసము ప్రాణాలు పణంగా ఒడ్డి నృశంసులైన కసాయి వారి చేతుల నుండి గోమాతను రక్షించడము పండిత్ జీ భక్తుల పరమ ధర్మము. (గోవధ నిషేధము స్వధర్మంలో ప్రధానాంశము. ఆ స్వధర్మ రక్షణ స్వాతంత్ర్యము సిద్ధిస్తేనే తప్ప అసంభవము) పండిత్‌జీకి ఈ సత్యము గోచరించినంతనే ఆయన వాణి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నిప్పుల గుప్పించ నారంభించింది. వేలకొలది యువక శిష్యులు ఆత్మాహుతి చేసుకోడానికి సిద్ధమై ఉత్తేజితులై నిలిచారు. చూస్తూ చూస్తూ ఉండగానే పంజాబు ప్రాంతంలో ఆయన మరొక ప్రభుత్వాన్ని స్థాపించాడు. 22జిల్లాలలో పండిత రామసింహ కూకా ఆధిపత్యము స్థాపించబడింది. ఈ కూకా రాజ్యంలో, ఆంగ్లేయుల సౌకర్యాలు త్రోసి వేయబడ్డాయి. రైళ్ళు, తంతితపాల కార్యాలయాలు మూతబడ్డాయి. వీని స్థానంలో స్వతంత్ర తపాలావ్యవస్థ ఏర్పడింది. ఆంగ్లేయ విద్యావిధానం వైపు కన్నెత్తి చూచేవాళ్ళు కూడ కరవైనారు.

## జ్వాలలు పైపైకి లేస్తున్నాయి

ఆంగ్లేయ ప్రభుత్వము మీద దీని ఫలితాలు కనుపించాయి. ఆంగ్లేయులు ఈ సంప్రదాయాన్ని నిషేధించారు. అయితే దీనివలన వారి స్వాతంత్ర్య పిపాస మరింతగా పెల్లుబికింది. రహస్యంగా కార్య విస్తరణ జరుగుట ప్రారంభమయింది. 22 జిల్లాల అధికారులు ఆంగ్లేయుల పట్లగల విద్వేషాగ్నిని ప్రణాళికా బద్ధంగా ప్రజ్వలింపజేయ సాగారు. ఆయుధ సంపత్తిని అతి రహస్యంగా సమకూర్చసాగారు. కూకా దూతలు సైన్యంలో విప్లవ సందేశాన్ని వినిపిస్తూ సంచరింపసాగారు. విప్లవ ప్రారంభదినము నిశ్చయింపబడింది

ఇంతలో ఈ ధార్మిక సాంప్రదాయము మీద ఉన్న అనుమానాలు బహుశా తొలగినందున కావచ్చు, దీనిమీద విధించిన నిషేధము తొలగింప బడింది. కూకాల కాంతి కోటిరెట్లు పెరిగింది. ఆత్మవిశ్వాసము అలం లాగా పొంగి ఆకాశాన్ని అంటింది.

ఒక పర్యాయము అమృతసర్‌లో కొందరు కూకాలు వెళ్తూఉండగా దారిలో ఒక కసాయి బహిరంగంగా గోవధ చేస్తూ ఉండడం కనబడింది. వారికోపము మిన్నుముట్టింది. వెంటనే వారతని కండలు చెండివేసారు.

## ఆత్మాహుతికి తేజోమయాదర్శము

ఆంగ్లేయ అధికారులకు ఈ వార్త అందగానే వారి కుటిల హృద యంలో మరొక కపటాలోచన మొలకెత్తింది. ఈ దేశంలోని ముసల్మాను లను తమ ఆధీనంలో ఉంచుకుంటే, తామీ దేశంలో శాశ్వతంగా, సుఖంగా రాజ్యమేలవచ్చు ననుకున్నారు. వెంటనే ముసల్మానులకు తోడ్పడటం కోసము ఒక కొత్త పద్ధతిలో చర్య తీసుకోవాలని నిశ్చయించుకున్నారు. ఈ హత్య బహిరంగంగా జరిగిన ఖూనీ, పచ్చి దారుణం, దౌర్జన్యకాండ అని ప్రకటించి హంతకుల అన్వేషణ అనే నాటకాన్ని ప్రారంభించారు. హత్య చేసిన కూకాలను పట్టుకొనడానికి నలువైపులకు అధికారులు పరుగు లెత్తారు.

హఠాత్తుగా జరిగిన ఈ విప్లవము పం రామసింహకూకా హృద యాన్ని భయభ్రాంతం చేసింది. కూకా సంఘటన విచ్ఛిన్నం కాకుండా నిలపటానికి, అనుశాసనము పాలించడానికి ఆయన ఈ వీరులను ఆంగ్లేయ అధికారులకు లొంగిపొమ్మని ఆజ్ఞాపించాడు. మహాశ్చర్యము, ఆ వీరులు ప్రతి ఒక్కరు ఆత్మాహుతి కావడానికి స్వయంగా అధికారులకు లొంగి పోయారు. వారందరిని ఒక సుప్రభాతాన ఫిరంగులు విను వీధిలోకి విసరి

వేసాయి. వారి ఈ ఆత్మాహుతి కూకాల యెదుట ఒక శ్రేష్ఠ ఆదర్శాన్ని నిలిపింది. ఏకాగ్రనిష్ఠకు ఒక ప్రత్యక్ష తేజోమయపాఠము అందరికీ లభించింది.

## ఒక నీచ సంఘటన

ఆ వెంటనే 1872 జనవరి 13వ తేది వచ్చింది. మాలేర్ కోట అనే ముస్లిము రాజ్యాధీనమునుండి కొందరు కూకాలు మాఘీ యాత్రకై గురురామసింహ జన్మ స్థానానికి వెళ్తూ ఉండినారు. వీరిలో ఒకడు ఒంటరిగా ఆ రాజ్యములోని ఒక ముసల్మానుల గుంపు చేతిలో చిక్కాడు. వారు అతనిని ఎగతాళి చేస్తూ, ఆ ఊరంతా త్రిప్పి బాధించారు. ఒక ఆవును చంపి ఆ రక్తాన్ని అతని మీద చల్లారు. పై పెచ్చు అతని నోట్లో బలవంతాన గోమాంసము తురిమారు.

ఇటువంటి దారుణమైన స్థితిలో ఆ కూకాను ఊరి వెలుపలికి తీసుకు వెళ్ళి రస్తాలో పారవేసారు. ఆ అదృష్టహీనుడు అలాగే వెళ్ళి గురు రామసింహ ఎదుట నిలిచాడు. అతని కళ్ళు నెత్తురు చిమ్ముతున్నవి. ఒళ్ళు కోపంతో భగ్గని మండిపోతున్నది. అతని సహచరులంతా పగ తీర్చుకోవాలని తహతహలాడేరు. ఈ అవమానాన్ని ఎవరు సహిస్తారు?

అతని స్థితి చూసి గురు రామసింహ హృదయము వ్రీలిపోయింది. లోలోపలే గాయము నుండి రక్తము ప్రవహింపసాగింది. తన మనస్సులో చిత్రించుకున్న చిత్తరువు చెరగిపోతున్నట్లుగా ఆయనకు తోచింది. స్థిత ప్రజ్ఞత్వముతో ఆయన కళ్ళు మూసుకున్నారు.

## ప్రతిక్రియకై పోరాటము

భూమి కంపించింది. క్రోధాగ్ని జ్వాలలు పైకి లేచాయి. కూకాలంతా గురు రామసింహునికి నమస్కరించి విచ్చుకత్తులతో బయలుదేరారు.

ధర్మస్థాపన కోసం వారు పోరాడుట ప్రారంభించారు. వారంతా మలౌధ్ కోటను చుట్టుముట్టారు. కోట స్వాధీనపరచుకొని వారు మలేర్ కోట రాజ్యము మీద దండెత్తారు ఆ రాజ్య సైన్యాలు ఎదుర్కొనడానికి ముందుకు వచ్చారు. కాని కూకాల చేతిలో పరాజయాన్ని పొందాయి. ఇంతలో లూధియానానుండి డిప్టీ కమిషనర్ కావన్ ఒక భారీ ఆంగ్లేయ పటాలముతో దండెత్తివచ్చాడు అల్ప సంఖ్యలో ఉన్న కూకాలు కావన్ సాయుధ సేనను ఎదుర్కొని ఓడించలేకపోయారు. ఇక ఆత్మాహుతి ఆరంభమైంది. చంపుతూ చంపుతూ చనిపోయే రణయజ్ఞము ప్రారంభమైంది చివరకు 68 మంది కూకాలను కావన్ పట్టుకొని చెరసాలపాలు చేసాడు

## బాల కూకా పరాక్రమము

కావన్ వారిని విప్లవకారులుగా ప్రకటించి నిండు వీధిలో ఫిరంగుల మూతులకు కట్టి ఆకసములోకి ఎగురగొట్టించాడు. ఈ ఘోరం చూడడానికి వేలాది ప్రజలను భయపెట్టి సమావేశపరచాడు. వారందరికి మరొక దృశ్యము కనపించింది. 49 మంది కూకాలు కర్తవ్యపూర్తి చేసామనే తృప్తితో, చిరునవ్వుతో స్వర్గసోపానాలను అధిరోహించారు. 50 వ కూకా ఒక పదమూడేండ్ల పసిబాలుడు

కావన్ సతీమణికి అతనిపై జాలి కలిగినది అతనిని ఫిరంగి వాత పడద్రోయ వద్దని కావన్‌ను అర్థించింది. కావన్ ఆ బాల కూకాతో "ఒరే అబ్బాయి నీవు ఆ బద్మాష్ రామసింహాతో సంబంధము వదలుకోవడానికి అంగీకరిస్తే నిన్ను వదలివేస్తాను" అన్నాడు.

ఈ మాటలు అతని చెవిలో పడీపడగానే దెబ్బతిన్న పులిపిల్లలాగా, సిపాయీల చేతులనుండి ఒక్కవూపుతో విడిపించుకొని కావన్‌మీద దూకాడు. అతడు కావన్ గడ్డముమీద ఒకేఒక దెబ్బకొట్టాడు. ఆ దెబ్బతో

కావన్ క్రిందపడ్డాడు. మిగిలిన అధికారులు అతని వైపు పరుగులెత్తారు. ఆ కూకా బాలుడు దెబ్బమీద దెబ్బ వేస్తున్నాడు. కావన్ దవడ యెముకలు, కీలూడి ఊగులాడే స్థితి వచ్చింది. ఇతరులా కూకా బాలుని చేతి పట్టు విడిపింపజూచారు. కాని ఆ పిడికిటిపట్టు వజ్రకఠినమైంది. అది



కావన్ సతీమణికి ఆ బాల కూకాపై జాలి కలిగింది. అతనిని రక్షించమని ఆమె తన భర్తను అర్థించింది.

---

ధైర్యపు పిడికిలి అంతులేని గురుభక్తి పట్టు అది. అతనిచేతులు ఖండింపబడుతున్నప్పుడు కూడ ఆ పట్టు సడలలేదు. సాక్షాత్తుగా మృత్యువుకు కౌగలించుకోడానికి ముందంజవేసిన సౌశీల్య సంపన్నుడైన అభిమన్యుని వజ్రముష్టి అది. అటు తర్వాత ఆ బాలుని ముక్కలు ముక్కలుగా నరికివేసారు.

## పంజాబు నుండి మహారాష్ట్రము వరకు

ఈ సంఘటనతో పండిత రామసిహ కూకా కల కరిగిపోయింది. ఒక బందీగా బర్మాదేశంలో ద్వీపాంతరవాస శిక్ష అనుభవిస్తూ అయన ప్రాణ త్యాగము చేయవలసి వచ్చింది. ఉన్నతలక్ష్యాలు, తీవ్ర సంసిద్ధత, ఆత్మసమర్పణ చేయడానికి ప్రేరణ ఉండినప్పటికీ, అనుశాసనము లేని కారణాన ఈ ఉద్యమము మెరుపుతీగలాగ మిరుమిట్లు గొల్పి నశించిపోయింది. పండిత రామంసిహ కూకా స్వధర్మ, స్వతంత్రతత్త్వాల జ్యోతులవెలుగు తరగిపోకుండా చూచాడు. ఆయన యజ్ఞ గురుపదాన్ని అధిష్ఠించాడు.

ఈ రోజుల్లో మహారాష్ట్రలో న్యాయమూర్తి రానడే, భ్రాంతిలో మునిగిన ప్రజలచేత 'స్వ' తత్వాన్ని గుర్తింపజేస్తూ ఉండినాడు. పూనాలో "సార్వజనిక కూకా" స్థాపించిన ఒక సంస్థ ఆధ్వర్యంలో న్యాయమూర్తి రానడే ఇచ్చిన ఉపన్యాసాలు ఎంతో విజ్ఞానదాయకంగాను, ఉద్బోధకం గాను, తీవ్రవేదనాభరితంగానూ ఉండేవి. పంజాబులో కూకా విప్లవము జరిగిన కాలంలోనే అనగా 1872 వ సంవత్సరములో పూనాలో 'స్వదేశీ వ్యాపారము' అనే విషయముమీద న్యాయమూర్తి రానడే విప్లవాత్మకమైన ఉపన్యాసము చేసాడు. స్వదేశభక్తికి ప్రేరణనిచ్చే సాకారమైన గంగోత్రి అది. ఆ ఉపన్యాసాన్ని వీనులవిందుగా తదేక నిష్ఠతో వినడానికి యువకులు గుంపులు గుంపులుగా చేరారు. వారిలో నుండియే ఒక గొప్ప తేజో భాస్కరుడుదయించాడు. రణయజ్ఞమహాగ్నిలో తన జీవితాన్ని సమిధను చేసి మండించడానికి అతడు సిద్ధపడ్డాడు. ఈ తేజోభాస్కరుడు, ఈ దధీచి వాసుదేవ బలవంత్ ఫడ్కే.

ఏడవ అధ్యాయము

# తేజోభాస్కరుడు
# వాసుదేవ బలవంత్ బలిదానము

1872 డిసెంబరులో పూనాలోని సార్వజనిక సభయొక్క తాత్త్విక చర్చలో 'స్వదేశీ వ్యాపారము' అనే విషయము మీద న్యాయమూర్తి రానడే మొదటి ఉపన్యాసము జరిగింది. దీని తర్వాత 1878 ఫ్రిబ్రవరిలో రెండవ ఉపన్యాసము జరిగింది. ఈ రెండు ఉపన్యాసాలు తగినన్ని వివర ణాత్మకమైన గణాంక ఆధారాలతో నిండి, ఆలోచనలు రేకెత్తించేవిగా ఉండినాయి. ఈ ఉపన్యాసాలు వినడానికి యువకులు హెచ్చు సంఖ్యలో వచ్చి చేరారు. ఈ యువశ్రోతలలో తేజోభాస్కరుడు 'వాసుదేవ బలవంత్ ఫడ్కే' కూడ ఒకరు.

## వాసుదేవ బలవంత్ వ్యక్తిత్వము

1845 నవంబర్ 4 వ తేదీ కులాబా జిల్లాలోని శిరఢోణ్ గ్రామంలో వాసుదేవ బలవంత్ ఒక గౌరవనీయ సంపన్న కుటుంబంలో జన్మించాడు. ఆయన వంశస్థులు ఒకప్పుడు ఒక కోటకు అధిపతులుగా ఉండేవారు. ఇంట్లో నూటయాభై లేక రెండువందలు పశువులుండేవి. బాల్యమునుండి వాసుదేవ్ బలిష్ఠుడుగా, అల్లరివాడుగా ఉండేవాడు. ఆయన 12-13 సంవత్సరాల వయస్సులో ఆనాడు నానా సాహెబ్ పరాక్రమాన్ని గూర్చిన కథలు తమ యింటి చావడిలో చెప్పుకుంటుంటే వింటుండే వాడు. వీరసాధ్వి లక్ష్మీబాయి, సేనాపతి తాత్యాటోపే మొద

లైన వారి త్యాగం పసితనంలో ఆ బాలునిపై చెరగని ముద్రవేసింది పెద్ద అయిన తర్వాత తానుకూడ ఏదో ఒక మహత్కార్యము చేయాలని ఆయన తనమనస్సులో అప్పుడే నిశ్చయించుకున్నాడు నిరంకుశాధికారంతో మత్తెక్కి నిరంతరము దుష్టులుగా తయారవుతున్న ఆంగ్లేయులపట్ల ద్వేషము ఆయన రోమ రోమంలో నిండిపోయింది. వీరకార్యము చేయాలనే ఉత్కంఠ ఆయనలో తీవ్రతరము కాసాగింది.

అనాటి పరిస్థితుల కనుగుణంగా ఆంగ్ల విద్యాభ్యాసము ఆయనకు అవసరమైంది. దానికోసం ఆయన బొంబాయి వెళ్ళాడు. బొంబాయిలో శంకర్ శేర్ స్కూలులో ఆయన చదువు ప్రారంభమైంది. విద్యాభ్యాస కాలములోనే ఆనాటి జి ఐ పి. రైల్వేలో 20 రూపాయల నెలజీతానికి ఆయనకు ఉద్యోగం దొరికింది. ఉద్యోగిగా జీవితము మొదలైంది. ఆత్మాభిమానముగల వాసుదేవ బలవంత్ ఉద్యోగజీవితంలో పెద్ద అధికారులతో మెలగడం కొంచెము కష్టమే వాస్తవానికి అటువంటి సన్నివేశము త్వరలోనే కలిగింది. పై అధికారులతో మాట పట్టింపువచ్చింది. వాసుదేవ బలవంత్ రైల్వే ఉద్యోగము వదలివేసాడు గ్రాంటు మెడికల్ కాలేజీలో అతనికి మరో ఉద్యోగము దొరికింది. ఆ ఉద్యోగంకూడా ఆయన త్వరలోనే వదిలివేసాడు. 1865 లో సైనిక ఆర్థిక విభాగములో ఆయనకు ఉద్యోగము దొరికింది. ఈ ఉద్యోగము కోసము ఆయన పూనావచ్చి అక్కడ స్థిర పడ్డాడు.

## సుఖమయ జీవనము

ఆ కాలపు ఆచారాన్నిబట్టి 15 సంవత్సరాల వయస్సు లోపలే ఆయనకు పెండ్లి అయింది. ఒక కుమార్తెకూడ కలిగింది. పూనాలో ఆయన ఇతరులలాగే ఇల్లు, వాకిలి చూచుకుంటూ, సుఖంగా ఉండేవాడు. అయితే ఆయన మనస్సునకు శాంతి, స్వాస్థ్యము ఉండేదికాదు. మనశ్శాంతి

కోసము ఆయన సత్పురుషుల సందర్శనము చేసేవాడు. అయితే, ఇదంతా చేసినా ఆయనలోని అగ్ని శాంతించలేదు

అంతలో ఒక సంఘటన జరిగింది. శిరఢోణ్‌లో తన తల్లికి జబ్బుగా ఉందనే వార్త ఆయనకు అందింది. పద్ధతి ప్రకారము ఆయన కార్యాలయము నుండి సెలవు కోరాడు. అయితే సెలవు మంజూరు కాలేదు. తల్లిమాట జ్ఞాపకం రాగానే ఆయన పూనాలో ఒక్క క్షణముకూడ ఆగలేకపోయాడు సెలవు మంజూరు కాకపోయినా, ఆయన తిన్నగా శిరఢోణ్ వెళ్ళిపోయాడు. కాని ఆయన అక్కడకుచేరే లోపలనే ఆయన తల్లికన్ను మూసింది. ఆయనను శాశ్వతంగా వదలి వేసింది. ఇంటి గడపమీద కూలబడి వాసుదేవ్ వెక్కి వెక్కి ఏడ్చాడు. ఊరంతా అక్కడ చేరింది. ఊరార్చసాగింది. అయితే ఓదార్పులకు మానేది కాదు ఆ గాయము.

మరుసటి సంవత్సరము తల్లికి సాంవత్సరిక శ్రాద్ధము నిర్వర్తించ డానికి కూడ వాసుదేవ్‌కు సెలవు చిక్కలేదు. వాసుదేవ్ కోపము కట్టలు తెంచుకుంది. ప్రతిక్రియ చేయాలనే భావాలు ఆయన ఇప్పుడు బహి రంగంగా ప్రకటిస్తున్నాడు. 'వాసుదేవ్, నీవు ఈ విధముగా మాట్లాడకు' అని ఎవరైనా అంటే వాసుదేవ్ ఇలా అనేవాడు - "మీకు నాదుఃఖ మేం తెలుస్తుంది? ఇటువంటి అన్యాయాలు అనేకమంది సహించి ఉంటే ఉండవచ్చు, కాని నేను దీనికి పగ తీర్చుకొని తీరుతాను."

## ప్రతీకారపు అగ్నికణము

వాసుదేవ్ బలవంత్ మనస్సులో ప్రతిక్రియాగ్ని ప్రజ్వలింపజేసిన మహాపురుషుడు న్యాయమూర్తి రానడే. అదృష్టవశాత్తు ఆ రోజుల్లో పూనాకువచ్చాడు 'స్వదేశీవ్యాపారము' అనే విషయము మీద ఆయన చేసిన రెండు ప్రసంగాల ప్రసక్తి ఇంతకుముందే చేశాము. ఆ ఉపన్యా

సాలు ఈ రోజుల్లోనే జరిగాయి వాసుదేవ బలవంత్ రెండు ఉపన్యాసాలు విన్నాడు. మండిపోయే వాసుదేవ బలవంత్ మనస్సు మీద ఆ ఉపన్యాసాల ప్రభావము ప్రసరించి, ఆయన ఒక శక్తిశాలి అయిన తేజో భాస్కరుడైనాడు.

1873 జనవరి నెలలో ఆయన కేవలము స్వదేశీ వస్తువులనే వాడడానికి బాహాటంగా ప్రతిజ్ఞ తీసుకున్నాడు. తన సహచరులలో కొందరికి గూడ ఆ ప్రతిజ్ఞ ఇప్పించాడు. స్వదేశీ వ్రతం విషయములో ఆయన చాల పట్టుదల జూపేవాడు, గొడుగు విదేశీవస్తువు కనుక ఆయన దాన్ని ఉపయోగించడము మానుకున్నాడు. ఒకసారి ఆయన మేజామీద ఒక విదేశీకలాన్ని నౌకరు ఉంచాడు. దాన్ని చూస్తూనే వాసుదేవ్ బలవంత్ క్రుద్ధుడైనాడు. ముక్కలు ముక్కలుగా దాన్ని విరచి పారవేసాడు.

ఆయన మనఃస్థితి ఇలా ఉండగానే, ఆయన భార్య గతించింది. కుటుంబ రథచక్రమొకటి విరిగి నేలబడింది. పెద్దవాళ్ళ ఒత్తిడివలన కూతురు 'మధు' పసిబిడ్డ అయినందున, ఆయన మరో వివాహము చేసుకున్నాడు. రెండవ భార్యపేరు గోపికాబాయి. ఆమె వాసుదేవ బలవంత్ సంసారాన్ని చక్కదిద్దింది. కుటుంబము నిలబెట్టింది. భర్త కోరికమీద ఆమె చదువను, వ్రాయను నేర్చుకుంది.

## ప్రజలలో చైతన్య నిర్మాణానికై సంచారము

వాసుదేవ బలవంత్ పరాయివారి సేవతో విసిగిపోయాడు. భార్య కూడ ఆయనను ప్రోత్సహించింది. వెంటనే ఆయన ఉద్యోగము వదలిపెట్టి స్వతంత్రంగా ఏదైన చేయాలని ప్రయత్నాలు మొదలుపెట్టాడు. దేశ స్వాతంత్ర్యము కోసము ప్రజలలో చైతన్యము కలిగింపవలసిన ఆవశ్యకత ఎంతైన ఉండినది. అందుచేత ఉపన్యాసాలుచేస్తూ ఆయన పర్యటన ప్రారంభించాడు. పూనాలో ఉపన్యసించాడు. పనవేల్‌లో,

దక్షిణ మహారాష్ట్రములోని తాస్‌గోను, సరసోబా పూదోటలోను ప్రసంగాలు చేశాడు. ఆయన ఉపన్యాసము ఒక్కొక్కటి ఒక్కొక్క అగ్నిగోళములాగా ఉండేవి. ఆంగ్లేయ అధికారులు మనపట్ల ఎటువంటి అన్యాయాలు చేస్తున్నారో, నిర్ణీతపథకం ప్రకారము మనలను ఏవిధంగా దోచుకుంటున్నారో, మోసం చేస్తున్నారో ఈ విషయాలన్నీ లెక్కలు చూపి ప్రజలకు బోధపరచేవాడు. స్వాతంత్ర్యము, స్వారాజ్యమువలన మాత్రమే మనకష్టాలు తొలగగలవని ఆయన ఎంతో తపనతో చెప్పేవాడు.

ఉపన్యాస కార్యక్రమము అందరికి తెలియజేయడానికి ఆయన తానే చేతిలో ఒక పెద్ద పళ్ళెము తీసుకొని మోగిస్తూ ఊరంతా తిరిగేవారు. ఈనాడు ఫలాన సమయంలో ఫలానిచోట తన ఉపన్యాసముంటుందని కేకలువేసి ప్రజలకు చెప్పేవాడు 'మనదేశము స్వతంత్రంకావాలి, దాని కోసము మనము ఎటువంటి ప్రయత్నాలు చేయవలసి ఉంటుందో నేను ఈనాడు ఉపన్యాసములో చెప్పబోతున్నా' నని చెప్పేవాడు. ఆ రోజుల్లో ఈవిధంగా ప్రకటన చేయడం ఒక సాహసమే. ఇది విని సామాన్య ప్రజలకు గుండె ఆగిపోయినంతపని అయ్యేది.

## పాఠశాల స్థాపన

యువతరమువారికి దేశప్రేమను మేల్కొలిపే విద్య లభించాలి అందుకొరకు ఆయన 'పూనానేటివ్ ఇన్‌స్టిట్యూషన్' (ఈనాటి భావే స్కూల్) పేరుతో ఒక విద్యాసంస్థను స్థాపించాడు. ఇంతలో క్షామ పిశాచి మెడల మీదికెక్కి కూర్చుంది. కేవలము షోలాపూర్, బీజాపూర్ జిల్లాలలో కరువువలన, కరవు మూలకంగా వచ్చే ఇతర వ్యాధులవలన చనిపోయినవారి సంఖ్య ఏడువేలు మించింది. ఈ దృశ్యంచూచి వాసు దేవ బలవంత్ మనస్సులో మరొక ఆలోచన మొలకెత్తింది. ఆంగ్లేయ ప్రభుత్వము పరిపాలిస్తున్నదా లేక నిద్రపోతున్నదా అని తన్నుతాను

ప్రశ్నించుకున్నాడు. మరొక విషయం. ఇంతమంది కాటకంలో కను మూసారే; వీరంతా ఈ విధంగా కాకుండా స్వాతంత్ర్య సమరములో పోరాడుతూ పోరాడుతూ మరణించి ఉంటే?...

మెడకొక జోలె వేసుకొని ఆయన దూరప్రాంతంలోఉన్న ఇండోర్ వరకు పర్యటించాడు. పందలకొలది ప్రసంగాలు చేశాడు. కోపంతో ఆయన ఇలా ప్రశ్నించేవాడు: "భారత దేశమందలి నా సోదరులారా! మీ హితము కోసము నేను నా ప్రాణాన్ని పణంగా ఉంచాను. దధీచి మహర్షి దేవహితం కోసం తన అస్థికల నియ్యలేదా? అలాగే భగవంతుడు నా ప్రాణాలు తీసుకొని మీకు శుభాన్ని కలిగించుగాక ఇదే నా ప్రార్థన."

## స్వరాజ్యప్రాప్తికి సంగ్రామము తప్పదు

అయితే, ఆయన చెప్పే ఈ మాటలు ఎవరు వింటారు? జన జాగరణ కార్యక్రమముతో ఆయన విసిగిపోయాడు. విషయము ప్రజలకు అర్థమైనప్పటికీ, పని చేద్దామనే ఉద్దేశముగానీ, ఉత్సాహంగాని, సాహసం గాని వారికి ఉండేది కాదు: ఈ చేదునిజం ఆయన అనుభవంలోకివచ్చింది తీవ్ర రణయజ్ఞం ప్రారంభించకుండా ఈ దేశానికి స్వతంత్రము సిద్ధింపదు అని తెలుసుకొని ఆ మార్గాన్ని అవలంబించడానికి ఆయన దృఢంగా నిశ్చ యించుకొన్నాడు.

అందులకై ఆయన ఆయుధాలు, సహచారులు, ధనము సమకూర్చ డానికి ప్రయత్నాలు మొదలు పెట్టాడు. ఉమాజీ నాఇక్ ఆయనకు జ్ఞప్తికి వచ్చాడు (అతడొక సాహసి. దారిదోపిడి చేసే బోయ. అయితే అతని పనులలో స్వదేశప్రేమ, ఆంగ్లేయులపట్ల ద్వేషము ద్యోతకమౌతాయి.) పిమ్మట ఆయన దొంగతనము, దారిదోపిడి వృత్తిగాగల "రామోశీ" తెగప్రజలను తన ధ్యేయపూర్తికి సాధనాలుగా చేసుకున్నాడు. వీరత్వము

మాట నిలకడ గల వాళ్ళ సహాయము ఆయనకు లభించింది. పూనాలోనే ఆయన వాళ్ళకొక సంఘటన నిర్మించాడు. పూనాలో మురళీధర్ ఆల యానికి అటువైపున నరసింహాజీ మైదానములో యువకులకు వివిధాయుధ ప్రయోగముతో శిక్షణ యివ్వడం ప్రారంభింపబడింది. వాసుదేవ బలవంత్ స్వయంగా శస్త్రవిద్యా నిపుణుడు. గుఱ్ఱపు స్వారి, కుస్తీలలో కూడా అందె వేసిన చేయి, ఆయుధాల మీద ఆయనకు ఎనలేని ప్రేమ. రెండు మూడు తుపాకులు, ఐదారు ఖడ్గాలు, పట్టాకత్తి, బల్లెము మొదలైన ఆయుధాలు ఆయనవద్ద ఎల్లప్పుడు ఉండేవి. చీకటి పడడంతోనే, ఆయన తనకు పరిచితుడైన సర్దార్ గుఱ్ఱము మీద కూర్చొని తిరగడానికి వెళ్తుండేవాడు. చీకటి రాత్రులలో అడవులలో, కొండలలో నిర్భయంగా తిరగడం, ఉధృతంగా పరదల్లో ఉన్న నదిలోకి దూకి ఈదుకుంటూ అవలి ఒడ్డుకు వెళ్ళడం—ఇటువంటి సాహస కృత్యాలతో ఆయన తన సహచరులను అనేకులను తనకు భక్తులైనవారిని చేశాడు. ఆయన రెండవ భార్య కూడ గుఱ్ఱపు స్వారి, కత్తి, తుపాకి ఉపయోగించడములో నిపుణత్వము సంపా దించింది. ఇంతేకాదు, ఆయన స్థాపించిన మండలిలో సభ్యులైన ఆ యువకులలో లోకమాన్య బాలగంగాధర తిలక్ ఒకరు అనే ప్రవాదం ఉన్నది.

## సంఘటన బలపడసాగింది

సాయంకాలము మురళీధర మందిరములో యువకులు చిన్న చిన్న గుంపులుగా సమావేశమౌతుండేవారు. ఆ సమావేశములలో తన యువక సహచరులను ఆయన అడిగేవాడు. "బ్రిటిషు రాజ్యశక్తికి లొంగి ఉండ డంలో మీకు సంతోషం ఎలా కలుగుతున్నది ? మన మంతా విప్లవం తెచ్చి పోగొట్టుకున్న స్వరాజాన్ని ఎందుకు తిరిగి సంపాదించకూడదు "

వాసుదేవ బలవంత్ ఆరాధ్యదైవము దత్తాత్రేయుడు. ఆయన యొక్క శ్రీ పాద శ్రీవల్లభ అను పేరుగల రౌద్రరూపము వాసుదేవ్‌కు

అత్యంత ప్రీతిపాత్రము. ప్రతి గురువారము సమావేశములలో ప్రతిజ్ఞా స్వీకార మనే గంభీర కార్యక్రమము జరుగుతుండేది క్రొత్తగా వచ్చిన సభ్యులు పెరుగు అటుకులు గల దొన్నె చేతికోకి తీసుకొని స్వాతంత్ర్య ప్రతిజ్ఞ తీసుకునేవారు ఛత్రపతి శివాజీ చిత్రపటము అక్కడ తగిలించి ఉంచబడేది.

ఈ విధంగా ప్రాథమిక సంసిద్ధత జరిగింది. రణయజ్ఞ ప్రారంభా నికి ముహూర్తము నిశ్చయించబడింది. 1871 ఫిబ్రవరి 21 నాడు ఆయన తన భార్యను వీడ్కొని, మండుటెండలో తేజోభాస్కరుడైన సూర్యుడే సాక్షిగా ఒక ప్రత్యేకపు ఎద్దు బండిలో ఇంటి నుండి బయలుదేరాడు. ఆది శేషుడు బుసకొట్టాడు. పరశివుడు ప్రళయంకరమైన మూడవ కన్ను తెరచాడు. ఢమరుకము మ్రోగింది. రణభేరి గర్జించింది. త్రిశూలపు మొదటి వ్రేటు "ఘామారీ" గ్రామంపై పడింది.

## "తోరణ విజయం"

ఛత్రపతి శివాజీ "తోరణ" విజయము, వాసుదేవ బలవంత్ "ఘామారీ" విజయము ఒకే విధమైన ప్రాముఖ్యము కలిగి ఉన్నాయి. శివాజీ ఛత్రపతి అయినాడు. వాసుదేవ బలవంత్ విప్లవకారులకు మకుట మణి అయినాడు. "ఘామారీ" గ్రామ దోపిడి వార్త మూడవరోజున పూనా చేరింది. దీని తర్వాత ఒకదాని వెనుక ఒకటిగా దోపిడులు ఒక మాలికగా తయారైనాయి కాని, ఈ దోపిడిగాండ్రు దొంగలుకాదు. దేశకార్యం కొరకు సాహసిక జీవితముగడిపే తేజో భాస్కరులు. ఇది తెలియగానే ప్రజలు వారిని ప్రేమింపసాగారు రైతు సోదరులు పెరుగు అటుకులు తెచ్చి ఇవ్వసాగారు. దాచుకొనడానికిగాని, పరుగెత్తిపోవడానికిగాని విశ్వాసంతో సహాయపడసాగారు.

రామోశీల నాయకుడు దౌలత్‌రావు, వాసుదేవ బలవంత్‌తో కలిసాడు. వాసుదేవ బలవంత్ రామోశీల 'మహారాజు' అయినాడు. మహారాజుకు మరొక విశ్వాస పాత్రుడైన సహచరుడు జాంభుల్ పాండేకు చెందిన గోపాల్ మోరేశ్వర్‌సారే.

ఘామారీ గ్రామము తర్వాత వాల్హే, పలస్యే మొదలైన అనేక గ్రామాలకు ఆయన వెళ్ళాడు. అనేక ధనిక సౌధాలను ముట్టడించి మాతృదాస్య విముక్తికి, వారి ఖజానాలు ఖాళీచేయించాడు. స్వాతంత్ర్య ప్రాప్తికి ధనవంతులనుంచి డబ్బు వసూలు చేయడము చాల అవసరము. స్వరాజ్యము వచ్చినతర్వాత బలవంతంగా వసూలుచేయబడిన ధనము ఎవరిది వారికి తిరిగి యివ్వబడాలనే ఉదారభావం కలవాడు ఆయన.

## పూనాలో చిచ్చు రగిలింది

ఈ సంఘటనతో పూనాలో కోలాహలము వ్యాపించింది. ఆంగ్లేయ అధికారులకు నిద్రపట్టలేదు. ఈ ఉపద్రవానికి కారణము వాసుదేవ బలవంత్ అని తెలుసుకోడానికి ఎక్కువ కాలము పట్టలేదు. అతనిని పట్టుకోడానికి మేజర్ డేనియల్‌ను ప్రత్యేకంగా నియమించారు. వాసుదేవ బలవంత్‌ను పట్టి యిచ్చినవారికి యాభైవేల రూపాయలు పారితోషిక మిస్తామని ప్రకటించారు

మరునాటి దినము పూనాలోని ముఖ్యమైన ప్రదేశాలన్నిటిలో వాసుదేవ బలవంత్ తరఫున గోడలమీద అంటించబడిన ప్రకటన పత్రాలు కనుపించాయి. ఆ పత్రాలమీద ఇలా వ్రాయబడి ఉంది-

"శ్రీమంత్ నానాసాహెబ్ పీష్వా తరఫున వాసుదేవ బలవంత్ ఈ ప్రకటన చేస్తున్నాడు. బొంబాయి గవర్నర్ సర్ రిఛర్డ్ టెంపుల్ తలగొట్టి పట్టుకవచ్చిన వానికి పైన చెప్పబడిన (ప్రభుత్వము ప్రకటించిన) పారితోషికానికి ఒకటిన్నర రెట్లు ధనము ఇవ్వబడగలదు."

గవర్నర్ టెంపుల్ హడలిపోయాడు. గ్రామ గ్రామంనుండి ఆంగ్లేయ అధికారులు పూనాకు పరుగెత్తి వచ్చారు. మహారాష్ట్రమంతా భయతరంగాలు వ్యాపించాయి ఇంతలో పూనాలో 1879 మేనెల 13వ తేదిన అర్ధరాత్రి సమయంలో ఒకేసారి బుధవార్‌హాడా, విశ్రామబాగ్




వాసుదేవ బలవంత్‌ను పట్టి యిచ్చినవారికి రు 50,000లు పారితోషిక మిస్తామని ప్రభుత్వం ప్రకటించింది, గవర్నరు తలకొట్టి తెచ్చినవారికి దానికి 1½ రెట్లు పారితోషికమిస్తామని వాసుదేవ బలవంత్ ప్రకటించాడు

---

వాడలు పరశురామప్రీతి అయినాయి. ఆంగ్లేయుల కార్యాలయాలు బూడిద అయిపోయినాయి. ఆంగ్లేయులకు మాట పడిపోయింది, పూనాలో కర్ఫ్యూ, పహరా మొదలైన కట్టుదిట్టాలు చేయబడినాయి. న్యాయమూర్తి రానడే సలహాతో వాసుదేవ బలవంత్ పథకాలు తయారు

చేస్తున్నాడని స్పష్టంగా ఇంగ్లీషు వార్తాపత్రికలు వ్రాయసాగాయి న్యాయ మూర్తి రానడేను వెంటనే "ధులియా" అనే మరొక ప్రదేశానికి బదిలీ చేసారు.

## దౌలత్‌రావు వీరస్వర్గం

ఇక్కడ డేనియల్‌ను ఎదుర్కొనడానికి వాసుదేవ బలవంత్ ప్రాణాలతో ఆటలాడుతున్నాడు, అది పరాక్రమానికి పరాకాష్ట. ఇంతలో తులసీఘాట్‌వద్ద పోరాటంలో దౌలత్‌రావ్ నేల వ్రాలాడు. వాసుదేవ బలవంత్ యొక్క సంస్కార క్షమమైన మనస్సు దుఃఖముతో విలవిల్లాడింది. ఏడెనిమిది రోజులు స్నానములేదు. అన్నము, నీరు లేదు. ఎల్లప్పుడు నిప్పుతో పోరాటము. విశ్వాసపాత్రుడైన సహచరుడు యుద్ధంలో ప్రాణాలు వదిలాడు. గురుతుల్యుడు న్యాయమూర్తి రానడే ఎన్నో కష్టాలు సహించ వలసివచ్చింది వీటన్నిటివలన వాసుదేవ బలవంత్ మనస్సు చాల చికాకు పడింది మనశ్శాంతికొరకు ఆయన శ్రీశైల మల్లికార్జునుని దర్శించడానికి బయలుదేరాడు. కాని, అతనిని ఎవరు విశ్రాంతి తీసుకోనిస్తారు? మేజర్ డేనియల్ నాయకత్వంలో 1800 తెల్లసైనికులు, భారతీయ సైనికులు ఆయనను వెన్నంటి తరిమారు.

## దుర్దినం జులై 20

చివరకు దురదృష్టకరమైన 1879 జులై 20వ తేదీ వచ్చింది. గంగాపూర్‌కు పది క్రోసుల దూరంలో దేవరనామగీ గ్రామంలో వాసు దేవ బలవంత్ ఉండినాడు ఆయనతోపాటు శ్రీ సాఠే కూడ ఉండినాడు. అప్పుడాయనకు బాగా జ్వరంగా ఉంది. కడుపులో ఒక్క మెతుకైనాలేదు. పైత్యంచేసి తల భారంగా ఉంది ఆటువంటి స్థితిలో ఆయన ఒక దేవా లయంలో యాత్రికుల మధ్య పడుకొని ఉండినాడు తలక్రింద ఒక

మూట, నడుముకు భీకరమైన కత్తి, పిస్తోలు, గడ్డాన్ని బిగించి కట్టినగుడ్డ, కాళ్ళకు పైజామా, తలమీద తెల్లని రుమాలు. నిద్రముంచుకు వచ్చింది. మేజర్ డేనియల్ వాసుదేవ బలవంత్ పోబడి తెలుసుకుంటూ సరిగ్గా అక్కడికివచ్చిచేరాడు. సెర్చిలైటు కాంతిలో అతడు వాసుదేవ బలవంత్‌ను గుర్తించాడు నలువైపులనుండి సైనికులచేత తుపాకులు గురిపెట్టించి, చేతిలో కత్తితో డేనియల్ ఆ నిదురించే సింహం భుజాలమీద తన బూటు కాళ్ళుంచి అతని గుండె మీద కూర్చున్నాడు. కదలడానికి వీలులేదు. ఈ స్థితిలో చిక్కిపోయిన వాసుదేవ బలవంత్ క్రోధము మిన్నుముట్టింది. ఆయన డేనియల్‌ను ద్వంద్వ యుద్ధానికి సవాల్ చేసాడు. కాని పిరికి ఆంగ్లేయ రక్తము ఆ ధీరోదాత్తుని ఆహ్వానం స్వీకరించేటంత తెలివి తక్కువదికాదు. అతడు ఆయన కాళ్ళు చేతులకు సంకెళ్ళు వేయించాడు. ఆ నర సింహము బోనులో చిక్కిపోయింది.

## ఆజన్మ కారాగారశిక్ష: ఏడెన్ ప్రయాణము

వాసుదేవ బలవంత్ పూనాకు తేబడినాడు. అతనిమీద నియమానుసారము అభియోగము నడిచింది. వాసుదేవ బలవంత్ తరఫున 'సార్వజనిక కాకా' వాదించాడు ఇది యుద్ధరంగంలోని అసమాన పరాక్రమం కంటె మరింత సాహసంతో కూడిన పని. ఆయన మిత్రుడొకరు 'సార్వజనిక కాకా'తో ఆయనచేసే ఈ పని విషమ పరిణామాలకు దారి తీస్తుందని చెప్పి హెచ్చరించే ప్రయత్నం చేశాడనీ, దానికి ఆయన వెంటనే 'వాసుదేవ బలవంత్'తో పాటు రెండవ వాడుగా నేను "గణేశ్ వాసుదేవ్" కూడా ఉరికంబ మెక్కుతాను. ఇంతేకదా' అని అన్నాడనీ అంటారు.

న్యాయస్థానములోని పటాటోపము యమపురి దృశ్యానికి మెరుగు పెట్టుతున్నది. న్యాయస్థానములోనికి వాసుదేవ బలవంత్‌ను తెచ్చినపుడు ఆయన బిగుతైన సల్వార్ ధరించి ఉన్నాడు. కాళ్ళకు చెప్పులు లేవు.

శరీరము మీద అంగరఖా, ఆపైన శాల్వ ధరించి ఉన్నాడు. సంకెళ్ళలో ఉన్నా చిరునవ్వు చిందిస్తూ ఆ నరవీరుడు బోనులో నిర్భయంగా కూర్చున్నాడు. నాల్గవ రోజున ఆయన అమూల్యమైన చిరంతనమైన వాఙ్మూలము యిచ్చాడు.

"కుక్కలలాగా పొట్ట పోసుకోడానికి ఒక సిగ్గులేని వర్తకపు జాతి మా మీదికి వచ్చి పడింది. దీనిని నేను చూడలేను. ఇందు కోసము బ్రిటిషు ప్రభుత్వానికి విరుద్ధంగా విప్లవం లేవదీశాను. మా పథకము సఫలమైతే అతి చమత్కారంగా ఆంగ్లేయులను వెళ్ళగొట్టి భారతీయ ప్రజాస్వామ్య రాజ్యస్థాపన చేయాలనే నా ఆశయము సఫలమవుతుంది. అప్పుడు 'పరలోకమందున్న తండ్రి' మాత్రమే ఆంగ్లేయులను రక్షించగలడు కాని, అది జరుగలేదు. చివరకు నాకు అపజయము ఎదురైంది. కాని నేనిదంతా స్వదేశం కోసమే చేసానని భగవంతునికి తెలుసు. ఓ హిందుస్థాన నివాసులారా ! నేను మీకు ఎటువంటి లాభము కలిగించలేకపోయాను. నేను నా ధ్యేయాన్ని సాధించలేకపోయాను. దీనికి నన్ను మన్నించండి."

ఐదవ రోజున న్యాయాధిపతి వాసుదేవ బలవంత్‌కు అజన్మ కారాగారవాస శిక్ష విధించాడు "వాసుదేవ బలవంత్‌కీ జై" అని ఆకాశము మార్మోగే నినాదాల మధ్య వాసుదేవ బలవంత్‌ను ఈ మాతృభూమికి దూరంగా ఏడెన్‌కు తీసుకుపోయి ఉంచారు. ఆయన ఆ చెరసాలనుండి తప్పించుకుని పరుగెత్తిపోయే ప్రయత్నము చేసాడు; కాని ఆ ప్రయత్నం సఫలం కాలేదు. చివరకు 1883 ఫిబ్రవరి 17 వ తేది సాయంకాలము 4-20 గంటలకు ఈ తేజోభాస్కరుడు, ఈ దివ్య జీవనజ్యోతి ఆరిపోయింది. మహారాష్ట్రములోని ఈ మొదటి విప్లవ కారుడు ప్రజ్వలింపజేసిన హోమకుండము నివురు గప్పిన నిప్పులాగా ఎల్లప్పుడు మండుతూనే ఉండినది,

మహారాష్ట్రములోని మొదటి విప్లవకారుడు, తేజోభాస్కరుడు వాసుదేవ బలవంత్ ఫడ్కే ఆ కాలంలో అన్ని రంగాలలో తన ప్రభావాన్ని చూపాడు. సాహిత్య సమ్రాట్ తాత్యాసాహెబ్ కేల్కర్ తిలక్ చరిత్రలో ఇలా వ్రాస్తారు:

'57 నాటి నానాసాహెబ్ పీష్వా తర్వాత 'ఫడ్కే' శబ్దము ఆంగ్లేయులను భయకంపితులను చేస్తుండేది. తిలక్‌కు ముందు మహారాష్ట్రలో 'వాసుదేవ బలవంత్' అనే మాటలు రాష్ట్రీయ స్ఫూర్తిని వెదజిమ్మే కేంద్రంగా ఉండేవి 'భారతీయ ప్రజాతంత్రము' అనే స్వాతంత్ర్యోత్తర స్వరాజ్య స్వరూపాన్ని వాసుదేవ బలవంత్ దివ్య ప్రతిభ ప్రథమంగా ప్రకటించింది.

ఈ దేశంలో ఆంగ్లేయుల ప్రభుత్వము, వారి సామ్రాజ్యము ఏదో భగవంతుని వరప్రసాదము వలన లభించింది కాదనీ, వారి నవీన ఆయుధాలు, వారి కూట రాజనీతి అత్యధిక శక్తి, సంపన్నములైనందున, సఫలమైన ఉపాయ మాత్రమేనని ఆయనకు తెలుసు. ప్రజలకు ఈ విషయము తెలియచెప్పడానికి ఆయన ప్రయత్నించాడు. అంతటితో ఆగలేదు ఆయన ఒక తీవ్ర రణ యజ్ఞాన్ని ప్రారంభించి భావితరాల వారికి తమ లక్ష్య సిద్ధికి ఒక నమ్మకమైన త్రోవ చూపినాడు

++

## ఎనిమిదవ అధ్యాయము

# చాఫేకర్ సోదరుల బలిదానము

1857 విప్లవమువలన హెచ్చరికపొందిన బ్రిటిష ప్రభుత్వము ఈ విప్లవముతో మరింత మెలకువ వహించి దాస్యబంధాలు నాల్గువైపుల నుండి బిగింపసాగింది. ఆయుధా లుంచుకోరాదని క్రొత్త చట్టము చేసింది. దానితో మనము పూర్తిగా నిరాయుధులమైనాము. క్రొత్త విద్యావిధానము ప్రారంభింపబడింది. దానితో పూర్తిగా మనము స్వత్వశూన్యులమైనాము. బానిసలమైనాము.

ఈ రణచండీ ప్రతాపానికి భయపడి, 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సమరములో ముఖానికి నల్లరంగు పులుముకొని ఆడవేషము వేసుకొని అసువుల కాపాడుకున్న ఆంగ్లేయుడొకడు ఇప్పుడు మరొక ఎత్తు ఎత్తాడు. ఉగ్రభావాలు మాటలద్వారా వెలిబుచ్చే వీలు కలిగించేఉద్దేశముతో 'ఇండియన్ నేషనల్ కాంగ్రెసు' అను సంస్థను స్థాపించడానికి ఆలోచన చేశాడు. ఈ ఆంగ్లేయుని పేరు సర్ ఆలెన్‌హ్యూమ్. 18౮౫లో ఆంగ్లేయుల ప్రోత్సాహంతోనే ఈ సంస్థ స్థాపించబడింది. ప్రజలలో రగులుతున్న అసంతృప్తి ఎప్పటికప్పుడు మాటలద్వారా బయటికి వెళ్ళిపోయేఅవకాశము కల్పించే 'సేఫ్టీవాల్వ్' ఈ సంస్థ. అయితే ఆంగ్లేయుల నీతిలోని మూడు కోణాలను (ఆయుధాల చట్టము, క్రొత్త విద్యావిధానము, కాంగ్రెసు)ఎప్పటికప్పుడు తెలియజెప్పి ఈ దేశప్రజలకు ఒకవైపు తమ సామర్థ్యంయొక్క

అనుభవాన్ని కలిగిస్తూ, మరొకవైపు ఆంగ్లేయ ప్రభుత్వాన్ని వెళ్ళగొట్ట దానికి స్పష్టంగా హెచ్చరించే సాహసము చేసిన పురుషసింహము లోక మాన్య బాలగంగాధర తిలక్. బ్రిటిషు సామ్రాజ్యమనే మదించినఏనుగును ఉద్దేశించి ఆయిన "నీ వీ దేశంలో ఒక్క క్షణం కూడ ఉండవద్దు. ఈ దేశము మహాపరాక్రమశాలి అయిన సింహము అది ఇప్పుడు నిద్రిస్తూ ఉంది. కాని, ఒకసారి అది నిద్ర లేచిందా, నీ పరిస్థితి విషమిస్తుంది" అని అంటాడు. ఆయన తన దేశ యువకులను ఆహ్వానిస్తూ—

"ధైర్యముంటే సదాశివరావు భావులాగా ఒక్క సమ్మెట వ్రేటుతో లండన్ సింహాసనాన్ని ముక్కలు ముక్కలు చేసే మహత్తరాశయాన్ని మీ ముందుంచుకోండి" అని అంటాడు.

## లోకమాన్యుని బాల్యము

లోకమాన్య తిలక్ 1856 జులై 23వ తేదీ రత్నగిరిలో జన్మిం చాడు. లోకమాన్యునితల్లి పార్వతీబాయికి ఈశ్వరునియందు భక్తి మెండు. కుమారునికోసము ఆమె సూర్యుని ఉపాసించింది బహుశా అందువలననే గాబోలు - లోకమాన్యునికి సూర్యకిరణాల వంటి బుద్ధి తీక్షణత వచ్చింది. తిలక్ తండ్రి గంగాధర్ మేధావి. గణితశాస్త్ర అభిమాని.

తిలక్ బాల్యం నుండి కుశాగ్రబుద్ధి; సమయస్ఫూర్తి,స్వాభిమానము ఆయనకు సహజ గుణములు తిలక్ తాత రామచంద్రపంత్ కొంతకాలం పీష్వా ప్రద్ద వస్తు భాండారములో ఉద్యోగిగా పనిచేశాడు. 1857 విప్లవకాల ములో ఆయన కాశీలో ఉండినాడు. ఆయన సన్యాసము తీసుకోదలచాడు. కాని తన నిర్ణయాన్ని వెంటనే కార్యరూపంలోకి తేలేకపోయినాడు. అందువలన ఆయన కాశీనుండి రత్నగిరికి తిరిగివచ్చాడు. ఆయనను చూచి ఇంట్లో అందరికి సంతోషమైంది. ఆయనకు మేధావి అయిన మనుమణ్ణి

చూచి సంతోషమయింది. శ్రీమంత్ నానాసాహెబ్ పీష్వాను గూర్చిన అనేకమైన కథలు తాతగారు చెప్పగా తిలక్ విన్నాడు. కొన్నిరోజుల తర్వాత తిరిగి ఆయన ఉత్తర భారతము వెళ్ళిపోయాడు సంకల్పాను సారము ఆయన సంతోషంగా సన్యాసము స్వీకరించి కాశీక్షేత్రములో కాలగతి పొందాడు.

తిలక్‌కు పదిసంవత్సరాల ప్రాయంలో ఆయన తండ్రి పూనాకు వచ్చి స్థిరనివాసమేర్పరుచుకున్నాడు అటుతర్వాత తిలక్ విద్యాభ్యాసము పూర్తిగా పూనాలో జరిగింది

1872లో తిలక్ హైస్కూలు చదువులో కృతార్థుడై పై చదువుల కోసము డక్కన్ కాలేజీలో ప్రవేశించాడు. ఆనాటి ఆచార వ్యవహారాల కనుగుణంగా తిలక్‌కు పెండ్లి కూడ అయింది. కళాశాలలో అగర్‌కర్, ఉపాసనీ, నామ్‌జోషీ సారంగపాణి మొదలైనవారు. ఆయనకు మిత్రులైనారు. వీరంతా ధీమంతులు. ఏ విషయాన్నైనా విచక్షణాబుద్ధితో విశ్లేషించి, అన్ని దృక్కోణాలనుండి ఆలోచించగల సమర్థులు. బానిస జీవనముపట్ల వారి మనస్సు విరిగిపోయింది. న్యాయమూర్తి రానడే, 'సార్వజనిక కాకా', చిపులూణ్‌కర్ మొదలైన పెద్దలు యువతరము వారిలో రాష్ట్రీయ భక్తి, స్వాతంత్ర్య ప్రియత్వము మేల్కొల్పడానికి ప్రాణపణంగా ప్రయత్నిస్తుండినారు.

## వాసుదేవ బలవంత్ వ్యాయామశాల

తిలక్ బుద్ధి సునిశితమైనది, కాని శరీరము అంత శక్తివంతము కాదు. తిలక్ తన దేహారోగ్యము బాగుపడడంకోసము ఒక సంవత్సరమంతా కృషి చేశాడు. ఈ కృషిలో ఆయన సఫలుడైనాడు.

ఈ కాలంలో, తిలక్ విప్లవవీరుడైన వాసుదేవ బలవంత్ పరిచయంలోకి వచ్చాడు. వాసుదేవ బలవంత్ స్థాపించిన వ్యాయామశాలకు తిలక్

వెళ్ళేవాడు. ఆయన తీవ్రమైన భావాలు వింటుండేవాడు. మనస్సును, శరీరాన్ని భవిష్యత్ సంగ్రామానికి యోగ్యంగా మలచుకుంటూ ఆయన కళాశాల విద్య పూర్తిచేశాడు. గణితము, సంస్కృతము, చరిత్ర, భూగోళము, విజ్ఞానశాస్త్రము అయన అభిమాన విషయాలు. అటుతర్వాత రెండు సంవత్సరాలకు ఆయన యం. ఏ కూడ అయినాడు

ఈ సమయంలో ఆయనమీద మరొక మహాపురుషుని ప్రభావము కూడ పడింది అ మహనీయుడు మహర్షి అణ్ణాసాహెబ్ పట్వర్ధన్. శ్రీ పట్వర్ధన్ న్యాయశాస్త్రము, వైద్య శాస్త్రములలో పట్టభద్రుడు, శ్రీమ-త్. నానాసాహెబ్ పీష్వాలాగే అత్యున్నత ప్రతిభాశాలి.

## మహర్షి పట్వర్ధన్ సాహసము

వర్‌హాడ్ ప్రత్తి పండే ప్రాంతము. ఇంగ్లండులోని జవుళి మిల్లులకు ప్రత్తి అవసరము. ఆ ప్రాంతము వాస్తవానికి నిజాముకు చెందినది. కాని, అప్పుకుగాను ఆంగ్లేయులకు అది తాకట్టు పెట్టబడింది. అప్పు తీర్చి అప్రాంతాన్ని ఆంగ్లేయుల ఆధీనమునుండి విడిపించి, నిజామువ్వారా తన అధికారములోనికి తెచ్చుకొని, ఆ ప్రాంతము కేంద్రంగా సంపూర్ణ దేశ స్వాతంత్ర్యానికి ఆందోళన సాగించాలని శ్రీ పట్వర్ధన్ ప్రణాళిక. అందు నిమిత్తము నిజాము మంత్రియైన సాలార్‌జంగ్‌తో ఆయన సంప్రదింపులు జరిపాడు అణ్ణాసాహెబ్ తన స్వంత పూచీమీద రెండు కోట్లరూపాయలు సేకరించాడు. ఎంత అంతులేని సాహసము! ఆంగ్లేయుల కుటిల రాజనీతి కారణంగా అణ్ణాసాహెబ్ ఈ సాహసానికి ఫలితము ఎంతగానో అనుభవించవలసి వచ్చింది. కాని, అణ్ణాసాహెబ్ ప్రతిభ అతిశ్రేష్ఠమైనది. కష్టాల నెదుర్కొనడంలో ఆయన సంసిద్ధత హిమాలయములాగా ప్రచండమైనది. వ్యక్తిగత శీలము మహర్షుల శీలములాగా పవిత్రమైనది. ఆయన ఒక బ్రహ్మర్షి. టిలక్ ఆయనపట్ల అత్యంత ఆదర భావము చూపేవాడు.

## ప్రత్యక్ష కార్యారంభము

విష్ణుశాస్త్రి చిపలూణ్‌కర్ పట్ల గూడ తిలక్‌కు అపార గౌరవ ముండేది. పట్టభద్రుడు కాగానే తిలక్ మొదట చిపలూణ్‌కర్ జీ ఇంటికి వెళ్ళి ఆయనను సందర్శించాడు. చిపలూణ్‌కర్ ఆరోజుల్లో న్యూ ఇంగ్లీషు స్కూలు స్థాపించి యున్నాడు. క్రొత్త తరాలవారిని స్వాతంత్ర్య భావాలతో నింపడం పాఠశాలద్వారా ఉత్తమంగా జరుగుతుంది. తిలక్ ఈ కొత్తస్కూలులో త్యాగభావనతో ఉపాధ్యాయుడుగా చేరాడు. బోధన పరిశోధన కార్యాలు ప్రారంభింపబడినాయి.

కాని కేవలం పాఠశాల నడపడంలో ఆయనకు తృప్తి కలుగలేదు. దానితోపాటు ప్రజాహితాన్ని సాధించడానికి సమర్థవంతమైన సాధనము వార్తాపత్రిక కూడ అవసరమే. అందుచేత కేసరి, మరాఠా పత్రికలు ప్రారంభింపబడినాయి. మొదటి సంవత్సరము కొల్హాపూర్ కేసులో "కేసరి" మీద పరువునష్టము దావా వేయబడింది. ఆ విషయంలో కేవలము తన మంచితనము వలననే 101 రోజులు తిలక్ శిక్ష అనుభవించవలసి వచ్చింది. విడుదల అయిన తర్వాత తిలక్ తన సర్వశక్తులు ఉపయోగించి కేసరి పత్రికను ప్రభావశాలిగా చేసే కార్యంలో నిమగ్నుడైనాడు బోధన పరిశోధనా కార్యాలు వెనుకబడినాయి. స్వరాజ్యప్రాప్తికై శాస్త్రీయమైన కృషికి పునాదివేయడం ఆరంభమైంది. ఆయన ఎదుటఉన్న విషయాలు మూడు.

1. ప్రజలలో తీవ్రమైన స్వాభిమాన జ్యోతిని ప్రజ్వలింప జేయడం.
2. ప్రజల మనస్సులలో దాస్య జీవనముపట్ల విరక్తి కలిగించి దానిని రాష్ట్రవ్యాప్తము చేయడం.
3. జాగృత జనశక్తిని కేంద్రీకరించి దానిని కార్యోన్ముఖం చేయడం.

ఈపనికి ఆయనకు "కేసరి" సాధనముకూడ సరిపోనట్లు తోచింది. అందుచేత తన ప్రతిభచేత ఆయన శివాజీ మహోత్సవం, గణేశోత్సవం అను రెండు రాష్ట్రీయ ఉత్సవాలను ప్రారంభించాడు. స్వాభిమానము, చైతన్యము కలిగించడంలోను, పరాయి రాచరికముపట్ల ద్వేషము స్వాతంత్ర్యముపట్ల అణపరాని అభిలాష ప్రజల మనస్సులలో కలిగించడంలోను ఈరెండు రాష్ట్రీయ ఉత్సవాలు అమూల్యములు ప్రధాన సంపన్నములు అయినవి.

## ప్లేగు వ్యాధి ఉపద్రవము

ఇంతలో కరవు. దాని వెనకాలే ప్లేగువ్యాధి వచ్చిపడ్డాయి. భారత దేశంలో ప్లేగు క్రిములు మొదటిసారిగా బొంబాయినుండి పూనాకు వచ్చాయి. ప్లేగువ్యాధ ఎంత భయంకరమైనదో మనము ఈనాడు ఊహించలేము. దీనికి కారణము ఈనాడు వ్యాధి రాకుండా చేసుకునే ఉపాయాలు, వచ్చినపుడు పోగొట్టుకొనడానికి తిరుగులేని మందులు ఉన్నాయి. కాని 1896 లో అది ఒక మహా భయంకర వ్యాధి. ఈ మహా మారి అంతకుపూర్వము లండన్ నగరాన్ని దాదాపు జనశూన్యం చేసింది. ఆనాడు మన భారతీయులకు ఈ క్రొత్త రోగాన్ని గూర్చి అసలేమీ తెలియదు. అయితే దీని సంహారకశక్తి ఆంగ్లేయులకు బాగా తెలుసు.

ఈ రోగము మనదేశంలో ప్రారంభం కాగానే ఇక్కడ నుండి ఇంగ్లండుకు వెళ్లేవాళ్ళమీద కఠిన నిబంధనలు విధించబడినాయి. పైపెచ్చు ఈ మహామారిని నివారించే ఉపాయాలు అమలు జరిపేటప్పుడు పూనా లోని ఆందోళన కారులకు బుద్ధిచెప్పడానికి తగిన అవకాశము లభించిందనికూడ ప్రభుత్వము అనుకుంది. ఈ ఆలోచన మనస్సులోకి రాగానే దానిని కార్యరూపంలోకి తేవడానికి ప్రభుత్వము పూనుకున్నది. రాండ్ అను ఒక అధికారిని ఇందుకై ప్రత్యేకంగా నియమించింది.

రాండ్ పూనాకు బదిలీ కాకముందే సతారా జిల్లా అసిస్టెంటు కలెక్టరుగా ఉండేవాడు. అతడక్కడ ప్రజలను భయభ్రాంతుల చేశాడు. అతని కఠోర స్వభావము పూనామీదకూడ గట్టిదెబ్బ తీయగలదని ప్రభుత్వ విశ్వాసము లోకమాన్యుడు ప్రభుత్వ దురాలోచనను సకాలంలో గమనించాడు. తన కేసరి పత్రికలో ఈ బదిలీని గురించి ప్రస్తావిస్తూ, "ఈనాటి ప్రభుత్వపు తీరుచూస్తే ఈ నియమాలను అమలు పరచడంలో చాల కఠినంగా వ్యవహరింపబడుతున్నదని అనిపిస్తున్నది," అని వ్రాశాడు.

వాస్తవానికి ప్లేగు మహామారిని నిరోధించే ప్రయత్నాలు మానవతా దృష్టితో, ప్రేమ భావంతో చేయవలసిఉంది. ఇండ్లు శుభ్రపరచడం, ప్లేగు రోగపీడుతులకు ఉపచారను చేయడానికి చికిత్సాలయాలు తెరవడం, అక్కడ సేవా, శుశ్రూషలు, ఔషధోపచారాలు మొదలైనవన్నీ సేవా తత్పరతతో చేయవలసిఉంది. ఆరోజుల్లో లోకమాన్యుడు పూనాలోని డాక్టర్లను సమావేశపరచి ప్లేగు నిరోధానికి ఒక ప్రణాళికను, రోగుల ఔషధోపచారాదులు ప్రజలకు విశ్వాసపాత్రులైన వారిచేతిలో ఉంచవలెనను ఒక సూచనను కూడ వారిముందుంచాడు. కాని ప్రభుత్వము మాత్రము పూనామీద కసి తీర్చుకోవాలని నిశ్చయించుకుంది.

## రాండ్‌దొర వీరాంగము

రాండ్ సైనికులు ఒక్కొక్క యింటిలో జొరబడేవారు. ఆడవారి మీద, పిల్లలమీద అత్యాచారాలు చేసేవారు. ఇళ్ళు కొల్లగొట్టేవారు. ఎవరినయినా పట్టుకొని ఆ నరకకూపంలాంటి ఆస్పత్రిలోకి త్రోసేవారు. ప్లేగు రోగపీడితులు ఆ క్యాంపుకు వెళ్ళడానికి బదులు చావు రావడమే మేలని భావించేవారు. ప్లేగు సమయంలో రాండ్ చేసిన అత్యాచారాలకు విరుద్ధంగా న్యాయం పొందడంకూడ అసాధ్యమయ్యేది. ప్రభుత్వము పూనాలో

పెద్దసేనను తెచ్చి నిలిపింది. పూనాలో ఈ "రాండ్‌రాజ్యము" అత్యాచారాల వార్తలువిని ప్రజలు 'ఈ రాండ్ పెత్తనాన్ని పూనాపౌరులు ఎంతకాలము సాగనిస్తారు? " అని కేసరి పత్రికకు ఉత్తరాలు వ్రాసి అడుగుతుండేవారు. వందలకొలది ప్రచారసభలు, శివజయంతి వంటి రాష్ట్రీయ మహోత్సవాలు నిర్వహించలేని అసంతృప్తిని రాండ్ కల్పించిన రావణరాజ్యము సులభంగా నిర్మించింది

లోకమాన్యుడు ఈ అసంతృప్తిని కార్యోన్ముఖము చేసాడు. ప్రజల మనస్సులలో కర్తవ్య దీక్షను, ఆత్మ సామర్థ్యభావాన్ని మేల్కొలుప దలచాడు. ఆయన గవర్నర్ లార్డ్ సంధర్‌స్ట్‌ను సంబోధిస్తూ స్పష్టంగా ఇలా వ్రాశాడు.

''ఈనాడు సాగుతున్న మొగిల్ రాజ్యమ లేక రాండ్ రాజ్యము చాలకాలము నిలువలేదు. ప్రజలెంత పేదవారైనప్పటికీ, ఈ దౌర్జన్యాలను వాళ్ళు శాశ్వతంగా సహింపగలుగుతారని మా కనిపించడంలేదు. కాబట్టి ప్లేగువ్యాధిపాలై మరణించినప్పటికీ ఈ సంకట స్థితినుండి విముక్తి పొంది తీరాలని ప్రజలు భావించేటంత వరకు లార్డ్‌సంధర్‌స్ట్ చూస్తూ కూర్చోరని వారికి మా విన్నపము"

ఈ విన్నపము బధిరశాసకుల చెవినిపడడం అసంభవము. పిస్తోలు దెబ్బ శబ్దంతప్ప మరి యే యితర శబ్దంకూడ వారి చెవులలోనికి చొచ్చుకపోదు. ఈ ధ్వని పుట్టించే మహత్కార్యము చాఫేకర్ సోదరులు చేశారు. అంతులేని వారి త్యాగానికి సాటి, ధరిత్రి చరిత్రలోనే దొరకడం అసంభవము. భారత స్వాతంత్ర్య చరిత్రలో వీరిత్యాగము సువర్ణాక్షరాలలో వ్రాయబడి ఉంటుంది.

# చాఫేకర్ సోదరుల దివ్యాగ్ని

27 సంవత్సరాల దామోదర పంత్, 24 సంవత్సరాల బాలకృష్ణ పంత్, 18 ఏండ్ల వాసుదేవరావ్ - ముగ్గురు సోదరులు ఒక సంపన్న కుటుంబానికి చెందినవారు. తండ్రివృత్తి హరికీర్తన చేయడం. పెద్దన్న తండ్రిగారి వృత్తిలో తోడ్పడుతుండేవారు లోకమాన్యుడు వీరి గురువు యొక్క గురువు. వాస్తవంగా దామోదర్‌పంత్‌కు సైనికవృత్తి అంటే ఎంతో ఇష్టము కాని ఆరోజుల్లో బ్రాహ్మణులను సేనలో ప్రవేశింపనిచ్చే వారుకాదు. ఆయన వీరత్వారాధన కోసము స్వయంగా ఒక వ్యాయామ శాల స్థాపించాడు. లోకమాన్యుని కార్యంలో అవరోధాలు కల్పించేవాకిరి బాగా దేహశుద్ధి చేసి బుద్ధిచెప్పడం వీరిక ఇష్టమైన పని. ఒకసారి వీరు హిందూధర్మాన్ని వదలి క్రైస్తవము పుచ్చుకున్న ధోరాత్, పేంఢార్కర్ మొదలైనవారికి చక్కగా దేహశుద్ధి చేసారు. తెల్లవారిపట్ల, బ్రిటిషు సామ్రాజ్య ప్రభుత్వము పట్ల వీరి మనస్సులో అపరిమితమైన తిరస్కార భావముండేది. ఒకసారి వీరు బొంబాయిలోని విక్టోరియారాణి ప్రతిమమీద తారు గుమ్మరించి మెడలో చెప్పులమాల అలంకరించారు.

విక్టోరియారాణి సింహాసనము అధిరోహించి, అప్పటికి 60 సంవత్సరాలు నిండుతున్నాయి. ఒకవైపు పూనాలో ప్లేగు వ్యాధితో ప్రజలు అలమటిస్తుంటే, మరొకవైపు రాణిగారి వజ్రోత్సవానికి ఏర్పాట్లు జరిగిపోతున్నాయి.

1897 జూన్ 22 వ తేదీ భారతదేశమంతటిలో వజ్రోత్సవము జరుపవలసి ఉంది. ప్రత్యేకంగా పూనాలో అనాడు గనేశ్ ఖిండ్‌లోని గవర్నర్ బంగళాలో పెద్దవిందు. స్వాగత సమావేశము ఏర్పాటు చేయబడినాయి. ఉత్సవము కోసము గవర్నర్ బంగళామీద చిత్రవిచిత్ర దీపా

లంకరణలు చేయబడినాయి. అర్ధరాత్రిదాకా ఈ ఉత్సవము జరుపవలసి యున్నది.

## రాండ్ హత్య

చాఫేకర్ సోదరులు దీనిని సహింపలేక పోయారు. ఆత్మబలి దానము చేయడానికి వారికి సంసిద్ధత ఉండనే ఉంది. జూన్ 22న అత్యాచారి రాండ్‌ను వధించి పూనా పౌరులకు జరిగిన అవమానానికి



దామోదర్‌పంత్ చాఫేకర్ రాండ్ బగ్గీపై దూకి పిస్తోలు పేల్చాడు. తూటా రాండ్ ఘటంలో ప్రవేశించింది, రాండ్ బగ్గీలో ఒరిగిపోయాడు.

ప్రతీకారము చేయాలని వారు నిశ్చయించుకొన్నారు. నడిరాత్రి దామోదర్ పంత్, బాలకృష్ణ పంత్ గణేశ్ ఖిండ్‌లో తమ బలి పశువుల కోసము ఎదురు చూస్తూ దాగుకొని ఉంచినారు. వారికి ఖిడే అను ఒక స్నేహితు డున్నాడు. హెచ్చరిక చేయడం కోసము అతడు సభా ప్రాంగణములోనే ఆగిపోయాడు. సగము రాత్రికి ఉత్సవము సమాప్తమైంది. రాండ్ తన గుఱ్ఱపు బగ్గీలో కూర్చొని తిరిగి వెళ్తున్నాడు. బంగళా ముఖద్వారము నుండి 500 గజాల దూరానికి, బగ్గీ రాగానే చెట్లనీడలో నిలచిన దామోదర పంత్, పులిలాగా బగ్గీమీదకు దూకి, పిస్తోలు ప్రేల్చాడు. ఏమి జరుగు తున్నదో తెలుసుకునే లోపలనే తూటా ఎడమ భుజములో నుంచి దూసుకొని పోయింది. రాండ్ బగ్గీలో ఒరిగిపోయాడు. దామోదర్ పంత్ క్రిందికి దూకి చెట్లమాటున మాయ మయ్యాడు.

రాండ్ వెనకాల లెఫ్టినెంట్ ఆర్యస్ట్ సతీసమేతంగా వస్తున్నాడు. బాలకృష్ణపంత్ అతని బగ్గీమీదకు దూకి ఒకేతూటాతో ఆర్యస్ట్‌ను అంత మొందించాడు. ఆర్యస్ట్ సతికి దిక్కుతోచలేదు. భయంతో దెలివితప్పి పడిపోయింది బాలకృష్ణపంత్ కూడ తన సోదరుని వనకాలే అదృశ్యు డైనాడు. ఇది జరిగిన పదినిమిషాల లోపలనే పని ముగిసిన వర్తమానము లోకమాన్యునికి అందజేయబడింది.

గణేశ్‌ఖిండ్‌లో తెల్లదొరల బగ్గీల గుర్రాలు బెంగారుపడి, ఆ కటిక చీకటిలో దిక్కుతెలియకుండా పరుగుతీసాయి. బగ్గీ నడిపేవాండ్లకు వాటిని అదుపులోకి తేవడం కష్టమైపోయింది. వెనుకనుండి వచ్చే మరొక ఆంగ్లేయుడు సాహసించి ఆ రెండు బగ్గీల గుర్రాలను ఆపాడు. అక్కడ చూస్తే గాయపడి పడిపోయిన రాండ్, నెత్తురులో తడిసి ముద్దయిపోయిన ఆర్యస్ట్, భయకంపితురాలైన ఆర్యస్ట్ సతీమణి అతడు రాండ్‌ను ఆస్పత్రికి చేర్చాడు. ఆ దిక్కుమాలిన రాండ్ పదకొండు రోజులు కొట్టుకలాడి చివరకు కన్నుమూసాడు

**అంతా శాంతి ! నిశ్శబ్దం ! !**

మరునాడు తూర్పు తెల్లవారకముందే రాండ్ హత్యావార్త నాల్గు వైపుల వ్యాపించింది. పూనా నగరము కిమ్మనకుండా ఊరుకుంది. ఒక రోజు గడచింది మరో రోజు గడచింది: నాల్గు రోజులు గడిచాయి. ఎవరి నోటినుండి మాట బయటికి రాలేదు. ఎవరి యింటి కిటికీకూడ తెరుచుకోలేదు అన్నివైపుల భయానక వాతావరణము క్రమ్ముకుంది.

హత్య చేసిన వారిని వెదకటానికి ప్రభుత్వ యంత్రాంగము చురుకుగా పనిచేయసాగింది. ఇరవై వేల రూపాయల బహుమానముకూడ ప్రకటించింది. అయినప్పటికీ అంతా యథా 'ప్రకారము చల్లగా ఉండి పోయింది. ఈ మౌనానికి, ఈ చల్లబడిన హృదయానికి అర్థము ప్రభుత్వం గ్రహించలేకపోయింది. చివరకు అయిదవ రోజున పూనా కలెక్టరు ఒక సభను సమావేశపరచి, హంతకులను పట్టుకోవడంలో ప్రజలు సహకరించాలనీ, లేకుంటే దుష్పరిణామాలు తప్పవనీ బెదరించాడు. ఇంగ్లీషువార్తాపత్రికలు లోకమాన్యుని గూర్చి ఇష్టప్రకారము వ్రాయ సాగాయి. అప్పుడుకూడ అంతా నిశ్శబ్దమే. చివరకు పోలీసువాళ్ళ నిమిత్తము ఖర్చు లక్ష ఇరవై వేల రూపాయలు పూనా పౌరుల నెత్తిన రుద్దబడింది. ఇక లోకమాన్యుడు శాంతంగా ఉండలేక పోయాడు "ప్రభుత్వానికి మెదడు ఉండవలసినచోటనే ఉన్నదా ? " అని ఆయన ప్రశ్నించాడు.

ఈ సంపాదకీయవ్యాసంలో లోకమాన్యుడు ఇలా వ్రాశాడు: "పిచ్చిపట్టిన ఏనుగు ఏవిధముగా సమస్తము ధ్వంసముచేస్తూ తిరుగు తుందో, అదేవిధంగా మన ప్రభుత్వస్థితికూడ ఉంది. హత్యాదోషం హత్యచేసినవారిమీద నిలవడానికి బదులు మన ప్రభుత్వంమీద నిలచింది. అందుచేత ప్రభుత్వదృష్టి పూర్తిగా తప్పుదోవ బట్టింది. " ఈవ్యాసంతో ప్రభుత్వం నిజంగా రెచ్చిపోయింది లోకమాన్యుని చెరసాలలో ఉంచింది,

## విశ్వాసఘాతకుడైన ద్రవిడ్ సోదరుడు



ద్రవిడ్ సోదరుని విశ్వాసఘాతకమువలన దామోదరపంత్ పట్టుబడ్డాడు. అతనిమీద అభియోగము నడిచింది. అతనికి ఉరిశిక్ష విధించబడింది లోకమాన్యుడిచ్చిన భగద్గీత ప్రత్యేకప్రతిని హృదయానికి హత్తుకొని ఈభరతమాత ముద్దుబిడ్డడు ఉరిత్రాటి ఉచ్చును పూలమాలగా మెడలో ధరించాడు. ఈహుతాత్ముడు మరణించికూడ అమరుడైనాడు

దామోదరపంత్ తర్వాత ఆయనతమ్ముడు బాలకృష్ణపంత్ కూడ పట్టుబడ్డాడు. ఆయనకూడ నవ్వుతూ నవ్వుతూ కర్తవ్యపూర్తి చేశాననే సంతోషంతో ఉరికంబమెక్కాడు. అందరికంటె చిన్నతమ్ముడు వాసుదేవరావు ఈ ఇద్దరు అన్నలకంటె కూడ ముందుకు వెళ్ళాడు విశ్వాసఘాతకులైన ద్రవిడ సోదరులు ప్రభుత్వంతరపున సాక్ష్యం చెబుతుంటే న్యాయస్థానంలోనే వారిని మృత్యువాత పడద్రోసి, అటుపిమ్మట చిరునవుతో ఉరికంబపు మెట్లెక్కి తన అన్నలను కలుసుకోడానికి వెళ్ళిపోయాడు.

సాహిత్యాచార్య బాలశాస్త్రి హరదాస్ ఇలా వ్రాస్తారు: "పరతంత్ర భారతదేశంలో స్వాతంత్ర్య ఉపాసనలో ఋషితుల్యులైనవారిలో చాఫేకర్ సోదరులను లెక్కించవలసి ఉంది. సావర్కార్ యుగానికి ముందు, స్వాతంత్ర్య యజ్ఞము నిమిత్తము ఒక కుటుంబమంతా జ్వలించే విప్లవ కుండంలో స్వహస్తాలతో తమ సంపూర్ణ జీవితాలను సమిధలుగా చేసి కుదించిన దీప్తిమంతమైన ఉదాహరణ అఖిలభారతదేశంలో కేవలము చాఫేకర్ సోదరులది మాత్రమే. 

చాఫేకర్ సోదరుల ఈ ఉదాత్త ప్రతీకారముచేత నిర్దయులుగా, ఉద్దండులుగా ఉన్న బ్రిటిష్ ప్రభుత్వాధికారుల మనస్సులలో ఒక విధమైన భయము అంకురించింది. ప్రజల మనస్సులలో తమ కార్యనిర్వహణా సమర్థతమీద విశ్వాసము కలిగింది. ప్రతీకారము చేయడానికి సాహస

మేర్పడింది. ఈ చాఫేకర్ ఉదంతంతో లోకమాన్యునికి కూడ శిక్ష పడింది. లోకమాన్యుడు దానిని నిర్భయంగా స్వీకరించాడు.

''మనము ఎల్లకాలము రాజకీయాలలో ఉండవలసి ఉంటే, ఇటు వంటి కష్టాలకుకూడ సదా సిద్ధమైంది ఉండాలి" అని చెప్పి ఆయన జైలుకు వెళ్ళాడు. కఠిన కారాగారశిక్ష ఆయనకు విధించబడింది. ఇక్కడి కష్టాల మూలంగా ఆయన ఆరోగ్యము దెబ్బతినింది. ఈ వార్త ఇంగ్లాండుకు చేరింది. ఇంగ్లాండులోని విద్వాంసులకు తిలక్ పట్ల చాల ఆదరభావముంది వారు ఆయనను కారాగృహమునుండి విడిపింపజేయడానికి ప్రయత్నాలు చేసారు. 1898 సెప్టెంబర్‌లో తిలక్ విడుదల అయినాడు.

లోకమాన్య తిలక్ అసామాన్య మనోబలము గూర్చి నెవిడ్ సన్ అను ఒక యూరోపియన్ ఇలా వ్రాసాడు: అటు ప్రభుత్వము వైపు నుండి భయము, కష్టాలు కలిగించబడుతుండేవి. ఆయన ధనము, కీర్తి గౌరవము అన్నిటినీ నాశనము చేయాలని ప్రభుత్వము పూనుకున్నది, ఇటువంటి సమయంలో 'ఆర్కిటిక్ హోమ్' అను గ్రంథాన్ని తిలక్ వ్రాశాడు. ఇట్టి క్లిష్టసమయములో పవిత్ర ధర్మ గ్రంథాన్ని గూర్చికాని, హిమమయ ధృవప్రాంతాన్ని గూర్చికాని ఆలోచించగల మనోధైర్యము ఎంతమ ఉకుంటుంది ? " వాస్తవానికి ఆయన ఒక మహా మానవుడు.

## ధర్మసంస్థాపనార్థాయ

దేశంలో బ్రిటిష సామ్రాజ్యానికి విరుద్ధంగా అసంతృప్తికలి గించడానికి, స్వావలంబితమైన సంఘటిత శక్తి నిర్మించడానికి, అనగా స్వరాజ్య సంపాదనకు, సంసిద్ధత కల్పించబడుతూ ఉండినది. దానితో పాటే స్వధర్మాన్ని గూర్చిన జ్ఞానము, ధర్మనిష్ఠ సమాజములో నిర్మించ డానికి లోకమాన్యుడు ప్రయత్నాలు కొనసాగించాడు

# తొమ్మిదవ అధ్యాయము

# స్వామి వివేకానంద అవతరణము

తిలక్ విడుదల అయినప్పుడే లార్డ్ కర్జన్ హిందూదేశానికి రాజ ప్రతినిధిగా నియమింపబడినాడు. ఇది చాల ముఖ్యమైన విషయము. చాల కాలము వరకు శాంతి ననుభవించినందున బ్రిటిషు సామ్రాజ్యశక్తి వేళ్ళూనుకున్నది, ప్రపంచ దేశాలన్నిటిలో ఇంగ్లడుకు చాల సామర్థ్య మున్నది. ఆంగ్లేయ సామ్రాజ్యముమీద సూర్యుడెన్నడు అస్తమించ బోడని వారు గర్వించేవారు. ఈ సామ్రాజ్య వైభవములో హిందూ దేశానికి ప్రథమ శ్రేణి ప్రాముఖ్య ముంది. ఇక్కడి ప్రభుత్వాన్ని సుదృఢం చేయడం ఆంగ్లేయుల దృష్టిలో అత్యధిక ప్రాముఖ్యం గల విషయము ఈఉద్దేశంతోనే కర్జన్‌ను నియమించడం జరిగింది.

## యువక రాజ ప్రతినిది

లార్డు కర్జన్ హిందుస్థాన్ రాజప్రతినిధి అయినప్పుడు ఆయన వయస్సు కేవలము నలభై సంవత్సరాలే. తూర్పు దేశాల రాజకీయాలను హిందూ దేశంలో జరిగే అల్లకల్లోలాల తీరుతెన్నులను ఆయన బాగా అధ్యయనంచేశాడు. కొరియా వరకు ఆయన పర్యటించాడు. హిందూ దేశానికి నాల్గు పర్యాయాలు వచ్చాడు. కొంతకాలము భారతదేశ ఉప మంత్రిగా కూడా పనిచేశాడు. ఆయన చాల చతురుడు, కూటనీతిజ్ఞుడు. భారత దేశంలో ఆయన ప్రభుత్వము చాల వేగవంతంగా నడిచింది ఆయన కార్యశూరుడు. పని త్వరగా ముగిసే టట్లు చేయడం ఆయనకు

అత్యస్త్ర విద్య. అనేక విభాగాలలోని దోషాలు వెదికి వానిని సరిదిద్దడంలో ఆయన చేసిన కృషి ప్రశంసనీయము. ఆయనకొన్ని కమిషన్‌లు ఏర్పాటు చేశాడు. ప్లేగు, కరవు, పోలీసు, విద్యాపద్ధతి మొదలైన అనేక విషయాల మీద కమిషన్‌లు ఏర్పరచి వాటి నివేదికల ననుసరించి ఆయన అనేక నిర్ణయాలు తీసుకున్నాడు. ఒకపర్యాయము నిర్ణయము తీసుకున్న తర్వాత ఆయన పట్టుదలతో దానిని కార్య రూపంలోకి తెచ్చేవాడు. అతని ఈ విధానమువలననే దేశంలో అసంతోషాగ్ని జ్వాలలు తీవ్రంగా లేచాయి. విఖ్యాతమైన బంగాళ విభజన పర్వము ఆయన కాలములోనే ప్రారంభమైంది.

## ముసల్మానులను రెచ్చగొట్టుట

ఆకాలంలోనే కాటకము, ప్లేగు భారతదేశంలో అడుగుపెట్టాయి. ఈరెండుకూడ ప్రకృతి వైపరీత్యమువలన ఏర్పడిన సకటస్థితులు కావచ్చు, కాని ఈ ఆపదలను తగినట్లుగా ఎదుర్కొని వాటిని తొలగించ డానికి బదులు ప్రభుత్వము వాటిని అడ్డము పెట్టుకొని, ఇక్కడి ప్రజల మీద పగతీర్చుకోడానికి ఒక పథకాన్ని రూపొందించింది. హిందూ దేశాన్ని కొల్లగొట్టడమే పనిగా పెట్టుకున్న ప్రభుత్వ విధానము వలన ప్రజలు కాటకములలో కంటె అధికంగా కష్టపడ్డారు ప్లేగు సమయంలో జరిగిన అన్యాయాలు కారణంగా ప్రజలు కోపోద్రిక్తు లయ్యారు. మహాత్ములు చాఫేకర్ సోదరులు సకాలంలో ప్రభుత్వానికి అంకుశం వేశారు.

లోకమాన్య తిలక్ వంటి దూరదృష్టిగల మహా పురుషుడు ఈ కాలంలో మనకు నాయకత్వం వహించి మార్గ దర్శనం చేయడానికి లభించాడు. ఆనాటి ఆయన మార్గనిర్దేశము అత్యంత శ్రేష్ట శ్రేణికి చెందినది, రాష్ట్రీయముయొక్క సమగ్ర వికాసము దృష్ట్యా ఆయన నిరుపమానమైన

విధంగా మార్గదర్శనం చేశాడు. ఆంగ్లేయుల కుయుక్తులు ఆయన సహజం గానే తెలుసుకోగలిగేదు. ప్రపంచ రాజకీయాల ఒడుదుడుకులను ఆయన ఎల్లప్పుడు గమనిస్తూ ఉండేవాడు. యూరోపులో ఏమి జరుగుతున్నది? ఆఫ్రికాలో ఏమి జరుగుతున్నది? ఆసియాలో ఏమి నడుస్తున్నది?—వీటిని ఆయన అతి సూక్ష్మంగా పరిశీలించేవాడు ప్రతివిషయాన్ని మనదేశ పురోభివృద్ధికి ఏవిధంగా ఉపయోగించుకోవాలి అనిఆయన ఎల్లప్పుడు ఆలోచిస్తూ ఉండేవాడు. ఆదిశలో ప్రత్యక్ష ప్రయత్నాలు ప్రారంభిస్తుండేవాడు

## హిందుత్వముయెడ అభిమానం అవసరం

1893-94 లో హిందువులకు వ్యతిరేకంగా ముసల్మానులు కొట్లాటలు ప్రారంభించారు 1893 ఆగష్టు 18వ తేది బొంబాయిలో చాలపెద్ద ఎత్తున సంఘర్షణలు జరిగాయి. జుమ్మా మసీదువద్ద హిందువులు రథ ఉత్సవ సందర్భంలో మేళతాళాలు వాయించడం దీనికి తాత్కాలిక కారణం, కాని కొట్లాటలు ప్రారంభించాలని ముసల్మానులు ముందుగానే నిశ్చయించుకొని దానికి అన్ని ఏర్పాట్లు చేసి ఉంచుకున్నారు. ఈ విషయము అటుతర్వాత జరిగిన అన్వేషణలోను, విచారణలోను తెలియ వచ్చింది.

బొంబాయి కల్లోలపు వాతావరణము చూస్తూ చూస్తూ ఉండగానే మహారాష్ట్రమంత వ్యాపించింది. ఈ కొట్లాటల వెనుక ప్రభుత్వపు అదృశ్యహస్తము ఉందని తిలక్ వెంటనే గ్రహించాడు. హిందూ సమాజాన్ని శక్తివంతము చేసే పనిలో ఆయన నిమగ్నుడై నాడు. కల్లోలాలపై చర్చ ప్రారంభమైంది. ఇంగ్లీషు పత్రికలు విషాన్ని వెళ్ళగక్కసాగాయి హిందువులపట్ల ముసల్మానులలో ద్వేషాన్ని పెంచసాగాయి. ప్రభుత్వము హిందూ నాయకులను పట్టి జైళ్ళలో ఉంచసాగింది. అప్పుడు తిలక్ "హిందూజాతి శక్తి సంపన్నమై తనను తాను రక్షించుకోగలిగిన

యోగ్యత సంపాదించుకున్నప్పుడే ఇటువంటి కొట్లాటలు ఆగిపోగలవు" అని నిర్భయంగా చెప్పాడు. ఆనాటి నాయకులలో కొందరు రెండు సమాజాల ప్రజలను కలిపి శాంతి సంఘాన్ని స్థాపించే ఆలోచనతో వెళ్ళి తిలక్‌ను కలుసుకున్నారు. దీనిమీదట తిలక్ వారిని చీవాట్లు పెట్టాడు. "ఆంగ్లేయ ప్రభుత్వము ఈ దేశంలో తన రాజ్యాన్ని సుస్థిరం చేసుకోడానికి ముసల్మానులను రెచ్చగొట్టి, వాళ్ళను తమ కీలుబొమ్మలుగా చేసుకొని బుద్ధిపూర్వంకగా కొట్లాటలు జరిపిస్తున్నప్పుడు హిందువులమైన మనము స్వాభిమానంతో పట్టుదలతో దీనిని ఎదుర్కొనవలసి ఉంది. హిందువులు తమ రక్షణకు మార్గాన్ని తామే నిర్ణయించుకోవాలి" అనేది ఆయన స్పష్టమైన అభిప్రాయము. సంధి, స్నేహము సమాన బలముగల సమాజాలమధ్య మాత్రమే పొసగగలవు, నిలువగలవు అని ఆయన నిశ్చయము. హిందూస్థాన్ హిందురాష్ట్రము. ఈదేశపు పూర్వవైభవాన్ని పునర్నిర్మించడానికి పూర్తి బాధ్యత కేవలము హిందూ సమాజము మీదనే ఉన్నదని ఆయన సిద్ధాంతము. ఆయన చాల శ్రమించి హిందుత్వ చైతన్యాన్ని మేల్కొల్పుతుండేవాడు. "స్వధర్మముయొక్క శ్రేష్ఠతనుగూర్చి అభిమానము లేనివారికి స్వరాష్ట్రముయొక్క శ్రేష్ఠత్వములో మాత్రము అభిమానము ఎలా ఉండగలుగుతుంది? "—తిలక్ యొక్క ఖచ్చితమైన అభిప్రాయమిది.

అదృష్టవశాత్తు ఈ కాలంలో, ఈ దేశంలో, కేవలము సధర్మ స్వరాజ్య పతాకాలను విశాల విశ్వంలో విహరింపజేయడానికి ఒక మహాపురుషుడు అవతరించాడు. 1902లో కేసరి పత్రికలో లోకమాన్య ఇలా వ్రాస్తాడు:

"హిందూ ధర్మముయొక్క ఉజ్వల స్వరూప మిటువంటిదనీ ఈ విధమైన ధర్మము మన దేశంలో జన్మించిందనీ, ఇదే మన అమూల్య ధనసంపత్తి అని, దానిని విశ్వవ్యాప్తము చేయడమే మన నిజమైన

కర్తవ్యమనీ ఉద్ఘోషించడమే గాక ప్రపంచంలో దానిని సాధించి చూసిన వ్యక్తి వేయి లేక పన్నెండు వందల సంవత్సరాల క్రితము ఒక్క శంకరాచార్యుడుండినాడు. నేడు 19 వ శతాబ్ది చివర భాగంలో స్వామి వివేకానందు డున్నాడు."

## వివేకానందుని విభూతి మత్త్వము

వైభవశాలి అయిన చక్రవర్తికి దీటైన వ్యక్తిత్వము కలవాడు వివేకానంద. భారతదేశంలోను, విదేశాలలోను ఆయన సహవాసము లోనికి వచ్చిన వ్యక్తులు ఆయన భక్తులు కాకుండపోయిన దెవ్వడూలేరు. దర్శన మాత్రంలోనే అయన జన్మ సిద్ధ నాయకుడనీ, దేవదూత అనీ, మానవ మాత్రులపై ప్రభుత్వము నెరపడానికే జన్మించినాడనీ అనిపిస్తుంది. 1863 జనవరి 12 వ తేదీ కలకత్తాలోని ఒక ఉన్నత కుటుంబంలో సచ్చరిత్రులు, వైరాగ్య సంపన్నులు నైన తల్లి దండ్రులకు వివేకానంద జన్మించాడు. పదునెనిమిదవ ఏట ఆయన శ్రీ రామకృష్ణ పరమహంసను దర్శించాడు. నరేంద్రుడు వివేకానందుడైనాడు. అయన చరిత్ర సమస్తము మహోజ్జ్వలము.

లోకమాన్య, వివేకానందుల కలయిక శరీరాలు పులకరింపజేసే సంఘటన. అది 1893 సంవత్సరము సెప్టెంబరు నెల. కేసరి కార్యాలయములో తిలక్ పత్రిక చూస్తూ ఉన్నాడు. చికాగో నగరంలో సమావేశమైన విశ్వమత మహాసభ వార్తలు చదవడానికి ఆంగ్ల వార్తాపత్రిక తీసుకున్నాడు. అందులో ఒక భారతీయ యువక సన్యాసి ఫోటో ఉంది. పెద్ద పెద్ద పతాక శీర్షికలున్నాయి. ఈ యువక సన్యాసి కేవలము ఐదు నిమిషాల ఉపన్యాసంతో అశేష సభను ఎలా ఆకట్టుకున్నాడో అక్కడ వర్ణింపబడి ఉంది. తిలక్ హృదయముకృతజ్ఞతాభావంతో ఉద్విగ్నమైంది. ఆయన ఎంతో అభిమానంతో ఆ యువక సన్యాసి ఛాయా చిత్రాన్ని పరిశీలనగా

చూచాడు. ఆశ్చర్యము ! ఇతడే గత సంవత్సరం భారతదేశ పర్యటన చేస్తూ తన యింటికి వచ్చి కొన్నాళ్ళపాటు ఉన్నాడు. ఐదడుగుల ఎనిమి దంగుళాలకు మించిన ఎత్తు, నిండైన శరీరము, వెలుగునిండిన చురుకైన చూపులు, సిరాలాంటి నల్లని కనుపాపలు ; సింహంలాంటి రీవి. ఆ తేజస్వి సుందరమూర్తి ఆయన కళ్ళెదుటనుండి తొలగిపోవడంలేదు. బొంబాయి నుండి పూనాకు వచ్చేటప్పుడు బండిలో ఈ సన్యాసి తనను కలుసు కున్నాడు. తానతని పేరడిగాడు. అయన వినోదంగా "సన్యాసికి పేరేమిటి ?" అన్నాడు. తర్వాత తానా అనామక సన్యాసిని బలవంతాన తన యింట్లో నిలుపుకున్నాడు. పది దినాలు వేదాలు, ఉపనిషత్తులు, హిందూ ధర్మము మీద చర్చలు జరిగాయి. నిర్దుష్టమైన ఆంగ్ల భాషలో సంభాషణలు జరిగాయి. సన్యాసి యేమిటి? ఆయన ఒక మహా రాజయోగి. ఈ విషయాలన్నీ తిలక్ స్మృతిపథంలోకి వచ్చాయి. ఆ అనామక సన్యా సియే వివేకానందుడు. తిలక్‌కు ఆయన పట్ల కలిగిన అభిమానానికి కారణము తెలిసింది.

భారత స్వాతంత్ర్య చరిత్రలో వివేకానంద అత్యున్నత స్థానాన్ని అలంకరించి యున్నాడు. ఆయన కార్యము పునాదివంటిది. ఈ స్వాతంత్ర్య యుద్ధానికి మూల సూత్రమైన స్వరాజ్య స్వధర్మ భావాలను అఖండంగా నిలిపే మహత్కార్యాన్ని వివేకానంద సాధించాడు. మన హిందూ ధర్మము ప్రపంచంలో సర్వ శ్రేష్ఠమని నేడు మనము సగర్వముగా చెప్పకొనడానికి అవసరమైన ఆత్మ విశ్వాసాన్ని వివేకానంద మనలో నిర్మాణం చేశాడు.

## చికాగో విశ్వమత మహాసభ

భారతదేశంలో మరొకసారి శక్తిసామర్థ్యాల సామ్రాజ్యము సాక్షాత్కరించాలి. విద్య సహాయముతో ఈ దుర్బల మానవునిలో శివశక్తి సంచారము ప్రారంభం కావాలి. ఇటువంటి సమయంలో ఎక్కడోదూరంగా

ఏకాంతంగా కూర్చొని ధ్యాన నిమగ్నులు కావడమంటే కర్తవ్య పరాఙ్ము ఖులై కాలాన్ని దుర్వ్యయం చేయడమేనని ఆయన చెప్పాడు. దీని కోసము ఆయన ప్రపంచమంతా పర్యటించాడు. అనేకులను కార్యోన్ముఖుల చేసాడు.

చికాగోలోని విశ్వమత మహాసభ ఎదుట ఆయన ఉపన్యసించడానికి నిలచాడు. 'అమెరికాలోని నా సోదరీ సోదరులారా' అను మాటలు నోటి నుండి వెలువడగానే సభ పులకితమై నిలచింది. ప్రజావళి నోటినుండి 'భలే బాగుంది.' 'ఎంత సహజము' మొదలైన మాటలు వెలువడినాయి. ప్రతి



చికాగోలో విశ్వమత మహాసభలో ఉపన్యసిస్తున్న స్వామివివేకానంద

ఒక్కరు తత్పరతతో విన్నారు. ఆకాశమునుండి గంభీర మేఘమాలిక వర్షించినట్లు అమృత మధుర వాక్కుల వర్షము మొదలైంది.

"ప్రపంచంలో ప్రాచీనతమమైన సన్యాసి సంప్రదాయపు ప్రతినిధిగా నేనీనాడు మీకు కృతజ్ఞతలు తెల్పడానికి మీ యెదుట నిలిచి యున్నాను. ఏ ధర్మము ప్రపంచంలోని సర్వ మతాలను గౌరవించడము, అన్నిటి యెడల సహిష్ణుతావాన్ని కలిగి ఉండడము, అనే రెండు ప్రముఖ తత్త్వాలను బోధించినదో, ఆ ధర్మము యొక్క ప్రతినిధిని నేను. ఏ ధర్మము యూదుల మీద అత్యాచారము జరిగినప్పుడు వారికి ఆశ్రయ మిచ్చినదో, ఏ ధర్మము పార్శీలను తన పొరుగు వారిని చేసుకున్నదో, ఏ ధర్మము ప్రపంచములోని సకల ధర్మములు కూడ పవిత్రములని సదా బోధిస్తూ ఉంటుందో, ఆ ధర్మంలో జన్మించి నేను ధన్యుడనయ్యాను. సర్వ ధర్మములకు జనని జన్మభూమి హిందు ధర్మము కావడమే దీనికి కారణము.

ఈ సుందర ప్రపంచములో ఇన్ని కష్టాలకు మూల కారణము మూఢమత దురభిమానము. కాని విశాల దృష్టికి అన్ని ధర్మాలు ఒకటే. అన్నిటి చరమ లక్ష్యము. ఒకటే. ఈ ఉదాత్త తత్వాన్ని నేటి ప్రాతఃకాల ఘంటా నినాదములాగా సమస్త విశ్వంలో ప్రతిధ్వనింపజేయడానికే మన మంతా ఇక్కడ సమావేశమైనాము. అందువలననే ఈనాటి ఈమతమహాసభ అటువంటి మత దురభిమానపు కూకటి వేళ్ళను తెగనరికే వజ్రాఘాతము"

ఈ యువకునకు మాట్లాడడానికి అవకాశము ఇవ్వబడుతుందో లేదో కూడ నమ్మకములేని ఆ మహాసభలో ఇంత సరళమైన సంక్షేపమైన ఉపన్యాసములో ఆయన ఆ మహాసభనే జయించి వేశాడు. ఈ విశ్వ విజయము తర్వాత వివేకానంద భారతదేశానికి తిరిగి వచ్చాడు. కొలంబోనుండి కలకత్తా వరకు పర్యటించి ఆయన వేలకొలది ఉపన్యాసాలు చేశాడు. మరొక సారి ప్రపంచ పర్యటన చేశాడు. 1902లో ఆయన అవతారం చాలించారు

స్వామి వివేకానంద చేసిన రాష్ట్రజాగరణ కార్యక్రమము వలన లోకమాన్యునికి తగినంత బలము చేకూరింది. లోకమాన్యుడు కలకత్తా వెళ్ళినప్పుడు, అతి ముఖ్య కార్యక్రమంగా ఎంచుకొని వివేకానందుని ఆశ్రమానికి వెళ్ళాడు. వివేకానందుడు సమాధి పొందినపుడు లోక మాన్యుడు ఎంతో దుఃఖించాడు. కాని ఆ దుఃఖాన్ని పూర్తిగా దిగమింగి కార్యసాధనకు ముందంజ వేశాడు.

## అతివాదులు మితవాదుల మధ్య సంఘర్షణ

1885లో స్థాపితమైన కాంగ్రెసులో తిలక్ మొదట్లో విశేషంగా పాల్గొనేవాడుకాదు. కాని ఇప్పుడు ముందు నడుస్తూ కాంగ్రెసు కార్య క్రమములో పాల్గొనాలి అని నిశ్చయించుకొన్నాడు. 1885 నుండి 1888 వరకు కాంగ్రెసు చరిత్రలోని మొదటి పర్వము కేవలం తీర్మానాలు చేయడంవరకే పరిమితమైంది. ఈ తీర్మానాలు చేయడం వలన ఏమీ ఉపయోగముండేదికాదు. అందుచేత ఇంగ్లాండుకు ప్రతినిధి మండలిని పంపే ప్రయోగము కూడ కాంగ్రెసు చేసి చూచింది.

"మనవద్ద సామర్థ్యముంటే, మనలను బంధించి యున్న జాలాన్ని త్రెంచివేసి మనము బయటకు రావాలి" - ఇది యువక వర్గము వారి ఆలోచన, "స్వరాజ్యము నా జన్మహక్కు. దానిని నేను సాధించి తీరు తాను"- ఇది యువక వర్గమువారి మూలసూత్రము. 1898లో కర్జన్ ఆగమనము, లోకమాన్యుని కాంగ్రెస్ ప్రవేశము రెండూ ఒకే కాలంలో జరిగాయి. లోక మాన్యుని వలన కాంగ్రెసులో యువక రక్తము పరవళ్ళు త్రొక్కింది. ప్రార్థనాపత్రాలు, మనవి, అర్జీలు, తీర్మానాలు—ఈ కార్య పద్ధతిని యువకులు ఆమోదించలేదు. సామ్రాజ్యాధికారానికి లోబడిన అధినివేశ ప్రతిపత్తిని (dominion status) కూడ వారు అంగీకరించలేదు

యువకులు శాంతంగా ఉండదలచుకోలేదు. అందుచేత కాంగ్రెసులో అతివాదులు, మితవాదులు అని రెండు దళాలు ఏర్పడినాయి. ఆ రోజుల్లో కాంగ్రెసు మితవాదుల చేతుల్లో ఉండినది. అయినప్పటికీ అక్కడ తమ భావాల ప్రభావాన్ని నిర్మించి కాంగ్రెసును నిజంగా స్వాతంత్ర్యాభిముఖంగా చేయవలెననే సంకల్పముతో లోకమాన్యుడు ప్రతి మహాసభకు వెళ్తుండేవాడు.

## స్వరాజ్యమే మన ధ్యేయము

1906 కలకత్తాలో మహాసభ జరిగింది. మితవాదుల నాయకుడు దాదాభాయి నౌరోజీ అధ్యక్షుడు. ఆయన తన అధ్యక్షోపన్యాసములో ఇలా అన్నాడు.

"నేను 50 సంవత్సరాలనుండి హిందూదేశ హితం కోసం పోరాడుతున్నాను. విదేశాలకు వెళ్ళికూడ తగినంత ప్రయత్నం చేశాను. కాని స్వరాజ్యము తప్ప హిందూదేశానికి మరొక తరుణోపాయం లేదని నేనిప్పుడు నిష్కర్షగా నమ్ముతున్నాను. కాబట్టి అటువంటి ప్రామాణిక ప్రయత్నాలు మనము గట్టి పట్టుదలతో చేయవలసి ఉంది. అంతే కాదు హిందూ దేశములోని పలువిధాలైన వ్యాధులకు స్వరాజ్య మొక్కటే ఔషధము. హిందూస్థాన్ ఇప్పుడు స్వరాజ్యము తన ధ్యేయంగా ఉంచుకోవాలి"

ఈ ఉపన్యాసంతో మితవాదులు కిక్కురుమనకుండా అణగి ఉండిపోయారు. అతివాదులు ఆనందంతో చప్పట్లు చరచారు. స్వరాజ్యము, విదేశీ బహిష్కారము, రాష్ట్రీయ విద్యా విధానము మొదలైన విషయాల మీద వెంట వెంటనే తీర్మానాలు చేయబడినాయి.

ఈ మహాసభలో అతివాదులు, మితవాదులమధ్య బాగా వాద వివాదాలు కీచులాటలు జరిగాయి. తిలక్ అనేక పర్యాయాలు సభను వదలి వెళ్ళవలసి వచ్చింది.

జయాపజయాల పోటీ సాగుతూనే ఉండినది. తిలక్ మరుసటి సంవత్సరము దేశవ్యాప్తంగా పర్యటన చేశాడు. అనేకమైన ఉపన్యాసాలిచ్చాడు. దేశమంతటిలో నవచైతన్యాన్ని మేల్కొలిపాడు. లాల్-బాల్-పాల్- ఈ ముగ్గురు మహనీయుల యుగ మది. బంగాళము, పంజాబు, మహారాష్ట్రము స్వాతంత్ర్య యుద్ధంలో భుజం భుజం కలిపి ముందడుగు వేశాయి.

మరుసటి సంవత్సరము సూరత్‌లో మహాసభ జరిగింది. అందులో మితవాదులు స్వరాజ్య తీర్మానమునుండి కాంగ్రెసును వెనుకకు లాగడానికి ప్రయత్నించారు. ఒక్క అడుగు కూడ వెనుకకు వేయడం తిలక్‌కు అంగీకారం కాదు. కుర్చీ విసరికొట్టి తిలక్‌ను తరుమగొట్టేవరకు ప్రయత్నాలు జరిగాయి. కాని, తిలక్ వేదికమీద దృఢంగా నిలచాడు. ధైర్యముంటే ముందుకు రండి అని ఆయన గర్జించాడు. అధ్యక్షుడు కూడ పరుగెత్తి పోయాడు ఈ దృష్టితో చూస్తే సూరత్ కాంగ్రెస్ చాల ప్రధానమైంది. కాంగ్రెసు చీలిపోయింది. మితవాదులు వేరింటి కాపురము పెట్టారు.

ఈ మహాసభకు బంగాళము నుంచి బాబూ అరవింద ఘోష్ వచ్చాడు. లోకమాన్యునితో పాటు ఆయన పూనాకు వెళ్ళాడు. లోకమాన్యుడు ఆయనకు పూనాను, చైతన్యపూరిత మహారాష్ట్రాన్ని చూపించాడు. బాబూ అరవింద ఘోష్ బెంగాల్‌లో చేసిన కృషి కళ్ళకు మిరుమిట్లుగొల్పుతుంది.

## పదవ అధ్యాయము

# బాంబు యుగము-
# వీరభద్రుడు ఖుదీరామ్ బోస్

లోకమాన్యుడు సూరత్ నుండి పూనాకు తిరిగివచ్చిన సమయంలో స్వాతంత్ర్య సమరములో మూడు ప్రాంతాలు— పంజాబు, మహారాష్ట్రము బెంగాల్- అగ్రశ్రేణిలో పోరాడుతుండేవి. లాలా లజపతిరాయ్, బాల గంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్- లాల్, బాల్ పాల్ అనబడు ఈ మూర్తిత్రయము నాయకత్వము వహిస్తుండేది. ఈ ముగ్గురి కృషి ఫలితంగా దేశ ప్రజలలో నిద్రిస్తున్న ఆకాంక్షలు మేల్కొన్నాయి. దేశంలో ఒక నవచైతన్యము సృష్టించబడింది. ఎటుచూచినా వీరత్వము విహరింపసాగింది

గోపాలకృష్ణ గోఖలే ఆ రోజుల్లో మితవాదుల నాయకుడు కాని ఆయనను లోకమాన్య తిలక్ ఓడించాడు. మహారాష్ట్రము కణ కణ మండే నిప్పువలె తయారైంది మహారాష్ట్ర మంతటిలో స్వదేశీఆందోళన తీవ్రరూపము ధరించింది. జాతీయ విద్య ప్రారంభింపబడింది. విదేశీవస్తువుల భోగిమంటలు మింటికెగిసాయి.

ఈ రోజుల్లో మహారాష్ట్రములో ఉత్తేజక సాహిత్యము గాలిలాగా సర్వత్ర వ్యాపించసాగింది. గణేశోత్సవాలు, శివాజీ ఉత్సవాలు చాల పెద్ద ఎత్తున నిర్వహింపబడసాగాయి. సేనాపతి బాపట్ విదేశాలకు వెళ్ళి బాంబుల తయారీ నేర్చుకున్నాడు. ఈ విద్య భారతదేశము వైపుకు ప్రసరింపసాగింది. విప్లవానికి సంబంధించిన తర్కశుద్ధ భావనలు, ప్రాతిపదిక

లనుగూర్చి కరపత్రాలుకూడ మహారాష్ట్రంలో ప్రచురించబడినాయి. విప్లవవీరులు చాఫేకర్ సోదరులు ఒక మహత్తరాదర్శాన్ని యువకుల ముందు నిలిపారు. ఇదంతా బాబూ అరవింద ఘోష్ పూనాలో నివసించినపుడు గమనించాడు. అరవిందబాబు ఆ దివ్యత్వాన్ని గ్రహించి పూనానుండి తిరిగివెళ్ళాడు.

## స్వయం ప్రకాశముగల తారక

అరవిందబాబు స్వయం ప్రకాశము గల ఒక తేజోమయమైన తార. ఉన్నతవంశము; సంపన్న కుటుంబంలో జన్మము. విద్యాధికుల యింట్లో జన్మించిన అరవిందబాబు బాల్యంనుండి ఇంగ్లండులోనే పెరిగి పెద్ద అయినాడు. అక్కడి వాతావరణము అక్కడి సంస్కారాలు ఆయన మీద అవాంఛనీయ పరిణామాలు కలిగించలేదు. పైపెచ్చు తీవ్రమైన స్వాతంత్ర్య కాంక్షతో ఆయన మాతృభూమికి తిరిగివచ్చాడు. త్యాగము తపించిపోయే హృదయము ఆధారముగా ఆయన బెంగాల్‌కు నాయకుడైనాడు. నిశితమైన బుద్ధిగల విద్యార్థిగా, శ్రేష్ఠ శ్రేణికి చెందిన నాయకుడుగా ఆయనను పరిగణించవచ్చు. ఆయన మాటలు వేదవాక్కులుగా ప్రజలు మన్నిస్తుండేవారు. అరవిందబాబు భారతదేశానికి తిరిగివచ్చిన కాలములోనే ప్రభుత్వము మనలను చాల గట్టిదెబ్బ కొట్టింది.

కర్జన్ బెంగాల్ ప్రాంతాన్ని రెండుగా విభజించాడు. మన రాష్ట్రీయ భావనను బలహీన పరచడమే ఈ విభజనకు ముఖ్య ప్రయోజనము. తూర్పుబెంగాల్, పశ్చిమ బెంగాల్‌గా ఆనాడు చేయబడిన విభజనమే ఈనాటి పాకిస్తాన్ నిర్మాణానికి మూలకందము. ముసల్మానులు అధిక సంఖ్యాకులుగా ఉన్న ప్రదేశమును ముందుగా వేరుచేసి ఇది ముస్లిము బంగాళమని, ఇది హిందూ బంగాళమని పేర్లుపెట్టి ముసల్మానులను రెచ్చగొట్టడం ఈదేశ స్వాతంత్ర్య ప్రాప్తిని కఠినతరము చేయడం హిందూ

స్థాన్‌లో హిందూ ముస్లిము సంఘర్షణల నిప్పుమీద తమ స్వార్థమనే రొట్టెలు కాల్చుకోవడం-ఇదీ అతని ప్రణాళిక.

ఈ స్వదేశఘాతక బెంగాల్ విభజన ప్రణాళికను భారతదేశమంతా ప్రతిఘటించింది. 1905 అక్టోబరు 16వ తేదిన ఆ ప్రణాళిక అమలులోకి రావలసి ఉంది. ఆనాడు అన్నిచోట్లలోను "న భూతో న భవిష్యతి" గా హర్తాల్ జరిగింది. ప్రజలు దీక్షవూనారు. పరస్పరము చేతులకు తోరములు కట్టుకొని ప్రతిజ్ఞలు తీసుకున్నారు. కోట్లకొలది సంతకాలతో వినతి పత్రాలు ప్రభుత్వానికి సమర్పింపబడినాయి.

క్రొత్త తూర్పుబెంగాల్ గవర్నర్ ఓడనుండి దిగినాడు. ఆయనను చూడడానికి ఆ ఓడరేవులో ఒక్క వ్యక్తి కూడా లేడు.

## ప్రభుత్వపు దమన కాండ

దేశంలో బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా జరిగిన ప్రచండమైన ఆందోళనలో, రాష్ట్రీయ ఏకాత్మతా స్వరూపాన్ని ప్రపంచమంతా దర్శించిన కాలంలో బెంగాల్‌కు నాయకుడు అరవిందబాబు. 1906 ఏప్రిల్‌లో బెంగాల్ ప్రాంత మహాసభ బారిసాల్‌లో జరుగవలసి ఉండినది. ప్రభుత్వము దానిని నిషేధించింది. "వందేమాతరం" అనడం కూడ నిషేధించ బడింది. ఈ నిషేధాజ్ఞను ఉల్లంఘించి మహాసభ జరుప బడింది. "వందేమాతరమ్" అని లక్షలాది గొంతులు తారస్థాయిలో పలికాయి. మహాసభమీద పోలీసులు లాఠీచార్జి చేశారు. చిన్నలను పెద్దలను అందరినీ కొట్టారు. ఈ అత్యాచారమువలన భారతదేశమేగాక ప్రపంచ మంతా కూడ క్షోభించింది. లోకమాన్యుడు స్పష్టంగా ఇలా వ్రాశాడు.

"బ్రిటిష ప్రభుత్వము ఈ షైస్తఖానీ అత్యాచారాలు త్వరగా ఆపివేయకపోతే, ప్రజలదృష్టిలో ఆంగ్లేయ రాజ్యానికి, మొగలాయి

రాజ్యానికి తేడావేమీ ఉండదు; ప్రజలు ప్రభుత్వము కూడ ఈ సంకట స్థితికి దుఃఖాన్ని అనుభవించవలసి ఉంటుంది."

"లేవండి, బ్రిటిష ప్రభుత్వాన్ని పెకలించి పారవేయండి" అంటూ బెంగాలీ వార్తా పత్రికలు స్పష్టంగానే వ్రాయసాగాయి. ఈ రోజుల్లో అరవిందబాబు తమ్ముడు బారీంద్ర నిర్మించిన శక్తివంత మయిన దళము మొదట బెంగాల్‌లో పనిచేస్తూ ఉండినది. ఈ దళము మొదట్లో "భవానీమందిర్" అను ఒక కరపత్రాన్ని ప్రకటించింది. కర పత్రంకంటె వార్తా పత్రిక మరింత ప్రయోజనకారి అయినందున "యుగాంతర్" ప్రారంభించబడింది. "యుగాంతర్" సాక్షాత్తుగా ఒక ప్రేలుడుబాంబు. ప్రభుత్వము దీనిని చూడలేకపోయింది. "యుగాంతర్" కార్యాలయముమీద ప్రభుత్వపు కన్నుపడింది. ఒకనాడు కార్యాలయములో ఇరవై-ఇరవై అయిదు మంది యువకులు కూర్చొని సరదాగా మాట్లాడుకుంటున్నారు. పోలీసు అధికారి ఒకడక్కడకువచ్చి, సంపాదకుని పట్టుకోవడానికి ఉత్తరువు చూపించి "సంపాదకుడెవరు?" అని అడిగాడు. అందరూ ఒక్కసారిగా నేను, నేనని కేకలు వేసారు. పోలీసు అధికారికి కోపమువచ్చింది. అతడు వారిలో లావుపాటి యువకుని పట్టుకొనిపోయి శిక్షవేయించాడు. ఆ యువకుడు చాల సరదాగా జైలుకు వెళ్ళాడు.

ఈ సంఘటనతో యువక వర్గములో ఒక అద్భుతశక్తి ప్రసరించింది. రహస్య సంస్థను నిర్మించడమువలన మాత్రమే ప్రభుత్వాన్ని కూలద్రోయగలము అని "యుగాంతర్" దళములోని వారి మనస్సుకు వచ్చింది. ఆ వెంటనే "మానిక్‌తోలా" లోని తమ తోటలో రహస్య సంస్థ స్థాపన జరిగిపోయింది.

## మానిక్‌తోలా ఉదంతము

దాదాపు ఇదేసమయములో లాలా లజపతిరాయ్‌ని న్యాయవిచారణ లేకుండా దేశ బహిష్కారణచేసి బర్మాకు పంపారు. ఈ సంఘటన ప్రభావము అరవిందబాబు మీద తీవ్రంగాపడింది. ఆయన "వందేమాతరమ్"లో ఇలా వ్రాశాడు

"ఉపన్యాసాలివ్వడం, పత్రికలలో వ్రాయడమనే యుగం ఇప్పుడు గడిచింది. అధికార వర్గం విజ్ఞత అనే ముసుగును తొలగించుకున్నది. మనముగూడ ఈ ఆహ్వానాన్ని స్వీకరిస్తున్నాం. పంజాబీ సోదరులారా! సింహ కిశోరములారా? లేవండి, ఒక్క లజపతిరాయ్‌ని దేశ బహిష్కారము చేస్తే ఆ స్థానంలో వందలకొలది లజపతిరాయ్‌లు పుట్టుకవస్తారని ప్రభుత్వానికి చూపించండి. జైహిందూస్థాన్ అని కోటి గొట్లు బిగ్గరగా గర్జించండి."

మానిక్‌తోలా ఉద్యానంలో ఇప్పుడు బాంబులుగూడ తయారవుతున్నాయి. ఉల్లాసకరదత్తు హేమచంద్రదాసు ఈపనిలో అగ్రేసరులు. వైస్రాయి చంద్రనగర్‌నుంచి రాంచీకి వెళ్తున్నాడని వారికి సమాచారమందింది. చంద్రనగర్‌వద్ద అతని బండిని ప్రేల్చి పారవేయాలని ఈ యువకులు రెండుపర్యాయాలు ప్రయత్నించారు. కాని, సఫలత లభించలేదు. ఆ తర్వాత ఇటువంటి బాంబు ప్రేలుడు ప్రయోగాలు ఎన్నో జరిగాయి. కత్తిలాంటి ప్రభుత్వ క్రోధాన్ని, దాని తీక్ష్ణ దృష్టిని తప్పించుకొని ఇదంతా జరుగుతుండేది. "యుగాంతర్" సంపాదకుడని భావించి అతని యువమిత్రునికి శిక్షవిధించిన మేజిస్ట్రేటు "కింగ్స్‌ఫోర్డు" మీద బాంబువేయాలని ఈయువకులు నిశ్చయించుకున్నారు. అతనికి ముజఫర్‌పూర్ బదిలీ అయింది. అందుచేత ఖుదీరామ్ బోస్, ప్రఫుల్లచంద్ర చాకీ అను ఇద్దరు యువకులు ముజఫర్‌పూర్ వెళ్ళి కింగ్స్‌ఫోర్డు బండీమీద బాంబు

విసిరారు. కాని దురదృష్టము, ఆబండిలో కింగ్స్‌ఫోర్డులేడు. ఇతరులెవరో ఆంగ్ల వనిత లుండినారు. ఆ దౌర్భాగ్యస్త్రీలు మరణించారు. కాని ఈ సంఘటనతో ప్రభుత్వము మేల్కొన్నది. నేర్పుతో ప్రభుత్వము ఆ యిద్దరిని బంధించివేసింది. ఖుదీరామ్ వీరోచితంగా ఉరికంబమెక్కాడు. ప్రఫుల్లచంద్ర తనకుతానే ఆత్మత్యాగము చేసుకున్నాడు; హుతాత్ముడైనాడు.



యుగాంతర్ బృందం జరిపిన మొదటి బాంబు ప్రయోగం; న్యాయస్థానంలో లోకమాన్యుని సింహగర్జన.

---

ముజఫర్‌పూర్‌లోని ఈ బాంబు ధాకపు హిందూస్థాన మంతా కంపించిపోయింది. ప్రపంచంలోని విప్లవకారులంతా సంతోషించారు. అతివాదులు ఈ బాంబు ప్రయోగాన్ని రాబోయే అసంఖ్యాక ప్రయోగాలకు నాందిగా భావించారు. ఖుదీరామ్ దేశభక్తియొక్క ఉన్నతాదర్శము

అందరినీ చకితులను చేసింది. బాంబు యుగానికి ఆయన వీరభద్రుడుగా ఎన్నబడినాడు.

## లోకమాన్యుని సింహగర్జన

ఈ ఖుదీరామ్ ఉదంతమువలన లోకమాన్యునికి ద్వీపాంతరవాస శిక్ష పడింది. ఈ శిక్ష సందర్భములో లోకమాన్యుడు న్యాయస్థానంలో సింహగర్జన చేశారు.

"జూరీచేసిన నిర్ణయమేదైనా, నేను నిర్దోషిని, ఇంతమాత్రము నేను నిశ్చయంగా చెప్పగలను. ఈ న్యాయస్థానము శక్తివంతమైనది కావచ్చు. కాని, సకలవస్తు నియతిని నిర్ణయించే ఆ పరాశక్తి ఇంతకంటె బలవత్తరమైనది."

క్రూరము, అన్యాయము అయిన ఆశిక్షకు జవాబుగా బొంబాయి లోని మిల్లు కార్మికులంతా ఒక స్ఫూర్తివంతమైన విస్తృతమైన హర్తాళ్ చేశారు. రష్యాలోని మొదటి కార్మిక నాయకుడు లెనిన్‌కూడ ఈ హర్తాళ్ వార్త విని ఆశ్చర్యపడ్డాడు. ఈ సంఘటనవలన దేశవ్యాప్తంగా విప్లవ కారులపట్ల సహానుభూతి నిర్మాణమైనది. ఇదే సమయంలో కలకత్తా శివార్లలోని మానిక్‌తోలా తోటలోని దాంబుల కార్ఖానాను పోలీసులు స్వాధీనపరచుకొని అరవిందబాబుతో కూడ 40 మంది విప్లవకారులను బంధించారు. ఇదే సుప్రసిద్ధమైన ఆలీపుర్ బాంబుకేసు. అరవిందబాబు, బారీంద్ర, ఉల్లాసకరదత్తు మొదలైన 40 మంది విప్లవకారుల మీద కేసు నడిచింది. దీనికి చాల ప్రసిద్ధి వచ్చింది. అరవిందబాబు విడుదల అయి నాడు. బారీంద్ర, ఉల్లాసకరదత్తులకు ద్వీపాంతర శిక్ష విధించబడింది.

## చక్రవ్యూహంలో అభిమన్యుడు

దీని తర్వాత అరవిందబాబు యోగసాధనలకు పాండిచేరి వెళ్ళాడు. దేదీప్యమానమైన ప్రతిభాశాలి అరవింద ఋషి రాజకీయాకాశము నుండి శాశ్వతంగా అంతర్థానమైనాడు. విప్లవ తత్త్వద్రష్టయే అంతర్హితు డైనాడు. అరవిందబాబు ఇంగ్లాండులో ఉండినప్పుడు కూడ ఒక విప్లవ సంస్థను స్థాపించినాడు. "ఖడ్గము—కమలము" ఇది ఆ సంస్థ యొక్క సాభిప్రాయ నామము. శత్రు శిబిరంలో ఇటువంటి ప్రేలుడు పదార్థానికి చిచ్చుపెట్టగలిగిన ఆయన ధైర్యము అసామాన్యము.



## పదకొండవ అధ్యాయము

# విప్లవయుద్ధ తత్త్వజ్ఞుడైన సేనాని

ఇరువదవ శతాబ్ది మొదటి పది సంవత్సరాలు భారత స్వాతంత్ర్య చరిత్రలో ఒక ఉజ్వల కాలఖండము. సురాజ్యము నుండి స్వరాజ్యానికి స్వరాజ్యమునుండి పూర్ణ స్వాతంత్ర్యానికి మన లక్ష్యాన్ని మార్చుకుంటూ వచ్చి స్థిరపడింది ఈ కాలములోనే. స్వరాజ్యాన్ని ప్రథమంగా ఉద్ఘోషించిన మంత్రద్రష్ట లోకమాన్య తిలక్. అలాగే స్వాతంత్ర్యాన్ని ప్రథమంగా ఉద్ఘోషించిన మంత్రద్రష్ట స్వాతంత్ర్య వీరసావర్కార్.

జయోస్తుతే శ్రీ మన్మహామంగళే  
శివాస్పదే, శుభదే!  
స్వతంత్రతే భగవతి  
త్వామహం యశోసుతాం వందే.

ఉదాత్త ఉత్కట ధ్యేయదర్శి అయిన ఈ సుందర స్వతంత్రతా స్తోత్రము సావర్కర్ జీ రచన. తీవ్ర ఆవేదన, అలౌకిక ధీశక్తి, చూపరుల నాకర్షించే తేజస్వీ వ్యక్తిత్వము, నిర్భయత్వము, మృతదేహానికి కూడ ప్రాణ ప్రతిష్ఠ చేయగల అమోఘవాక్కు, నిశితమైన ప్రజ్ఞ, అసాధారణ కవిత్వము, సాటిలేని కార్యశూరత - ఇవి ఆయనలోని ప్రముఖ గుణాలు. అపారమైన దేశభక్తి, అత్యుత్తమ త్యాగము— ఈ విషయాలలో ఆయనతో సరిపోల్చగల మహాపురుషులు వందలాది

సంవత్సరాలలో ఒకరో ఇద్దరో జన్మించారు. సాహిత్యాచార్య బాలశాస్త్రి హరదాస్ ఇలా వ్రాస్తారు :

"బ్రిటిషు పాలనలోని భారతదేశంలో తత్వజ్ఞుడైన మొదటి విప్లవ నాయకుడుగా స్వాతంత్ర్య వీర వినాయక దామోదర సావర్కార్‌ను మాత్రమే పక్షపాతంలేని చరిత్రకారుడు గుర్తించి తీరాలి"

## భీష్మ ప్రతిజ్ఞ

1883 మేనెల 28వ తేదీ నాసిక్ సమీపానగల భగూర్ గ్రామంలో శ్రీ సావర్కార్ జన్మించాడు. బాల పసితనములోనే ఆయన హృదయం మీద చాపేకర్ సోదరుల ఆత్మాహుతి చెరగనిముద్ర వేసింది "స్వదేశంలో జరిగే అత్యాచారాలకు ప్రతిక్రియ చేసి చాపేకర్ సోదరులు ఉరిపంట మెక్కారు. కొడిగట్టి ఆరిపోతూ వారి ప్రాణ జ్యోతులు రగిలించిన శత్రుంజయి వృత్తిని ఇలాగే ఎల్లకాలము సమిధలు వేసి ప్రజ్వాలింపచేసే బాధ్యత మనపైన కూడ ఉంది" ఆ చిన్న వయసులో ఆయన కీ సత్యము తెలిసింది. తన కులదేవత సమ్ముఖములో "దేశస్వాతంత్ర్యాన్ని మరల సంపాదించడానికి సాయుధ విప్లవ పతాక నెగురవేసి మారణ హోమం చేస్తూ మరణపర్యంతము నేను పోరాడుతాను" అని ఆయన శపథం తీసుకున్నాడు. ఆనాటి నుండి ఆయన ఒక ఎడతెగని పోరాటాన్ని ప్రారంభించాడు, ఆయన మొదట్లో స్థాపించిన రహస్య సంస్థ 'రాష్ట్రభక్తి సమూహము' తర్వాత 'మిత్ర మేలా' గాను, అటు తర్వాత 'అభినవ భారత్'గాను రూపాంతరము పొందింది.

సావర్కార్‌జీ హైస్కూలు విద్యార్థిగా ఉన్నప్పుడు నాసిక్ చుట్టు పట్ల ప్రదేశమంతా ఆయన తేజస్సునుండి ఆవిర్భవించినరాష్ట్రీయగీతాలతో మార్మోగిపోయింది. 1901 జనవరి 22వ తేదీన విక్టోరియారాణి మరణించింది. రాజభక్తిపరులు. ధూర్తకూట నీతిజ్ఞులువిషాదాన్ని ప్రదర్శింప

సాగారు. కాని, సావర్కర్‌జీ ప్రజలను సూటిగా ఇలా ప్రశ్నించారు. "ఆమె రాజుగానీ, రాణిగానీ, ఎవరికి అనేది ప్రశ్న. ఇంగ్లండుకు రాణి అంటే మన శత్రువులకు రాణి కాబట్టి ఇటువంటి సందర్భములో రాజ భక్తి చూపించడము నిజానికి రాజభక్తి కాదు అది కేవలము దాసిస గీతాలు ఆలాపించడము మాత్రమే."

నాసిక్‌లో సావర్కార్ సోదరులు ప్రారంభించిన చైతన్య నిర్మాణ కార్యాలకు లోకమాన్య తిలక్, 'కాలకర్త' శివరామ్ పంత్ పరంజపే వంటి జాతీయ నాయకుల ఆశీర్వాదాలు లభించాయి. 1906 నాసిక్‌లో సంక్రాంతి మహోత్సవము చాల పెద్దఎత్తున జరిగింది. ఆ సందర్భంలో సావర్కర్‌జీ ప్రసంగిస్తూ—

"దేశంకోసం రక్తం ప్రవహింపజేయండి. స్వరాజ్యాన్ని సాధించండి స్వదేశ స్వాతంత్ర్యముకోసము మనము ఆయుధాలుతీసుకున్నాము కత్తితో కత్తి నెదురొ్కన్నందున పాపమేమ్మాత్రము లేదు. మన ఆయుధాలమీద స్వధర్మము, స్వదేశము అను శబ్దాలు ముద్రింప బడి ఉన్నంత వరకు ఆ ఆయుధాలచేత హతులైనవా రందరు స్వతంత్రదా యజ్ఞంలో అర్పింపబడిన ఆహుతులే. ఈ ఆహుతి పాపపంకిలము కాదు. పుణ్య భూషితము."

## శత్రు శిబిరంలో

ఈ సంవత్సరమే బి. ఏ పరీక్షలో ఉత్తీర్ణుడై స్వాతంత్ర్య ఆందోళనను తీవ్రతరం చేయడానికి "పండిత శ్యాంజీ కృష్ణవర్మ" విద్యార్థి వేతనముపై ఆయన పై చదువులకు లండన్ వెళ్ళాడు. లండన్ శత్రు శిబిరము మహా భయంకరమైన చక్ర వ్యూహము ఓడపై అడుగిడి నప్పటినుండియే ఆయన 'అభినవ భారత్' కార్యక్రమము ఆరంభించాడు.

విప్లవ కార్యాన్ని శాస్త్రీయ రూపంలో అభివృద్ధి పరచడం దృష్ట్యాను దానికి ఒక సుదృఢ తత్వజ్ఞానపు ప్రాతిపదిక కల్పించడం దృష్ట్యాను సావర్‌కర్‌జీ కృషి అత్యంత ప్రాముఖ్యము వహిస్తుంది. సావర్‌కర్‌జీ ప్రతిభ మహోన్నతము సంఘటనా కౌశల్యము అపారము. సావర్‌కర్‌జీ సోదరుడు విప్లవ వీరుడు బాబారావు సావర్కార్ కూడ మహాశక్తిశాలి. ఆయన భారతదేశంలోని విప్లవ కార్యభారాన్ని తన భుజస్కంధాల మీద వహించాడు. ఇక వినాయక్‌రావ్ సావర్‌కర్ ఆనాటి ప్రపంచ రాజధాని లండన్‌లో నివసిస్తూ పని చేయసాగాడు. అతి స్వల్ప కాలములోనే ఆయన చుట్టూ భారతీయ యువకులనేకులు చేరారు. వారంతా 'అభినవ భారత్' శపథము తీసుకొని విప్లవ కార్యంలో నిమగ్నులైనారు. లండన్‌లోని సావర్కార్ నివాస స్థానము భారత స్వాతంత్ర్య యుద్ధ కేంద్ర కార్యాలయం అయిపోయింది.

సేనాపతి బాపట్ ఆ రోజుల్లో లండన్‌లో ఉండినాడు. అతడు సావర్కార్‌జీ వ్యక్తిత్వము వలన ప్రభావితుడైనాడు. అతనికి దేశ కార్యము తప్ప మరేమీ మనస్సుకు నచ్చేదికాదు. రష్యా విప్లవకారులు ఆ కాలంలో చాల ముందడుగువేసి ఉండినారు. సావర్కార్‌జీ సూచనానుసారము సేనాపతి బాపట్ బాంబు తయారీ విద్య వారివద్ద నేర్చుకున్నాడు. పార్లమెంటు భవనము పూర్తిగా పేల్చి వేయాలని సేనాపతి కోరిక. కాని సావర్కార్ అతనిని వారించి భారతదేశంలో బాంబుల విద్య ప్రచారానికై ప్రత్యేకంగా పంపించాడు.

వెనుకటి అధ్యాయములో చెప్పబడిన ఖుదీరామ్‌బోస్ ఉపయోగించిన మొదటి బాంబు ఈయన ప్రేరణ, శిక్షణల వలన తయారుచేయబడినదే. భారత్‌కు ఇంతకు ముందు బాంబులు వచ్చాయి. ఇప్పుడు మంచి పిస్తోళ్ళు కూడా రాసాగాయి. ఆంగ్లేయ అధికారులను నిర్ణీత పథకము ప్రకారము తుపాకి గుండ్ల దెబ్బలకు గురిచేసి కూల్చివేయడానికి ప్రణాళికలు తయారు

కాసాగాయి. ప్రతీకారము, దెబ్బకుదెబ్బ, హత్యకు హత్య— విధానము నిర్ణయింపబడింది. దేశంలో అన్నిచోట్ల ఆయుధ సేకరణ జరుగసాగింది.

## విప్లవానికి సిద్ధాంత ప్రాతిపదిక

ఆయుధపు శక్తి పిడికిటి పట్టులో ఉంది; ఆ పిడికిలి బలము చైతన్యవంతమైన హృదయంలో ఉంది. అటువంటి చైతన్యవంతమైన హృదయాన్ని నిర్మించే కార్యంలో వీర సావర్కార్ నిమగ్నుడైనాడు. లోకమాన్యుని మనము 'అసంతుష్టికి జనకుడు' అని చాల అభిమానంతో పిలుస్తాము. ఆయన మనకు స్వరాజ్య మంత్రానిచ్చాడు. వీరసావర్కార్ అంతకంటె మరొక అడుగు ముందుకు వెళ్ళాడు. యువక హృదయాలను ప్రతీకార, విప్లవ భావాలతో నింపడానికి ఆయన 'జోసెఫ్ మాజిని' '1857 స్వాతంత్ర్య సంగ్రామము' అను రెండు గ్రంథాలు రచించాడు. ఈ రెండు గ్రంథాలు విప్లవానికి భగవద్గీతలే. ఆయన ఇలా వ్రాస్తాడు :

"రహస్య సంస్థలకు ప్రచారక ఆచారక విభాగాలు రెండుండాలి. ప్రత్యక్ష కార్యాచరణ చేసేది ఆచారక విభాగము. ఈ విభాలకు అనుగుణంగా బహిరంగ కార్యక్రమాలు, రహస్య కార్యక్రమాలు రూపొందించబడాలి. ఆయుధ సహాయము లేకుండా కేవలము నిరాయుధ మార్గము ద్వారా పూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందడము ఎప్పుడు కూడ అసంభవము. ప్రజలలో ప్రాథమిక చైతన్యము నిర్మించడానికి నిరాయుధ ఆందోళన ఎలా చేయవలెనో, ఆసియా, యూరోపు అమెరికా మొదలగు బ్రిటిషు విరోధులైన రాష్ట్రాలతో సంబంధాలు ఎందువలన, ఏ విధంగా ఉంచుకోవలెనో, గ్రహించి వృకయుద్ధ విధానంలో (గెరిల్లా) విదేశీ శత్రువుల ఒక్కొక్క కేంద్రం మీద ఒక్కొక్క అధికారి మీద దాడిచేసి, వీలైన విధంగా ఒక వ్యక్తినిగాని, సముదాయాన్నిగాని ధ్వసంచేస్తూ ఉన్నందునను, బ్రిటిషు

ప్రభుత్వ సేవలో ఉన్న లక్షలాది సైనికులు రహస్యంగా విప్లవానికి సన్నద్ధులజేసి వీలైనన్ని స్థానిక, వ్యక్తిగత విప్లవాలు జరిపించడం వలనను ఇతర రాష్ట్రాలేవైనా ఇంగ్లండుతో యుదము ప్రారంభిస్తే దానితో చేయి గలిపి బ్రిటనుకు విరుద్ధంగా విప్లవము-ఒకటి సఫలం కాకున్న అదను చూచి మరియొకటి-తేవడం వలనను-ఈ విధంగా వక్రమార్గంలో శస్త్ర ప్రయోగం ద్వారా బ్రిటిషు ప్రభుత్వాన్ని వీలైనంతగా ఛిన్నాభిన్నం చేయాలి."

ఇటువంటి అనేక ఉపాంగాల ద్వారా పోరాటము సాగింపవలసిన సాయుధ విప్లవ కార్యక్రమ రూపురేఖలు స్పష్టంగా తయారుచేసి ఆయన తన సహచరుల ఎదుటను పుస్తక రూపంలో భారతీయ ప్రజల యెదుటను ఉంచాడు.

"1857 స్వాతంత్ర్య సంగ్రామము" అను గ్రంథము యొక్క చరిత్రయే మనలను పులకరింపజేస్తుంది గ్రంథ రచన, రచన పూర్తిగాక ముందే దాని మీద నిషేధము, నిషేధ ముండినప్పటికీ ముద్రింప బడిన మొదటి సంస్కరణము-ఇదంతా మహాద్భుత చరిత్ర. లాలా హరదయాళ్ సర్దార్ భగతీసింహ, నేతాజీ సుభాష్‌చంద్రబోసు వంటి వారిని ప్రకాశకులుగా పొందిన ఆ గ్రంథము యొక్క గొప్పతనము ఎలా వర్ణింపగలము !

## 1857 యొక్క స్వర్ణోత్సవము

1907 నాటికి 1857 స్వాతంత్ర్య సంగ్రామము జరిగి 50 సంవత్సరాలు పూర్తి అవుతున్నాయి ఈ సందర్భములో లండన్‌లో మే 10 వ తేదీన ఒక అపూర్వమైన స్వర్ణోత్సవము జరుపబడింది. భారతీయ యువకులందరు ఛాతిల మీద వీర ముద్రలు ధరించారు. ప్రసాదము రూపంలో చపాతీలు పంచబడినాయి. 'హుతాత్ములు' అను శీర్షిక గల ఉద్రేక పూరితమైన పత్ర మొకటి పంచి పెట్టబడింది.

దాదాపు ఇదే సమయములో భారత దేశములో ఖుదీరామ్ బోసుకు ఆ జన్మ కారాగారశిక్ష విధించబడింది. అరవిందబాబు మీద కేసు నడుస్తూ ఉండినది. లోకమాన్య తిలక్‌కు ద్వీపాంతరవాస శిక్ష విధించబడింది. లాలా లజపతిరాయ్ దేశమునుండి బహిష్కరింపబడినాడు. బారీంద్ర మొదలైన విప్లవకారులకు అజన్మ కారాగృహ శిక్ష విధించబడింది. బాబా రావు సావర్కార్ కూడ ప్రభుత్వ జాలములో చిక్కుకున్నాడు. రాజద్రోహ నేరము మీద ఆయన కూడ అండమాను దీవులకు కడగండ్లపాలు గాను డానికి పంపబడినాడు.

భారతదేశములో ప్రభుత్వ దమన నీతికి ప్రతీకారము చేయడము అవసరమైంది. రాజద్రోహ నేరానికి ఎందరో యువకులను ఉరికంబానికి వ్రేలాడదీయడము, మరెందరో యువకులకు అజన్మ కారాగార శిక్ష విధించి సముద్రాల కావలకు పంపడం—ఇది కేవలము అత్యాచారము. ఈ అత్యాచారానికి సకాలములో అడ్డుకట్టవేయడం అత్యవసరము. లండన్‌లో భారత భవనములోని యువకులు కోపంతో ఉడికిపోయారు. మదన్‌లాల్ ధీంగ్రా యిక సహించలేకపోయాడు. భారత మంత్రికి సలహాదారైన సర్ కర్జన్ వాయ్‌లీని హతమార్చడానికి పథకము వేసుకొని ఆ కార్యభారాన్ని తానే వహించాడు.

## దివ్యాగ్ని తేజఃపుంజము

మదన్‌లాల్ ధీంగ్రా వీర సావర్కార్‌కు ప్రియమైన స్నేహితుడు సంపన్నమైన ఒక ఉన్నత పంజాబీ కుటుంబంలో జన్మించాడు స్వభావ సిద్ధంగా బాల్యమునుండి సాహసి, నిర్భయుడు. మాట్లాడడం కంటె కార్యాచరణే అతనికి ఇష్టము. సావర్కార్ అతనిని ఒకసారి పరీక్షించాడు అతని చేతిలో ఒక వాడి బాకును రెండవ వైపుకు దిగేలాగా గుచ్చాడు రక్తము చిమ్మన గ్రోవిలోలోగా ఒక్కసారి చిమ్మింది. కాని

ఆ వీరుడు హూఁ అనికూడ అనలేదు. ఒకసారి అతడు బాంబు రసాయనముగల వేడిపాత్రను తన చేతులతో పైకెత్తాడు. చేతులకు పెద్ద పెద్ద బొబ్బలెక్కాయి.

దివ్యాగ్ని రగిలే అశుభదినము వచ్చింది. 1909 జులై 1వ తేదీ సాయంకాలము. లండన్‌లో జహంగీర్ హాలులో నేషనల్ ఇండియన్ అసోసియేషన్ వార్షికోత్సవము. భారత శత్రువు సర్ కర్జన్ వాయ్‌లీ ఆ ఉత్సవానికి వచ్చాడు. ధీంగ్రా ఈ ఉత్సవానికి యోగ్యమైన దుస్తులు ధరించాడు. బంగారు వన్నె ఫ్రేముగల కళ్ళజోడు పెట్టుకున్నాడు. తనకు ప్రియమైన ఆరుగుళ్ళ ఆటోమాటిక్ కోల్ట్ రివాల్వర్ తన కుడిజేబులో జాగ్రత్తగా ఉంచుకున్నాడు మరిరెండు పిస్తోళ్ళు రెండవ జేబులో ఉంచుకున్నాడు. పతి సఫలం కావడానికి వెంట మరి యిద్దరు స్నేహితులను తీసుకొని ఉత్సవ ప్రదేశానికి ఉత్సాహముతో వెళ్ళి చేరాడు.

ఉత్సవము లోటుపాట్లు లేకుండా చక్కగా పూర్తి అయింది. విందుకూడపూర్తి అయింది. కర్జన్ వాయలీ, ఆయన సతీమణి అక్కడ చేరినవారితో కబుర్లు చెప్పుకుంటున్నారు. రాత్రి పదకొండు గంటలు కాబోతున్నది. ప్రజలు క్రమక్రమంగా సన్నగిలుతున్నారు. వాయలీ దొర అందరి దగ్గర సెలవు తీసుకుంటూ ఉన్నాడు. అప్పుడే మదన్‌లాల్ ఆయనకు ఎదురుపడ్డాడు కర్జన్ వాయలీ మదన్ లాల్‌ను గుర్తుపట్టాడు. మాటలు పూర్తి అయినాయి. వాయలీ సతీమణి 'క్లోకురూము' వైపుకు వెళ్ళింది. ఇప్పుడు వాయలీ కేవలం ఒంటరిగా ఉన్నాడు. ఇద్దరు మెల్ల మెల్లగా మాట్లాడుతూ ముఖద్వారము వరకు వచ్చారు. అంతే, ఒక కర్ణ కఠోర ధ్వని దిక్కులు మారుమ్రోగింది. మదన్‌లాల్ గురి తప్పలేదు. కర్జన్ వాయలీ నేలబడి మన్ను గరచాడు. గడియారంలో 11 గంటలు దాటి పది నిముషాలైంది. ముళ్ళు భయంతో కంపించి ఆగిపోయాయి.

వాతావరణమంతా ఒక్క క్షణములో మారిపోయింది. పోలీసులు పరుగెత్తారు. ప్రజలు పరుగెత్తారు; ఒక్కసారి కోలాహలము చెలరేగింది. మదన్ లాల్ ఏమీ జరగనట్లుగానే స్థిమితంగా, చిరునవ్వుతో నిలబడ్డాడు. పోలీసులు అతనిని అదుపులోకి తీసుకున్నారు. 'నాపేరు మదన్ లాల్ ధీంగ్రా, నేను లేడ్ బరీ రోడ్డులో నివసిస్తున్నాను' ఇంతే చెప్పాడతను. పోలీసులవెంట శాంతంగా కస్టడీలోకి వెళ్ళాడు కొంచెము సేపటికి అతడు ప్రశాంతంగా నిద్రపోయాడుకూడ.

భారత మంత్రి సలహాదారుడు లండన్‌లో ఖూనీ చేయబడ్డాడు. ఈ సంఘటన సకల ప్రపంచాన్ని దిగ్భ్రాంతి చెందించింది. లండన్‌లో హాహాకారాలు పెల్లుబికాయి అటుతర్వాత ధీంగ్రాకు ఉరిశిక్ష వేయబడింది. అతడు హుతాత్ముడైనాడు. భారతీయ స్వాతంత్ర్య యోధులలో మకుట మణి అయినాడు. శాశ్వత స్ఫూర్తిని ప్రసాదిస్తూ వెలిగే కాంతిపుంజ మైనాడు.

హుతాత్ముడు మదన్‌లాల్ ధీంగ్రా వాఙ్మూలము స్వాతంత్ర్య వీర సావర్కర్‌తో చర్చించినమీదట ముందుగానే సిద్ధముచేసి ఉంచబడింది. ఆ 'ఆహ్వానము' ఈ విధంగా ఉంది.

"మాదేశంలోని దేశభక్త యువకులకు విధించబడిన ఉరిశిక్షలు ఆ జన్మ కారాగారవాసమువంటి అమానుష శిక్షలకు అతి స్వల్ప ప్రతీకారము చేయడానికి, అనాడు నేను ఆంగ్లేయ రక్తాన్ని ప్రవహింపజేసే ప్రయత్నం చేసాను. ఈ విషయంలో నేను కేవలము కర్తవ్యబుద్ధితోనే వ్యవహరించాను, కేవలము అంతరాత్మయొక్క అనుమతితీసుకున్నాను. కత్తి పదునువలన దాస్యములో చిక్కిఉన్న దేశము ఎల్లప్పుడు పోరాడు తూనేఉంటుంది తుపాకి ఉపయోగించడానికి వీలులేదు. గనుక నేను పిస్తోలునే ఉపయోగించాను నేను హిందువుడను కాబట్టి నా దేశానికి జరిగే అవమానము సాక్షాత్తుగా భగవంతునికి జరిగే అవమానమే అని

నా దృఢ విశ్వాసము, ఎందుకంటే, రాష్ట్రపూజయే రామునిపూజ; రాష్ట్ర సేవయే కృష్ణభక్తి. నావంటి నిర్ధనులవద్ద, శారీకంగా, మానసికంగా బలహీనులవద్ద, దీనులవద్ద మాతృదేవికి అర్పించడానికి తమ రక్తపు శ్రద్ధాంజలి తప్ప వేరే ఏమి ఉంటుంది? మానవతాసేవ, ఈశ్వరపూజ చేయడానికి నా తల్లికి స్వాతంత్ర్యము లేనంతవరకు నేను మరల మరల ఆ భారతమాతకే జన్మించి ఇటువంటి కార్యంలో ఈవిధంగానే మరణించు నట్లు అనుగ్రహించ వలసిందని భగవంతునికి నా ఏకైక ప్రార్థన. వందే మాతరమ్".

## అగ్ని ప్రపాతములకు సూత్రధారుడు

హుతాత్ముడు మదన్ లాల్ బ్రిటిషు చక్ర వ్యూహాన్ని భేదించి సామ్రాజ్యశక్తి నెత్తిమీద నెత్తుటి బొట్టుపెట్టాడు. ఈ వీరకార్యాన్ని చూచి భారతదేశంలోని యువకులు ఉత్సాహ పూరితులైనారు. మనముకూడ ఏదైన చేయాలి అని వారు ఆలోచించసాగారు. అనంతరావ్ కాన్హేరే నాసిక్‌లో జాక్సన్‌ను వధించి తానుకూడ సంతోషంతో ఉరికంబ మెక్కాడు.

ఈ అగ్ని ప్రపాతములకు సూత్రధారుడు స్వాతంత్ర్య వీర సావర్కర్. ఆయనే ఈ విప్లవ కార్యాలన్నిటినీ ఒకటిగా కూర్చేవాడు. బ్రిటిషు ప్రభుత్వము ఆయన వెంట కూడా పడింది. నాయకుడు కాబట్టి తన రక్షణ దృష్ట్యా సావర్కర్ ఆ సమయంలో పారిస్‌లో ఉండేవాడు. కాని, ఈ విషయం ఆయన మృత్యుంజయ ప్రవృత్తికి అణచిపెట్టలేక పోయింది సహచరులందరికీ నచ్చజెప్పి ఆయన మరల లండన్‌కు వచ్చాడు. వెంటనే స్టేషన్‌లోనే ఆయనను బంధించివేసారు. దీని పరిణా మము ఏవిధంగా ఉండబోతుందో సావర్కర్‌కు తెలుసు. ఆ వారంలోనే భారత దేశంలో అతని సోదరులిద్దరు కూడ బంధింపబడినారనే వార్త ఆయనకు తెలిసింది. ఆయన ఒక మహాకవి. తన వదినెగారినుండివీడ్కోలు గ్రహిస్తూ ఆయన 'మృత్యుపత్ర' అను పేరుతో ఒక కవిత రచించాడు.

"ఇందులో విశేష మేముంది? మేము ఏడుమందిమి సోదరులము ఉన్నప్పటికీ సంతోషంగా, అందరము నీకోసము ఆత్మాహుతి అవుతాము" ఈ కవితలోని ఉదాత్త రసావిష్కారము సాటిలేనిది. సాగరాన్ని ఉద్దేశించి వ్రాసిన కవితకూడ మాతృభూమిపట్ల ఇంతటి ఉదాత్తమైన. అత్యున్నత ప్రేమను ఆవిష్కరించింది.

## విశ్వ విఖ్యాతమైన సముద్రోల్లంఘనము

సావర్కార్ యొక్క ప్రాథమిక విచారణ ఇంగ్లండులోనే జరిగింది. అటుతర్వాత అయనను అతి రహస్యంగా ఓడలో భారతదేశానికి కొనిరావడానికి నిశ్చయించారు. ఓడమీద గట్టి బందోబస్తు ఏర్పాటు చేయబడింది అప్పుడుకూడ, సమర్థులని పేగమోసిన, కఠినత్వంలో యమ సమానులైన అధికారుల కండ్లలో దుమ్ము చల్లి సావర్కార్‌జీ పాయిఖానాలోని గుండ్రని కిటికీ (Port Hole) గుండా క్రిందికి సముద్రములోనికి దూకాడు. స్వతంత్రుడైవాడు ఎంత అద్భుత సాహసము: ప్రపంచమంతా ఆశ్చర్యముతో ముక్కుమీద వ్రేలు వేసుకుంది. కాని, ఆంగ్లేయులు అయనను మోసంతో మరల పట్టుకొని భారత దేశానికి తీసుకువచ్చారు రెండు అజన్మకారాగార శిక్షలు, అనగా 50 సంవత్సరాలు శిక్ష విధింపబడింది ఈ శిక్షకు సరిపోల్చ దగిన ఉదాహరణము ప్రపంచ చరిత్రలో మరెచ్చటకూడ కానరాదు. 1911 మార్చి 22వ తేదీ ఆ దుర్దినము ఆ నాడు మానవత్వము కళంకితమై అస్తమించింది. ఈ శిక్ష వింటూ ఆ మహా మేరు సమాన ధీరుడు "ఆంగ్లేయుల రాజ్యము 50 సంవత్సరాలుంటుందా?" అని గర్జించాడు.

## చిరస్మరణీయమయిన చివరి కలయిక

అండమాన్‌కు వెళ్ళబోయేముందు 27 సంవత్సరాల యువక సావర్కార్ చెరసాలలోనే 19 ఏండ్ల తరుణి తన సతీమణి వద్ద వీడ్కోలు

గ్రహించాడు ఇద్దరిమధ్య సల్లని ఇనుపచువ్వలు అడ్డంగా ఉన్నాయి. జీవితాంతం విడిపోయే దయనీయమైన సన్నివేశ మది, ఒకరి నొకరు చేతితో తాకడానికి కూడ అనుమతించని సావర్కార్ శరీరము మీద మోటు జైలు దుస్తులు, కాళ్ళకు బరువైన సంకెళ్లు. చూపులు కలిసాయి, ఇద్దరి గుండెలు ఒక్క సారి ఆగినట్లుయుంది. ఆ స్థితిలో సావర్కార్ తన శ్రీమతితో ఇలా అన్నాడు—



ఆమరణ కారాగారవాస శిక్ష అనుభవించుచున్న సావర్కార్‌ను ఆయన సతీమణి జైలువద్ద కలుసుకున్నప్పటి భవ్యోదాత్త దృశ్యము

---

"భగవంతుని కృప ఉంటే మరల కలిసి తీరుతాము. అప్పటి దాకా, ఎప్పుడైన ఈ సాధారణ సంసార వ్యామోహాలు కలిగితే, ఈ విధంగా తలుచుకో-సంతానము పొందడం, నాలుగు కర్రలు చేర్చి ఒక యిల్లు కట్టుకోవడం, దీనికే సంసారం చేయడం అని పేరుపెట్టితే అలాంటి సంసారము కాకులు, పిచ్చుకలు గూడ చేస్తూనే ఉన్నాయి, కాని

సంసారానికి దీనికంటె ఉదాత్తమైన అర్థము తీసుకోదలిస్తే, మనుష్యులలాగా సంసారాన్ని నిలిపి, శోభిల్లజేయడంలో మనముకూడ కృతకృత్యుల మైనాము. మన కుండ, చట్టి మనమే పగులగొట్టుకొన చున్నాము. కాని ఇందువలన ముమ్ముందు కొన్ని వేలమంది యిండ్లలో నుండి బంగారు పొగలు పైకెగుస్తాయి ఇటువంటి వివేకంతో సంసార విషయాలను ఎదుర్కొనే ధైర్యంతో ఉండటానికి ప్రయత్నించు."

అందుకు ఆ మమతామూర్తి నిశ్చయపూర్వకమైన కోమల స్వరంతో "అటువంటి ప్రయత్నాలు మనము చేస్తూనే ఉన్నాము. మీరు నా కొరకు, నేను మీ కొరకు ఉన్నాము. పుమ్ములగూర్చి మీరెందుకు చింతిస్తారు? మీరు స్థిమిత పడండి, అంతే, అందులోనే మనకు సర్వము సిద్ధిస్తుంది"

భారతీయ సంస్కృతి ఇక్కడ ఎంత భవ్యోదాత్త రూపంలో ప్రకటితమైంది! ప్రథమంగా విదేశీ వస్త్రాలకు కుప్పవేసి భోగిమంటలా బుగ్గిచేసినవాడు, మృత్యుంజయుడు, మహత్తర ప్రతిభా సంపన్నుడైన కవి, విప్లవ యుద్ధతత్వజ్ఞుడైన సేనాని సాటిలేని త్యాగానికి సాకార ఆదర్శము అయిన సావర్కర్ జీ 50 సంవత్సరాలు అండమాన్ దీవులలో ద్వీపాంతరవాస శిక్షను అనుభవించడానికి బయలుదేరి వెళ్ళాడు.

# పంద్రెండవ అధ్యాయము

# విప్లవ యుద్ధ జ్వాలలు

1911 మార్చి 22 వ తేదీన స్వాతంత్ర్య వీర సావర్కార్‌కు రెండు అజన్మ కారాగారశిక్షలు విధించి అండమాన్ దీవులలో యమ యాతనల పాలు గావటానికి పంపి బ్రిటిషు ప్రభుత్వము నిశ్చింతతో ఒక నిట్టూర్పు వదిలింది.

ఇంతకు ముందే లోకమాన్యునికి శిక్ష పడింది ఆయనను మాండలేకు పంపి జాతీయ ఆందోళనను చైతన్యహీనము చేయగలిగింది ప్రభుత్వము. మితవాదుల నాయకత్వములో జాతీయకాంగ్రెసు ఉత్సాహము తరిగిపోయింది. సావర్కార్‌కు శిక్ష పడింది. అనాడు లాల్-బాల్-పాల్ మూర్తిత్రయము జాతీయ ఆందోళనకు సంక్రమింపజేసిన ఉగ్రాకృప స్వరూపము సంపూర్ణంగా సన్నగిలి పోయింది

## అగ్నిజ్వాలల దాహకత

కానీ విప్లవోద్యమ స్థితిదీనికి భిన్నంగా ఉంది. "బలవంతానదివిటీని తలక్రిందుగా త్రిప్పినా జ్వాలలు పైకేలేస్తాయి-" ఈ న్యాయాన్ననుసరించి ప్రభుత్వము అధికారికంగా దమననీతిని అనుసరిస్తున్న కొలది, విప్లకారుల ప్రయత్నాలు మరింత తీవ్రంగా, దాహకంగా, తేజోయుతంగా, సంఘటితంగా, కొనసాగజొచ్చాయి. ఈ కాలంలో విప్ల వోద్యమానికి సావర్కార్ వంటి ప్రతిభాశాలి తత్వజ్ఞుడైన సేనాని లేదించడము మన దేశపు అదృష్టము

స్వాతంత్ర్య వీర సావర్కార్ విప్లవోద్యమానికి తాత్విక ప్రాతిపదికను సమకూర్చాడు. విప్లవము కోసము 'అభినవ భారత్' అనే విశాల సంఘటనను నిర్మించాడు ఈ క్రాంతియుద్ధము షాంఘైనుండి శాన్‌ఫ్రాన్సిస్కో వరకు విస్తరించింది. బ్రిటిషు ప్రభుత్వము తమ సామ్రాజ్యములో మాత్రమే సూర్యుడస్తమించదని అనుకుంటుండేది. కాని, భారతీయ విప్లవకారులు సాక్షాత్తుగా సూర్యనారాయణులే. ఈ ప్రచండకిరణ దాహక ప్రభావాన్ని సహించగలశక్తి బ్రిటిషు సామ్రాజ్యానికి లేదు. ఈ విషయము ముమ్ముందు జరిగిన సంఘటనలు నిరూపించాయి.

భారతీయ విప్లవకారుల నాయకుడు వినాయక దామోదర్ సావర్కర్‌ను ఒక్కరిని బంధించి చెరసాలలో వేసినట్లయితే, క్రాంతి జ్వాలలు సమసిపోగలవని ఆంగ్లేయులు అమాయకంగా అనుకొనేవారు. కాని, సావర్కర్ ఒక వ్యక్తి మాత్రమే కాదు. ఆయన ఒక జాజ్వల్యమానమైన అగ్ని శిఖ ఆయన ఒక చిరంతన చైతన్యము. సావర్కర్ పట్టుబడడంతో క్రాంతి జ్వాలలు మరింతగా పైకెగయసాగాయి విప్లవాగ్ని భయంకర రూపాన్ని ధరించింది. చివరకు బ్రిటిషు ప్రభుత్వము ఆ తేజస్సు ఎదుట తలవంచి "భారతీయ ప్రజలకు రాజకీయ హక్కులు మేము ఇస్తాము" అని విధిలేక అనవలసి వచ్చింది.

ఈ అధ్యాయంలో 1911 నుండి 1920 వరకు జరిగిన సంఘటనలు తెలుసుకుందాము. ఇవి మూడు విధాలు. మొదటిది భారత దేశంలోని విప్లవ ప్రయత్నాలు. రెండవది భారతదేశం వెలుపల జరిగిన విప్లవ కృషి ఇక మూడవది ప్రపంచ యుద్ధము వలన బ్రిటిషు ప్రభుత్వానికి సంభవించిన ఆపద అనువుగా చేసుకొని చేసిన ప్రతిక్రియ.

## రాస బిహారీ బసు

భారతీయ రణాంగణ విప్లవ నాయకుడు, క్రాంతి వీరుడు బాబారావు సావర్కర్‌ను ప్రభుత్వము ఇంతకు ముందె బంధించి అండమాన్ దీవులకు పంపివేసింది. మహారాష్ట్రము, బంగాళము, పంజాబు— ఈ మూడు ప్రాంతాలు విప్లవ యుద్ధంలో అగ్రగాములుగా ఉండేవి. ఇక్కడ క్రాంతి కారులు రహస్యంగా సంచరిస్తూ కార్యనిమగ్నులైనారు. ఈ కాలములో భారతదేశములో విప్లవోద్యమానికి రాస బిహారీ బసు నేతృత్వము లభించింది. 1911 ప్రాంతంలో ఆయన డెహరాడూన్ అటవీ విభాగములో ఒక గుమాస్తాగా ఉండేవాడు. అక్కడ పనిచేసే రోజుల్లో ఆయనకు విప్లవ కారులతో సంబంధ మేర్పడింది. స్వాతంత్ర్యముకోసము తీవ్రవేదనతో ఆయన విప్లవ కార్యంలో నిమగ్నుడైనాడు. ఉత్తర భారతంలోని చిన్న పెద్ద విప్లవ సంస్థ లన్నిటినీ ఒక త్రాటిమీద నడిపించే ప్రముఖ బాధ్యత ఆయనకు అప్పగించబడింది. లాహోరులో ఆయన ఒక శక్తివంతమైన విప్లవకారుల సంఘటన నేర్పరచి 'న భూతో న భవిష్యతి'గా అపూర్వమైన కృషిచేసి చూపాడు

ఈ ప్రయత్నాలన్నిటికీ ఉద్గమ స్థానము స్వాతంత్ర్య వీర సావర్కర్. లండన్‌లో ఆయన రూపురేఖలు తయారు చేసిన ప్రణాళిక ననుసరించి అంతా జరిగిపోతున్నది. ప్రతిభావంతులైన ఆయన అనుయాయులు ఆయన అడుగు జాడల్లో చిచ్చు రగిలిస్తూ పోయారు.

## లాలా హరదయాళ్

సావర్కర్ పట్టుబడకముందే, ఆయన సూచనం ప్రకారము ఆయన సహచరుడు లాలా హరదయాళ్ భారత దేశానికి వచ్చాడు. హుతాత్ముడు మదన్ లాల్ ధీంగ్రా లాగే హరదయాళ్ కూడ సావర్కర్‌కు ముఖ్య సహచరుడు. వీరభూమి పంజాబులో జన్మించిన ఆ యువకునికి

రుక్కాగ బుద్ధి అయన పై చదువులకు ఇంగ్లాండు వెళ్ళాడు. అక్కడ సావర్కార్ జీ సహవాసముతో స్వయంగా సావర్కారే అయినాడు.

హరదయాళ్ చదువులు వదిలి వేశాడు. ఆంగ్లేయ వస్త్రధారణ పద్ధతికి స్వస్తి చెప్పాడు. ఆంగ్లేయులు చేతిఅన్నము కూడ ముట్టేవాడు కాదు ఇంగ్లాండుకు గుండె గాలమై గట్టి వెరపు పుట్టించగల విస్తృత ఆందోళనను భారత దేశంలో నిర్మించడానికి ఆయన స్వదేశానికి తిరిగి వచ్చాడు. పంజాబులో ఆయన ఆశ్రమం వంటి ఒక కేంద్రాన్ని స్థాపించి కార్యారంభము చేశాడు

ఈ రోజుల్లో లార్డ్ హార్డింజ్ భారత దేశంలో రాజ ప్రతినిధిగా ఉండేవాడు బెంగాల్ విభజన జరిపించి కర్జన్ చేసిన పాపాన్ని కడిగి వేసే ప్రయత్నము హార్డింజ్ చేయవలసి ఉంది. ఒక వైపు అతివాదులను, విప్లవకారులను అణచివేసి మట్టిలో గలపడం. మరొక వైపు భారతీయ ప్రజల విశ్వాసాన్ని చూరగొనడం- ఈ కఠిన కార్యాలను ఆయన సాధించవలసి ఉంది దాదాపు ఇదే సమయంలో ఇంగ్లాండు రాజు ఏడవ ఎడ్వర్డు చనిపోయాడు. ఆయన పెద్ద కుమారుడు అయిదవ జార్జి సింహాసన మెకాడ్క హిందూదేశ చక్రవర్తి గనుక ఆయన హిందూ దేశానికి రావలెననీ ఆయన పట్టాభిషేక మహోత్సవము హిందూ దేశంలో వైభవోపేతంగా జరుగవలెననీ ఆలోచన కలిగింది. ఈ కారణంగా రాజధాని కలకత్తానుండి ఢిల్లీకి మార్చబడింది. ఈ ఆగమన సందర్భంగా బెంగాల్ విభజన రద్దుచేస్తూ ప్రకటన చేయవలెనని నిశ్చయింపబడింది.

## మదరాసు వైపున మంటలు లేచాయి

నాటి విప్లవకారులు ఈ ఆశలకు లోబడేవారుకాదు. చక్రవర్తి ఆగమన దుర్వార్తను ప్రపథమంగా మద్రాసు నిరసించింది. తిరునల్వేలి జిల్లా మేజిస్ట్రేటు మిస్టర్. యష్ ను 'అభినవ భారత్' విప్లవ సైనికుడు

శ్రీ వాంచీ అయ్యర్ హతమార్చి విస్కారాన్ని ప్రకటించాడు. భారత మాతృ చరణాలమీద తన ప్రాణాల నర్పించాడు.

లాలా హరదయాళ్ భారత్‌లోని విప్లవకార్యాన్ని హనుమంత సహాయ్, మాస్టర్ అమీర్ చంద్, గణేశ్‌లాల్ ఖస్తా, అవధ బిహారీ, బసంతకుమార్ విశ్వాస్, భాయీ బాలముకుంద్ మొదలైన యువకుల మీద ఉంచి, ఇంగ్లాండుకు ప్రయాణమై వెళ్ళాడు. అక్కడ బాంబులు తయారు చేయడం, పిస్తోళ్ళు సేకరించడం వీటి సామాగ్రి నంతా భారత దేశానికి పంపడం వంటి పనులలో నిమగ్నుడైనాడు.

## రుధిరప్రియ ఢిల్లీ

ఢిల్లీ భారత రాజధాని అయింది. రుధిరప్రియ అది. వాడ్సరాయ్ హార్డింజ్ రాజప్రతినిధిగా ఢిల్లీకి వస్తాడనీ, రాజవీధులలో అతని ఊరేగింపు జరుగుతుందనీ ఇదంతా ఒక్క నెత్తుటిబొట్టు కూడ పడకుండ జరుగగలదని ఆశించడం అసంభవము.

1912 డిసెంబరు 23 వ తేదీన అతను ఢిల్లీ ప్రవేశించాలి. ప్రభుత్వ శక్తి, వైభవము, ఆటాటోపము ప్రదర్శింపబడుతున్నాయి. ఆనాడు రాజవీధులన్నీ పురజనులతో క్రిక్కిరిసిపోయినాయి. అలంకరింపబడిన ఒక రథముమీద హార్డింజ్ కూర్చున్నాడు. ఊరేగింపు చాందనీ చౌక్‌లోకి వచ్చింది. చరిత్ర ప్రసిద్ధమైన రాజవీథి, పొంగులు వారే జనసముద్రము. హార్డింజ్ తాను ధన్యుడైనట్లు తృప్తిగా భావించుకుంటున్నాడు. ఎర్రని అతని చెక్కిళ్ళు గర్వంతో మరికొంచెము కెంపెక్కాయి. ఆయన పొంగిపోయాడు. చిరునవ్వు చిలకరిస్తూ ప్రజల నమస్కారాలందుకుంటున్నాడు. ఇంతలో భయంకర మోతలాగా పెద్దశబ్దమైంది. నింగి నల్లటి పొగలతో నిండిపోయింది. అంబారియు కదలిపోయింది. జనసాగరము కలత

పడింది. పోలీసులు భయపడ్డారు. హార్డింజ్ నిస్త్రాణపోయాడు. ఆటోప మంతా అణగిపోయింది. ప్రతి ఒక్కరూ కళ్ళుమూసుకొని ఇళ్ళదారి పట్టారు. నిశ్చింతగా ఏమి జరిగిందో ఎవరికీ తెలియదు.



1912 డిసెంబరు 23 న ఢిల్లీలో లార్డ్ హార్డింజ్ ఊరేగింపుపై బాంబు విసరబడింది.

మరునాడు వార్తాపత్రికలలో ప్రకటింపబడిన వార్తలబట్టి లార్డ్ హార్డింజ్ బాంబువలన గాయపడ్డాడనీ అతని అనుచరుడు మరణించాడనీ, ఢిల్లీ పౌరులకు, సర్వ ప్రపంచానికీ తెలియవచ్చింది.

## లాహోర్ కుట్ర

ఇది జరిగిన ఆరు నెలలలోపలనే లాహోర్‌లోని లారెన్సు గార్డెన్ కంపించిపోయింది. రణచండీ పూజా మహోత్సవము మొదలయినట్లనిపించింది. తోట నిండుగా ఎర్రపూలు విచ్చుపువ్వట్లు నెత్తుటిజల్లు ప్రారంభమైంది. ఆత్మాహుతికోసం యువకులు ప్రాణాలొడ్డి ముందంజ వేయసాగారు.

ప్రభుత్వ దమన చక్రము నలువైపులా స్వైరవిహారముచేయ సాగింది. ఈ సంఘటనల కన్నిటికీ సూత్రధారుడు రాస బిహారి అని ప్రభుత్వానికి తెలియవచ్చింది. కాని, సంవత్సరాలు గడచినప్పటికీ ఆయన ఆచూకీ తెలియలేదు. చివరకు భేదనీతి సహాయంతో ప్రభుత్వము అవధ బిహారీ అమీర్‌చంద్, బసంత్ కుమార్ విశ్వాస్, బాలముకుంద్ మొదలైనవారిని పట్టివేసింది. అందరూ ఆనందంగా ఉరిశిక్షను వరించారు.

భాయి బాలముకుంద్ అరవిరిసిన మొగ్గ. వయస్సు 20 సంవత్సరాలు; అయితే సూర్యుని సిగ్గుపరచే తేజస్సు. "నా పూజ్య సోదరుడు మతీదాస్ స్వధర్మము స్వాతంత్ర్యము కోసము ఆత్మాహుతి చేసిన ఆ లాహోర్‌లోనే నేను కూడ మాతృభూమి పాదాల మీద బలిదానము చేస్తున్నాను" అనే సంతోషంతో బాలముకుంద్ ఉరికంబ మెక్కాడు. పవిత్ర శీలము, ఉజ్వల త్యాగప్రవృత్తి, తీవ్రవేదన రక్తధ్వజము మీద రెపరెప లాడసాగాయి. ఆ తేజస్సునుచూచి విరోధుల గుండెలు పగిలాయి. పైకెత్తిన వారి తలలు క్రిందికి వాలాయి.

## సతి-సాధ్వి రామరక్షీ

బాలముకుంద్ బలిదానము శ్రేష్ఠతరమని మనము భావిస్తే, ఆయన సతీమణి సాధ్వి రామరక్షీ బలిదానము శ్రేష్ఠతమము. ఆ సాధ్వి భర్త మరణానంతరము సతి అయి విప్లవ పర్వానికి వినూత్న తేజస్సును తెచ్చింది. బాలముకుంద్ ధైర్యంతో ఉరికంబ మెక్కిన నాటినుండి రామరక్షీ అన్నము, నీరు ముట్టకుండా భర్త వెనువెంట తానుకూడ స్వర్గస్థురాలైంది.

భారత దేశంలో ఈ విధంగా ఎటు జూచినా అగ్నిజ్వాలలు లేస్తున్నాయి. యువకులను పట్టి ఉరిశిక్షలు విధించే దమన చక్రము కొనసాగుతునే ఉంది. దీని ప్రభావము భారత దేశానికి వెలుపల ఉన్న విప్లవకారుల

మీద అధికంగా ఉండినది. భారత దేశంలో నివసించడం అపాయకరంగా పరిగణించిన నాయకులు రహస్యంగా విదేశాలకు వెళ్ళిపోయారు. స్వాతంత్ర్య వీర సావర్కార్ వలెనే నాగపూర్ నివాసి డాక్టర్ పాండు రంగ సదాశివ ఖాన్ ఖోజే దేశ స్వాతంత్ర్యోద్యమాన్ని దేశం వెలువల సంఘటిత పరచే ఉద్దేశముతో విదేశాలకు వెళ్ళాడు. డా॥ ఖాన్‌ఖోజే చరిత్ర అణువణువు అద్భుత సంఘటనలతో నిండి ఉంటుంది.

## డాక్టర్ ఖాన్‌ఖోజే

సమర్థ రామదాసులాగే వివాహ మంటపము నుండి ఆయన పరుగెత్తి పోయాడు. తిలక్‌ను ఆయన గురువుగా భావించేవాడు. గురువు ఇంట్లో ఉండవలె ననే కోరికతో ఆయన తిలక్ జీ ఇంట్లో ఉండేవాడు. తిలక్‌కు విశ్వాసపాత్రుడు కాబట్టి ప్రపంచంలోని విప్లవ వార్తలు, ముఖ్యమైన సందేశాలు ఆయనకు చేరవేసే అతి రహస్యమైన కఠిన కార్యాన్ని డా॥ ఖాన్‌ఖోజే స్వీకరించాడు మొదట ఆయన జపాన్ వెళ్ళాడు. అక్కడ నుండి అమెరికా వెళ్ళాడు.

అమెరికాకు వెళ్ళిన మీదట పండిత కాశీరామ్ సహాయముతో ఆయన స్వాతంత్ర్యము కోసము ప్రయత్నాలు ప్రారంభించాడు. ఇంతలో లాలా హరదయాళ్ వచ్చి ఆయనను కలిసాడు. విఖ్యాతమైన 'గదర్' పార్టీకి అపూర్వమైన తేజస్సు లభించింది. పంజాబీ భాషలో 'గదర్' అనగా విప్లవము. ఈ పేరును లాలా హరదయాళ్, భాయీ పరమానంద్‌లు సూచించగా అందరూ అంగీకరించి ప్రత్యక్ష కార్యానికి ప్రారంభం చేసారు ఇంతలో లోకమాన్య తిలక్ రహస్య సందేశము తీసుకొని ఒక యువకుడు అమెరికాకు వచ్చి చేరాడు. ఈ యువకుని పేరు విష్ణు గణేశ్ పింగళే. అతని వద్ద లోకమాన్యుడు సాంకేతిక భాషలో వ్రాసిన ఒక ఉత్తరముంది.

అదిచూడగానే డా॥ ఖాన్ ఖోజేకు అతనిమీద విశ్వాసము కలిగింది. పింగలే "గదర్" పార్టీలో ఒక ప్రముఖ నాయకుడైనాడు.

## గదర్ పార్టీ విప్లవము

గదర్ పక్షములో ప్రచార విభాగము, ప్రహార విభాగము అని రెండు భాగాలుండేవి. ప్రచార విభాగపు నాయకత్వము డా॥ ఖాన్‌ఖోజే వహించాడు. ప్రహార విభాగము దాని ప్రాముఖ్యానికి తగినట్లుగానే అతి రహస్యంగా ఉండేది. దాని సభ్యులకుకూడ ఈ విభాగపు విషయము తెలియనంత రహస్యంగా అది జరుగుతుండేది.

విప్లవ ప్రచారము కోసము "గదర్" పేరుతో ఎదు భాషలలో ఒక పత్రిక ప్రారంభించబడింది. 1913 నవంబర్ 1వ తేది గదర్ పత్రిక మొదటి సంచిక వెలువడింది. అది దానికంటె ఉష్ణాతి ఉష్ణంగా ఉండినది. విప్లవ శాస్త్రాన్ని సువ్యవస్థిత రూపంలో ప్రచారం చేయడం, అత్యావశ్యకమగు సూచనలు ఇవ్వడం, ప్రజా హృదయాలను విప్లవోన్ముఖం చేసే సాహిత్యం అందించడం-ఈ పనులు ఆ పత్రిక చేస్తుండేది.

"గదర్" పత్రిక ప్రతులు భారతదేశం లోపల, వెలుపల నలు మూలలకు లక్షల సంఖ్యలో చొచ్చుకు పోతుండేవి. బ్రిటిష్ ప్రభుత్వము దీన్ని చూస్తూ సహించలేకపోయింది. అది అమెరికా, కెనడా ప్రభుత్వాల మీద ఒత్తిడితెచ్చి హరదయాళ్‌ను అక్కడనుండి దేశ బహిష్కారము చేయించింది. ఇంతలో ప్రథమ ప్రపంచ యుద్ధము ప్రారంభమైంది. విప్లవకారులలో నవచైతన్యము ప్రబలింది. "ధనపు సంచులను విప్పి హిందుస్థాన్‌లో జరిగే విప్లవ ప్రయత్నాలకు సహాయ పడండి" అని గదర్ ద్వారా ప్రచారము ప్రారంభమైంది. 1914 ఆగస్టు 18 సంచికలో "విప్లవ సాహిత్యాన్ని విరివిగా ప్రచారం చేయండి, నిరాయుధ

ప్రతిఘటనకు ప్రోత్సాహం ఇవ్వండి. రైలు మార్గాలను ధ్వంసం చేయండి. బ్రిటిషు బ్యాంకులనుండి డబ్బు దోచుకోండి. విదేశీయులను ఎదుర్కొనేందుకు స్వదేశీ సైన్యానికి సంకేతము ఇవ్వండి. అని స్పష్టంగా వ్రాయబడింది. ఈ సమయంలోనే గదర్‌లో ఈ క్రింది విన్నపము ప్రకటింపబడింది.

**కావాలి**

హిందూదేశానికి వెళ్ళి విప్లవము కోసము పనిచేసే వీర సైనికులు.

జీతము - మృత్యువు
బహుమానము - బలిదానము
పెన్షన్ - స్వాతంత్ర్యము
సేవాక్షేత్రము - హిందుస్థాన్.

ప్రథమ ప్రపంచ యుద్ధము నుండి పూర్తి ప్రయోజనాన్ని పొందాలని నిశ్చయించుకుంది గదర్ పక్షము. అది జర్మనీతో సంబంధాలు ఏర్పరచుకుంది. పసిఫిక్ మహాసముద్రము మీదుగా బర్మాకు వచ్చి అక్కడి ఓడరేవును తన అధికారంలోకి తెచ్చుకొని బెంగాల్‌కు రావడం. విప్లవ బడబాగ్నిని ప్రజ్వలింపజేయడం, బయటి నుంచి లోపల నుండి ఒకేసారి విప్లవము తేవడం వారి పథకము. 1915 ఫిబ్రవరి 21 వ తేది విప్లవ ప్రారంభానికి దినముగా నిశ్చయింపబడింది. విదేశాలనుండి వేలాది భారతీయులు స్వదేశానికి బయలుదేరారు. బాంబు నిర్మాణ కళావిశారదుడు సంఘటనా కుశలుడు అయిన విష్ణుగణేశ పింగళే ఈ కార్యానికి నాయకత్వం వహించడానికి భారతదేశానికి తిరిగివచ్చాడు. జతీన్ ముఖర్జీ, శచీంద్రసన్యాల్, రాసబిహారి బసు-వీరి సహాయంతో విప్లవ సంసిద్ధతను సంపూర్ణం చేయడానికి ఆయన వచ్చాడు. అండమాన్ దీవుల మీదకు దండెత్తిపోయి స్వాతంత్ర్య వీరసావర్కర్ మొదలైన విప్లవకారులను

విడిపించే పథకముకూడ తయారైంది. కాని, వెనుకటి విప్లవాలకు పట్టిన దుర్గతి ఇక్కడకూడ అనుభవించవలసి వచ్చింది. పంజాబులో "గదర్" పక్షములో కృపాల్‌సింహ అనే ఒక గూఢచారి ప్రవేశించాడు. విప్లవ ప్రారంభదినము మొదలైన సమాచారమంతా ప్రభుత్వానికి తెలిసి పోయింది.

## హుతాత్ముని చివరికోరిక

ఈ విధంగా విప్లవోద్యమము ఆగిపోయింది. ఎంతో మంది త్యాగులు, దేశభక్తులు లాహోరు కుట్రకేసులో ఉరికంబానికి ప్రేలాడి ప్రాణాలు వదిలారు. జర్మనీవారి "యమ్‌డన్" యుద్ధనౌక మద్రాసు వరకువచ్చి వెళ్ళిపోయింది. సింగపూర్ 7 రోజులు మాత్రము స్వతంత్రమై ఉండినది. ఉరి తీయడానికి ముందు చివరికోరిక యేమిటని హుతాత్ముడు పింగలేని అడుగగా, ఆయన "చేతిసంకెళ్ళు తీయించండి చేతులు జోడించి ప్రార్థించడానికి అనుమతించండి." అని అడిగాడు. అనుమతి లభించిన మీదట ఆయన చేతులు జోడించి-

"ప్రభూ! మా హృదయం మీకు తెలుసు. ఏ పవిత్ర కార్యంలో మేము మా జీవితాల నర్పిస్తున్నామో దానిని నీవే పూర్తి చేయాలి. ఇదే మా చివరి ప్రార్థన" అని అన్నాడు. మొదటి మహాయుద్ధంలో ఆంగ్లేయులకు విజయం సిద్ధించింది. భారతదేశ స్వాతంత్ర్య నిమిత్తము సాగిన విప్లవ యుద్ధములో రెండవ పర్వము ఇలా విఫలమయింది

ఈ యుద్ధకాలంలో లోకమాన్యుడు శిక్ష అనుభవించి చెరసాల నుండి విడుదలైనాడు. మాండలే జైలులో ఆయన విశ్వవిఖ్యాతమైన 'గీతారహస్యము' అను భగవద్గీతా భాష్యాన్ని రచించి పూర్తి చేశాడు. చెరసాల నుండి బయటకు రాగానే ఆయన జాతీయ కాంగ్రెసును నవ చైతన్యముతో నింపచూచాడు. డాక్టర్ అనిబిసెంటు ఆయనకు సహాయ

పడింది. స్వరాజ్యపక్షఆందోళన మరల చిగురించింది. విప్లవకారులు గట్టి దెబ్బ తీయనే తీసారు. ఆ దెబ్బకు ఆంగ్లేయులు కళ్ళుతెరచారు. భారతీయులకు కొన్ని హక్కులు ఇవ్వడం తప్పనిసరి అయింది. అందుచేత లార్డ్ మాంటేగ్యూ 1917 ఆగస్టు 20 వ తేదీ భారతీయుల స్వరాజ్య హక్కును దశలవారీగా ఇవ్వగలమని ప్రకటించాడు.

## రౌలట్ బిల్ కొరడా

ఈ సమయంలో విప్లవఆందోళననుగూర్చి నివేదిక తయారు చేయడానికి ఇంగ్లండు నుండి సుప్రీము కోర్టు న్యాయమూర్తి యస్. ఏ. టి. రౌలట్ అధ్యక్షతన ఒక కమిటీ నియమింపబడింది. ఈ కమిటీ నివేదిక "రౌలట్ రిపోర్టు" పేరుతో ప్రసిద్ధి పొందింది. ఒక విధంగా చూస్తే ఇది విప్లవప్రయత్నాల సాధన గ్రంథము. కాని ఇదంతా తయారు చేయడానికి వెనుక ఆంగ్లేయుల కుటిలమైన పన్నాగ మొకటి ఉంది. ఈ రిపోర్టు ఆధారంగా ప్రజాపీడనకు పోలీసువారికి, న్యాయ శాఖవారికి అపరిమిత అధికారాలు నిస్తూ "రౌలట్ బిల్లు" పార్లమెంటులో ప్రవేశపెట్టబడింది. ఈబిల్లు ఎగువసభను(House of Lords)కంపబడగానే దేశమంతా ఒక్కటిగా ప్రతిఘటించింది; ఈ సందర్భములోనే పంజాబ్ గవర్నర్ మైకేల్ ఓడ్వాయర్ అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్‌లో వందలకొలది నిరాయుధులు నిరపరాధులు అయిన ప్రజలను చుట్టుముట్టి తుపాకి కాల్పులకు గురి చేశాడు. దేశం యావత్తు కోపంతో కంపించిపోయింది

# పదమూడవ అధ్యాయము

# సహాయ నిరాకరణ, స్వదేశీ ఉద్యమాల జాతీయ తరంగము

భారత స్వాతంత్ర్య యుద్ధములోని మూడవ పర్వాన్ని ఈ అధ్యాయము నుండి ప్రారంభిస్తున్నాము. 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామము వలన భారతదేశములో కంపెనీ ప్రభుత్వము నశించి, విక్టోరియా రాణి రాజ్యము ఆవిర్భవించింది. ఆ కాలములో ఇంగ్లాండు ప్రపంచ రాజ్యాలన్నిటిలో శక్తివంతంగా ఉండేది.

## నిరంకుశ రాజ్యకాలము

హిందూ దేశాన్ని గూర్చి చెప్పవలసి వస్తే, సుగంధిత సువర్ణ శకలము ఇంగ్లండు చేతికి చిక్కించదగిన విశాలమైన భూఖండము, దీనులు, మృతప్రాయులు అయిన ప్రజలు. వారు వేయి సంవత్సరాల విదేశీ ఆక్రమణ నెదుర్కొంటూ అలసిపోయారు. ప్రతీకారము చేయడానికి శక్తికూడ కోల్పోయారు, తమ స్వత్వాన్ని మరచిపోయారు. ఓడినవారు, గెలిచినవారు - అందరు మట్టిలో గలిసారు. ఈ విపరీత సమయంలో ధూర్తులు, చతురులు అయిన ఆంగ్లేయులు ఈ భూమిపై అడుగుపెట్టారు. విశాలత్వంలో ఒక ఖండం లాంటి ఈ దేశాన్ని తమ బుద్ధిబలంతో, కత్తిబలంతో ఆంగ్లేయులు తమ గుప్పిట్లోకి తెచ్చుకోగలిగారు. స్వాభిమానం కల మనుష్యుల స్వాభావిక ప్రయత్నాలను

అణచివేయడానికి పిడికిలి బిగించక తప్పదు అనే నీతి ననుసరించి ఆంగ్లేయులు నడచుకొన్నారు. దేశంలో ఏకచ్ఛత్ర నిరంకుశాధికారాన్ని స్థాపించ గలిగారు. మన దేశంలో 1920 వరకు గల కాల ఖండాన్ని ఆంగ్లేయుల నిరంకుశ రాజ్యకాలమని చెప్పవచ్చు.

## డాక్టరు ఖాన్‌ఖోజే సాహసము

1918లో ప్రథమ ప్రపంచ యుద్ధము ముగిసింది. ఆ కాలంలో డాక్టర్ ఖాన్‌ఖోజే ఒక ఇరానీల సమూహముతో ఉండేవాడు. ఈ ఇరానీ గుంపులు ఎల్లప్పుడు తిరుగుతూనే ఉండేవి. అప్పుడుకూడ ఆంగ్లేయులు అతనిని ఒక నిర్జన ప్రదేశానికి తరిమారు. ఇరాన్ రాజు సౌలత్‌ఉద్దౌలా ఓడిపోయాడు. ఆంగ్లేయులు అతని కుమారుని, మహమ్మద్ ఖాను అను మరొకరిని తమకు అప్పగించవలసిందని ఉద్దౌలాను కోరారు. మహమ్మద్ ఖానే మన డాక్టర్ ఖాన్‌ఖోజే. ఆఫ్ఘనిస్థాన్, బెలూచిస్థాన్ మార్గంగా భారతదేశానికి వచ్చే స్వాతంత్ర్య సైనికుల సేనాపతి ఆయన.

ఉద్దౌలా తనకుమారుని ఆంగ్లేయులకు అప్పగించడానికి సిద్ధపడ్డాడు అందరి హత్యకు సిద్ధపడ్డాడు కాని మహమ్మద్ ఖాన్‌ను అప్పగించదలచ లేదు. కాని ఈ క్లిష్ట పరిస్థితులలో నుండి కూడ దారి కనపించింది. మహమ్మద్ ఖాన్ హాజీ ఆగా ఖాన్‌గా మారాడు. ఇరానీ పౌరుడై ఇంగ్లాండుకు వెళ్ళాడు హిందూ దేశానికి కూడ వచ్చాడు.

డాక్టర్ ఖాన్‌ఖోజే మహాసాహసి. 1919లో ఆయన హాజీ ఆగా ఖాన్ అను పేరుతో ఒక ఇరానీ సర్దారుకు అంతరంగిక కార్యదర్శిగా ఆయనతో భారతదేశానికి వచ్చాడు. ఆయన బొంబాయిలో దిగి, నేర్పరులయిన గూఢచారుల కండ్లుగప్పి గిర్‌గాంవ్‌లో లోకమాన్యుని కలసు

కున్నాడు. డాక్టర్ ఖాన్‌ఖోజేను చూచి లోకమాన్యుడు ఆనందంతో ఉక్కిరి బిక్కిరైనాడు. తన శిష్యుడు ఇంత పరాక్రమశాలి నిర్భయుడు కావడం జూచి తాను ధన్యుడైనట్లు భావించాడు ప్రేమతో డాక్టర్ సాహెబ్ వీపు నిమురుతూ ఆయన ఇలా అన్నాడు.

"నిన్ను పట్టుకోడానికి దేశమంతట వారంటు జారీ చేయబడింది ఎక్కడైనా నీవు పట్టుబడితే నీమీద కేసు నడిపి ఉరిశిక్ష వేయడానికి తగిన ఆధారాలు ప్రభుత్వము వద్ద ఉన్నాయి. కాబట్టి ఇదే విధంగా హాజీ అగా ఖాన్ రూపంలోనే ఇరానీ సర్దార్‌తో పాటే తిరిగి వెళ్ళిపో"

లోకమాన్యుని దర్శించి, ఆయన ఆశీర్వాదాలు గ్రహించి, డాక్టర్ ఖాన్‌ఖోజే బొంబాయి నుండి తిరిగి యూరోపుకు వెళ్ళిపోయాడు. లాలా హరదయాళ్ విదేశాలలో స్థిర నివాస మేదీ లేకుండా తిరుగుతూ ఉండి నాడు, రాస బిహారీ కూడా జపాన్‌కు వెళ్ళిపోయాడు. ఇంతలో లోక మాన్యుడు దివంగతుడైనాడు. దేశమంతా దుఃఖ సాగరంలో మునిగి పోయింది.

## గాంధీజీ నాయకత్వము

అతివాదులను, విప్లవకారులను అణచివేయడములో ప్రభుత్వము విజయాన్ని సాధించింది. విప్లవ తత్త్వజ్ఞ సేనాని సావర్కార్ అండమాన్ లలో బందీ అయినాడు. విప్లవకారులు క్లిష్ట పరిస్థితులలో చిక్కుకున్నారు. అప్పట్లో మొదటి ప్రపంచ యుద్ధము తర్వాత ఆర్థిక మాంద్యము భయం కర తరంగములాగా వ్యాపించింది. దానికితోడు మహామ్మారి వ్యాధి. చాల కష్ట సమయమది.

ఇటువంటి సమయంలో మన అదృష్ట వశమున మహాత్మాగాంధీ వంటి నాయకుడు మన దేశానికి లభించాడు. భయంకరమైన తుఫానులో చిక్కుకొనిపోయిన స్వాతంత్ర్య యుద్ధ నౌకకు కర్ణధారుడై ఆ కష్ట స్థితి

నుండి తప్పించి నడిపించడంలో గాంధీజీ విజయాన్ని పొందాడు. మానసీయ గోఖలే 1919 లక్నో కాంగ్రెసులో "గాంధీజీ వంటి నిర్భయుడు నిర్మలుడు ఉదాత్తుడు అయిన వ్యక్తి మరొకరు నాకంటికి ఇంతవరకు కనపించలేదు" అని నొక్కి చెప్పాడు

గాంధీజీ 1869 అక్టోబరు 2 వ తేది, కథియవాడ్‌లోని పోరు బందర్‌లో జన్మించాడు. మంచి ఆరోగ్యము ప్రామాణికత ఆయనకు కుటుంబమునుండి వారసత్వంగా సంక్రమించాయి. ఆ రువది ధార్మిక ప్రవృత్తి. ఆయనవి స్వతంత్ర భావాలు తనమనస్సుకు నచ్చిన విషయాన్ని ఆయన నిర్భయంగా చేసేవాడు. ఎప్పుడైనా తప్పు దొరలితే విశాల హృదయంతో అంగీకరించేవాడు. సత్యము పట్ల అత్యంత శ్రద్ధ, అహింసయందు అచంచల విశ్వాసము ఆయన కున్నాయి. సాకార భారతీయ సంస్కృతి అయిన దేశము స్వాతంత్ర్యము పొందడమంటే అర్థము రాజకీయాధి కారము పొందడము మాత్రమే కాదని, ఇక్కడి ప్రజలు అన్ని విషయా లలో స్వతంత్రులు కావాలని ఆయన ఉద్దేశ్యము ప్రజలు ఆయన కిచ్చిన 'మహాత్మా' అనే బిరుదు సార్థకము.

## రాక్షస ప్రభుత్వము

జలియన వాలాబాగ్‌లో జరిగిన హత్యాకాండ సంఘటన మహాత్మాజీ హృదయంలో వేలకొలది తేళ్ళు కుట్టినంత వేదన కలిగింది ఆయనకు చాల కోపము వచ్చింది. జలియన్ వాలాబాగ్ హత్యాకాండ విచారణకు కాంగ్రెస్ తరపున ఒక సమితి నియమింపబడింది పండిత మోతీలాల్ నెహ్రూ, దేశబంధు చిత్తరంజన్‌దాస్, అబ్బాస్‌త్యాబ్జీ, బారిస్టర్ జయకర్, మహాత్మా గాంధీ మొదలైనవారు ఆసమితిలో సభ్యులు. గోషా స్త్రీలుకూడ నిర్భయంగా విశ్వాసంతో, గౌరవంతో గాంధీజీ ఎదుటికి వచ్చి సాక్ష్యం చెప్పేవారు, వారి సాక్ష్యం వలన గాంధీజీ ఈ ప్రభుత్వాన్ని 'రాక్షస ప్రభుత్వము' అని

కాక మరొక పేరుతో పిలవటానికి వీలులేక పోయింది. ఆ సమయంలోనే గాంధీజీ సహాయ నిరాకరణ శంఖాన్ని పూరించాడు.

1875 నుండి 1920 వరకు గల కాలఖండములో స్వాతంత్ర్యము కోసము చేయబడిన అనేక ప్రయత్నాల ఫలితంగా 1917 ఆగష్టు 20 వ తేదీ లార్డ్ మాంటేగ్యూ, స్వరాజ్య హక్కు మెల్లమెల్లగా క్రమానుసారము ఇవ్వబడుతు దని ప్రకటించాడు. ఈ క్రొత్త సంస్కరణ అమలులోనికి వచ్చినా, రాకున్నా ఈ ప్రణాళిక విషయంలో ప్రభుత్వముతో సహకరించవలెనా, లేదా అను విషయం మీద నాయకులలో రెండు వర్గాలు ఏర్పడినాయి. అతివాదులు, విప్లవకారులు ఈ సంస్కరణను మొదట్లోనే త్రోసి పుచ్చారు. కాని మితవాదులు, క్రొత్త జాతీయ నాయకుడు గాంధీజీ తమతో సహకరించగలరని ప్రభుత్వము ఆశించింది. కాని గాంధీజీ సహాయ నిరాకరణను ప్రకటించటంతోనే ప్రభుత్వానికి పెద్ద ఆశాభంగమైంది. దేశంలో సహాయ నిరాకరణోద్యమము సర్వత్రా సాగింది.

## సహాయ నిరాకరణ రణభేరి

1920 సంవత్సరము ఆగష్టు 1 వ తేది మహాత్మా గాంధీజీ ఈ నవీన యుద్ధపు రణభేరిని మ్రోగించాడు. 1920 సెప్టెంబర్‌లో లాలా లజపతిరాయ్ అధ్యక్షతన కలకత్తాలో ఒక మహాసభ జరిగింది. అక్కడ గాంధీజీ స్వయంగా సహాయ నిరాకరణ తీర్మానాన్ని ప్రవేశ పెట్టాడు. క్రొత్త సంస్కరణ అమలులోనికి తీసుక రావాలని కోరే చిత్తరంజన్‌దాస్ బిపిన్ చంద్రపాల్, మహమ్మదాలీ జిన్నా మొదలైనవారు ఈ తీర్మానాన్ని వ్యతిరేకించారు కాని హెచ్చుమంది బలపరచినందున ఆ తీర్మానము నెగ్గింది. తర్వాత గాంధీజీ దేశమంతా పర్యటించి సహాయ నిరాకరణ అంటే ఏమిటో ప్రజలకు తెలియ జెప్పాడు.

స్వరాజ్య ఆందోళనను ప్రతి పౌరుని చేరువకు తీసుకవెళ్ళే మహత్తర కార్యాన్ని గాంధీజీ సఫలతా పూర్వకముగా నిర్వహించాడు. "ఒక్క సంవత్సరములో స్వరాజ్యము"-ఇది ఆనాటి గాంధీజీ సినాదము ఈ లక్ష్య ప్రాప్తికి చేయవలసిన పనులు : గౌరవదాయకములైన పదవులను స్థానాలను వదలి పెట్టడం, స్థానిక స్వపరిపాలనా సంస్థలలో ప్రభుత్వము నియమించిన స్థానాలకు రాజీనామా ఇవ్వడం, ప్రభుత్వము జరిపే ఉత్సవాలలో పాల్గొనక పోవడం, ప్రభుత్వ సహాయము పొందే పాఠశాలలనుండి విద్యార్థులను వెలుపలికి రప్పించడం, కోర్టులకు ఎవ్వరుకూడ వెళ్ళకపోవడం, సేనలో చేరక పోవడం సహాయ నిరాకరణము సంపూర్ణంగా విలక్షణమైన, విప్లవాత్మకమైన ప్రయోగము. సహాయ నిరాకరణముతోపాటు స్వదేశీ కొరకు ఖద్దరు కుటీర పరిశ్రమలు వెలశాయి, సహాయ నిరాకరణానికి సత్యము, అహింస నియమాలు.

ఈ నూతన ఆందోళనకు దేశమంతా మున్నెన్నడులేని విధంగా తోడ్పడింది. స్త్రీలు, పిల్లలు, శ్రీమంతులు, పేదవారు; విద్యావంతులు, నిరక్షరాస్యులు; హిందువులు, హిందువులు కానివారు - సమాజమంతా ఒక్కటిగా గాంధీజీ వెనుక నిలచింది. తన, మన, ధనముల నర్పించే వ్యక్తులు వేల సంఖ్యలో ముందుకు వచ్చారు. ధనరాసులు కురిసాయి. కాని గాంధీజీ లోభ రహితుడు, సన్యాసి మనస్తత్వము కలవాడు; దరిద్ర నారాయణుడు. ఆయన ఉద్దేశ్యము జనసామాన్యములోని ప్రతి ఒక్క పౌరుడు ఉద్యమంలో పాల్గొనడం, ఈ యజ్ఞ వేదిక మీద ఆహుతి నర్పించడానికి ప్రతి ఒక్కరు కొద్దిగానే అయినప్పటికీ ఏదో ఒకటి చేయాలి. జన్మక్రాంతి యొక్క అపూర్వ యజ్ఞ మది. అందుకై లోకమాన్యుని పుణ్యస్మృతి కొరకు 'స్వరాజ్య ఫండ్' ప్రకటింపబడింది. గాంధీజీ ఇలా అంటాడు ?

"హిందూదేశానికి స్వరాజ్యము సిద్ధింప జేయడమే తిలక్‌జీకి నిజమైన స్మారక చిహ్నము. తిలక్‌జీ నుండియే నేనీ స్ఫూర్తిని గ్రహించాను. ఆ స్ఫూర్తాన్నే నేను నాశక్తి ననుసరించి ముందుకు తీసుకు వెళ్తున్నాను."

చూస్తూఉండగానే 125 లక్షల రూపాయల నిధి వసూలయింది. దేశంలో అపూర్వమైన ఉత్సాహం వ్యాపించింది. సహాయ నిరాకరణ అనే ఆయుధంతో ప్రజలు ప్రభుత్వశాసనాలను దెబ్బకొట్టారు. మరింతగా నిర్భయులైనారు.

"నేను చట్టాన్ని వ్యతిరేకిస్తాను ఈ చట్టము అత్యాచారపూరిత మైనది. దానిని నేను ముక్కలు చేస్తాను" అని బహిరంగంగా ప్రజలు చెప్పసాగారు. తిలక్‌జీ కృషి అంతా చట్టాలకు లోబడి జరుగుతుండేది. కాని ఇప్పుడు చట్టాలను భంగపరచడమే ఆయుధంగా మారింది. ఒక్క సంవత్సరములోపల సి. ఆర్. దాస్ మొదలైన వ్యతిరేకులుకూడ గాంధీజీకి మనఃపూర్వకంగా అనుయాయులైనారు

## యువరాజు స్వాగతముపై బహిష్కారము

ఇంతలో ఇంగ్లాండు యువరాజు హిందూదేశానికి రాబోతున్నాడని వార్త చేరింది. యువరాజు రాక బహిష్కరింపబడింది. ఈ బ్రహ్మాస్త్ర ప్రయోగంతో, యువరాజు బొంబాయిరేవులో దిగినప్పటినుండి, హిందుస్థాన్ వదలి వెళ్ళేవరకు యువరాజు కార్యక్రమాలన్నిటినీ ప్రజలు బహిష్కరించారు. ప్రతిచోట సంపూర్ణ హర్తాళ్ జరిగింది.

బొంబాయి హర్తాళ్ రోజున సంఘర్షణలు జరిగాయి. కుటిలురైన ఆంగ్లేయులు సంఘర్షణ అనే విష వృక్షానికి నీళ్ళుపోసి పెంచారు. శాంతి స్థాపనకు గాంధీజీ ఉపవాస దీక్ష ప్రారంభించాడు. అహింసా సుగంధాన్ని

ప్రజలకు పంచిపెట్టాడు. హిందు, ముస్లిము ఏకత్వాన్ని ఉభయ పక్షాలకు తెలియ జెప్పాడు.

ఇప్పటికి బహిష్కారమనే ప్రత్యక్ష కార్యాచరణ ప్రారంభమైంది. అయితే శాసనోల్లంఘన కార్యక్రమమింక ప్రారంభము కావలసి ఉంది అహ్మదాబాదు కాంగ్రెసు మహాసభలో శాసనోల్లంఘన తీర్మానము నెగ్గింది. ఈ ఆందోళనపై సంపూర్ణాధికారము గాంధీజీకి అప్పగించ బడింది.

## శాసనోల్లంఘనము—ఉపవాసము

బహిష్కార ఆందోళనతో ప్రభుత్వానికి కోపం వచ్చింది అహింసాత్మకంగా బహిష్కారము, హర్తాళ్ చేసే వారినికూడ ప్రభుత్వము పట్టి జైళ్ళలో వేయసాగింది. ప్రభుత్వ నిరంకుశ ప్రవర్తనను నిరసిస్తూ గాంధీజీ ప్రభుత్వానికి ఒక తీవ్రమైన లేఖ వ్రాసాడు. వారము రోజుల లోపల ఈ దమన విధానము మానకపోతే శాసనోల్లంఘన, బార్డోలీ జిల్లాలో పన్నుల నిరాకరణ ఉద్యమము ప్రారంభం కాగలదని హెచ్చరించాడు కాని ఈ వారం రోజుల లోపల ఉత్తర ప్రదేశ్‌లోని చౌరా చౌరీలో కొట్లాటలు జరిగాయి. ప్రజలు 21 మంది పోలీసులను నిలువునా దగ్ధం బెట్టారు

ఈ హింసాత్మక సంఘటన గాంధీజీ మనస్సును గాయపరచింది సహాయ నిరాకరణకు ప్రాతిపదిక అహింస. అదే ప్రజల మనస్సుకు రాకపోతే ఆందోళన కొనసాగించి నందున ఏమి లాభము? ఆయన వెంటనే ఆందోళనను ఆపివేశాడు బార్డోలీ పోరాటము జరుగనే లేదు దేశాన్ని మరల నిరాశామయ వాతావరణము ఆక్రమించింది

అనుకోని ఈ వెనుకంజతో మరల దేశములో అసంతృప్తి వ్యాపించింది, శాసనోల్లంఘనకు ప్రజలు సిద్ధమై నించారు, ప్రజలకు ప్రభుత్వానికి

మధ్య సంఘర్షణ ప్రారంభమయింది. ఏదో చిన్నకారణాన్ని సాకుగా తీసుకొని ప్రభుత్వము గాంధీజీని చెరసాలలో ఉంచింది. అక్కడికి వెళ్ళుతూ గాంధీజీ ప్రజల నుద్దేశించి ఇలా అన్నాడు-

"ఇప్పుడు మీరు నిష్క్రియులుగా, నిశ్చింతగా ఉండకండి. అలా ఉంటే, అది సర్కారువారి నిరంకుశ ప్రవర్తనకు దాసోహ మన్నట్లవుతుంది. కార్యక్రమాన్ని నిరంతరము సాగించండి. దానితో ఒక్క సంవత్సరములో దేశము స్వతంత్రమవుతుంది నా విడుదల స్వతంత్ర భారత్ ఆజ్ఞమీద జరుగుతుంది"

సహాయ నిరాకరణ ఆందోళన ఆగిపోయింది. కాని గాంధీజీ తేజోమయం చేసిన స్వాతంత్ర్య జ్యోతి మరింత కాంతివంత మయింది. నాయకత్వములేని ఆరు సంవత్సరాల కాలములో స్వాతంత్ర్య యుద్ధ రథము కేవలము అపయామల చేతనే లాగబడి, ముందుకు వెళ్ళడం కష్టమే ఈ కష్టాలకుతోడు ముస్లిము సమాజము తమ మతతత్వపూరిత, భారత వ్యతిరేక రాజకీయాలను మరల ప్రారంభించింది. కాంగ్రెసు రెండు భాగాలుగా చీలిపోయింది. స్వాతంత్ర్యోద్యమ నౌక కర్ణధారుడు లేకుండా ప్రయాణం సాగించింది

## "సామము" కాదు "శుద్ధ" సత్యాగ్రహము

ఈ ఆందోళనపటన విప్లవకారులలో ఒక విధమైన వ్యాకులత కలిగింది. సేనాపతి బాపట్ లాంటి విప్లవకారుడు 1924 అక్టోబరు 14 వ తేది పిస్తోలు చేతబట్టి బైలుదుండి బయటకు వచ్చాడన్నాడు. కేవలం అహింసాత్మక సత్యాగ్రహముతో న్యాయము స్వాతంత్ర్యము లభింప జాలవని ఆయన భావన ఆయన మాటల్లోనే చెప్పాలంటే, 'సామ' సత్యాగ్రహ బంధనాలు వదిలించుకొని ఆయన 'శుద్ధ' సత్యాగ్రహాన్ని చేపట్టాడు ఈ శుద్ధ సత్యాగ్రహ స్వరూపము ఇటువంటిది సేనాపతి బాపట్ ముఖ్యమైన ఐదుగురు సహచరులతో చేతిలో పిస్తోలు, కత్తి బాకు తీసుకొని 'హౌడ్' అను పేరుగల స్థానానికి వెళ్ళాడు అక్కడ వారు ములశీ వంతెనమీద పనిచేసే ఉద్యోగులను తీసుక వెళ్ళే రైలుబండి మీద

దాడిచేసారు బండినడిపే తెల్లడ్రైవరు సేనాపతి తూటాదెబ్బకు కూలిపోయాడు. ఈ వృద్ధ సత్యాగ్రహి స్వయంగా వెళ్ళి పోలీసులకు లొంగిపోయాడు.



సేనాపతి బాపట్ తుపాకి గుండుతో ఆంగ్లేయుడైన రైలుబండి డ్రైవరు కూలిపోయాడు.

---

సాధ్య, సాధకం స్వరూపాలు గుర్తించలేక, రాష్ట్రీయ కల్పనల విషయంలో విచక్షణ చూపలేక, నిర్మాణాత్మక నిర్మూలనాత్మక కల్పనల సత్యాన్ని గమనించలేక, విభ్రాంతిలో చిక్కుకున్న భారతీయ ప్రజలకు శాశ్వత సత్యాన్ని, విశుద్ధ రాష్ట్రీయతను, కర్తవ్యాన్ని బోధపరచి ఈ దేశంలో ఒక అతి విశాల సంఘటిత శక్తి నిర్మించే ప్రయత్నము ఒక మహనీయుడు చేసాడు ఆయన, ఇంకా వందనీయులైన ఇతరమహాపురుషులు చేసిన మహత్కార్యాలు ఈ పుస్తకముయొక్క ముందు అధ్యాయములలో మీకు పరిచయం చేస్తాము.

## పదునాల్గవ అధ్యాయము

# జాతి రుగ్మతకు అపూర్వమైన నిదానము

మహాత్మాగాంధీ నాయకత్వంలో సహాయ నిరాకరణ ఉద్యమం 1922 మధ్యభాగమువరకు చాల తీవ్రంగా సాగింది. అది ఒక అపూర్వమైన ప్రయత్నము. నాడు దేశంలో బ్రిటిషు ప్రభుత్వంపై ఎంతో అసంతృప్తి వ్యాపించి ఉంది. ఈ అసంతృప్తి మాటిమాటికి పొంగుతుండేది. దానితో బ్రిటిషు ప్రభుత్వము ఉలిక్కిపడి మేల్కొంటూ ఉండేది. ఈ నాటి వరకు ప్రపంచంలో స్వాతంత్ర్యము కోసము ఎన్నో అద్భుతమైన యుద్ధాలు జరిగాయి. కాని, భారత స్వాతంత్ర్య సంగ్రామము వాటన్నిటి కంటె శ్రేష్ఠతరమైనది. 1857 నుండి 1920 వరకు గల కాలఖండము స్వాతంత్ర్య సమరంలో ఉదాత్త ప్రవృత్తులను ఉన్నత స్థానానికి కొని పోయింది. స్వదేశాభిమానజ్యోతి దేదీప్యమానంగా వెలిగింది. ప్రపంచము లోని దేశభక్తు లెల్లరకు మార్గదర్శనం చేసే దీపస్తంభమై అది నిలిచింది. ఈ కాలఖండములో స్వదేశము కోసము సర్వస్వము సమర్పించడానికి ప్రజలు పోటీలు పడ్డారు. విదేశీశక్తి ఈ చైతన్యాన్ని అణచివేయడానికి

భయానకమైన అత్యాచారాలు చేసింది. ఈ అత్యాచారాలతో దేశభక్తులు పూర్తిగా నలిగిపోయారు. అయితే, ఆ స్వాతంత్ర్య యోధుల సాహసము అపారము. స్వాతంత్ర్యము సాధింపవలెనను వారి తీవ్ర ఆకాంక్ష అణచ బడేది కాదు. అది మరింత ఉధృతంగా పైకి లేచింది.

## ప్రతీకార శక్తిగా రూపొందిన అసంతృప్తి

ఈ సమరము రెండు విధాలుగాసాగింది- జాతీయకాంగ్రెసుద్వారా చట్టసమ్మతమైన రీతికోసు, విప్లవకారుల సాయుధ ప్రతిఘటనద్వారాను. సంఘటితమైన విప్లవ ప్రయత్నాలను అణచివేయటంతో బ్రిటిషు ప్రభుత్వము విజయాన్నిసాధించింది. విప్లవకారుల సంఘటన విచ్ఛిన్నం చేయబడింది. ప్రజలలోని సామూహిక సాయుధ విప్లవ భావన సాకారము కాలేకపోయింది. వ్యక్తిగత విప్లవ భావము నిర్వాణమయింది. సేనాపతి బాపట్ వంటి విప్లవ నాయకులకు దిక్కుతోచలేదు. ఆయన బుద్ధిపూర్వ కంగా శుద్ధ సత్యాగ్రహాన్ని చేపట్టాడు.

వాస్తవానికి 'సత్యాగ్రహ కల్పన విప్లవాత్మకమైనది. దేశంలో 1885 నుండి సాగుతూ వచ్చిన చట్ట సమ్మతమైన ఆందోళన క్రమంగా సత్యాగ్రహముగా పరిణామము పొందినది. లాల్ - బాల్ - పాల్ మూర్తిత్రయము ప్రయత్నాలద్వారా ప్రజాహృదయాంతో ఉత్పన్నమైన అసంతృప్తి ప్రతీకారశక్తిగా రూపొందింది. మహాత్మాగాంధీ స్వాతంత్ర్య యుద్ధానికి నాయకత్వంవహించారు. ఒక్క సంవత్సరములో స్వరాజ్యము సాధిస్తాను అని ఆయన చేసిన ఉద్ఘాటన అత్యద్భుతము. ఆయనమార్గము శాంతిమయము, అహింసాత్మకము.

సహాయ నిరాకరణ ఆందోళనను గాంధీజీ అకస్మాత్తుగా ఆపు చేశారు. దీనితో దేశంలో వైఫల్య భావన పెచ్చుపెరిగింది. సర్వత్ర

అసంతృప్తి, నిరాశలతో కూడిన వాతావరణం వ్యాపించింది. ప్రభుత్వము గాంధీజీని ఖైదు చేసింది. ప్రజల యెదుట ఎటువంటి కార్యక్రమమూ కూడా లేదు. అంతటా వ్యాకుల పరిస్థితి ఏర్పడింది.

ఈ గాఢాంధకారంలో డాక్టర్ కేశవ బలీరామ్ హెడ్గెవార్ అనే ఒక ద్రష్ట రాష్ట్రీయ స్వయంసేవక సంఘ రూపంలో ఒక అఖండ దీపాన్ని భారతభూమి హృదయ పీఠమైన నాగపూర్‌లో వెలిగించారు. ఆ కాంతిలో ఈ రాష్ట్రాన్ని చైతన్యవంతం చేసే మహాయజ్ఞాన్ని ప్రారంభించారు.

వాస్తవానికి డాక్టర్ హెడ్గెవార్ అలౌకిక ప్రతిభా సమన్వితుడగు మహాపురుషుడు. ఈ దేశానికి పరమ వైభవ స్థితిని కలిగించడానికి విశుద్ధ మైన ఆచరణతోను సునిశ్చితము, భ్రాంతిరహితము నయిన భావముల తోను కూడిన గట్టిపునాదిని నిర్మించడానికి ఆయన తన సంపూర్ణజీవితాన్ని ఆహుతిచేశారు. తాను గంధం చెక్కలాగా అనుక్షణము అరిగిపోతూ విశుద్ధ రాష్ట్రీకల్పనా సుగంధాన్ని దేశంలో నలువైపుల విరజిమ్మారు. నిజమైన రాష్ట్ర ధర్మాన్ని తన ఆహుతిలో చిరంతనంగా చైతన్యవంతం చేసారు.

## డాక్టర్‌జీ బాల్యము

డాక్టర్ హెడ్‌గేవార్ 1889 సంవత్సరము ఉగాదినాడు ఒక వేద విదుల వంశంలో జన్మించారు కుటుంబము పేదరికములో ఉన్నందున బాల్యములో డాక్టర్‌జీ ఎన్నో ఇబ్బందులు పడవలసి వచ్చింది. ఆయనకు కేవలం పన్నెండు సంవత్సరాల ప్రాయంలో ఆయన తల్లిదండ్రులు ఒకే నాడు దివంగతులైనారు ఈ ఆఘాతముతో ఆయన పరిస్థితి మరింతగా సంకటగ్రస్తమయింది అనేక విధాలైన కష్టాలను ఎదుర్కొనే శిక్షణ ఆయనకు ఆయాచితంగా లభించింది ఆయన పెద్దన్నగారు కుటుంబపెద్ద.

స్వభావ సిద్ధంగా ఆ సోదరులు కోపిష్ఠులు. కాని డాక్టర్‌జీ తన కోప స్వభావాన్ని మరొక మార్గానికి మళ్ళించాడు. శరీరము బలిష్ఠముకావడానికి ఆయన చిన్ననాటినుండి కృషి చేశాడు. పెద్ద అయిన తర్వాత తన జీవితాన్ని కేవలము రాష్ట్ర కార్యం కోసము అర్పింప వలసి ఉన్నది. అందుచేత ధృఢమైన శరీరము, మధురమైన స్వభావము ఆయన సంపాదించుకున్నాడు.

చిన్ననాటినుండి ఆయనకు స్వదేశముపట్ల ఎంతో ప్రేమ ఉండేది. "మనము పరాధీనులము. మనము స్వతంత్రులము అయి తీరాలి" అని ఆయన ధృఢంగా భావించేవాడు. దేశ స్వాతంత్ర్యము కోసము గొప్ప గొప్పవారు పెద్దపెద్ద ప్రయత్నాలు చేస్తుండేవారు. ఇది ఆయనకు తెలుసు తాను కూడ ఏదైనా చేయాలి అని ఆయన నిశ్చయించుకొన్నాడు.

ఆ పసితనములోనే మన దేశ దాస్యాన్ని పోగొట్టాలని ఆయన ఆలోచించాడు. నాగపూర్ కోటమీద ఆంగ్లేయుల "యూనియన్ జాక్" ఎగురుతూ కనిపిస్తుండేది. "ఇది ఆంగ్లేయులప్రభుత్వము ఇది ఆంగ్లేయుల జెండా." ఇంతకంటే ఆయనకు ఆంగ్లేయుల ప్రభుత్వము మరెక్కడకూద కనిపించలేదు. ఆ జండాను అక్కడనుండి లాగిపారేస్తే ఆంగ్లేయ ప్రభుత్వమే అంతరిస్తుందని ఆయన అనుకున్నాడు.

బాల్యావస్థకు తగినట్లుగానే ఒక ప్రణాళిక తయారయింది స్నేహితులతో కలిసి తాను చదువుకునే గదిలో నుండి కోటలోనికి పోవడానికి ఒక సొరంగము త్రవ్వడానికి మొదలుపెట్టాడు. కొన్ని దినాలు పని జరిగింది. ఇంట్లో పెద్దలకు అనుమానము వచ్చింది. రోజూ తలుపులు మూసివేసుకుని పిల్లలేమి చేస్తున్నారో అని గదిలోకి వెళ్ళి చూడగా అక్కడ ఒకవైపు మట్టిపోగు మరొకవైపు ఒక సొరంగముకనుపించాయి. వాళ్ళకు కోపము వచ్చింది. గద్దించి అడగగా వాళ్ళు ఉన్న దున్నట్లుగా విషయమంతా చెప్పారు. ఆ పథకము అంతటితో ఆగిపోయింది.

## విద్యార్థి లోకానికి సహజసిద్ధమైన నాయకత్వం

స్వాతంత్ర్యము కోసము ఆయన మనస్సులో ఎంతటి తీవ్రమైన ఆకాంక్ష! డాక్టర్‌జీ విద్యార్థిగా ఉండే రోజుల్లోకూడ విద్యార్థి లోకానికి సహజంగా నాయకుడైనాడు. ఆయన విద్యార్థిగా ఉన్నప్పటి సంఘటన: ఆంగ్లేయుల దమన నీతి తీవ్రంగా సాగుతున్నది. 'వందేమాతరం' అని నోరారా పలకడం కూడా నిషేధింపబడింది. విద్యార్థులలో జాతీయ భావన వ్యాపింపసాగింది. డాక్టర్ హెడ్గేవార్ స్వయంగా ఆ విషయంలో కార్యశీలుడైనాడు. విద్యార్థులలోని యీ భావనను అణచివేయడం ప్రభుత్వ విధానం. ఆ రోజుల్లో నీల్ సిటీ హైస్కూలులో డాక్టర్‌జీ చదువుతుండేవాడు. ఒక పర్యాయము విద్యాశాఖాధికారి అయిన ఒక ఆంగ్లేయుడు—ఈ విషయంలో పరిశీలన జరపడానికి ఆ స్కూలుకు వచ్చాడు. ఉపాధ్యాయులందరు విద్యార్థులు క్రమశిక్షణతో నడచుకోవాలని ముందుగానే హెచ్చరిక చేసి ఉంచారు డాక్టర్‌జీ తన స్నేహితులందరితో మాట్లాడి ప్రభుత్వ విధానానికి జవాబుగా ఆ అధికారిని మరొక రీతిలో ఆహ్వానించడానికి అంతా తయారుచేసి ఉంచాడు. సరిగ్గా 11 గంటలకు ఆ అధికారి వచ్చాడు. పర్యవేక్షణ ప్రారంభమైంది. డాక్టర్‌జీ ఒక్క 10వ తరగతిలోనికి ఆయన రాగానే అందరు ఒక్క గొంతుతో 'వందే మాతరమ్' అని నినాదము చేసారు. అధికారి కోపంతో అక్కడినుండి మరొక తరగతిలోనికి వెళ్లాడు. కాని అక్కడ కూడా అదేవిధమైన స్వాగతము లభించింది.

'వందే మాతరమ్' నినాదము చెవుల పడగానే ఆ తెల్ల అధికారి కోపంతో ఎఱ్ఱబడ్డాడు. తెల్ల అధికారి ఎదుట 'వందే మాతరమ్' అనడము రాజద్రోహము ఆంగ్లేయ రాజ్యంలో అదొక మహాపరాధము. ఈ అపరాధాన్ని చిన్న పిల్లలు, నిండు తరగతిలో తెల్లదొర సమక్షంలో చేసారు. ఎంత సాహసము ! ఆ తెల్ల అధికారి అవమానంతో పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ, ఏమీ మాట్లాడకుండా ఆ తరగతి నుండే గాక, పాఠశాలనుండే

వెళ్ళిపోయాడు. ఆ తర్వాత విచారణ ప్రారంభమైంది. ఓరప విద్యార్థి బృందానికి నాయకుడైన డాక్టర్‌జీ పాఠశాలనుండి వెళ్ళగొట్టబడినాడు.

డాక్టర్‌జీ దృఢవ్రతుడు. ఆయన చలించలేదు ఆయన నిశ్చయము సాహసము, ధైర్యము, దేశభక్తి అణుమాత్రమైన తరిగిపోలేదు. యవత్ మాల్ లోని రాష్ట్రీయ విద్యాలయములో ఆయన ప్రవేశించాడు. కాని దీనిని ప్రభుత్వము ఎక్కువ రోజులు జరుగనియ్యలేదు. అటు తర్వాత చదువుకోసము ఆయన పూనా వెళ్ళాడు. అమరావతి నుండి రాష్ట్రీయ విద్యాపీఠము పరీక్ష వ్రాసి, మెట్రిక్‌లో కృతార్థుడైనాడు.

పూనాలో చదువు పూర్తిచేసుకుని ఆయన నాగపూర్‌కు తిరిగి వెళ్ళాడు. ఇక్కడ విప్లవకారులతో ఆయనకు సన్నిహిత సంబంధము ఏర్పడింది. కుటుంబ పరిస్థితిదృష్ట్యా పెద్ద చదువులు చదవడం ఆయనకు సాధ్యపడలేదు. అయినప్పటికీ దేశకార్యము కోసము ఉన్నత విద్యను గడించడము అవసరమని ఆయన భావించాడు. ఆ రోజుల్లో కలకత్తా విప్లవకారుల కేంద్రంగా ఉండేద, డాక్టజీ తన పైచదువులకు కలకత్తాను ఎంచుకున్నాడు. దానికి ముఖ్య కారణము విప్లవకారుల సంఘటనకు సంబంధించిన విషయపరిజ్ఞానము సంపాదించవలెనను కోరిక మాత్రమే. ఆయన ప్రయత్నశీలుడైనాడు. పిల్లలకు చదువుచెప్పి కొంత డబ్బు కూడబెట్టుకొని పైచదువులకై కలకత్తాకు ప్రయాణమైనాడు.

## అనుశీలన సమితిలో సభ్యత్వం

అరవిందయోగి మొదలైనవారు ప్రారంభించిన కార్యములో ప్రత్యక్షంగా పాల్గొనడం డాక్టర్‌జీ కోరిక. కలకత్తాకు వెళ్ళిన తర్వాత ఆయన అక్కడ అనుశీలన సమితి ప్రతిజ్ఞ స్వీకరించి దానిలో సభ్యుడై నాడు. ఆ ప్రతిజ్ఞా స్వీకార కార్యక్రమము ఎంతో ఉగ్రంగా, గంభీ

రంగా ఉండేది. కాళీమాత సమ్ముఖంలో హవనం, పూజ చేసి మోక ళ్లి తలమీద కత్తి, భగవద్గీత ఉంచుకొని ప్రతిజ్ఞను ఉచ్చరించాలి. దృఢంగా, స్థిరంగా, గంభీరంగా తీసుకునే ఈ దేశ సేవా ప్రతిజ్ఞ మహోగ్రమైనది. తాను ఈ ప్రతిజ్ఞను పాటించకపోతే బ్రాహ్మణుల, మాతాపితరుల, దేశంలోని సమస్త దేశభక్తుల శాపముచేత దగ్ధమై, భస్మమై నాశనమౌతాను అని చెప్పి, వందే మాతరమ్ అని భారతమాతకు జేజేలు పలికేవారు.

ప్రతిజ్ఞా స్వీకారము అయిన తర్వాత ఒక్కొక్కరికి ఒక్కొక్క మారుపేరు ఇవ్వబడేది. డాక్టర్‌జీ రహస్య నామము 'కోకెన్'.

డాక్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడైన తర్వాత కొన్నాళ్ళు కలకత్తాలోనే ఉండి, నాగపూర్‌కు తిరిగి వచ్చాడు. కుటుంబ దారిద్ర్యము వలన ఆయన తప్పనిసరిగా ధనసంపాదన చేయవలసి ఉన్నది. ధనసంపాదనకు మంచి వీలు కూడ ఉంది. అవసరమూ ఉంది. కాని మాతృభూమి దాస్యవిముక్తి, స్వాభిమానయుతము సామర్థ్య సంపన్నము అయిన సమాజ జీవన నిర్మాణము — ఈ రెండు పిలుపులు ఆయన చెవులలో నిరంతరము ప్రతిధ్వనిస్తుండేవి. సంసారిక జీవన బంధనాలను త్రెంచివేసి, ఆజన్మ బ్రహ్మచారిగా ఉండి రాష్ట్రసేవ చేసే కఠోర వ్రతాన్ని ఆయన స్వీకరించాడు. మాతృభూమి చరణాలలో సర్వస్వము అర్పించిన తర్వాత ఆయనకు తనదిగా మరేమీ మిగలలేదు.

నాగపూర్‌కు తిరిగివచ్చిన తర్వాత కొన్ని సంవత్సరాలు ఆయన విప్లవ కార్యంలో నిమగ్నుడైనాడు. ఈ విప్లవ ప్రయత్నాలు భావనాత్మకంగాను, రహస్యంగాను ఉండేవి. డాక్టర్‌జీ సూక్ష్మదృష్టికి ఈ ప్రయత్నాలలో బలహీనత కనిపించింది. కేవలము భావోద్రేకము కల్గించడం ద్వారా నిర్మాణమైనట్లు కనబడే శక్తి విద్యుల్లతలాగా తళుక్కుమని మెరిసి

మాయమౌతుందని ఆయన తెలుసుకున్నాడు. కార్యనిర్వహణలో ఆయన కనేకమైన అనుభవాలు వచ్చాయి. వీనిని గూర్చి ఆలోచించిన మీదట ఆయన ఒక నిర్ణయానికి వచ్చాడు. శక్తివంతమైన సంస్కారాలగూర్చి దేశభక్తికి స్థాయీస్వరూపము నిర్మించకుండా ఈ దేశంలోని క్లిష్ట సమస్యలు తొలగింపబడజాలవని ఆయన దృఢనిశ్చయము. నిస్వార్థము, అనుశాసనము, సమాజ జీవితములో నిర్మాణము కానిదే శక్తిశాలియైన పరకీయ ప్రభుత్వ శక్తిని ఎదుర్కొనే సామర్థ్యము ఏ సమాజములోను నిర్మాణముకాదు. సమాజములోని సర్వసాధారణ వ్యక్తిలో సమాజముపట్ల ఆత్మీయతా భావము లోపించినదని ఆయన అనుభవము వల్ల తెలుసుకున్నాడు. సమాజమంతా ఒడలెరుగని గాఢనిద్రలో మునిగి ఉంది. ఈ పరిస్థితిలో రాష్ట్రపునరుద్ధరణకు ప్రజలలో జాగృతి కలిగించడముఅవసరమని ఆయనగుర్తించాడు. విప్లవకారులకార్యక్రమాలుఉగ్రమైనవి. రహస్యమైనవి అయినందునను, వాని పరిణామాలు సహింపగల శక్తి సాధారణ వ్యక్తికి లేనందునను జనసామాన్యాన్ని ఆ కార్యంలో పాల్గొనజేయడం అసంభవమయింది. మరొక వైపున కాంగ్రెసు ఆంగ్లేయులపట్ల విధేయత చూపుతూ, ప్రతి సంవత్సరము మహాసభలు జరుపుతూ తీర్మానాలు చేస్తూ, వినతి పత్రాలు సమర్పిస్తూ ఒక పరిమితమైన పరిధిలో నడుస్తూ కూడ గొప్ప నాయకుల ఆధ్వర్యములో, ప్రజలలో చైతన్య నిర్మాణము చేసే సాధనముగా రూపొందింది. అందుచేత ఈ జన జాగరణ కార్యాన్ని చేపట్టి కాంగ్రెస్ వేదిక నుండి రాజకీయ రంగములో పనిచేస్తూ, ఆయన దానికి నాయకత్వము వహించాడు.

'స్వాతంత్ర్య' అను పేరుతో ఆయన ఒక దినపత్రికను నడిపాడు. సహాయ నిరాకరణ ఆందోళనలో పాల్గొని, డాక్టర్‌జీ కఠినకారాగారశిక్షను అనుభవించాడు. ఆసందర్భంలో కోర్టులో తనకార్యాన్ని సమర్థించుకుంటూ ఆయన చేసిన ప్రసంగము తీవ్రస్వాతంత్ర్య భావసమన్వితము.

కణకణలాడే నిప్పులాంటి ఆ వాఙ్మూలము వినగానే ఆ మేజిస్ట్రేటు "నేరముగా పరిగణింపబడిన మొదటి ఉపన్యాసముకంటె ప్రతివాది తనను సమర్థించుకుంటూ చేసిన ప్రసంగము మరింత రాజద్రోహకరమైనది" అని అన్నారు



సహాయ నిరాకరణ ఆందోళనలో పట్టుబడ్డ తర్వాత న్యాయాలయములో తన కార్యాన్ని సమర్థించుకుంటూ ఉపన్యసిస్తున్న డాక్టర్‌జీ.

ఖిలాఫత్, సహాయ నిరాకరణ ఆందోళనల పరిస్థితి చూచి డాక్టర్‌జీ మనస్సు బాధపడింది. ముసల్మానుల అరాష్ట్రీయ ప్రవృత్తి, ఆకాంక్షలు అడుగడుగునా అనుభవములోకి వచ్చాయి. ముసల్మానులను సంతోష పరచి, స్వాతంత్ర్య సమరంలో వారి సహకారం పొందడానికై రాష్ట్ర హితాన్ని బలిచేసి అయినా ముస్లిములను సంతృప్తిపరచే విధానాన్ని

కాంగ్రెసు తీసుకుంది. రాష్ట్ర జీవనాధారాన్ని గూర్చిన సుస్పష్టమైన పరిజ్ఞానము దానికి లోపించినట్లు తేటతెల్లమైంది.

డాక్టర్‌జీ 1915నుండి 1924 వరకు దేశంలో జరిగిన ఆందోళనలను, సంస్థలను పరిశీలిస్తూ, అధ్యయనం చేస్తూ, విమర్శించి చూస్తూ జాతి రుగ్మతకు నిదానాన్ని అన్వేషిస్తూ గడిపారు. ప్రత్యక్ష రాజకీయాలు, సాంఘిక కార్యకలాపాలు మొదలు విప్లవకారుల రహస్య కార్యక్రమాలవరకు ఆయన అత్యంత శ్రద్ధతో, పరిశ్రమతో, ఉత్సాహముతో పాల్గొన్నాడు. కాని వీటన్నిటిలో ఆయన నిశితబుద్ధికి సంతృప్తి లభించలేదు. ఫలితంగా, ఈ వివిధ కార్య విధానాలను, తన కీర్తి ప్రతిష్ఠలను ఒక మూలకు నెట్టివేసి ఆయన నూతనము, శాంతియుతము, రచనాత్మకము అయిన ఒక కార్యాన్ని నిర్మించ పూనుకున్నారు.

వార్తాపత్రికలు, ఉపన్యాసాలు, సంస్థలు, విప్లవాలు మొదలైన వాటికంటె ఒక్కొక్క వ్యక్తినే సంస్కరించి, అతనిలో పరివర్తన తెచ్చి ఆదర్శవాదిగా చేసి దేశవ్యాప్తంగా ఇటువంటి ఆదర్శవాదుల విశాల సంఘశక్తిని నిర్మించడమే నిజానికి ప్రధానమైన కార్యము అనే సత్యము ఆయనకు సాక్షాత్కరించింది. ఈ పనిని ఎంతో ధైర్యముతో, పట్టుదలతో, నిరంతరము, సమాజములో అటువంటి పరంపర నిర్మాణమగునంతవరకు, తరాల తరబడి చేయవలసిన ఆవశ్యకత ఉన్నది. ఆ పని చేయుటకు సుస్పష్టమైన రూపురేఖలు, ప్రణాళిక అవసరము.

## సంఘకార్య ప్రారంభం

తన సన్నిహిత పరిచయంలోనికి వచ్చిన విశాల మిత్రబృందముతోడి తన అనుభవము దృష్ట్యా ఆయన అంతఃకరణలో ఒక నూతన తత్వము ఆవిర్భవించింది. దేశాభిమానులు, విశ్వాసపాత్రులు నైన మిత్రుల అభేద్యతయే ఆ తత్వము. హృదయాలతో ఐకమత్య భావము

నిర్మాణమై ఒకరినొకరు స్వదేశ బాంధవులుగా భావిస్తూ, పరస్పరము ప్రేమించుకుంటూ ఉండటమే ఒక అమోఘమైన శక్తి. ఈ శక్తి యొక్క విరాట్ స్వరూప దర్శనం చేత దుర్బల రాష్ట్రము బలిష్ఠము కాగలదని తన అనుభవముచేత డాక్టర్‌జీకి విశ్వాసము కలిగింది.

ఒకసారి నిశ్చయానికి రాగానే, తన హృదయంలో జ్యోతి వెలుగగానే వెనువెంటనే డాక్టర్‌జీ కార్యసాధనకు ఉపక్రమించాడు. అది 1925 సంవత్సరము. విజయదశమి శుభముహూర్తాన నిరాడంబరముగా ఆయన రాష్ట్రీయ స్వయంసేవక సంఘాన్ని స్థాపించాడు. నలుగురైదుగురు స్నేహితులతో ఒక నిశ్చిత ధ్యేయాన్ని, ఒక నిశ్చిత మార్గాన్ని గ్రహించి ఆయన కార్యారంభము చేశాడు.

1925 వ సంవత్సరములో దేశము భ్రాంతిలో మునిగిఉన్న సమయంలో ఒక అచంచల సంకల్పంతో ఈ మహాయజ్ఞాన్ని డాక్టర్‌జీ ప్రారంభించాడు. ఒక జ్యోతితో మరొక జ్యోతిని వెలిగించడం, హృదయాలలో విశుద్ధ దేశప్రేమ కాంతులను విరజిమ్మడం—ఇంత సరళమైన సాధారణమైన కార్యక్రమమది. అయితే దానిని పట్టుదలతో చేయాలి. సూటిఅయిన ప్రశ్న—సరళమైన సమాధానము; స్పష్టమైన భావాలు—అసందిగ్ధమైన ప్రకటనము; గట్టి మనస్సు—నిశ్చితమైన మార్గము ఎక్కడకూడ భ్రాంతిలేదు తొందరలేదు. పిల్లిమొగ్గలు లేవు.

నేను భారత భూమిలో జన్మించాను. ఈ భూమి నాతల్లి. నా తల్లి వైభవముకోసము వెనుకంజ వేయక పోరాడటము నా కర్తవ్యము. రాష్ట్ర కార్యముకోసము ధనాన్ని వ్యయం చేయడం, కష్టాలను సహించడం దేశంలోని ప్రతి వ్యక్తికీ పవిత్ర కర్తవ్యమే—ఇలా అతి సరళమైనప్పటికీ హృదయాన్ని కదిలించే మాటలతో ఆయన తన భావాలను తనచుట్టుచేరిన యువకులకు వినిపించేవాడు. ఈ యువకు లందరు రోజూ కనీసము గంటసేపు ఒకచోట చేరేవారు. ఈ గంటలో దేశ కార్యాన్ని గూర్చి

మాత్రమే ఆలోచించేవారు. ప్రతివారు తమ స్నేహితులను అక్కడకు తీసుకువచ్చేవారు. డాక్టర్‌జీ మాటలు వారికి నచ్చాయి. ఆయన ప్రవర్తన వారిని ఆయన వైపుకు ఆకర్షించింది. ఈ విధంగా యువకులను ఒక్కొక్కరినిగా చేర్చి, వారిలో సంస్కారములతెచ్చి అతిరకాలములోనే ప్రజల గుర్తింపును పొందగలిగిన ఒక పెద్ద సంఘటనను డాక్టర్‌జీ నిర్మించారు నాగపూర్ నగరంలో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ ప్రధానము నిర్మాణము కాసాగింది. దీని ఉనికి ప్రజల అనుభవములోనికి రాసాగింది. సామర్థ్యముయొక్క వెలుగు, కన్నులలో నింపసాగింది.

## రెండు హృదయాల సంభాషణ

ఈ సంఘంలోని విశేషాలన్నీ అపూర్వమైనవి. దీనికి లిఖిత పూర్వకమైన నిబంధనావళి ఉండేదికాదు. దీనివద్ద ఎటువంటి ధనసంపద లేదు. ఈ సంఘంలోని స్వయంసేవకులు బ్యాడ్జీలు ధరించి ఏ మహాసభలకు, ఉత్సవాలకు వెళ్ళేవారుకాదు. ప్రజలకు ఆశ్చర్యముగా ఉంది. హృదయాల పరస్పర సంభాషణ అర్థంకాని సామాన్య జనులకు "ఇందులో ఏదో రహస్యము ఉండితీరాలి" అని అనిపించింది. ఇంతేగాక ఈసంఘమునకుపేరు రాష్ట్రీయ స్వయంసేవక సంఘమని పెట్టారు. అయితే ముస్లిములను ఇందు లోనికి తీసుకోరు మరి ఇది రాష్ట్రీయ సంఘమెట్లు ఏవిధంగా అయింది అనికూడ కొందరనేవారు. డాక్టర్‌జీ బయలిచ్చే ఆటంకాలనులో పడలేదు. వ్యాఖ్యలు, విమర్శల ప్రభావాన్ని మనస్సుమీద పడనీయలేదు. తన పని తాను చేస్తూ ఉండేవారు.

యోగ్యములు సహజములు అయిన భావములను సత్యము ప్రాగీనము అయిన తత్వమును, స్వచ్ఛము సరళము అయిన మార్గమును ఆయన ప్రతిపాదించారు "నేను సమాజము కోసము" అనే భావాన్ని మరచి "నాకోసము సమాజము" అనే భావాన్ని అంటి పట్టుకొన్నాము కనుకనే మనము పరాధీనులమైనాము అని డాక్టర్‌జీ సరిగా గుర్తించారు.

జాతి దుర్గతకు ఆయన కనుగొన్న అమోఘమైన నిదానమిదే. ఒక్కొక్క వ్యక్తిలో ఈ సమష్టి భావన నిర్మాణము చేయడం కేవలము స్వాతంత్ర్య సంపాదనకే గాక, రాష్ట్రానికి శ్రేష్ఠ వైభవాన్ని సంపాదించడానికి కూడా ఏకైక మార్గము అని ఆయన విశ్వాసము. ఈ మార్గాన్ని అనుసరించి నడిచే రాష్ట్ర సేవకులు 'నేనూ, రాష్ట్రము ఒక్కటే' అని భావించి సమాజముతో తాదాత్మ్యము పొందుతారు.

## "స్వ" యొక్క గుర్తింపు

ఆ కాలములో స్వార్థ త్యాగ భావన విస్మృతంగాను, రాష్ట్రీయ భావన అస్పష్టంగాను, నిర్మాణాత్మక కార్య స్వరూపము విచిత్రంగాను తయారై ఉన్నది. స్వదేశము, స్వరాజ్యము స్వధర్మము వీనిలోని 'స్వ' నే మనము మరచాము. 'స్వ' విషయంలో మనస్సులో ఒక సంఘర్షణ యేర్పడింది.

డాక్టర్‌జీ మాటల్లో—

"ఒక ధర్మము, ఒక సంస్కృతి, ఒక విచారధార, ఒక పరంపర గల ప్రజలచేత రాష్ట్రము ఏర్పడుతుంది. వేర్వేరు ధర్మాలు, వేర్వేరు సంస్కృతులు, వేర్వేరు ఆచార విచారాలు గల ప్రజలతో ఒక రాష్ట్రము ఎలా ఏర్పడుతుంది? మన ధర్మము, సంస్కృతి రక్షింపబడాలి. మనము తలయెత్తుకొని ఇతరులతోపాటు తిరుగ గలగాలి. ఇందుకోసము మనకు స్వరాజ్యము కావాలి. ఈ హిందుస్థానము హిందువులది. ఇక ముందుకూడ ఇది అలాగే ఉండాలి."

## హిందుస్థానము హిందువుల రాష్ట్రము

రాష్ట్రసేవ విషయంలో ఆయన స్పష్టంగా ఇలా అనేవాడు. "రాష్ట్రంకోసము నేను ఇంతగా, ఈ విధంగా స్వార్థ త్యాగం చేసానని

కొందరు మహాగర్వంతో చెప్పుకుంటారు. ఈ విధంగా అనడంలో 'నేను' రాష్ట్రముకంటె వేరుగా ఉన్నాను. నాకూ రాష్ట్రానికి సంబంధము లేదు అని చెప్పినట్లే అవుతుంది. ఎవరైనా ఒకరు తన కుమారుని ఉపనయనానికి ధనవ్యయము చేసి 'చూడండి, నా కుమారునికోసము ఎంత స్వార్థత్యాగం చేశానో' అని చెపుతూ తిరిగినట్లుంటుంది. కాని ఈవిధంగా చెప్పేవారికి ఈ విషయమే గుర్తుకురాదు. ఈ విధంగా చెప్పడం మనకు సబబు అని పిస్తుందా? కుటుంబం కోసం చేసిన వ్యయము స్వార్థత్యాగము అనడానికి వీలులేనట్లే కుటుంబ రూపమైన రాష్ట్రసేవ చేయడానికి అయిన వ్యయము కూడ స్వార్థత్యాగ మనడానికి వీలులేదు. రాష్ట్రంకోసము ధనవ్యయము చేయడం, కష్టాలు సహించడం, ఆ రాష్ట్ర అవయవ స్వరూపుడైన ప్రతి వ్యక్తియొక్క పవిత్ర కర్తవ్యము మాత్రమే. ఇక్కడ స్వార్థత్యాగ మేది? రాష్ట్రము జీవిస్తూ ఉంటే, నేను, నా కుటుంబము జీవించి ఉండ గలుగుతాము! హిందూరాష్ట్రము మన రాష్ట్రము. దాని బాగోగుల పూర్తి బాధ్యత మనమీద ఉంది. ఈ విషయాన్ని గుర్తించి మనమంతా ఏకం కావాలి. రాష్ట్రంతో మనము తాదాత్మ్యము పొందాలి. దేశంలోని ప్రతి చిన్న, పెద్ద అంతఃకరణతోపాటు మనశరీరము కార్యనిమగ్నం కావాలి. స్వంత శరీరాన్ని గూర్చి ఎంతగా ఆలోచిస్తామో అదే విధమైన ఆలోచన దేశాన్నిగూర్చి, రాష్ట్రాన్ని గూర్చి మనము చేయాలి.

## సంఘము - సమాజము ఒక్కటే

'నేనూ, రాష్ట్రము ఒక్కటే' అనే భావనతో నిండి, విశుద్ధ దేశ సేవ కోసము తపించిపోతూ, ఒకచోట సమావేశమయ్యే స్వయంసేవకుల అనుశాసిత, ఏక సూత్రబద్ధ, అజేయ. అతులనీయ, చిరంతన సంఘ శక్తియొక్క పేరే రాష్ట్రీయ స్వయంసేవక సంఘ

సంఘము, సమాజము ఒక్కటే. సంఘమువేరు. సమాజమువేరు అను భావము యిక్కడలేదు. కనుక సంఘ కార్యానికి ప్రత్యేక అభిరుచి లేదు. సంఘకార్యము అఖండంగా సాగుతూ ఉంటుంది. ఈ కార్యము యొక్క ప్రగతి, పరిస్థితుల ననుసరించి ఉండవచ్చుగాని, ఈ కార్యము మాత్రము పరిస్థితులకతీతము, సార్వకాలికము. ఈ కార్యములో చాటుమాటు వ్యవహారమేమీ లేదు. రహస్యమేమీ లేదు. రాష్ట్ర జీవనాన్ని బలిష్ఠం చేయడమే సంఘ కార్యము.

## రాష్ట్ర ధర్మానికి గంగోత్రి

డాక్టర్ హెడ్గేవార్ సమాజాన్నంతా సంఘటితం చేయడానికి 1925 లో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ రూపంలో ప్రారంభించిన కృషి గంగోత్రిలాగా చాల చిన్నది. కాని ఇప్పుడది పవిత్ర గంగామాతవలె విశాల స్వరూపాన్ని ధరించింది. లక్షలాది యువకుల మనస్సులు విశుద్ధ సమష్టి భావనతో నిండిపోయినాయి. స్వదేశాన్ని గూర్చి, స్వధర్మాన్ని గూర్చి భ్రాంతి మూలకమైన భావాలు ఈ దేశంలో 1920 లో మొలకెత్తాయి. దాని ఫలితంగా ఈ ప్రాచీన హిందూ సమాజము నశించిపోయేట్లుగా తయారైంది. ఈ సంకట స్థితి డాక్టర్‌జీ అవతరింపచేసిన కార్యమువలన తొలగిపోయింది.

భారత స్వాతంత్ర్య సమరములో డాక్టర్ హెడ్గేవార్ యొక్క కార్యానికి అత్యంత ప్రముఖస్థానము ఉన్నది. ఆలయపు గోపురముమీద కలశము బంగారురంగుతో మిల మిలా మెరుస్తూ కనిపిస్తుంది. కాని పునాదిలోని ఇటుకలు ఎవరికీ కనిపించవు. ఈ రాష్ట్రాభ్యుదయానికి, ఈ సమాజోద్ధరణకు విశాలమైన పునాది రూపంలో డాక్టర్ జీ ఒక మౌలిక మైన కార్యాన్ని చేసారు. ఆయన హిందూ సమాజానికి, స్వసామర్థ్యము యొక్క అనుభూతిని కలుగ జేసారు. రాష్ట్రకల్పనలో ఏర్పడిన భ్రాంతిని

గూర్చి ఆయన సకాలములో దేశానికి హెచ్చరిక చేసారు. సరియైన నిర్మాణాత్మకమైన కార్యాన్ని గుర్తింపచేయడం ద్వారా ఈ రాష్ట్రాన్ని, దేశాన్ని సామర్థ్య సంపన్నముచేసే రాష్ట్రీయ స్వయం సేవక సంఘ స్థాపన చేసారు.

"పెద్ద నాయకుడు చెపుతున్నాడని గ్రుడ్డి నమ్మకముతో ఆయన వెంట వెళ్ళకండి. ఆయన మాటలను మీ బుద్ధి అనే ఒరపురాతిమీద గీచి చూడండి" అని ఆయన స్పష్టంగా చెప్పేవారు.

లౌకిక జీవనంలోను, రాజకీయ రంగంలోను, ప్రతియొక్కరు విశుద్ధ రాష్ట్రీయ సౌశీల్యముతోను, నిజాయితీతోను పనిచేయాలి. ఈ భావాల దీపకళికను వారు ఈ రాష్ట్రంలో వెలిగించారు.



## పదునైదవ అధ్యాయము

# స్వామి శ్రద్ధానంద ఆత్మాహుతి

శరీరములో గజ్జి, దురదలు ఏర్పడితే, అవి కేవలం పైపూతలకు తగ్గిపోవు; దానికి రక్తాన్ని శుభ్రపరచే మందు తీసుకోవలసి ఉంటుంది. సరిగా అదేవిధంగా రాష్ట్రోద్ధరణకు, పరతంత్రతావ్రణము మానిపో చేయడానికి మాటిమాటికి మందులు వేయడంతోపాటుగా, రాష్ట్రహృదయంలో ప్రసరించే 'స్వాభిమానము, రాష్ట్ర కల్పన అనే రక్తాన్ని శుద్ధి పరచడంకూడ అత్యంతావశ్యకము. ఆ రక్తశుద్ధికి మూలభూతమైన ఔషధము రాష్ట్రీయ స్వయంసేవక సంఘ రూపంలో ఈ దేశములో ప్రారంభమయింది. ముందు ముందు ఈ కార్య ప్రభావము మాటిమాటికి మన దృష్టికి గోచరిస్తూ ఉంటుంది.

## దేశంలో బ్రహ్మతేజము యొక్క ఆవశ్యకత

ఇప్పుడు మనం పరిశీలిస్తున్న ఈ కాలఖండము కీలకప్రాయమైనది. రాజకీయరంగంలో అనాడు అంధకారము ఆవరించి ఉంది. సామాన్యునికి ధైర్యానిచ్చే కాంతిరేఖ ఒక్కింతకూడ కనిపించడంలేదు.

మహాత్మా గాంధీ నాయకత్వంలో దేశము నడుస్తూ ఉంది. ఏనాడుకూడ కలియనంతటి జనశక్తి మహాత్మాగాంధీ అడుగుజాడల్లో ఏకత్రితమై నిలిచింది. శ్రీమంతులు, నిరుపేదలు, చదువరులు, చదువురానివారు - స్త్రీలు, బాలురు అన్ని వర్గాలు, అన్ని స్థాయిలకు చెందినవారు సమరాంగణములో వచ్చి నిలిచారు. స్వరాజ్యధ్యేయముతప్ప ఎవరికికూడ మరేమీ తోచటం లేదు. సహాయ నిరాకరణ అనే నూతనాయుధాన్ని గాంధీజీ ప్రయోగించబోతున్నాడు. ఇక కేవలము ఒక్క సంవత్సరములో ఏంచుం దేశానికి స్వాతంత్ర్యము తెచ్చి చూపించబోతున్నాడు - ఒక్క నెత్తుటి బొట్టుకూడ చిందకుండానే, మారణాయుధాలు ప్రయోగించకుండానే.

కాని, అమోఘము అపూర్వ శక్తిసంపన్నము అయిన ఈ అస్త్రాన్ని ఎంతో జాగరూకతతో ప్రయోగించవలసి ఉన్నది. కనుకనే సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గాంధీజీ నిలిపివేయవలసి వచ్చింది. అది ఒక బ్రహ్మాస్త్రము. ప్రజలలో బ్రహ్మతేజము ఉత్పన్నము కాకుంటే అది తిరిగివచ్చి మనలనే నాశనము చేస్తుంది. గాంధీజీ మహా ప్రతిభాశాలి అయిన ఋషి. ఆందోళన అపివేసినందున కలుగగల హాని తులనాత్మక దృష్టితో చూస్తే చాలా తక్కువ. అందువలన గాంధీజీ నిర్భయంగా ఆత్మ విశ్వాసముతో ఆందోళన ఆపుచేసి, ఆటుపిమ్మట నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టాడు. స్వాతంత్ర్య యుద్ధముతోపాటు నిర్మాణ కార్యక్రమాన్ని శక్తివంతము చేయటము ముఖ్యమని గాంధీజీ భావించాడు. ఇటువంటి కార్యక్రమాల ద్వారా సమాజ సంస్కరణ చేయాలని గాంధీజీ ఆశయము. వయోజనవిద్య, ఖాదీ, అంటరానితనము నివారించడం, మద్యపాన నిషేధము, జాతీయ ఐక్యత, కుటీర పరిశ్రమలు, సూత్రయజ్ఞము మొదలైన అనేక కార్యక్రమాలను చేపట్టి, ఆయన గ్రామ గ్రామానికివెళ్ళి చైతన్య నిర్మాణము ప్రారంభించాడు.

## స్వరాజ్య పక్షస్థాపన

ఆ సమయంలో మహాత్మాగాంధీ స్వరాజ్య ఆందోళనను ఆపు చేసి ప్రజాచైతన్య నిర్మాణానికి మరొక ఉద్యమాన్ని ఒక్కసారిగా ప్రారంభించడము ఆయన సహచరులకు ఇష్టం లేకపోయింది. దేశబంధు చిత్తరంజనదాస్, పండిత మోతీలాల్ నెహ్రూ వంటి సహచరులు గాంధీజీని విమర్శింప సాగారు. వారు స్వరాజ్యపక్షాన్ని స్థాపించి స్వరాజ్య ఆందోళనను కొనసాగింపదలచారు. 1923 ఎన్నికలలో ఈ స్వరాజ్య పక్షము తన ప్రతినిధులను నిలువబెట్టి మహత్తర విజయాన్ని సాధించి కౌన్సిల్‌లో ప్రవేశించింది.

కేంద్ర శాసన సభకు ఎన్నుకొనబడిన వీరు మరికొందరు స్వతంత్ర సభ్యుల సహాయంతో అధిక సంఖ్యను సంపాదించుకొని, ఆ బలంతో ఒక తీర్మానాన్ని ఆమోదింపజేశారు. ఆ తీర్మానము ఈ క్రింది విధంగా ఉంది.

"1919 చట్టాన్ని పునరాలోచించడానికి గవర్నర్ జనరల్ వెంటనే అవసరమైన చర్యలు తీసుకోవలసింది. రాజ్యాంగంలో అవసరమైన నూతన సంస్కరణలు చేయుటద్వారా భారతదేశానికి సంపూర్ణ స్వరాజ్యము ఇప్పించవలసింది."

పై తీర్మానము కేంద్ర శాసన సభలో నెగ్గింది. కాని తీర్మానంలో పేర్కొనబడిన కోరికలను ప్రభుత్వము త్రోసిపుచ్చింది. మహాత్మాజీ అనుమానము నిజమైంది కౌన్సిల్‌లో ప్రవేశించడానికిముందు మోతీలాల్ నెహ్రూ, దేశబంధుదాస్ మొదలగు వారితో మహాత్మాజీ "మీ కౌన్సిల్ వ్యామోహము వృథా, కాంగ్రెస్‌కు కౌన్సిల్‌లో అధికసంఖ్య వచ్చినప్పటికీ దానికోరిక త్రోసిపుచ్చడానికి ప్రభుత్వము వెనుకాడదు. నాకు ప్రభుత్వ ఉద్దేశము చక్కగా తెలుసును" అని స్పష్టంగా చెప్పాడు.

నెహ్రూ, దాస్ మొదలగువారి యీ అపజయమువలన ప్రజలలో వైఫల్యభావన వ్యాపించింది. కాని గాంధీజీ ఈ సమయంలో వారికి, ప్రజలకు ధైర్యముచెప్పి నిర్మాణాత్మక కార్యాలను తీవ్రతరం చేయవలసిందని సలహా ఇచ్చాడు. రానున్న అపూర్వ యుద్ధానికి ప్రజాహృదయాలలో అవసరమైన విప్లవభావనలోనను, నిర్మాణాత్మక కార్యాలవైపు తమదృష్టిని పూర్తిగా కేంద్రీకరింపవలసి ఉన్నదని ఆయనకు తోచింది. దేశబంధుదాస్ ప్రభృతులకు కూడ తమ కార్యములో అపజయము మనస్సుకు వచ్చింది. కౌన్సిల్‌లో అవరోధము కల్పించే విధానాన్ని వారు స్వీకరించారు. ప్రభుత్వముచేసే చెడ్డపనులన్నిటినీ వారు బయటపెట్టడం ప్రారంభించారు. అభివృద్ధి నిరోధకమైన శాసనాలను వారు కౌన్సిల్‌లో నెగ్గనిచ్చేవారుకాదు. అప్పుడప్పుడు ప్రభుత్వ తీరును నిరసిస్తూ సభనువదలి వెళ్తూఉండేవారు. కౌన్సిల్‌లోని ఈ సహాయ నిరాకరణతో ప్రభుత్వము విసిగిపోయింది. ప్రజలకు ఒక విధమైన ధైర్యము వచ్చింది. ఇంతలో దేశబంధుదాస్ దివంగతుడైనాడు. కౌన్సిల్‌లో ఒక సమర్థుడైన యోధుని దేశము కోల్పోయింది.

## స్వామి శ్రద్ధానంద హత్య

ఈ అఘాతమునుండి దేశము కోలుకొనేలోపల మరొక అఘాతము వచ్చిపడింది. దేశంలో ముసల్మానులు కొట్లాటలు ప్రారంభించారు. మలబార్‌లో మోప్లాలు జరిపిన దౌర్జన్యాలు, కొట్లాటలలో పశుత్వం, మతమౌఢ్యము, క్రూరత్వము చరమస్థాయి నందుకున్నాయి. ఆటు తర్వాత అబ్దుల్‌రషీద్ అనే ఒక యువకుడు పూజనీయ స్వామి శ్రద్ధానందను పట్టపగలే హత్యచేశాడు. ఏదో చర్చచేయాలనే నెపంతో అతడు స్వామీజీ వద్దకు వెళ్ళాడు. నిరామయుడు, తపస్వి, జ్ఞానదాత

అయిన స్వామీజీని అతడు పిస్తోలుతో కాల్చి చంపాడు. స్వామీజీ శాంతంగా, ఈశ్వరుని పిలుపు వచ్చిందని భావించి తనను హత్యచేయ



స్వామి శ్రద్ధానందపై పిస్తోలు ప్రయోగిస్తున్న అబ్దుల్ రషీద్

వచ్చినవానికి నమస్కరించి మృత్యువుకు లొంగిపోయాడు ఆయన రక్తనాళాలనుండి వెచ్చని నెత్తురు ప్రవహించి మాతృభూమి ఒడిని తడిపి ధన్యమైంది. స్వామీజీ హుతాత్ముడైనాడు. దేశసేవ చేస్తూ ఆయన అమరత్వాన్ని పొందాడు. కాని ఈ మరణము స్వాభావికము కాదు. ఇది ఖూనీ. ఒక రాక్షసుడు బుద్ధిపూర్వకంగా ఈ హత్య చేశాడు. ఆ యువకుడు పిచ్చివాడు కాదు. ఒంటరిగాడు కాడు. అతని వెనకాల బ్రిటిషు ప్రభుత్వముంది, అతని వెనకాల హిందువులపట్ల ద్వేషమనే విషముతో నిండిన ఒక ముసల్మాను వర్గముంది. అతని వెనకాల రాష్ట్ర విద్రోహకర శక్తుల విషవల్లరి ఉంది. స్వదేశము, స్వధర్మము అను మూల

తర్వాతనుండి స్వాతంత్ర్య యుద్ధము పతనము రావడానికి బ్రిటిషు ప్రభుత్వము పన్నిన కుట్రలో భాగమది.

## శ్రద్ధానందజీ మహత్కార్యము

స్వామి శ్రద్ధానంద ఆర్యసమాజములో ఒక నిష్ఠావంతుడైన కార్యకర్త గురుకుల విశ్వ విద్యాలయ స్థాపకుడు. ఆయన జన్మస్థానము పవిత్రభూమి అయిన పంజాబు. విద్యాభ్యాసము కాశీలో. విద్య పూర్తి అయినతర్వాత ఆయన లాహోర్‌లో న్యాయవాదవృత్తిని స్వీకరించాడు. స్వామి దయానందయొక్క అలౌకిక వ్యక్తిత్వము, విశుద్ధ తత్వజ్ఞానము శ్రద్ధానందమీద చెరగని ముద్ర వేశాయి. ఆయన ఆర్య సమాజ కార్యము నిమిత్తము తనను తాను అర్పించుకున్నాడు.

హిందూ సమాజముయొక్క కలుషిత స్వరూపాన్ని కడిగివేసి; తేజోమయ స్వరూపాన్ని ప్రాప్తింపచేయడానికి ఆర్యసమాజము స్థాపింప బడింది. ఆర్యసమాజ స్థాపకుడు స్వామీ దయానంద సరస్వతి సంస్కృత భాషలో గొప్ప విద్వాంసుడు వేదవిద్యలో ఉద్దండుడైన పండితుడు. జ్ఞానప్రసారము, సమాజకార్యము-ఈరెండు కావ్యాలను స్వీకరించి ఆయన దేశంలో వీనికి హిమాలయము వంటి ప్రచండ స్వరూపాన్ని సంపాదింపజేసాడు. స్త్రీ విద్య, విధవా వివాహము, అనాధ సంరక్షణ, ఆధునిక విద్యాప్రసారము-ఇది ఆయన కార్యస్వరూపము, స్వామి శ్రద్ధానంద ఆ కార్యంలో నిమగ్నుడైనాడు.

స్వామి శ్రద్ధానంద ధీరుడు, గంభీరుడు, భయరహితుడు, రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా సాగిన ఆందోళనలో ఢిల్లీలో ఒక పెద్ద ఊరేగింపు జరిగింది. ఆ ఊరేగింపుమీద కాల్పులు జరపడానికి ప్రభుత్వాధికారులు తుపాకులు గురిపెట్టారు. అప్పుడు స్వామీజీ ముందు నిలిచి సాయుధ సైన్యాన్ని ఆపివేసాడు. జనసమూహమంతా అక్కడినుండి కదిలివెళ్ళేవరకు

ఆయన నిర్భయంగా అక్కడే నిలబడినాడు. స్వామీజీ హిందువైనప్పటికీ అన్నిమతాలవారిచేత మహాత్ముడుగా గుర్తింపబడినాడు. అందువలననే ఢిల్లీలోని జుమ్మామసీదులో ప్రార్థనానంతరము ఉపన్యసించడానికి ఒకసారి ఆయనను ఆహ్వానించారు. ఇతర మతాలలోనికి మారిపోయిన హిందువులను శుద్ధిచేసి, మరల హిందువులుగామార్చే కార్యాన్ని ఆయన ప్రారంభించాడు. పాదుషాల పాలన కాలములో హిందువులుగాఉంటూ, బలాత్కరింపబడి ముస్లిములుగా మార్చబడిన ఢిల్లీ పరిసరాలలోని వేలాది రాజపుత్రులకు ఆయన శుద్ధి జరిపించాడు. ఆయన మలబార్‌కు వెళ్ళి అక్కడకూడ అనేకులకు శుద్ధి సంస్కారము జరిపించాడు.

## రాష్ట్ర వ్యాప్తంగా శుద్ధి ఉద్యమము

"శుద్ధికరణ" ఉద్యమమును స్వామీజీ ఉన్నతంగా సాగించారు. స్వాతంత్ర్య సమరంలో ఇది ఒక భాగమే. ముస్లిముల రాజకీయ దాస్యముతోపాటు మత విషయిక దాస్యముకూడ మోపబడి ఉన్నది. వీరంతా మొదట్లో హిందువులే. కాని, ముసల్మానులుగా మార్చబడినారు. వారు శుద్ధి సంస్కారము పొంది మరల హిందువులైనారు, నిజమైన రాష్ట్రీయులైనారు. అనగా ఇక్కడి రాష్ట్రీయ స్వరాజ్య ఆందోళనలో తన మన ధన పూర్వకంగా ఉత్సాహంతో పాల్గొన గలుగుతారు. మన స్వాతంత్ర్య సమరము స్వరాజ్య, స్వధర్మ విముక్తి నిమిత్తమే కదా!

స్వామి శ్రద్ధానంద ప్రారంభించిన రాష్ట్ర వ్యాప్తమైన శుద్ధి ఉద్యమము ముస్లిములకంటె బ్రిటిషువారికి ఆందోళన కలిగించింది. బ్రిటీషు ప్రభుత్వము ఈ దేశంలో ముస్లిము వర్గతత్వాన్ని సృష్టించి పెంచ నిశ్చయించుకుంది.

## వర్గతత్వ భూతము

ఈ కాలంలో మనదేశంలో ముస్లిము వర్గతత్వానికి బీజారోపణ జరిగింది. దాని చరిత్రను ఉల్లేఖించడం అవసరము. 1885 లో జాతీయ కాంగ్రెసు అంగ్లేయుల ప్రేరణచే స్థాపింపబడింది. దేశంలోని అసంతుష్టి ఎప్పటికప్పుడు బయటికి వెళ్ళిపోవడానికి ఒక మార్గాన్ని ఏర్పాటు చేయదమనే ప్రభుత్వ పన్నాగము ఫలితమే ఆ సంస్థ. కాని, మొదటి సమావేశమునాటినుండియే 'హిందుస్థాన్ ఒక రాష్ట్రము' అను భావనమీద జాతీయ కాంగ్రెస్ తన లక్ష్యమును విధానమును నిశ్చయించుకుంది. చాల ఉత్సాహంతో, అన్నివర్గాలను, తెగలకుచెందిన ప్రజలను సంఘటితపరచే ప్రయత్నాలను ప్రారంభించింది. ఈ విషయము అంగ్లేయులకు కష్టాన్ని కలిగించింది. ఈ దేశంలో రకరకాలైన కలహాలు చెలరేగుతూ ఉంటే వారిరాజ్యము ఇక్కడ సుస్థిరంగా నుసాగలుగుతుంది. కాబట్టి వారు ఈ దేశాన్ని, ఇక్కడి సంస్కృతిని, సహనశీలమైన హిందు ధర్మాన్ని సూక్ష్మంగా అధ్యయనంచేసి, ఇక్కడి హిందూ ముస్లిము సమాజాల మధ్య శత్రుత్వము సృష్టించగలిగితే తమకు విజయము లభిస్తుందని నిశ్చయించుకున్నారు. వారు సర్ సయ్యద్ అహ్మద్‌ను తమ చేతిలోనికి తీసుకొని అతనిద్వారా ముస్లింలలో వర్గతత్వం అనే విషవల్లికి బీజారోపణము చేసారు. "ఈదేశంలో హిందువులు విద్యావంతులై పురోగమించారు. కాని, ముస్లిములు విద్యాహీనులై పోయారు. వాస్తవానికి ఈ దేశానికి ముసల్మాన్ నిజమైన యజమాని, నాయకుడు, పాదుషా. కాని, జాతీయ కాంగ్రెసు ప్రయత్నాల ద్వారా రాజ్యము వచ్చింది హిందువులకే గాని ముసల్మానులకు కాదు." - ఈ భావాలు ప్రచారము చేయబడినాయి. అంతే గాక జాతీయ కాంగ్రెస్ కోరికలమీద ప్రచ్ఛన్నమైన వర్గతత్వ దోషం ఆరోపించబడింది. 'హిందూస్థానంలో హిందువులు బహుసంఖ్యాకులు, ముస్లిములు అల్పసంఖ్యాకులు. కాబట్టి రాష్ట్రీయ అందోళన హిందువుల

ఆందోళనే. అది సఫలమైతే హిందుస్థానంలో హిందువుల రాజ్యము వస్తుంది'—అది ముస్లిములు భయపెట్టబడుతుండేవారు. జాతీయ కాంగ్రెస్ లోకి ముస్లిములు పోరాదని ప్రచారము చేయబడింది.

## అలీగర్ కుట్ర

ముసల్మాన్ సమాజములో నిర్మాణమై, బ్రిటిష్ ప్రభుత్వముచేత పోషింపబడిన వర్గతత్వమనే ఈ క్రొత్త మొలకకు ఎరువువేసి, నీళ్ళుపోసి పెంచే పని ఒక పథకం ప్రకారం సాగింది. అలీగర్ విశ్వవిద్యాలయము ప్రారంభింపబడింది. హిందువులపట్ల ద్వేషభావాన్ని నింపుకున్న మతోన్మాద ముసల్మాన్ యువకులు ఈ విశ్వవిద్యాలయములో తయారు కాసాగారు. ఈ ప్రయత్నాల కన్నిటికీ కీలకము ఈ కళాశాల ప్రిన్సిపాల్ థియొడర్‌బెక్ చేతిలో ఉండేది. ద్వేషభావన అనే సారాయిని అయన వీరిచే పుష్కలంగా తాగించేవాడు.

1890 నుండి దేశములో ప్రారంభమైన మతకలహాలు, బెంగాల్‌ను విభజించి ముస్లిము ప్రాంతాన్ని వేరుచేసే ప్రయత్నము, ముస్లిములకు ప్రత్యేకమైన నియోజక వర్గాలు ఏర్పరచవలసిందని కోరడం - ఇవన్నీ ఈ ఆంగ్లేయుడు అలీగర్‌లో కూర్చొని చేయించినవే. 1906లో ముసల్మానుల స్వతంత్ర రాజకీయ సంస్థ 'ముస్లిములీగు' స్థాపించబడడము కూడ ఇతని ప్రేరణ వల్లను, వైస్రాయి ప్రోత్సాహము వల్లను జరిగింది.

లోకమాన్య తిలక్ చేతిలో ఈ దేశపు రాజకీయ సూత్ర మున్నంత వరకు అయన ఇక్కడి ముసల్మాను సమాజం పిచ విశ్వాసముంచి, జాతీయోద్యమంలో వారు పాల్గొనునట్లు చేయడంలో చాలవరకు విజయాన్ని సాధించాడు. సుప్రసిద్ధమైన లక్నో ఒడంబడిక వర్గతత్వానికి సమాధి

కట్టింది. కాని ఈ గోరీలోనుంచి వర్గతత్వ భూతము ఖిలాఫత్ ఆందోళన నిమిత్తము మరల తల ఎత్తింది. ప్రథమ ప్రపంచ యుద్ధంలో ఓడిపోయిన టర్కీమీద బ్రిటిషువారు భారత ముస్లిముల సంపాను పాటించకుండా కఠిన నిబంధనలను విధించారు. కాబట్టి మనదేశంలో ముస్లిములు ఖిలాఫత్ ఆందోళనను ప్రారంభించారు. ఉదార స్వభావుడైన మహాత్మాజీ ముసల్మానుల అవమానమే హిందువుల అవమానమని భావించి ఈ ఆందోళనలో సహకరించాడు. కాని ఈ ముస్లిము సమాజమే సహాయ నిరాకరణ ఆందోళనలో గాంధీజీని దగాచేసింది.

## సైమన్ కమీషన్ నియామకము

సహాయ నిరాకరణ ఉద్యమము విఫలమైనందున దేశంలో నలువైపుల అవ్యవస్థ ఏర్పడింది. ప్రతి వ్యక్తి తన ఇష్టప్రకారము నడచుకొనసాగాడు. ముసల్మానులు కొట్లాటలు ప్రారంభించారు. శాంతియుతంగా శుద్ధి సంస్కార కార్యాలు నిర్వహిస్తున్న స్వామి శ్రద్ధానంద ఈ వర్గతత్వముయొక్క పిస్తోలు దెబ్బకు మొదటి ఆహుతి అయినాడు. దేశభక్తులైన యువకుల హృదయాలలో జర జర నెత్తురు పరుగులిడ సాగింది.

1922 నుండి 1928 వరకుగల కాలఖండము చాల విచిత్రమైనది. ఈ కాలఖండములో కౌన్సిల్ లోపల స్వరాజ్యపక్ష కార్యక్రమము, వెలుపల మహాత్మాగాంధీ కార్యక్రమము, ఇదే చట్టసమ్మతమైన జాతీయ ఆందోళన స్వరూపము. ఈ ఆందోళన ఫలితంగా హిందుస్థాన్‌కు మరికొన్ని స్వరాజ్యాధికారాలు, కొన్ని రాజకీయ అధికారాలు ఇవ్వడానికి ప్రభుత్వము నిశ్చయించినట్లుగా లోకానికి చూపించడానికి, ఒక కమీషన్ నియమింపబడినట్లు ప్రకటింపబడినది. భారతదేశములో రాజ్యపద్ధతిని పరిశీలించి

బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన ఎంతవరకు అవసరము, సాధ్యము అను అంశముపై నివేదించడానికి సర్ జాన్ సైమన్ అధ్యక్షతన ఒక కమీషన్ నియమింపబడింది. ఈ కమీషన్‌లోని సభ్యులు ఏడుమంది కూడ యూరోపియన్‌లు అందుచే ఈ కమీషన్‌ను బహిష్కరించాలని దేశమంతా ఒక్క మాటగా ఘోషించింది.

ఈ ఉద్యమానికి నాయకత్వము యువకుడు పండిత జవహర్లాలు నెహ్రూ వహించాడు. పండిత్‌జీ రూపంలో ఈ దేశంలో నవచైతన్యము వ్యాపించింది. స్వతంత్ర సమరానికి ప్రగతి కలిగింది.



## పదునారవ అధ్యాయము

# విప్లవభానుడు భగత్ సింహ తేజోమయ బలిదానము

"ఒక్క సంవత్సరములో స్వరాజ్యము" అని మహాత్మా గాంధీజీ చేసిన ప్రకటన, ఆయన ప్రయోగించిన సహాయ నిరాకరణాస్త్రము విఫలమైనందున సామాన్యునికి దిగ్భ్రమ కలిగింది. ఈ ప్రకటన, ఈ అస్త్రము దేశంలో మున్నెన్నడు ఎరుగనంత రాజకీయ చైతన్యము కలిగించాయి మితవాదులనుండి అతివాదుల వరకు ప్రతివ్యక్తి మహాత్మాజీ వెనుక తన సంపూర్ణ శక్తితో నిలచాడు. కాని ఈ ఉద్యమము విఫలమైంది. ఈ ఉద్యమములోని అనేక కార్యక్రమాలు ఆచరణయోగ్యములు కావని ఆలోచనాపరుల మనస్సుకు వచ్చింది స్వరాజ్య పక్షము కౌన్సిల్‌లో ప్రవేశించి తన బుద్ధిని, శక్తిని అనుసరించి బ్రిటిషు ప్రభుత్వాన్ని ఎదుర్కొనడానికి పూనుకున్నది డాక్టర్ హెడ్గేవార్ తన సూక్ష్మ దృష్టితో దూరదృష్టితో భారతమాత వ్యాధి నిదానాన్ని గమనించి రాష్ట్రీయ స్వయంసేవక సంఘాన్ని స్థాపించి, హిందు సంఘటన పునాదిగా మూలభూతమైన

కార్యాన్ని ప్రారంభించాడు స్వామి శ్రద్ధానందజీ శుద్ధి కార్యము ప్రారంభించి దేశంలో బలత్కారము చేతగాని, మోసము చేతగాని ముస్లిములుగా మార్చబడిన హిందువులను శుద్ధిచేసి మరల హిందువులుగా మార్చడం ప్రారంభించాడు. శుద్ధీకరణ విశుద్ధమైన జాతీయోద్యమము, స్వాతంత్ర్య ప్రయత్నాలకు బలాన్ని చేకూర్చే ప్రయత్నమది. అందువలన దీని ఆందోళనను అణచివేయడానికి శ్రద్ధానందజీ హత్య జరిపించబడింది. దేశంలో ముస్లిములను రెచ్చగొట్టి వారు కొట్లాటలు సాగించడానికి పూనుకునేటట్లు చేయబడింది. విప్లవకారుల స్థితి చాల శోచనీయమై పోయింది.

ప్రథమ ప్రపంచ యుద్ధకాలమునాటి మంచి అదనును మనము కొంచెమైనా ఉపయోగించుకోలేక పోయాము. పై పెచ్చు వేలకొలదిమంది తమ సర్వస్వాన్ని ఆహుతి చేయవలసి వచ్చింది. ప్రతిభావంతులైన నాయకులు జైళ్ళలో యమయాతనలపాలు గావలసివచ్చింది. సాయుధ విప్లవ వైఫల్యము మనస్సులో గ్రుచ్చుకొనసాగింది ప్రజలపై అహింస, నిరాయుధ ప్రతీకారాల ప్రభావము హెచ్చైనందున, వారు విప్లవ కార్యాన్ని నీచదృష్టితో చూడసాగారు. కాని, పిస్తోళ్ల తాకిడికిగాని, విఫలత దెబ్బలకుగాని సాహసము జారవిడిచే వ్యక్తులుకారు విప్లవవీరులు. వారు స్వయంగా ప్రకాశించే దీపశిఖలు. విప్లవము అనగా జ్వలించే యజ్ఞ కుండము. ఎఱ్ఱని నాల్కలుచాస్తూ పైపైకి ఎగసే లావా ద్రవమది.

## రిపబ్లికన్ అసోసియేషన్

1922 నాటి ఈ విపరీత కాలఖండములో విప్లవంయొక్క అపజయమును, సహాయనిరాకరణ ఉద్యమముయొక్క ప్రభావమును అధిగమించే అపూర్వ ధైర్యమును ఇద్దరు భారతీయ విప్లవకారులు ప్రదర్శించారు. వారు 'హిందుస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్' పేరుతో భారతీయ

ప్రజాతంత్ర సమితిని స్థాపించి విప్లవాగ్ని కుండాన్ని మరల నూతనోత్సాహముతో ప్రజ్వలింపజేయసాగారు. వీరు శచీంద్రనాథ్ సన్యాల్, యోగేశచంద్ర ఛటర్జీలు.

ఈ ఇద్దరు అనేక కష్టాలు సహించారు. అనుశీలన సమితి కార్యము నిర్వహించే సమయంలో ఒకసారి యోగేశచంద్ర పెంటకోసుతో ముఖము పెట్టి కొరడాదెబ్బలు తినవలసి వచ్చింది. ఆ పైశాచిక అత్యాచారము మనస్సులో మెదలగానే శరీరము గగుర్పొడుస్తుంది. వీరు దేశంలో చైతన్య నిర్మాణానికి సాయుధ చర్యలు సాగింప నిశ్చయించుకున్నారు. చెల్లాచెదరై పోయిన విప్లవకారులను మరల ఒక్క త్రాటిమీదకు తెచ్చే ప్రయత్నంలో నిమగ్నులైనారు. వీరు 'బలరాజ్' అనే సంతకముగల ఒక అత్యంత ఉపద్రవకరమైన రహస్య పత్రాన్ని ప్రకటించి ప్రజలలో పంచారు. ఈ పత్రాన్ని చూడగానే బ్రిటిష్ ప్రభుత్వము నిద్రనుండి ఉలిక్కిపడి మేల్కొన్నది. ఈ దేశంలో విప్లవాగ్ని ఇంకను చల్లారి పోలేదు. ఈ విషయము బ్రిటిష ప్రభుత్వము దృష్టికివచ్చింది. ప్రభుత్వం తన కూటనీతిని ప్రయోగింప పూనుకున్నది.

## కాకోరీ ఉదంతము

ఇంతలో లక్నోకు ౮ మైళ్ళ దూరాన ఉన్న కాకోరీ అనే చిన్న స్టేషన్‌మీద దోపిడీ జరిగింది. వెళ్ళే రైలుబండి గొలుసులాగి నిలిపివేయబడింది. అది రాత్రివేళ. రైలుబండిలో ప్రభుత్వ ఖజానా ఉంది దాని కాపలాకు సాయుధ సైనికులున్నారు. కాని కేవలము ౧౦ మంది యువకులు ఆ ఖజానాను దోచుకున్నారు. తుపాకి కాల్పులకు జవాబు తుపాకి కాల్పులతోనే యిచ్చారు. పది నిమిషాలలో డబ్బుసంచులతో ఆ యువకులు వెళ్ళిపోయారు.

ఆ యువకులు మామూలు వ్యక్తులు కారు. భారత ప్రజల ధనరాసులన్ను తుడిచిపెట్టి దోచుకువెళ్ళే ప్రభుత్వ రూపంలో ఉన్న దోపిడి గాండ్రకు వారు అంతకులు వారు గొప్ప దేశభక్తులు. విప్లవ సైనికులు. వీరి మొదటి దాడి సఫలమైంది. కాని కొద్దిరోజుల్లోనే ప్రభుత్వము 40 మంది వ్యక్తులను బంధించి వారిపై కేసు నడిపింది ఈ సందర్భంలో పైన చెప్పబడిన రహస్య పరపత్రము జపాన్‌లో ఉన్న రాసబిహారి బసు వద్దకు రహస్యంగా పంపబడుతుండగా పట్టుబడింది. ఇందువలన ప్రభుత్వానికి 'హిందుస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్' కార్యక్రమము తెలియ వచ్చింది. శచీంద్ర సన్యాల్, యోగేశచంద్ర ఛటర్జీ, పండిత రామ ప్రసాద్ ప్రభృతులు 8 మందికి కఠిన శిక్షలు విధించబడినాయి. తొమ్మిదవ విప్లవకారుడు తప్పించుకున్నాడు అతడు అందరికంటె చిన్నవాడైనా మహా సాహసి. అతడు జ్వాలాభీలమైన అగ్ని. సాకార తేజః పుంజము ఈ తేజస్సుపేరు 'ఆజాద్'- చంద్రశేఖర ఆజాద్

## చంద్రశేఖర ఆజాద్

చంద్రశేఖర ఆజాద్ ఒక సామర్థ్యశాలి అయిన అద్భుతవ్యక్తి. అతడెవరు ? ఎక్కడివాడు ? అతని తల్లితండ్రులెవరు ? ఎవ్వరికీ తెలియదు. 1921-22 సహాయ నిరాకరణ ఆందోళనలో విద్యార్థులు మహోత్సాహంతో పాల్గొన్నారు. ఆ సమయంలో కాశీ సంస్కృత కళాశాల నుండి అతడు పట్టుబడి జైలుకు వెళ్ళాడు. పోలీసులు అతనిని అడిగారు - 'అబ్బాయి, నీపేరేమి ?' అని. ఆ యువకుని సమాధానము 'ఆజాద్' 'తండ్రిపేరు ?' 'స్వతంత్ర.' 'నివాసము ?' 'జైలుగది.' పోలీసులు అతనిని గట్టిగా 15 బెత్తము దెబ్బలు కొట్టారు. కోమలంగా, కేవలము పదునైదు సంవత్సరాల పసిప్రాయములో ఉన్న చంద్రశేఖర్ ఆజాద్ శరీరము ఆ దెబ్బలకు చీలి వ్రయ్యలైంది. కాని, అతడు హూఁ అనిగాని

అబ్బా అనిగాని అనలేదు. 'వందేమాతరమ్' అని మాత్రము అంటూ చివరకు మూర్ఛపోయాడు.

చంద్రశేఖర్ ఆజాద్ అద్భుత సాహసి. అతని మనోవేదన అపారము. కాశీలోనే అతనికి అమృతమయమైన విప్లవ మంత్రము లభించింది. విప్లవ శపథము తీసుకొని పర్వతములాగా నిలిచి విస్తృతమైన కార్యాన్ని నిర్వహించాడు. పెషావర్ నుండి రంగూన్‌వరకు నిప్పులు కురిపించే విప్లవ కరపత్రాలను ప్రసారము చేయడంలో చంద్రశేఖర్ ఆజాద్ ఎంతో నేర్పుచూపాడు. కాకోరి ఉదంతంలో చంద్రశేఖర్ చివరవరకు పట్టుబడలేదు. బ్రతికిఉండగా ప్రభుత్వానికి చిక్కను అని ఆయన ప్రతిజ్ఞ పూనాడు. చివరకు అది నిజమైంది.

ఇక మరొకప్రక్క కాంగ్రెసు మహాసభలు ప్రతి సంవత్సరము జరుగుతుండేవి. తీర్మానాలు చేయబడుతూండేవి. 1927 మద్రాసు కాంగ్రెసు మహాసభలో పండిత్ నెహ్రూ "సంపూర్ణ స్వాతంత్ర్యమే హిందుస్థాన్ ధ్యేయము" అను తీర్మానాన్ని ప్రతిపాదించగా అది అందరి ఆమోదముతో నెగ్గింది. ఈ తీర్మానముతో యావద్భారతదేశములో ఒక అపూర్వ చైతన్యము వ్యాపించింది. ఆనాటి నుండి పండిత జవాహర్‌లాల్ నెహ్రూ ప్రజలకు ప్రియతమ నాయకుడైనాడు.

## పండిత్ జవాహర్లాల్ నెహ్రూ

1889 నవంబరు 14వ తేదీన అతి సంపన్నమైన ఒక ఉన్నత వంశంలో పండిత జవాహర్లాల్ నెహ్రూ జన్మించాడు. లక్ష్మి, సరస్వతి సౌందర్యాధిదేవత ఈ కుటుంబానికి వరప్రదానము చేసారు. పండిత్‌జీ తల్లిదండ్రులు అసామాన్య సౌందర్యవంతులు, సౌశీల్యవంతులు, విద్యావంతులు. పండిత్‌జీ ఈ దేశ నేతృత్వము వహించడానికే జన్మించాడా

అనిపిస్తుంది. ఆయన ఇంగ్లాండులో విద్యనభ్యసించాడు. భారతదేశానికి తిరిగివచ్చిన తర్వాత తనంతటతానే స్వాతంత్ర్య సంగ్రామ రంగంలో దూకాడు 'స్వయమేవ మృగేంద్రతా'కై వ్యాయంచేత ప్రారంభమునుండే ఆయన నాయకుల శ్రేణిలోనికి వెళ్ళికూర్చున్నాడు.

మద్రాసు కాంగ్రెసు మహాసభలో పండిత్‌జీ స్వాతంత్ర్య తీర్మానాన్ని ప్రతిపాదించాడు. అది సర్వజనామోదాన్ని పొందింది. దానితో రాజకీయ ఆందోళనలో సంక్రమించిన ఉదాసీనత, విశృంఖలత్వము దూరముకాసాగాయి. యువకవర్గము ఉత్సాహంతో, సాహసంతో రాజకీయాలలో పాల్గొనసాగింది. ఆ కాలములో రష్యన్ విప్లవము, సమాజ వాదాల ప్రభావము యూరోపులో అధికంగా వ్యాపించి ఉన్నది. సమాజ వాదముయొక్క విప్లవభావాలు యువకులను తటాలున ఆకర్షిస్తుండేవి. ఆ కాలములో పండిత్‌జీ ప్రభావముచేత వాడవాడల 'యువజన సంఘాలు' 'స్వాతంత్ర్య సంఘాలు' స్థాపింపబడుతుండేవి. విప్లవకారులకుగూడ కొంత వరకు ధైర్యము చేకూరింది.

## ఢిల్లీలోని రహస్య సమావేశము

ఈ కాలములోనే ఢిల్లీలో యువక విప్లవకారులు ఒక రహస్య సమావేశము జరిపారు. ఈ సమావేశ స్థలము ఒక పాతకోట-ఫిరోజ్‌షా కోటలోని ఏకాంత ప్రదేశము. నాటి స్వాతంత్ర్య యుద్ధము, దివంగతులైన దేశభక్తులు సాక్షులుగా ఒక భయంకర యజ్ఞాన్ని ప్రజ్వలింప చేయడానికి ఒక ప్రణాళిక ఆ సమావేశములో తయారు చేయబడింది. ఆ సమావేశానికి పంజాబు, రాజస్థాన్, మధ్యప్రదేశ్, బీహార్ మొదలైన వివిధ ప్రాంతాలనుండి ప్రత్యేకంగా ఎన్నుకొనబడిన యువకులు వచ్చారు. చంద్రశేఖర ఆజాద్ ఈ సమావేశములో ప్రముఖుడే. కాని

మరొక యువకుని ప్రభావము ఈ సమావేశములో చరిత్రను సృష్టించింది. ఆ యువకుడు భగత్‌సింహ-సర్దార్ భగత్‌సింహ దత్త.

ఉదాత్త సౌశీల్యానికి, దేశ ప్రేమకు మూర్తిమంతమైన ఆదర్శము భగత్‌సింహ . మహారాజా రంజితసింహ యొక్క ఉన్నతవంశంలో జన్మించే భాగ్యము భగత్‌సింహకు లభించింది. భగత్‌సింహ జన్మదినము ఆ వంశానికే అదృష్టదాయకము. ఆనాడు ఆ వంశస్థుడైన స్వర్ణసింహ విడుదలయి వచ్చాడు. అతని తండ్రి నేపాల్‌నుండి తిరిగివచ్చాడు. ప్రసిద్ధుడైన అజిత్‌సింహ ఆనాడే మాండలే జైలునుండి విడుదల అయినాడు దేశభక్తి, ఆవేదన, విశుద్ధశీలము, ప్రభావ పూర్ణమైన వ్యక్తిత్వము భగత్‌సింహకు వారసత్వంగా సంక్రమించాయి. భగత్‌సింహ లాహోర్‌లో విద్యాభ్యాసము చేసాడు. పైన చెప్పబడిన సమావేశంలో పాల్గొనడానికి ఢిల్లీ వచ్చేనాటికి భగత్‌సింహ వయస్సు కేవలము 22 సంవత్సరాలే. కార్యశూరత ఆయన ముఖంలో ప్రస్ఫుటంగా ప్రకాశిస్తూ ఉంది. ఆయనతో బాటు ఆయనను ఎడబాయని స్నేహితుడు సుఖదేవ్ కూడ వచ్చాడు.

## స్వాతంత్ర్యసేన స్థాపన

ఢిల్లీ సమావేశంలో 'హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ, అను సమాజవాద ప్రజాతంత్రసేన స్థాపింపబడింది. ఒక వ్యక్తి మరొకనిని పీడించడాన్ని తుదముట్టించడము ఈ సంస్థయొక్క ఆశయము ఈ ప్రయత్నంద్వారా వేరు వేరుగా విప్లవకార్యంలో నిమగ్నమై ఉన్న సంఘటనలన్నీ ఒకటిగా కూర్చబడినాయి. విప్లవ ప్రయత్నానికి ఒక శాస్త్రబద్ధమైన పునాది చేకూర్చబడింది.

ఈ కాలంలోనే గుజరాత్‌లో సర్దార్ వల్లభాయి పటేల్ నేతృత్వంలో బార్డోలీ పన్నుల నిరాకరణ అనే అపూర్వమైన పోరాటము

సాగింది. అది విజయాన్ని సాధించింది. దేశంలో మరింత చైతన్యం కలిగింది రైతులు, కూలీలు, స్త్రీలు, యువకులు వీరంతా చైతన్య పూరితులై గట్టిపట్టుదలతో స్వాతంత్ర్య సమరాంగణములో దూకారు. 1928 ఫిబ్రవరి 8 వతేదీన తెల్ల జాతీయుల సైమన్ కమిషన్ భారతదేశానికి వచ్చింది. దేశమంతా ఆకమిషన్‌ను బహిష్కరించింది.

అక్టోబరు 20 వతేదీన ఈ కమిషన్ లాహోరు చేరింది. లాహోర్ అంటే భగత్‌సింహుని రాజధాని. అక్కడ జరిగిన హర్తాళ్ మున్నెన్నడు కని విని ఎరుగనటువంటిది. ఈ కమిషన్ బహిష్కారానికై సాగిన ఊరేగింపు అపూర్వమైనది. ఆ ఊరేగింపుకు ముందు ప్రాతః స్మరణీయులైన లాలా లజపతిరాయ్ నిలచారు. కమిషన్‌వచ్చే రైలుబండి స్టేషన్‌లోకిరాగానే 'సైమన్ వెనుకకు వెళ్లిపో' అనే నినాదాలతో ఆకాశము మార్మోగిపోయింది. పోలీసులు దారి ఖాళీచేయించడానికి ప్రజలను బెదిరించారు. కాని ఆ బెదరింపులను జనసమూహములోని ఒక్కరైనా లెక్కచేయలేదు. స్వయంగా పోలీసు సూపరింటెండెంటు స్కాట్, డి. యస్. పి. సండర్స్ అక్కడే నిలబడి ఊరేగింపు మీద లాఠీదెబ్బలు వేయవలసిందని పోలీసులకు ఆజ్ఞాపించారు. దారుణంగా లాఠీదెబ్బలు వర్షింపసాగాయి. కోలాహలము ఆరంభమైంది. లాలాజీకి నలువైపుల యువకులు కోటలా నిలచారు. అయితే నన్ను మిన్నెరుగని కోపంతో ఉన్మత్తుడైన సండర్స్ లాలాజీని కట్టితో మోదాడు. ఆ దారుణ ఘాతము లాలాజీకి మృత్యుఘాతమే అయింది. ఆ ప్రహారము లాలాజీ ప్రాణాలు తీసుకుంది.

## అద్భుతమైన ప్రతీకారము

లాల్, బాల్, పాల్‌లలో లాల్ స్వాతంత్ర్య యుద్ధంలో నేలకూలాడు. ఆయన బలిదానంలో భగత్‌సింహ, చంద్రశేఖర ఆజాద్ మొదలైన యువకులు చలించి మనస్కులైనారు. దేశ స్వాభిమానాని

అనుగుణంగా ఈ హత్యాకాండకు ప్రతిక్రియ చేయాలని నిర్ణయింపబడింది. ఒకే ఒక్క నెలతర్వాత లాలాజీ మొదటి మాసిక శ్రాద్ధమునాడు డి. యస్. పి. సండర్స్ పోలీసు స్టేషన్ ముఖద్వారం సమీపములో



లాలాజపతిరాయ్‌ని లాఠీతో కొట్టిన ఉన్మత్తుడు సండర్స్, భగత్‌సింహ పిస్తోలు దెబ్బకు కుక్కవలె మరణించాడు.

కుక్కచావు చచ్చాడు. భగత్‌సింహ, రాజగురు ఆజాద్ అతనిని కాల్చి చంపారు. ఈ దేశానికి అవమానము కలిగించేవారి గతి యేమవుతుందో ప్రపంచానికంతకూ తెలిసింది.

1929లో కలకత్తాలో కాంగ్రెసు మహాసభలు జరిగాయి. పండిత జవాహర్లాలు నెహ్రూ తండ్రి పం॥ మోతీలాల్‌జీ ఈ మహాసభకు అధ్యక్షత వహించాడు. 'అధినివేశ ప్రతిపత్తి' నుండి ముందుకువెళ్ళడానికి ఆయన ఇష్టపడలేదు. కార్యదక్షుడైన ఆయన కుమారుడు 'తండ్రిని మించిన కొడుకు' ముందడుగు వేసాడు. ఆ మహాసభలో భగత్‌సింహ కూడ ఉన్నాడు. సంపూర్ణ స్వాతంత్ర్యముగాని, అధినివేశ ప్రతిపత్తిగాని కావాలి అను సందిగ్ధ తీర్మానము ఆ మహాసభలో జవాహర్లాలుజీని తృప్తిపరచడానికై ఆమోదింపబడింది

## అసెంబ్లీలో బాంబు

కేంద్ర శాసనసభలో ప్రజాభీష్టాన్ని, ప్రజానాయకుల భావాలను లెక్కచేయకుండా 'పబ్లిక్ సేఫ్టీ బిల్లు' కార్మికవర్గాన్ని అణచివేసే 'ట్రేడర్స్ డిస్ప్యూట్ బిల్లు' అనే నిరంకుశము, ఘాతుకము అయిన రెండు శాసనాలను, వైస్రాయి తన విశేషాధికారాలు ఉపయోగించి ఆమోదింప జేయడానికి ఒక కుయుక్తి పన్నబడింది. ఈ ఉన్మాదానికి సమాధానము ఎలా చెప్పాలో విప్లవకారులకు అర్థంకాలేదు. బ్రిటిషువారి మనస్సులో భయాన్ని అంకురింపజేసేట్లు ఏదైనా చేయాలి అని కొందరు నిశ్చయించుకున్నారు. పార్లమెంటు భవనంలో బాంబు ప్రేలాల్చి అని నిశ్చయించుకున్నారు. సర్దార్ భగత్‌సింహ, బటుకేశ్వరదత్త-ఈ ఇద్దరు నాయకులు పిస్తోళ్ళు, బాంబులు తీసుకొని వెళ్ళి ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చున్నారు సుఖదేవ్, రాజగురు, ఆజాద్ ఇంకా ఇతర స్నేహితులు పూర్తిగా తయారయి ఉన్నారు. 1929 ఏప్రిల్ 8వ తేదీన, వైస్రాయి విశేషాధికారమువలన ఆ నిరంకుశ శాసనాలు ఆమోదింపబడినట్టు సర్ జాన్ షుస్టర్ ప్రకటించగానే భగత్‌సింహ, బటుకేశ్వరదత్త తమతమ స్థానాల్లో లేచి నిల్చున్నారు. వెంటనే భగత్‌సింహ, షుస్టర్ వెనకాల ఉన్న గోడమీదికి బాంబు విసిరాడు. బాంబు బ్రద్దలైన కర్ణకఠోర ధ్వనికి ఆ సౌధము దద్దరిల్లింది, కంపించిపోయింది. ఇంతలో బటుకేశ్వరదత్త తన బాంబును విసిరాడు దానితో అక్కడ కోలాహలము వ్యాపించింది. ప్రజలు చెల్లా చెదరుగా పరుగెత్తారు. అధ్యక్షుడైన విఠల్‌భాయి పటేల్, పం॥ మోతీలాల్ నెహ్రూ, మహమ్మదాలీ జిన్నా మాత్రము స్థిమితంగా కూర్చొని ఉన్నారు.

నల్లని పొగలుగ్రమ్మిన ఆ భవనము ఆ దేశభక్తుల తేజస్సుతో వెలిగిపోయింది. షుస్టర్ దిగ్భ్రాంతి చెంది నిలబడిపోయాడు. అంతలో

భగత్‌సింహ పిస్తోలునుండి రెండు టూటాలు దూసుకొనివచ్చి అతని డస్కుకు తగిలాయి. మస్టర్ కంగారుపడి అతి దీనుడై ఆ డస్కు క్రింద తల దాచుకున్నాడు. హోమ్ మెంబర్ ఆ శబ్దానికి భయభ్రాంతుడై క్రింద పడి మూర్ఛిల్లినాడు. ఆ తమాషా అంతా చూస్తూ చిరునవ్వుతో భగత్ సింహ, బటుకేశ్వరదత్త గ్యాలరీలో నిలబడ్డారు. 'విప్లవము వర్ధిల్లాలి' "వందేమాతరమ్" అని వారు నినాదాలుచేస్తూఉండినారు కొంచెముసేపట్లో ఇద్దరు తమంతతామే పోలీసులకు లొంగిపోయారు.

## చెరసాలలో యమయాతనలు

భగత్‌సింహను, బటుకేశ్వరదత్తును పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. విచారణ ప్రారంభమయింది. జైలులో వారిపట్ల అమానుషంగా ప్రవర్తింపసాగారు దీనికి నిరసనగా జైలులో సహాయ నిరాకరణము సత్యాగ్రహము చేయడానికి పిలుపు ఇవ్వబడింది. పండిత జవాహర్లాల్ నెహ్రూ చెరసాలకువచ్చి భగత్‌సింహ మొదలైనవారిని కలుసుకున్నాడు. ఇతరులు ఉపవాసాన్ని విరమించారు. కాని యతీంద్రనాథ్‌దాస్ ఉపవాస విరమణకు సిద్ధంగాలేడు ఆయన తన ఆత్మ బలిదానము ద్వారా విప్లవ కార్యాన్ని ఉత్తేజితం చేయడానికి, శక్తిశాలిగా చేయడానికి నిశ్చయించుకున్నాడు. చివరకు 1929 డిసెంబర్ 13 వ తేదీన 92 రోజుల ఉపవాసముతో యతీంద్రదాస్ అమరజీవి అయినాడు. ఆయన బలిదానానికి సుభాష్ చంద్ర బోస్ దుఃఖితుడైనాడు.

ఒక వైపు భగత్‌సింహపై అభియోగము నడుస్తూండగా మరొక వైపు పండిత జవాహర్లాల్, సుభాష్‌చంద్రబోసు మొదలైన యువక నాయకులు కాంగ్రెసును తమ నేతృత్వంలోనికి తీసుకరావడంతో విజయాన్ని పొందారు. 1929 లాహోర్ కాంగ్రెసులో సంపూర్ణ స్వరాజ్య తీర్మానము ఆమోదింపబడింది. ఈ మహాసభకు అధ్యక్షుడు పండిత జవాహర్లాల్

న్నాహులయే. సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము, కాంగ్రెసు కోర్కెలను మన్నించుటకు ప్రభుత్వానికి ఒక్కసంవత్సరము వ్యవధి నిచ్చి, అటు తర్వాత శాసనోల్లంఘన ఆందోళనను దేశవ్యాప్తంగా చేయవలెనని కార్యక్రమము ఆ మహాసభలో నిశ్చయించబడింది. శాసనోల్లంఘన ఆందోళనకు నాయకత్వము గాంధీజీకి అప్పగించబడింది. దేశంలో ఒక అద్భుత చైతన్యము ప్రసరింపసాగింది.

సెప్టెంబరు 16వ తేదీన భగత్‌సింహ కేసు విచారణ ప్రారంభమైనది. 1930 అక్టోబరు 7వ తేదీన స్పెషల్ ట్రిబ్యునల్ భగత్‌సింహ, సుఖదేవ్, రాజగురులకు బోస్టర్న్ జైలులో ఉరిశిక్ష విధించబడింది. మరి ఏడుగురికి ఆజన్మ కారాగార శిక్ష, ఒకనికి 7సంవత్సరాల శిక్ష, మరొకనికి 5సంవత్సరాలు శిక్ష విధింపబడింది. అందరూకూడా చిరునవ్వుతో శిక్షలను స్వీకరించారు. ఇదే సుప్రసిద్ధమైన లాహోరు కేసు.

## దివ్యభావ వ్యాప్తి

1931 మార్చి 23వ తేదీ సాయంకాలం 7.30 గంటలకు ప్రియతమ దేశభక్తులు భగత్‌సింహ, సుఖదేవ్, రాజగురులు ముప్వురు ఉరితీయబడ్డారు. ముగ్గురుకూడ తమ జీవితాలు సార్థకమైనట్లు అనుభూతి పొందుతూ ఎంతో ప్రశాంతంగా, ఆనందంగా తమలో మొదట ఎవరు ఉరికంబాన్ని ఎక్కాలారో అని పోటీ పడ్డారు.

ఈ సంఘటనతో గాంధీజీ సత్యాగ్రహ ఆందోళనకు అనుకూల వాతావరణ ఏర్పడింది. శాసనోల్లంఘనము, సత్యాగ్రహముల వాతావరణము దేశవ్యాప్తంగా నిర్మాణమైంది. ఉప్పుసత్యాగ్రహము, మద్యపాననిషేధము, విదేశీ వస్త్ర బహిష్కరణ, విదేశీ వస్త్ర దహనము మొదలైన కార్యక్రమాలలో దేశము నిమగ్నమైంది. ఇందులో మునిగి,

ఉన్న ప్రజానీకం ఎదుట జాతీయ అసంతృప్తికి, స్వాభిమానానికి, స్వాతంత్ర్య ఆకాంక్షకు ఈ నవవీరులు సాకార ప్రతీకలై నిలచారు.

## విప్లవకార్యానికి జీవనదానము

భగత్‌సింహ విప్లవకార్యానికి తన జీవితాన్ని దానం చేసాడు. పౌరుషాన్ని మేల్కొల్పాడు. నిర్భయంగా ఆత్మబలిదానము చేసి విప్లవ సిద్ధాంతాలకు ఒక రాత్త్విక ప్రాతిపదికను, ప్రతిష్ఠను సమకూర్చాడు. ఏకాగ్రతతో గంభీరంగా రాజనీతిఅభ్యసించే సాధకుడాయన దేశపరిస్థితిని మానవ ఆకాంక్షలను సూక్ష్మంగా అధ్యయనం చేసాడాయన భారతీయ జన సముద్రపు ఉపరితలమునందలి ప్రశాంతియొక్క గర్భంలోని లోతుల్లో అగ్ని కణకణ మండుతూ ఉందని తెలియజేయడానికి ఆయన ఈ యజ్ఞాన్ని చేసాడు. ఆయన తన వాఙ్మూలంలో స్పష్టంగా ఇలా చెప్పాడు.

"విప్లవముయొక్క నిజమైన అర్థము ప్రస్తుతము అమలుతో ఉన్న అర్థరచనలో మార్పుతేవడం. ప్రకృతి మానవునికి ప్రసాదించిన అధికారము విప్లవము, స్వాతంత్ర్యము ప్రతివ్యక్తికీ జన్మహక్కు. ఈ ధ్యేయ నిష్టకొరకు మా వంతుకు వచ్చిన కష్టాలు అత్యాచారాలు, యాతనలు ఎటువంటివైనా మేము వానికి స్వాగతం పలుకుతాము. విప్లవవేదికమీద అర్పించటానికి మేము యౌవనాన్ని ధూపంగా ఎంచి ముందుంచాము. ఎందుకంటే, ఈ దివ్య ధ్యేయసాధనకై చేయబడే త్యాగము యోగ్యమైనదిగా నిరూపిత మవుతుంది. మేము ఆ విప్లవముయొక్క రాకకు ఎదురుచూస్తూనే ఉన్నాము. "ఇంక్విలాబ్ జిందాబాద్, విప్లవము చిరాయువు కావాలి."

## పదునేడవ అధ్యాయము

# గాంధీజీ ఉండి సత్యాగ్రహము

విప్లవ వేదికమీద అర్పించడానికి తాము తమ యౌవనసుగంధాన్ని తెచ్చామనే ఉదాత్త భావనతో విప్లవభానులు భగత్‌సింహ, సుఖదేవ్ రాజగురులు నవ్వుతూ నవ్వుతూ ఉరికంబమెక్కారు. అదే విధంగా వీరుడు చంద్రశేఖరఆజాద్ పోలీసులతో పోరాడుతూ పోరాడుతూ యుద్ధరంగంలో నేలవ్రాలాడు. అయన మనయెదుట నిర్భయత్వానికి ఆదర్శాన్ని నిలిపాడు. విప్లవాగ్ని నిరంతరము మండుతూనే ఉంది. అగ్నిపర్వతము మరల మరల ప్రకోపిస్తూనే ఉంది. బ్రిటిషు సామ్రాజ్య శక్తికి ఆఘాతాలు తగులుతూనే ఉన్నాయి.

ఇది స్వాతంత్ర్య యుద్ధంలోని దాహర పక్షము స్వాతంత్ర్య ప్రయత్నాలు యజ్ఞకుండాన్ని నిరంతరము ప్రజ్వలిస్తూ ఉండేట్లుచేయడం స్వాతంత్ర్యాకాంక్షలను అసంతృప్తిని రగిలిస్తూ ఉంచడం ఆ యుద్ధంలోని మరొక భాగం. ఈ కార్యాలను చట్టసమ్మతమైన మార్గాలద్వారా నిరంతరము కాంగ్రెసు చేస్తూ ఉండేది. కాంగ్రెసు గాంధీజీ నాయకత్వములో నడుస్తూఉన్నది. సాయుధులు; కుటిలురు, అయినఆంగ్లేయులను ఎదుర్కొన

దానికి గాంధీజీ మనకు సత్యము, అహింసా అనే అస్త్రాలను రెంటిని యిచ్చాడు. ఈ అస్త్రాల విషయంలో బ్రిటిషు ప్రభుత్వము మోస పోయింది. "ఇక ఈ దేశము మనతో ఏమి పోరాడగలుగుతుంది; చర్చలు, సంప్రదింపులు, ఓదార్పు మాటలు ఆధారముగా మనము శాశ్వతంగా ఈ దేశాన్ని పరిపాలించగలము, అనంత కాలమువరకు ఈ దేశాన్ని దోచుకోగలము" అని బ్రిటిషు ప్రభుత్వము అనుకున్నది.

1929లో లాహోరులో కాంగ్రెసు మహాసభ జరిగింది. మహాత్మాజీ చాల నేర్పుతో కాంగ్రెసు అధ్యక్ష పదవిని యువకుడైన జవాహర్లాల్ నెహ్రూకు అప్పగించాడు. యువరక్తం యొక్క సాహసము, మొండి పట్టు గాంధీజీకి బాగా తెలుసు. యువక వర్గము ఉద్రేకంతో ముందుకు వెళ్తుంటే తాము వెనుకనుండి, సంయమము అనే పగ్గాలు చేతపుచ్చుకొని స్వాతంత్ర్య రథాన్ని చక్కని మార్గంలో నడిపించాలని గాంధీజీ ఉద్దేశ్యము. ఇది గాంధీజీ ఆత్మ విశ్వాసముతో చేసిన కార్యము

## జనవరి 26 స్వాతంత్ర్యదినము

1929 డిశంబరు 31వ తేదీ లాహోర్ కాంగ్రెస్‌లో పండిత్‌జీ జాతీయధ్వజాన్ని ఎగురవేశాడు. సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదింపజేసాడు దేశవ్యాప్తంగా శాసనోల్లంఘన రణభేరిని మ్రోగిం చాడు. భవిష్యత్ సంగ్రామ సేనాపతిత్వం గాంధీకి అప్పగించబడింది. ఎనిమిది సంవత్సరాలపాటు సత్యాగ్రహము మరల ప్రారంభము కాబో తున్నది. పం॥ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ మొదలైన యువనాయకుల హృదయాలలో ఉత్సాహము పొంగులు వారింది కాంగ్రెసు అధ్యక్ష స్థానమునుండి పం॥ నెహ్రూ ఒక పత్రాన్ని ప్రకటించి దేశమంతా జనవరి 26 వ తేదీని స్వాతంత్ర్య దినముగా గుర్తించవలెనని కోరాడు. ఈ విశాల దేశములో నలుమూలల నుండి ఈ ఆకాంక్షకు ప్రతిధ్వని విని

పించింది. జనవరి 26 వ తేదీని స్వాతంత్ర్య దినముగా జరుపుకున్నం దున, దేశ స్వాతంత్ర్యము కోసము ప్రజలలో గల ఏకముఖమైన సంక ల్పము సకల ప్రపంచానికి మరొక్కసారి ప్రకటింపబడింది.

తన చేతిలోనికి యుద్ధసూత్రాలన్నీ రాగానే మహాత్మాజీ అహింసా యుద్ధాన్ని గూర్చి ఆలోచించారు. ఆయుధ పాటవం గల బలవంతమైన సామ్రాజ్య శక్తిని నిరాయుధ సామాన్య మానవుడుగా గాంధీజీ ఏవిధంగా ఎదుర్కొనగలడు అని ప్రపంచమంతటిలోని రాజనీతి ధురంధరులు తమ దృష్టిని ఇక్కడ కేంద్రీకరించారు. ఆ రోజుల్లో గాంధీజీ సబర్మతీ ఆశ్రమములో ఒక ఋషితుల్యమైన జీవితాన్ని గడుపుతుండేవాడు. ఆత్మ శక్తిని సంపాదిస్తుండేవాడు. తన మనస్సులో చింతన చేస్తుండేవాడు. దేశ మంతా విశ్వాసంతో గాంధీజీ మాటకోసము ఎదరు చూస్తుండేది.

## అపూర్వమైన దండియాత్ర

1930 మార్చి 12వ తేది వచ్చింది. నడుముచుట్టు పంచె, అందుండి వ్రేలాడుతూ గడియారము, చేతిలో కర్రతో గాంధీజీ తేజోమూర్తి ఆశ్రమముకుండి బయలుదేరింది. ఆయన వెంట ప్రత్యేకంగా ఎన్నుకోబడిన 79 మంది అనుయాయులున్నారు. ఆశ్రమమునుండి బయలుదేరే ముందు గాంధీజీ అందరికి ఇలా చెప్పాడు.

"స్వరాజ్యము అవతరింపజేయకుండా నేను ఈ ఆశ్రమానికి తిరిగిరాను."

ఇది ప్రతిజ్ఞ, సత్యవచనుడైన గాంధీజీ ప్రతిజ్ఞ. మహాత్మాజీ సంకల్పమది. సంపూర్ణ దేశ సంకల్పమది. గాంధీజీ సంకల్పాన్ని విన్న ప్రజలు పులకితులైనారు. దేశంలోని గొప్ప గొప్ప నాయకులు గాంధీజీకి వీడ్కోలు ఇవ్వడానికి ఆశ్రమ ద్వారమువద్ద సమావేశమైనారు. అందరు

ఆనందముతో ఉక్కిరి బిక్కిరైనారు. ముందు ఏమి జరుగుతుంది. అందరి మనస్సుల్లో ఈ భావమే మెదలుతున్నది. కాని గాంధీజీ ప్రశాంతంగా ఉన్నాడు. నిత్యములాగే ప్రార్థన చేసాడు. ముత్తైదువలు ఆయనకు హారతులిచ్చారు. విజయ చిహ్నమైన కుంకుమ తిలకాన్ని మహాత్మాజీ నొసట దిద్దారు. గాంధీజీ ప్రసన్న భావంతో అందరికీ నమస్కరించాడు. తన ప్రక్కచుట్టతీసి వీపున కట్టుకున్నాడు. చేతిలో కర్రపుచ్చుకుని అడుగు ముందుకు వేసాడు. ఆ సమయంలో ఆయన ముఖము గంభీరంగాను, ఆలోచనా నిమగ్నంగాను కనిపిం



గాంధీజీ దండియాత్ర

చింది. ఎవరూకూడ మాట్లాడ సాహసించలేదు. గాంధీజీ ముందుకు సాగిపోతున్నాడు. ముఖ్యులైన 7౯మంది ఆయన వెనుక గంభీరంగా నడచిపోతున్నారు. అది ఒక మహాయాత్ర. అందరి మనస్సులలో యాత్ర అనే పవిత్ర భావన మెదలుతున్నది. యాత్రకు అవసరమైన త్యాగము, దృఢసంకల్పము ప్రతివారి ముఖముమీదను ప్రకాశిస్తున్నవి.

## ఉప్పుసత్యాగ్రహము నిమిత్తము

భారత స్వాతంత్ర్య చరిత్రలో ఒక అపూర్వ పర్వము ఈ దండి యాత్రతో ప్రారంభమైంది. సబర్మతినుండి 250 మైళ్ళ దూరములో సముద్రతీరములోని గ్రామము దండి. గాంధీజీ అక్కడికి కాలినడకనవెళ్ళి ఉప్పుచట్టాన్ని ధిక్కరించి శాసనోల్లంఘన యుద్ధాన్ని ప్రారంభిస్తారు.

మార్చి 12వ సబర్మతీ ఆశ్రమమునుండి బయలుదేరిన పాదయాత్ర పూర్తిగా 25 రోజుల తర్వాత ఏప్రిల్ 5వ తేదీన దండి చేరింది. ఈ పాదయాత్ర కార్యక్రమము అంతా ముందుగా నిశ్చితమైంది. ఇది ప్రపంచ మంతటిలో అపూర్వమైన ఆసక్తి నిర్మాణము చేయబోతున్నది. స్వదేశ బాంధవులలో సామర్థ్యాన్ని సృష్టింప బోతున్నది

ఏప్రిల్ 6వ తేదీ వచ్చింది నిత్య ప్రార్థన పూర్తిచేసుకున్న తర్వాత గాంధీజీ సముద్రమువైపు నడిచాడు. అన్నివైపుల శాంతి-గంభీర శాంతి—ఆవరించింది. నలువైపుల పవిత్రత అను పండువెన్నెల విరిసింది అనుయాయులందరు ఏకాగ్ర మనస్కులై తమ నాయకుని పలుకులు విన డానికి సిద్ధంగా ఉన్నారు. అప్పుడు గాంధీజీ "ఈ యజ్ఞానికి అధ్యాత్మిక స్వరూపము ఇవ్వండి. ఇక వైఫల్యము ఉండదు" అని అన్నాడు.

మహాత్మాజీ సముద్రపు నీటిలో నిలబడి ఒడ్డున పడిఉన్న పిడికెడు ఉప్పు చేతిలోకి తీసుకున్నాడు "ఉప్పుచట్టము ముక్కలైంది" అని ఆయన ప్రకటించాడు. దేశమంతటిలో "మహాత్మా గాంధీజీకీజై" అని జయ జయ నినాదాలు మార్మోగాయి. అన్నిచోట్ల శాసనోల్లంఘనము ప్రారంభమైంది. ఈ విషయంలో ఏమి చర్య తీసుకోవలెనో ప్రభుత్వా నికి అర్థంకాలేదు. అది భయపడిపోయింది. నిరాయుధులయిన సత్యా గ్రహులమీద అది లాఠీలను ప్రయోగించింది. గుఱ్ఱపుదళాన్ని నడిపిం చింది. దేశమంతటిలో శాంతియుత నిరాయుధ సత్యాగ్రహులకు,

ఉన్మత్తులై తలతిరిగిన సాయుధ అధికారులకు మధ్య చిన్నచిన్న సంఘర్ష ణలు ప్రారంభమైనాయి. ప్రభుత్వ శాసనాల ఆధారాన్ని సమూలంగా నాశనము చేయవలెనన్న సంకల్పముతో గాంధీజీ దండియాత్ర జరిపి ఉప్పు చట్టాన్ని ముక్కలు చేయడంతో దేశవ్యాప్తమైన శాసనోల్లంఘన ఉద్య మము ప్రారంభమైంది.

## దేశమునంతప్తమై నిలచింది.

ఆందోళన చేయవలసిందనే పిలుపుకు దేశమంతా ఉత్తేజితమై సహకరించింది. ఉప్పుసత్యాగ్రహముతోపాటే విదేశ వస్త్రాలను బహిష్కరించడం, పన్నుల నిరాకరణ, అటవీ సత్యాగ్రహము మొదలైన అనేక కార్యక్రమాలు ఆరంభమైనాయి. ప్రభుత్వము గాంధీజీని బంధిం చింది. చిన్న పెద్దనాయకులందరినీ పట్టి జైలులో వేసింది. దాదాపు ఒక లక్షమంది సత్యాగ్రహులు చెరసాల పాలైనారు. ఈ ఆందోళనను అణచి వేయడానికి లాఠీలు, తుపాకులు, శిక్షలు మొదలైన మార్గాలన్నిటినీ ప్రభుత్వము ఉపయోగించింది. కాని, ప్రజలలో చెలరేగిన మహో త్సాహము ప్రభుత్వాన్ని లొంగదీసింది. చిన్న చిన్న పిల్లలు బ్రహ్మాండ మైన ప్రభాత భేరీలు లేవదీసేవారు. "అత్యాచారాల ప్రభుత్వము అంత మొందాలి." అని గట్టిగా మొండిగా పెద్ద పెద్ద అధికారుల సమక్షంలో నినాదాలు చేసేవారు.

దేశవ్యాప్తంగా సాగిన ఈ సంగ్రామమువైపు ప్రపంచమంతా ఆకర్షింపబడింది. విస్మయముతో ప్రజలు మహాత్మాజీని వినమ్రులై చూడ సాగారు. మహాత్మాజీ అలౌకిక నేతృత్వము ప్రభుత్వ దౌర్జన్యకాండను లెక్కచేయకుండా ఆందోళనను సాగిస్తూ ఉండటానికి ప్రజలు తీసుకున్న నిశ్చయము, నిరాయుధ ప్రతిఘటన సామర్థ్యము - అన్నింటినీ ఈ పోరాటము ప్రపంచానికి ప్రత్యక్షంచేసింది.

పోరాటము ఆయుధ సహితమా, ఆయుధ రహితమా అన్నది అప్రధానమైన విషయము. ఎదుర్కొనడానికి ప్రజల మనస్సులు సుముఖంగా ఉన్నవా, లేదా అన్నది ముఖ్య విషయము. 'స్వాతంత్ర్యము కోసము నేను నా సరస్వాన్ని ఆహుతి చెయడానికి సిద్ధంగా ఉన్నాను' అను భావన అత్యవసరము, ఈ రాష్ట్రీయ భావన ప్రజా హృదయాలలో 1930 నాటి ఈ పోరాటంలో అతి తీవ్రంగా కనిపించింది. ఆంగ్లేయ ప్రభుత్వము అదిరిపడింది. అది సంధి సంభాషణల జాలాన్ని పన్నింది. ఆ వలలో గాంధీజీని పట్టివేసింది.

## సంప్రతింపులద్వారా ప్రగతి

మొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు, గాంధీ ఇర్విన్ ఒడంబడిక, రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు, మూడవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సుల ఫలితంగా 1937లో ప్రాంతీయ స్వపరిపాలన అనే నూతన శాసనము దేశంలో అమలులోకి వచ్చింది.

అనాడున్న పదకొండు ప్రాంతములలోని ఎనిమిదింటిలో కాంగ్రెసు అధిక సంఖ్యలో ఎన్నికలలో గెలిచింది. అన్ని ప్రాంతములలో రాష్ట్రీయ పునర్నిర్మాణము కొరకు కమిటీలు, కమిషన్‌ల కార్యక్రమాలు పెద్ద ఆడంబరముతో ప్రారంభమైనాయి. రైతుల ఋణ విమోచనము, మద్యపాన నిషేధము, పారిశ్రామిక విద్య, విద్యాప్రసారము, ఆర్థిక పంచవర్ష ప్రణాళిక వంటి అనేక విషయాలపై ప్రాంతీయ ప్రభుత్వాలు తమ దృష్టిని కేంద్రీకరించాయి. దీనివలన దేశ ప్రజలలోని శాసన నిర్మాణ శక్తి, కార్యసాధనకు వారి తహతహ ప్రపంచములోని ప్రగతిశీల దేశాల దృష్టికి వచ్చాయి. దేశమంతటలో ఒకే రాజ్యాంగాన్ని అమలులోకి తేవడానికి సంస్థానాధిపతులతో చర్చ ప్రారంభింపబడింది.

శాసనోల్లంఘనోద్యమము దేశంలో ప్రారంభమైంది. ఆ కాలములో నలువైపుల అహింసాధాయలు వ్యాపిస్తూఉన్నాయి. 'అహింసయొక్క అర్థము పారిపోవట కాదు. శత్రువును ఎదిరించలేక కారణంచేత పిరికితనము చూపడం అహింస అని నేనెన్నడు అనను, - అని మహాత్మాజీ స్పష్టంగా చెప్పాడు. నిరాయుధుల మీద ప్రభుత్వాధికారులు తూటాలు ప్రయోగించినప్పుడు అనేకుల సంయమము తొలగి పోయేది. ఇట్టి అధికారులను తరుణములో సరిదిద్దే మహత్కార్యాన్ని విప్లవకారులు నిరంతరము సాగిస్తుండేవారు. ఈ కార్యంలో వారు తమతమ ప్రాణాలను అర్పింపవలసివచ్చేదికూడ. కాని, అసంతృప్తి అనే అగ్నిని ఆరిపోసికుండా మండించడానికి తమ జీవితాలను సమిధలుగాచేసి ఆ అగ్నికుండంలో అర్పణచేయడం తమ పవిత్ర కర్తవ్యంగా విప్లవకారులు భావించేవారు.

## విప్లవకారుల ఆహుతి

ఒకవైపు దేశమంతటిలో వేలకొలదిమంది శాసనోల్లంఘనము చేసి చెరసాలకు వెళ్తుండడము, మరొకవైపు అదేసమయంలో చంద్రశేఖర్ అజాద్ వంటి నరవీరులు పోలీసుల నెదుర్కొనిబలిదానము చేస్తుండడము ఈ దృశ్యము అనాడు కన్పిస్తుండేది. బెంగాల్‌లో అడుగడుగునా బాంబులు ప్రేలుతుండేవి. అక్కడ ఒకరి తర్వాత మరొకరుగా తెల్లవారు చంపివేయబడుతుండేవారు. ఈ సాహస కార్యాలలో స్త్రీలుకూడ పాల్గొంటుండేవారు. 19 సంవత్సరాల వయస్సుగల శోభారాణీదత్త, కుమారి శాంతిఘోష్, సుమతి చౌధురీ, వీణాదాస్‌లు జిల్లా మేజిస్ట్రేటు మీద, యూరోపియన్ క్లబ్ గవర్నర్ మీద పిస్తోలు, బాంబులతో మహా వీరత్వముతో దెబ్బతీసారు. సోలాపూర్, పెషావర్‌లలో బ్రిటిషు రాజ్యము వారమురోజుల పాటు పూర్తిగా అంతరించిపోయింది. సోలాపూర్‌లో సైనిక శాసనము అమలుపరచారు. ఏప్రిల్ 25 నుండి మే 4 వరకు పెషావర్‌లో బ్రిటిషు

శక్తి సమూలంగా పెకలించివేయబడింది. రాయల్ గఢ్‌వాల్ ప్లాటూన్ లోని రెండు భాగాలు అక్కడకు పంపబడినాయి.కాని వారు నిరాయుధుల మీద తుపాకులు ప్రేల్చడానికి నిక్కచ్చిగా నిరాకరించారు. ఇది అపూర్వమైన దృశ్యము. 1857 స్వాతంత్ర్య సంగ్రామము యొక్క సూత్రము ఈ యుద్ధమువరకు సాగివచ్చిందని ఈ దృశ్యము తెలుపుతుంది. ఇదంతా విప్లవకారుల నిరంతర ప్రయత్నాల, ప్రచారాల ఫలితమే.

## భారత దేశమునుండి బర్మా విచ్ఛేదం

1937లో మనము అమలు పరచిన ప్రాంతీయ స్వపరిపాలన చట్టముద్వారా కుటిలురైన ఆంగ్లేయులు అతి నేర్పుతో దేశ విభజన చేసారు. లోకమాన్యుడు మొదలైన వారి నివాసముచేత పవిత్రమైన బర్మా హిందుస్థానమునుండి వేరుచేయబడింది. ఈ శస్త్రచికిత్స మనపయి జరిగిన ఆ రోజుల్లో మనము పలుతెరగుల మత్తులోపడి ఉన్నాము. అంటరానివారి సమస్య, ముసల్మాను సమస్య వంటి భస్మాసురులను మన యెదుట నిలిపి, గాంధీజీ ఈ సమస్యలలో చిక్కుపడి పోవడం గమనించి బ్రిటిషు ప్రభుత్వము ఈ శస్త్రచికిత్స జరిపింది ఇది మనకు దురదృష్టము.

నా మనఃఫలకంపై చిత్రించబడి ఉన్న మాతృభూమి చిత్ర పటంలో బ్రహ్మదేశము, నేపాల్, లంక ఉన్నాయి నేడు లంక పోయింది. నేపాల్ పోయింది. బ్రహ్మదేశము పోయింది. సింధు, బలూచిస్థానాలు విడిపోయినాయి. 1935లో క్వెట్టాలో తీవ్రమైన భూకంపము వచ్చింది. మృత్యువు లక్షల సంఖ్యలో మనుష్యులను, పశుగణాన్ని పొట్టనబెట్టుకున్నది. దేశమంతా ఎంతో దుఃఖించింది. సహాయ మందించ డానికి ముందుకురికింది. కాని నేడు ఆ క్వెట్టా హిందుస్థానమునుండి దూరము చేయబడింది. కుటిలురైన ఆంగ్లేయులు 1935లో ఇలా శస్త్రచికిత్స జరిపి, దేశవిభజనలో

మొదటసారిగా సఫలత పొందారు. శాసనముద్వారా బ్రహ్మదేశము హిందుస్థానమునుండి వేరుచేయబడింది.

## నాటి రాజకీయ పరిస్థితి

1930–32 శాసనోల్లంఘన ఆందోళన, ఆటుతర్వాత చట్ట సమ్మతమైన ప్రయత్నాలు 1935 చట్టముయొక్క అసలు జరిగిన ఈకాలములో రాజకీయ రంగములో కాంగ్రెసు పోరాడుతూ ఉన్నది. 1938 లో కాంగ్రెసులో 3 కోట్ల 21 లక్షల సభ్యులున్నారు. కాని ఈ సంస్థలోని కార్యకర్తలలో మూల విధానాల విషయంలో తీవ్రమైన అభిప్రాయ భేదాలుండేవి గాంధీజీ యుద్ధము వైపుకంటె సంధివైపుకు మొగ్గు చూపేవాడు. ఇక సుభాష్‌చంద్ర ప్రత్యక్ష యుద్ధం వైపుకు మొగ్గేవాడు సంధి మాయాజాలంలో పడి మనము మన ధ్యేయానికి దూరంగా వెళ్ళిపోతున్నామని ఆయన గాంధీజీతో స్పష్టంగా చెప్పాడు. ఫలితంగా గాంధీజీ ఆయననే కాంగ్రెసుకు దూరంచేసాడు.

ఈ కాలములో దేశంలో కమ్యూనిష్టులు తమ సంఘటనను సుదృఢం చేసుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. విప్లవ కారులు అనేకులు కమ్యూనిష్టులతో వెళ్ళి కలిసారు. దేశము విశుద్ధమైన జాతీయ భావనకు దూరమైపోతున్నదని గుర్తించి హిందూమహాసభ రాజకీయ రంగంలో ఆవిర్భవించింది. బ్రిటిషువారిచేత రెచ్చగొట్టబడి ముస్లిములీగు దేశ వ్యతిరేక కార్యకలాపాలు సాగిస్తున్న సంగతి సకాలములో ప్రజలకు చూపే పనిని హిందూమహాసభ స్వీకరించింది సోషలిస్టులు మాత్రము కాంగ్రెసును అంటిపెట్టుకొని ఉన్నారు.

## ద్వితీయ ప్రపంచ సంగ్రామము

ఇంతలో ప్రపంచశాంతి భగ్నమైంది. రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమైంది. 1939 సెప్టెంబరు 1వ తేది జర్మనీ పోలెండు మీదికి

సైన్యాలు నడిపింది. పోలెండ్, డెన్మార్క్, నార్వే, లక్సెంబర్గు, హాలెండు బెల్జియము, ఫ్రాన్సుదేశాలు ఒక్కొక్కటి పేకముక్కలలాగా రాలిపోయాయి. ఓడిపోయి జర్మనీకి లొంగిపోయాయి. ఆంగ్లేయులకు పెద్ద చిక్కు వచ్చిపడింది. ఇంగ్లండుకు వచ్చిన యీ ఆపద మనకొక చక్కని అవకాశము. ఈ విషయము గుర్తించి సాహసము, దూరదృష్టిగల స్వాతంత్ర్య వీర సావర్కార్ దేశాభిమానులు, సాహసవంతులు అయిన యువకులు సేనలో చేరవలసిందని సలహా యిచ్చాడు. ఈ యుద్ధమునుండి ప్రయోజనము పొందడానికి సుభాష్‌చంద్రబోసు ఒక మహా సాహసికమైన ఆలోచనలో మునిగిపోయాడు. కాంగ్రెసు నాయకులు కొన్ని షరతులమీద స్వేచ్ఛగా ఇంగ్లండుకు సహాయము చేయడానికి సిద్ధపడ్డారు. కాని షరతులమీద సహాయము పొందేటంతగా ఆంగ్లేయ సామ్రాజ్య అహంకారము ఆనాటికి తగ్గిపోలేదు. అయితే ఈ అహంకారమును దించివేసే మహత్కార్యము ఒక యువకుడు చేసాడు. ఇది కూడ సాక్షాత్తు లండన్‌లో శత్రు శిబిరంలో ఆంగ్లేయుల రాజధానిలో యుద్ధము జోరుగా సాగే ఆ సమయంలో. ఈ యువకుని పేరు ఉధామ్‌సింహ. సర్దార్ ఉధామ్‌సింహ.

## పంజాబు బెబ్బులి ఉధామ్‌సింహ

సర్దార్ ఉధామ్‌సింహ 1908లో వీరభూమి పంజాబులో జన్మించాడు. అతనిది శ్రీమంతుల కుటుంబము. కాని అయన ఐదేండ్ల బాలుడుగా ఉన్నప్పుడే తలిదండ్రు లిద్దరు గతించారు. యువకుడైన ఉధామ్ సింహ పంజాబులోని విప్లవకారుల సంఘటనలో చేరి భగత్‌సింహ దత్తకు సహచరుడై అనేక కష్టాలను సహించాడు. భగత్‌సింహ మొదలైనవారు ఉరికంబ మెక్కిన తర్వాత ఇతర విప్లవకారులు విదేశాలకు వెళ్ళిపోయారు: ఈ సంఘటనతో సంస్కారవశమైన ఉధామ్‌సింహ మనస్సులో ఒక

అద్భుత పరిణామము కలిగింది. ప్రభుత్వముయొక్క ఈ అత్యాచారాలకు, దౌర్జన్యాలకు ప్రతిక్రియ ఎలాచేయాలి అని ఆయన అహర్నిశలు ఆలోచింప సాగాడు, అప్పటికి ఆయన ఇంజనీరింగ్ పరీక్షలో ఉత్తీర్ణుడై ఉన్నాడు. ఇంట్లో యెవరూలేరు తన ఆస్తినంతా అమ్మివేసి ఇంగ్లాండు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఒక నిశ్చిత పథకము ప్రకారము ఉధామ్‌సింహ ఇంగ్లాండు వెళ్ళాడు. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండలో అకారణంగా హతులైన దేశబాంధవులు ఆయనను నిలవేసి అడుగుతున్నారు. "మేము ఇలాగే ఆక్రందిస్తూ ఉండవలసిందేనా ? మా నిష్కారణ సర్వనాశనానికి పగ తీర్చేదెవరు ?" విప్లవకారులైన దేశభక్తుల, స్వభాంధవుల నాశనానికి కారణభూతుడైన ఆ మదోన్మత్తుని ముఖము ఉధామ్‌సింహకు కనుపించ సాగింది అతని మనస్సులో ప్రతిక్రియను గూర్చి తప్ప మరి యేయితర ఆలోచనకూడ రావడంలేదు. అందుచేత వెంటనే ఆయన ఇంగ్లాండుకు పయనమైనాడు.

## మదన్‌లాల్ ధీంగ్రా అనుకరణ

ఉధామ్‌సింహ వ్యక్తిత్వము సింహ సమానమైనది. బిగువుగల శరీరము కొంచెము శ్యామలవర్ణము, మెరసిపోయే కళ్ళు...మధురమైన స్వభావము, ఉధామ్‌సింహ ఇంగ్లాండు చేరాడు. మదోన్మత్తులైన మాజీ ప్రభుత్వ అధికారుల చిరునామాలు సంపాదించే ప్రయత్నాలు ప్రారంభించాడు. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండకు పూర్తిగా బాధ్యుడైన సర్ మైకేల్ ఓ డాయర్‌ను మొట్టమొదట హతమార్చడానికి నిశ్చయించుకున్నాడు. చాల నేర్పుతో ఆయన ఓ డాయర్ పరిచయాన్ని సంపాదించుకున్నాడు. రహస్యంగా పిస్తోలు చేతబట్టాడు. ఓ డాయర్‌ను హత్యచేసి

తిన్నగా హిందుస్థాన్ తిరిగి రావాలనికూడ ఆయన అనుకున్నాడు. కాని ఇంతలో రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమైంది. ఇక ఎక్కువ కాలము వేచి ఉండకుండా ఆత్మ బలిదానము చేసి భారతీయ అసంతృప్తి అగ్నిజ్వాలలను పైపైకి లేచేట్లు చేయడానికి ఆయన నిశ్చయించుకున్నాడు.

1940 మార్చి 13వ తేదీన ఈస్ట్ ఇండియా అసోసియేషన్ చర్చకై ఒక సభను ఏర్పాటు చేసింది. సభాస్థానము కేక్స్టన్‌హాలు. అధ్యక్షుడుగా భారతమంత్రి లార్డ్ జెట్‌లెండు నిశ్చయింపబడినడు. ఆనాటి ముఖ్యవక్త బ్రిగేడియర్ జనరల్ పార్సిసైక్సు. విషయము ఆఫ్గనిస్థానములోని ఆనాటి స్థితిగతులు. ముసల్మానులను సంతోషింపజేయడానికి ఇది ఒక ప్రయత్నము. మైకేల్ ఓ డాయర్ ఈ సభకు రావలసి ఉంది. ఓ డాయర్ లార్డ్ జెట్‌లాండులను హత్యచేయాలని ఉధామ్‌సింహ నిశ్చయించుకున్నాడు. అతని రోమరోమంలో హుతాత్ముడు మదన్‌లాల్‌ఢీంగ్రాయొక్క చైతన్యము తొణికిసలాడుతున్నది. పథకము ప్రకారము నిశ్చిత సమయానికి, యోగ్యమైన దుస్తులలో, తూటాలు దట్టించిన పిస్తోలు, లిఖిత వాఙ్మూలము వెంట తీసికొని ఉధామ్‌సింహ సభాస్థానానికి చేరుకున్నాడు.

## పౌరుషము యొక్క సాక్షాత్కారము

మధ్యాహ్నము నాలుగుగంటల సమయము. సభ జరుగుతున్నది. మైకేల్ ఓ డాయర్ మొదటి వరుసలో చిట్టచివర కూర్చున్నాడు. అతని ప్రక్కన గోడ నానుకొని ఉపన్యాసము వింటూ ఉధామ్‌సింహ ప్రశాంతంగా నిలబడ్డాడు. మధ్యలో కొంతసేపు విశ్రాంతి సమయము. ప్రజలు కబుర్లు చెప్పుకుంటూ లేచి నిలబడి ఉన్నారు. ఇంతలో ఉధామ్‌సింహ

ఓ డాయర్‌ను ఎదురుగా వచ్చి గేటుముందే పిస్తోలు తీసి సరాసరి పేల్చి వేసాడు.

పిస్తోలు శబ్దముతో సభాప్రాంగణమంతా స్తంభించిపోయింది. భయ భీతమైంది. ఒకటి తర్వాత ఒకటిగా ఆరు తూటాలు పేలాయి ఉధామ్ సింహ తనపని చక్కబెట్టుకున్నాడు. ఓ డాయర్ ఉన్న చోటుననే నేల గూలి మరణించాడు. లార్డ్ జెట్‌లాండు, అతని చేరువన గూర్చున్న మరి యిద్దరు గాయపడ్డారు. పోలీసులు ఉధామ్‌సింహ మీద విరుచుకపడ్డారు. 'విప్లవము వర్ధిల్లాలి' అని గొంతెత్తి నినాద చేస్తూ అతడు పోలీసులకు లొంగిపోయాడు. ఓ డాయర్‌ను చంపినందుకు అతనికి ఉరిశిక్ష విధించ బడింది. హుతాత్ముడు మదన్‌లాల్ ధీంగ్రా పావన స్మృతికి అంజలి ఘటిస్తూ ఉదామ్‌సింహ పంటేల్‌విల్లీ జైలులో భారతమాతకు జేజేలుచెపుతూ ఉరికంబాన్ని కౌగిలించుకున్నాడు.

ఉధామ్‌సింహ ధన్యుడు. ఆయన చేసిన ఈ అసాధారణ కార్యము భారతమాతకు గర్వకారణమైంది. అది సాక్షాత్తుగా భారతీయుల పౌరుష ప్రదర్శనయే ఆయన మాటల్లోనే చెపితే,

"ఓ డాయర్ హత్య అనే ప్రతిక్రియకు నేను పూనుకొననుందే హిందూస్థాన్ పేరు కళంకితమై ఉండేది. మీరు నాకు విధించే పది పది హేను లేక ఇరవై సంవత్సరాల శిక్షగాని, మరణశిక్షగానీ నాకు లెక్క లేదు. ముసలితనమువరకు జీవించి ఉన్నందున ఉపయోగమేమి? యౌవ నములో మరణించడములోనే నిజమైన పురుషార్థముంది నేను నా ప్రియ స్వదేశానికై ఆత్మబలిదానము చేస్తున్నాను."

## ప్రభుత్వానికి గర్వభంగము

ఉధామ్‌సింహ చేసిన ఈ వీరకార్యాన్ని జర్మనీ గౌరవించింది. 'కాలరాచబడిన హిందుస్థాన నివాసులలో అణగి ఉన్న క్రోధముయొక్క సాకార స్వరూపము' అని జర్మను రాజ్యాధికారులు ఉధామ్‌సింహను శ్లాఘించారు. కాని భారతదేశంలో ఆ రోజుల్లో ఆంగ్లేయులతో సంప్రతింపులు సాగించే వాతావరణము ఉన్నది. యుద్ధములో తలమునకలై ఉన్న సమయములో కాంగ్రెసుతో స్వరాజ్యం గురించి సంప్రతింపులు జరిపే మనః స్థితిలో బ్రిటిష్ ప్రభుత్వము లేదు. అది గర్వించి ఉండినది. ఉధామ్‌సింహ ఆ గర్వాన్ని దించివేసాడు. దానితో క్రిప్సు మహాశయుడు సంప్రదింపుల కోసము భారత్‌కు పంపబడినాడు.



## పదునెనిమిదవ అధ్యాయము

# 'క్విట్ ఇండియా' గర్జన

1939 సెప్టెంబరు 3వ తేదీన రెండవ ప్రపంచ యుద్ధము మొదలైంది. ఇంగ్లాండు జర్మనీపై యుద్ధం ప్రకటించింది. భారతదేశంలో 1935 శాసనము ననుసరించి ప్రాంతీయ స్వపరిపాలనతో ప్రభుత్వము నడుస్తూ ఉంది. అప్పుడు పదకొండు ప్రాంతాలలోని ఎనిమిదింటిలో (సింధు, పంజాబు బెంగాల్ తప్ప) కాంగ్రెసు మంత్రివర్గాలున్నాయి. భారతీయ ప్రజల నూతన సామర్థ్యము ప్రకటితముకాసాగింది. అన్ని పనులు పరస్పర అవగాహన, సహకారము ఆధారంగా జరుగుతున్నాయి. తీవ్రమైన ఆందోళనలుగాని నెత్తురు చిందించుటగాని లేవు. భారతీయ ప్రజలకు ఆంగ్లేయ ప్రభుత్వానికి మధ్య స్వరాజ్యం గురించి సంభాషణలు శాంతియుతంగా సాగుతూ వున్నాయి.

### భారతదేశము తరఫున యుద్ధప్రకటన

ఇటువంటి పరిస్థితి ఉన్నప్పటికీ, యుద్ధము ప్రారంభము కాగానే బ్రిటిషువారు నిమితం కోల్పోయారు. ఏ భారతీయ నాయకునితోగూడ

సంప్రదించకుండా భారతదేశము తరఫున జర్మనీకి విరుద్ధంగా అప్పటి వైస్రాయి లార్డ్ లిన్‌లిత్‌గో యుద్ధము ప్రకటించాడు. ఈ ప్రకటన ప్రజలను దిగ్భ్రాంతిలో ముంచింది. అది భారతీయ ప్రజల ప్రకటన కానేకాదు. అది సామ్రాజ్యవాదులైన బ్రిటిషు పాలకుల ప్రకటన. అది తమ శక్తిని ప్రదర్శించడానికి, ప్రజలవిశ్వాసమును తుడముట్టించడానికి ఏకపక్షంగా చేయబడిన ప్రకటన.

ప్రభుత్వము యొక్క ఈ విశ్వాస ఘాతకమైన ప్రకటన వలన ప్రజలు, నాయకులు వ్యాకులపడినారు. వార్ధాలో కాంగ్రెసు ప్రత్యేక సమావేశము జరిగింది. ముందుగా ప్రభుత్వము హిందూస్థాన్ పూర్తిగా స్వతంత్ర రాజ్యమని ప్రకటించాలనీ, ప్రస్తుత పరిస్థితిలో దానిని అధికారికంగా అమలుపరచాలనీ బ్రిటిషు వారు తమ యుద్ధలక్ష్యాలను అసందిగ్ధంగా ప్రకటించాలనీ కాంగ్రెసు కోరింది. లార్డ్ లిన్‌లిత్‌గో ఈ విషయాలన్నిటినీ దాటవేస్తూ ఒక పత్రాన్ని విడుదల చేసాడు. కాని అది కాంగ్రెసుకు సంతృప్తికరంగా లేదు. అందుచేత నవంబర్ 1వ తేది ప్రభుత్వ విధానానికి నిరసనగా కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేసాయి. గవర్నర్‌లు ప్రాంత ప్రభుత్వాలు నడిపింపసాగారు. కాంగ్రెసుకు పదవులకన్న స్వాతంత్ర్యమే ప్రముఖమైనదని ఈ సంఘటన నిరూపించింది. కాని విద్రోహి అయిన ముస్లింలీగు ఈ రోజున 'విముక్తి దినము' అని ప్రకటించి పండుగ చేసుకుంది. అధిక సంఖ్యాకులైన హిందువుల రాజకీయ సంస్థ ప్రభుత్వమునుండి అల్ప సంఖ్యాకులైన ముసల్మాను జాతి విముక్తి పొందినదని దాని వాదము. బ్రిటిష్ ప్రభుత్వ కుటిల రాజనీతికి ఇదొక విజయము.

## 'పాకిస్థాన్' కోరిక

ఈ సంఘటనతో దేశంలో నిరాశ, నిస్పృహలు అలముకున్నాయి. యుద్ధము యొక్క సవాల్‌తో ఉద్రేకించిన ప్రభుత్వము వివేకాన్ని కోల్పోయింది. అది కాంగ్రెసును దెబ్బకొట్టింది. ముసల్మానులను రెచ్చగొట్టి తమ చేతిలోని కీలుబొమ్మలుగా చేసుకుంది. ముస్లిములీగు నాయకుడు బారిష్టర్ జిన్నా మండిపడ్డాడు 'కాంగ్రెస్ హిందువుల సంస్థ. ముసల్మానుల తరపున మాట్లాడడానికి దానికి ఎట్టి అధికారమూ లేదు' అని ఆయన స్పష్టంగా ప్రకటించాడు. అంతటితో ఆగలేదు; 1940 మార్చిలో ముస్లిములీగు మహాసభలో బహిరంగంగా పాకిస్థాన్ కోరికను ప్రకటించాడు.

పాకిస్థాన్ కోరికకు అర్థము హిందూస్థానును విభజించడము. ఈ దేశద్రోహకరమైన కోరికను వదులుకోవలసిందని గాంధీజీ జిన్నాకు నచ్చచెప్పడానికి ఎంతగానో ప్రయత్నించాడు. ఆయన ఇచ్చట ముస్లిము సమాజాన్ని కూడ అనేక విధాల ఒప్పించజూచాడు. కాని వాళ్లు భారత మాత తమ తల్లి అనికూడ అంగీకరించలేదు. అందుచేత దేశవిభజన్ల జరగాలి అన్న తమ పట్టును వారు వదలలేదు. తమ మొండిపట్టుకు బ్రిటిష్ ప్రభుత్వము లొంగితీరుతుందని, తమకోరిక తీర్చుతుందని జిన్నాకు బాగా తెలుసు. బ్రిటిషు ప్రభుత్వము విభజించి - పాలించే విధానంతో న్యాయశీలురు స్వభావులు అయిన భారత ప్రజలను చీలదీసి తన సామ్రాజ్యం సుస్థిరము చేసుకునే ప్రయత్నాలు ప్రారంభించింది. ఇంతలో ఉధామ్‌సింహ లండన్‌లో ఓ డాయర్‌ను హత్యచేసి ఆంగ్లేయ ప్రభుత్వాన్ని గట్టిదెబ్బ కొట్టాడు. భారతీయ యువకులలో స్వాభిమాన జ్యోతి ఇప్పటికీ వెలుగుతూ ఉన్నదనే సాక్ష్యం ప్రభుత్వానికి లభించింది

## వ్యక్తిగత సత్యాగ్రహ ప్రారంభము

అయితే గాయమిందా పెద్దదికాకుండా చేయడానికి బ్రిటిషు ప్రభుత్వము క్రిప్సు మహాశయుని సంప్రతింపులకై భారతదేశానికి పంపింది. ఆరోజుల్లో మనదేశంలో మహాత్మాగాంధీ వ్యక్తిగత సత్యాగ్రహ ఆందోళనను ప్రారంభించాడు. మొదట ఆచార్య వినోబాభావే 1940 అక్టోబరు 17 వ తేదీ పవనార్‌లో సత్యాగ్రహము చేసాడు. తర్వాత క్రమంగా 25 వేల మంది సత్యాగ్రహులు జైలుకు వెళ్ళారు.

1941 వ సంవత్సరము సగం గడిచింది. ప్రపంచ యుద్ధము ఒక కొత్తమలుపు తిరిగింది. జర్మనీ ఆసియామీదికి దండెత్తింది. ఇటు జపాన్ పెరల్ హార్బర్‌లో సుసజ్జితమైన అమెరికన్ నౌకాదళముపై దాడి చేసింది. ఆశ్చర్యకరమైన వేగంతో దాడిచేసి మలయా, ఇండోనీసియా ఇండో చీనా దేశములను జయించింది. 1942 ఫిబ్రవరి 15వ తేది సింగపూర్ ఓడిపోయింది. మార్చి 7 వ తేది రంగూన్ పరాస్తమైంది. మార్చి 29 న మాండలేకూడ జయింపబడింది.

## క్రిప్సు పథకము స్వరూపము

ఇటు దేశంలో కాంగ్రెసు ఆధ్వర్యాన సహాయ నిరాకరణ, సత్యాగ్రహ ఆందోళనలు సాగుతూ ఉండగా, అటు విజయాలు సాధిస్తూ మన దేశ సరిహద్దుల్లోకి జపాన్ సైన్యము వచ్చి నిలిచింది. బ్రిటిషు ప్రభుత్వానికి భయము కలిగినది. క్రిప్సు భారత్‌కు వచ్చి ఇక్కడి నాయకులతో సంభాషణలు ప్రారంభించాడు. ఆయన రూపొందించిన పథకముయొక్క స్వరూపము:

1. యుద్ధము ముగిసిన తర్వాత హిందూదేశానికి రాజ్యాంగము తయారుచేయడానికి ఒక సమితి ఏర్పాటు చేయబడుతుంది.

2. దానిలో సంస్థానాధిపతులు గూడ పాల్గొంటారు.

3. బ్రిటిష్ ఇండియాలో ఏ ప్రాంతమైనా రాజ్యాంగ స్థితిలో చేరదలచకపోతే, అది అలా చేయవచ్చు. ఆ ప్రాంతానికి వేరే రాజ్యాంగ సమితి ఏర్పాటు చేయబడుతుంది.

4. బ్రిటిషు ప్రభుత్వానికి, రాజ్యాంగ సభకు మధ్య సంధి జరిగి భారత ప్రజలకు రాజ్యాధికారాన్ని సంక్రమింపజేసే ఏర్పాటు చేయబడుతుంది; దానిలో అల్పసంఖ్యాక వర్గాల అధికారాలకు పూర్తి సంరక్షణ కల్పించబడుతుంది.

ఈ పథకము ఒక మాయాజాలము. ఇది కాంగ్రెస్‌కే గాక ముస్లిము లీగుకుకూడ ఆమోదయోగ్యంగా లేదు. "దివాలా తీసిన బ్యాంకులో భవిష్యత్తులో మార్చుకొనడానికి ఇవ్వబడిన చెక్కు" అని ఈ పథకాన్ని గూర్చి గాంధీజీ వ్యాఖ్యానించారు. ఇంతలో అండమాన్ ద్వీపము గూడ జపాన్ హస్తగతమైందని సమాచారమందింది. ఏప్రిల్ 6వ తేదీన కొలంబో నగరముమీద బాంబులు పడ్డాయి. అంతేగాక విశాఖపట్టణము, కాకినాడలమీద కూడ బాంబులు పడ్డాయి. ఇంత తీవ్రపరిస్థితి ఎదురైనప్పటికీ, భారతీయ ప్రజలు ప్రభుత్వముతో సహకరించి ప్రాణాలొడ్డి పోరాడి విజయము సాధించడానికి సిద్ధమైనప్పటికీ, సిగ్గుమాలిన బ్రిటిష్ ప్రభుత్వము భారతదేశ భవిష్యత్తు విషయమై సరళమైన, నిశ్చితమైన హామీ యివ్వడానికి తయారుగాలేదు.

## 1942 లో కాంగ్రెసు తీర్మానము

అది 1942 సంవత్సరము. ప్రపంచ యుద్ధానికి సరిగ్గా మధ్య కాలము. అనేక స్థానాల్లో ఆంగ్లేయులు అడుగు వెనుకకు వడుతున్నది. బర్మాలో బ్రిటిషు ప్రభుత్వము భారతీయుల మోటారు బండ్లు లాగుకొని ఆంగ్లేయుల కిచ్చి వారు సులభముగా తప్పించుకొని పరుగెత్తిపోయే వీలు

కలిగింది. భారతదేశంలో తెల్లసైనికుల సౌకర్యము కోసము గ్రామాలకు గ్రామాలే ఖాళీ చేయించబడుతుండేవి. కలకత్తా, బొంబాయి మొదలైన నగరాల్లో తెల్లసైనికులు పట్టపగలు విచ్చలవిడిగా సంచరింపసాగారు. సమాజములోని మాతృమూర్తులు, సోదరీమణులు వారి అత్యాచారాలకు గురికాసాగారు. మహాత్మాజీ మనస్సు వికలమైంది.

"ఒక్క పర్యాయము హింసనైనా అవలంబించండి. అంతేకాని ఈ జులుం, ఈ అత్యాచారాలు సాగనీయకండి స్త్రీల మానాన్ని సంరక్షించండి పిరికిపందలు కాబోకండి. పారుబోతు, హింస చేసేవానికంటె హీనుడని నేను భావిస్తాను."

గాంధీజీ ప్రజల కిచ్చిన సందేశమిది. గాంధీజీ మనస్సు వికలమైంది. నాయకుల మనస్సు వికలమైంది. ప్రజలంతా వికల మనస్కులైనారు. యుద్ధము ఇంగ్లాండు, జర్మనీలమధ్య కాని భారత దేశానికి వ్యర్థ మానహానిభయాలు. జపాన్ భారతదేశంమీద దండెత్తివస్తుందని ఆరోజుల్లో రాత్రిపూట "బ్లాక్ అవుట్" ప్రభుత్వము ఒక చట్టంచేసి గడియారాలు ఒక గంట ముందుకు నడిపించింది. ఎంత మూర్ఖత్వము. కాని కంసునకు నలువైపుల కృష్ణుడే కనబడినట్లు ఆరోజుల్లో బ్రిటిష్‌రు జలస్థలపాషాణాదు లన్నిటిలో జపానే కన్పించేది. కాంగ్రెసు చివరకు ప్రభుత్వాన్ని మరొక్కసారి స్పష్టంగా ఇలా హెచ్చరించింది-మీరు మా రక్షణ చేయ జాలరని స్పష్టమైపోయింది. కాబట్టి దేశరక్షణ బాధ్యతను కాంగ్రెసుకు అప్పగించండి. మేము సేనలో ప్రజలను చేర్చి జపాన్ ఆక్రమణను ఎదుర్కొంటాము. కాంగ్రెసు చేసిన తీర్మానపు మాటల్లో—

"హిందుస్థాన్‌మీద జపాను, జర్మనీల కన్ను పడింది. మీరు మాకు స్వాతంత్ర్యమునివ్వండి. దానితో మీకూ మాకూ మధ్యగల శత్రుత్వము నశించిపోతుంది. ఏ ప్రజాస్వామ్య రత్నాలకోసము మీరు (ఆంగ్లేయులు)

పోరాడుతున్నామని అంటున్నారో, ఆ మాటలు ఇప్పుడు ఋజువవుతాయి అప్పుడు మేము మీకు అన్నివిధాల సహాయపడతాము. ఇదంతా జరగడానికి, మీరు హిందుస్థాన్‌కు స్వాతంత్ర్యము ఇచ్చి మీ దేశానికి వెళ్ళిపోవాలి."

## "క్విట్ ఇండియా" గర్జన

ఈ కోరికను బ్రిటిషు ప్రభుత్వము చెత్తబుట్టలో పారవేసింది. బ్రిటిషు ప్రభుత్వము ఎదుట కేవలము యుద్ధసమస్యే ఒక్కటే ఉంది. అనేకములైన ప్రబలశక్తులతో దశదిశలలో పటిష్టంగా పోరాడుతున్న ప్రభుత్వానికి నిరాయుధులైన భారతీయ ప్రజలంటే యేమిలెక్క? ఏమి భయము? చివరకు నైరాశ్యము హద్దుదాటింది. బొంబాయిలో ఆగస్టు 6,7,8, తేదీలలో కాంగ్రెసు కార్యవర్గ సమావేశము నిశ్చయించబడింది. అక్కడ సహాయ నిరాకరణ తీవ్రతను ఎలా అధికతరము చేయడం అని చర్చలు జరుపవలెనని నిశ్చయింపబడింది. మార్గదర్శనము కొరకు మహాత్మాజీ స్వయంగా ఆ సమావేశాలలో పాల్గొన్నారు. ప్రజల మనస్సుల లోని క్షోభ, అగ్ని పర్వతపు లావావలె భయంకరంగా, ఉష్ణాతి ఉష్ణంగా ఉంది. చాలా క్లిష్టపరిస్థితి నిర్మాణమైంది.

మూడురాత్రులు, మూడు పగళ్ళు చర్చలు సాగుతూనే ఉన్నాయి. జవహర్లాలు, వల్లభభాయి ఉత్తేజితులై ఆవేశంతో మాట్లాడారు. స్వాతంత్ర్యము పట్ల తీవ్రమైన ఆకాంక్ష వారిమాటల్లో సమ్మిళితమై ఉంది. బ్రిటిషు పరిపాలన నేడు సమాప్తమయి తీరాలి. హిందుస్థాన్‌కు సంపూర్ణ స్వాతంత్ర్యము వచ్చితీరాలి. అనే నిశ్చయము వారి ఉచ్ఛ్వాస నిశ్వాసా లలో ప్రకటితమవుతూ ఉంది. ఒక అపూర్వమైన శాసనోల్లంఘన ఉద్య మానికి వాతావరణము ఏర్పడింది. మహాత్మాజీ ఒక తీర్మానము ప్రతిపా దించారు "భారతదేశాన్ని వదలివెళ్ళు" అన్నదే ఆ తీర్మానము. ఈతీర్మా నము మీద మాట్లాడుతూ వల్లభభాయి ఇలా అంటాడు:



"భారత్‌ను వదలిపోండి" అని గర్జిస్తున్న మహాత్మాజీ. ఆ గర్జనతో ప్రాదుర్భవించిన ప్రజా సంగ్రామం

"పనిచేయడమో, లేదా చనిపోవడమో అన్న సంకల్పంతో ఈ యుద్ధము జరగాలి కాని చివరివరకు ఈఉద్యమ స్వరూపము శాంతి యుతంగానే ఉండాలి. స్త్రీలు, పురుషులు పేదలు, శ్రీమంతులు, కార్మికులు, కర్షకులు-అంతా ఆందోళనలో పాలుపంచుకొని తీరాలి. ఈసారి సైనికులుకూడా ఈ ఆందోళనలో పాలుపంచుకోవాలి. అప్పుడే మన యీ ప్రయత్నము సఫలమౌతుంది."

## "కరేంగే యా మరేంగే"

అపూర్వమైన విప్లవకల్పన కారణంగా, సభామండపము కంపించిపోయింది. మూలమూలల నుండి వేడి నిట్టూర్పులు వెలికి రాసాగాయి. ఉత్సాహము పొంగులు వారింది. ప్రతియొక్కరి దేహము ఉప్పొంగింది. అందరికన్నులు కేవలము స్వాతంత్ర్యము మీదనే లగ్నమైనాయి. చంపడమో, చనిపోవడమో— ఈపట్టుదల విశాల సాగర రూపాన్ని

వరించి వచ్చినట్లయింది. ఆ అలలమీదినుండి మహాత్మాజీ మాట్లాడడానికి లేచి నిలచాడు. ఆ సభామండపమేగాదు, దేశమంతా మనస్సును కేంద్రీకరించి మహాత్మాజీ సందేశాన్ని వినడానికి సన్నద్ధమయింది. ఆయన మాటలలో తేజస్సు దీపించింది.

"హర్తాళ్, సహాయనిరాకరణ, లేక మరేయితర మార్గంచేతనైనా అయితే అహింసాత్మకంగా-ప్రతి ఒక్కరు ఆందోళన చేయడానికి పూర్తిస్వేచ్ఛ ఉన్నది. అందులో మృత్యువే ఎదురైతే సత్యాగ్రహి దానిని కూడ అహ్వానించాలి. వ్యక్తి స్వేచ్ఛగా శాంతంగా మృత్యువును ఆలింగనము చేసుకున్నప్పుడే రాష్ట్రము జీవించి ఉంటుంది. మనము మన ఉద్దేశాన్ని సఫలము చేసుకుంటాము. లేదా ప్రాణాలు వదుల్తాము."

"పని చేయడమో, చనిపోవడమో" -ఇది రాష్ట్రముయొక్క ఆఖరి నిశ్చయము, ఇక "భారతదేశాన్ని వదలివెళ్ళు" అన్నది బ్రిటిషువారికి అంతిమ సందేశము. ఆగస్టు 8 నాటి రాత్రి యింకా దాటలేదు "క్విట్ ఇండియా" తీర్మానము ఆమోదించబడింది. అయినా బ్రిటిషువారికి మరొక అవకాశము ఇవ్వవలెనని మహాత్మాజీ అభిప్రాయము. కాని, పై తీర్మానంతో ప్రభుత్వము భయంతో వణకిపోయింది. అది ఆందోళన సాగించే వ్యక్తులను పట్టి చెరసాలలో వేయనారంభించింది. మహాత్మాజీని బంధించింది. కాంగ్రెసు నాయకులు పట్టుబడ్డారు. ప్రతిచోట చిన్న, పెద్ద నాయకులు జైలుపాలైనారు. ప్రత్యక్ష యుద్ధ రణభేరి మ్రోగించే ముందుగానే ప్రభుత్వము ఈ దాడిని ప్రారంభించింది. ప్రజలు ఉడికి పోయారు. మొదట్లోనే లావాద్రవము సలసల మరుగుతున్నది. ఆ పైన ఈ దమన నీతిదెబ్బకు అగ్నిపర్వతము అవులించింది. ప్రళయోత్థ బ్రహ్మాండమైన శబ్దముతో బయల్వెదలింది.

## అగ్నిపర్వతము భయంకరముగా ప్రజ్వలించింది.

అయుధ సంపన్నమైన ప్రభుత్వానికి, ఆవేశపూరితమైన ప్రజలకు మధ్య భయంకర సంగ్రామము ప్రారంభమైంది. ప్రభుత్వ యంత్రాగాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రజలు అంతిమ నిర్ణయం తీసుకున్నారు. మార్గ దర్శనంచేసే నాయకులు అందరు ఇనుప కటకటాలవెనుక బందీలై ఉన్నారు. అందుచేత ప్రజలు ఎవరికివారే నాయకులైనారు. జయప్రకాశ్ నారాయణ్, అచ్యుతరావ్ పట్వర్ధన్ మొదలైన కొందరు నాయకులు ప్రభుత్వం కనుగప్పి రహస్యంగా ఉండిపోయారు. దేశమంతటిలో బహిరంగంగా, రహస్యంగా హింసనుగూర్చి ఆలోచించకుండా ప్రజలు పోరాడసాగారు. ప్రతిచోట హర్తాళ్ జరిగింది. ప్రదర్శనలు జరిగాయి. నిషేధసభలు ఏర్పాటుచేయబడినాయి. తంతి తపాలా ఆఫీసులు, రైలు బండ్లు తగులబెట్టబడినాయి. దేశములో ఒక చివరినుండి మరొక చివరకు ఈ భయంకర సంగ్రామంలో ప్రజలు తమ ఆంతరిక స్ఫూర్తితో పోరాడ సాగారు. ప్రభుత్వము లారీలు, తుపాకులు ప్రయోగింప సాగింది. స్వాతంత్ర్య యోధులను సమూలంగా నాశనము చేయడానికి ఉద్యమించింది.

1942 సంఘర్షణ అపూర్వమైనది. వాస్తవానికి ప్రజలే ఈ పోరాటము నడిపించారు. ప్రజలకు నాయకత్వము వహించే అతివాద, మిత వాద నాయకులు అందరు ఇనుప ఊచల కావల బంధింపడి ఉన్నారు. 25 సంవత్సరాలు ఈదేశంలో విప్లవదేవతయే బందీయై ఉంది. ఈ సమయంలో ఆమె స్వతంత్ర అయింది. అనేక యువకులు నాయకత్వము వహించడానికి తెగువతో ముందుకు వచ్చారు. వారు తమ తమ ఆలోచనల

ననుసరించి చిత్తశుద్ధితో కృషిచేసారు. దానితో పరరాజ్యశక్తి బెంబేలు పడిపోయింది.

బీహారులోను, ఉత్తరప్రదేశ్ తూర్పు భాగంలోను అనేక వారాల వరకు రైల్వే యంత్రాంగము పూర్తిగా స్తంభించి పోయింది. 150 పోలీసు స్టేషన్‌లు, 250 రైల్వే స్టేషనులు ధ్వంసం చేయబడినాయి. సతారాజిల్లా విప్లవములో అగ్రస్థానం వహించింది. అక్కడి ప్రజలు ప్రభుత్వానికి పోటీగా మరొక ప్రభుత్వాన్ని నెలకొల్పారు. మిద్నపూర్‌లో కూడ ఇటువంటి గౌరవదాయకమైన స్థితి ఏర్పడింది. అస్సాంనుండి బొంబాయి వరకు ముఖ్యంగా కలకత్తా, అలహాబాద్, పాట్నా, పూనా నగరాలు వీరత్వంలో పరాకాష్ఠ నందుకున్నాయి. బ్రిటిషు ప్రభుత్వానికి తల తిరిగి పోయింది. అది ఉక్కిరి బిక్కిరి అయింది.

## వీరమాత మాతంగినీ హజ్రా

అగస్టు 14 వ తేదీన జరిగిన హర్తాళ్ అసాధారణమైనది. ఇందులో మిద్నపూర్ అన్నిటికంటె ముందు నడిచింది. తామ్లుక్ విభాగములోని దృశ్యము రోమాంచమును కలిగించింది. ఈ విభాగములోని ప్రజలు సెప్టెంబర్ 29 వ తేదీన సర్కారు అధికారుల నందరినీ బంధించివేయవలెనని నిశ్చయించుకున్నారు. పథకము ప్రకారము వారు సెప్టెంబరు 28 రాత్రి రహదారికి ఇరువైపుల గల చెట్లను నరికి అడ్డంగా పడవేశారు. దారులు మూతబడినాయి. 60 వంతెనలు అకస్మాత్తుగా త్రెంచివేయబడినాయి. హుగ్లీ నది మీద సామానులను చేరవేసే పడవలు హుగ్లీ నది మధ్యకుపోయి అక్కడే నిలబడిపోయినాయి. 27 మైళ్ళ పొడవుగల రహ

దారి ప్రక్కనగల 194 తంతి స్తంభాలు పెకలించి పడవేయబడినాయి 29వ తేదీన అన్నిచోట్ల బ్రహ్మాండమైన ఊరేగింపులు లేవదీయబడినాయి. ప్రజల ఊరేగింపుకు స్వాగతం పలకడానికి సైన్యము సిద్ధంగా నిలిచింది.

ఈ ఊరేగింపులో ఒక భాగానికి 73 సంవత్సరాల వృద్ధ స్త్రీ నాయకత్వం వహించింది. ఈ పూజ్యమాత పేరు మాతంగినీ హజ్రా. ఆమె నాయకత్వం వహించిన దళము సాహసంతో సైనికుల వద్దకు వెళ్ళి నిలిచింది. క్షణకాలంలో ఆ వృద్ధమాత మాటకు జవాబుగా ఒక తూటా వచ్చి ఆమెను కూల్చివేసింది. చేతిలో గట్టిగా పట్టుకొన్న జండాను పైకెత్తుతూ ఈ తల్లి ప్రాణాలు వదిలింది. ఆమెకు వీరస్వర్గము, హుతాత్మత లభించాయి. ఆమె తేజో విశేషము ప్రజలపై ప్రసరించింది. ప్రజలు ఉత్తేజితులై లేచినిలిచారు. వీధివీధిన సంకుల సమరము సాగింది. ప్రజలు జయించారు. తుములక్ నగరంలో జాతీయ ప్రభుత్వము స్థాపింపబడింది. ఈ స్వతంత్ర ప్రభుత్వ అధికారంలో ఖులాహరీ, నంద్రిగామ్, మహీబదాదల్, తాములక్ పోలీసు స్టేషనులున్నాయి. ఈ జాతీయ ప్రభుత్వానికి స్వయంగా ఏర్పరచుకున్న సేన 'బిజలీ టుకడీ' (మెఱుపు తునక) ఉంది.

పై విధమైన విప్లవయుద్ధము ప్రతిచోట ప్రజలు తమంతతాము ఉత్తేజితులై సాగించారు. పలుచోట్ల జాతీయ ప్రభుత్వాలు స్థాపింపబడినాయి. ఈ యుద్ధాలలో వేలకొలది ప్రజలు మృత్యువాతబడినారు. లక్షల మంది బంధితులైనారు. నాయకత్వము లేనందున ఈ అపూర్వ వీరత్వము 'ఉత్కట దేశభక్తి అంతా నిష్ఫలమై పోతున్నట్లనిపించింది. కాని వాస్తవమదికాదు. ఈ స్వాతంత్ర్యపు పొంగులో సామాన్య మానవునికి స్వాతంత్ర్యేచ్ఛ, ఆత్మాహుతికై సంసిద్ధత ప్రభుత్వ దృష్టికి వచ్చినాయి. భారత జనత మందే అగ్నిపర్వతమని ప్రభుత్వానికి తెలియవచ్చింది

## పులకరింపజేసే క్షణాలకై ప్రతీక్ష

ఈ విధంగా అపూర్వ సంఘటనలు ఈ దేశంలో జరుగసాగాయి. నాయకులంతా బందీలైపోయినారు. ఆ క్లిష్ట సమయంలో ప్రజలు ఒక వీర నాయకుని మాటిమాటికి స్మరిస్తుండేవారు. ఆ వీరాగ్రణి సుభాష్ చంద్ర బోస్ ఒకప్పుడు ప్రభుత్వపు కళ్ళలో దుమ్ముచల్లి ఈ మహవీరుడు వెళ్ళిపోయాడు. ఛత్రపతి శివాజీ యొక్క ఆగ్రా విజయాన్ని గుర్తుకుతెచ్చి పులకరింపజేస్తుంది ఈ సంఘటన. సుభాష్‌బాబు ఎక్కడ రహస్యంగా ఉండిపోయినాడో ఎవరికీ తెలియదు. అంతా అతి రహస్యము.



# పంతొమ్మిదవ అధ్యాయము

# రాష్ట్ర గౌరవపాత్రుడు

# సుభాష్ చంద్రబోస్

**1942** సంవత్సరము మొదటి భాగంలో ప్రపంచ యుద్ధము తీవ్రరూపం ధరించింది. యుద్ధము భారతదేశ ముఖద్వారము వద్దకు వచ్చి నిలిచింది. 1942 ఏప్రిల్ 5వ తేదీన జపాన్ కొలంబోమీద బాంబు వేసింది. 6వ తేదీ విశాఖపట్టణము, కాకినాడలమీద బాంబులు వర్షించాయి. బంగాళాఖాతములో జపాన్ యుద్ధనౌకలు సంచరింపసాగాయి. నలువైపుల యుద్ధ వాతావరణము అలుముకుంది. దేశమంతా 'బ్లాక్ అవుట్' ప్రారంభమైంది. దేశంలో తిరుగుతున్న తెల్లసైనికులు అల్లకల్లోలము చేస్తున్నారు. తల్లులు-చెల్లెండ్ర మానమర్యాదలు హరిస్తున్నారు. ఈ యుద్ధములో మనకు కొంచెముకూడ సంబంధము లేకపోయినా, కేవలము బానిసలమైనందున మనము ఈ చెప్పరాని అత్యాచారాలు సహించవలసి వచ్చింది. ఈ పీడనము, ఈ అన్యాయాలు, ఈ అత్యాచారాలతో ప్రజలు స్తిమితము కోల్పోయారు. నాయకులు వ్యాకులపడ్డారు. మహాత్మాజీ చింతిం

దారు. వచ్చిచెప్పే పద్ధతిలో ఆంగ్లేయ ప్రభుత్వానికి ఆయన రెండు మాటలు చెప్పజూచారు. కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వంతో ఇలా అన్నది;

"మీరు మాకు రక్షణ కల్పించలేరన్న విషయము స్పష్టమైంది. కాబట్టి దేశరక్షణ బాధ్యతను భారతీయులకు అప్పగించండి. అప్పుడు సేనలను సమకూర్చడంలో మాకు ఆనందము కలుగుతుంది. ప్రజలకు ఈ రాజ్యము తమది అనిపించాలి. కాబట్టి ముందుగా భారతదేశానికి స్వాతంత్ర్యము ఇచ్చిచూడండి. యుద్ధకాలంలో తాత్కాలిక ప్రభుత్వము మా హస్తగతం చేయండి. అప్పుడు మీరు మేము కలిసి జపాన్ ఆక్రమణను ఎదుర్కొందాము. యుద్ధము ముగిసిన తర్వాత రాజ్యాంగ నిర్ణయ సభను ఏర్పరచి తగిన విధంగా రూపురేఖలన్నీ తయారు చేయించుదాము.

ఈ కోరికను ప్రభుత్వము త్రోసిపుచ్చింది. చివరకు మహాత్మాజీ 'భారతదేశాన్ని వదలివెళ్ళు' అని ప్రభుత్వాన్ని స్పష్టంగా హెచ్చరించడం జరిగింది 'పని చేయడమో, లేదా చనిపోవడమో' అన్న నిశ్చయంతో ప్రజాసామాన్యము పోరాటములో పాల్గొనవలసిందని ఆహ్వానింపబడింది. ఈ ఆహ్వానంతో ప్రజలు మెరుపులాగా మేల్కొన్నారు. అపూర్వ యుద్ధాన్ని ఆరంభించారు. దేశమంతటిలో నాయకులను బంధించడము ఆరంభమైంది. అనేక వీరులు పోలీసులకు చిక్కక రహస్యంగా వ్యవహరింపసాగారు. రైలుబండ్లు తల్లక్రిందులు చేయడం, ఖజానాలు దోచుకోవడం, పోలీసు స్టేషనులు తగులబెట్టటం, పోస్టాఫీసులు ధ్వంసచేయడం, ప్రభుత్వ అధికారులను బహిష్కరించడము ఇలా అన్ని విధాల ఉద్యమము ప్రారంభమైంది. గ్రామ గ్రామంలో, జిల్లా జిల్లాలో పోటీ ప్రభుత్వాలు స్థాపింపబడినాయి. బ్రిటిషు ప్రభుత్వ యంత్రాంగము పనిచేయకుండా నలువైపుల నుండి అడ్డంకులు కల్పించబడసాగాయి.

## శివాజీ ప్రతాపాన్ని స్మరణకు తెస్తూ

మహాత్మాజీ మొదలైన నాయకులు జైళ్ళలో ఉంచబడినారు. ప్రజల్లో అశాంతి ప్రబలింది. ఏమిచేయాలో వారికి అర్థంకావడంలేదు. ఈ సమయంలో దేశ గౌరవ పాత్రుడైన సుభాష్ చంద్రబోస్ మనమధ్య ఉండి ఉంటే ఆయన నిశ్చయంగా ఈ జనశక్తికి సరియైన మార్గముచూపి ఉండేవాడు. ఆయన ఇనుప ఊచల వెనుక ఉండనే లేదని ప్రతియొక్కరికి అనిపిస్తుండేది. ఆ విధముగా అనుకోవడము గూడ సబబే. ప్రభుత్వ జైలునుండి సుభాష్‌బాబు ఛత్రపతి శివాజీ అడుగుజాడల్లో సరాసరి మాయమైనాడు అయితే అయనిప్పు డెక్కడ ఉన్నాడు? జీవించి ఉన్నాడా? స్మశానములో ఉన్నాడా ? హిమాలయములో ఉన్నాడా?- ఈ విధమైన ప్రశ్న లనేకము ప్రజల మనస్సుల్లో గూడుకట్టుకున్నాయి. అలా ఉండగా సుభాష్‌బాబు జర్మనీలో ఉన్నట్లు ఒకనాడు వార్త అందింది. ఆయన ఆజాద్ హింద్ సేన తయారుచేశాడు. కొన్ని రోజుల తర్వాత స్వతంత్ర భారత ఆకాశవాణిపై సుభాష్ చంద్రుని పరిచిత కంఠం వినిపించింది ఆయన ఇలా అన్నాడు :

"అక్కడ, చాల దూరాన, ఆ నదికి అవతల ఒడ్డున ఆ అడవి ఆవల ఆ పర్వత శిఖరాల దిగువ మన ధ్యేయభూమి ఉన్నది. ఏ భూమిలో మనము జన్మించామో, ఆ మాతృభూమి అక్కడ ఉన్నది. ఒక్కింత వినండి. హిందుస్థాన్ గొంతెత్తి పిలుస్తున్నది లెండి. పని చేయకుండా వ్యర్థం చేయడానికి మీకు వ్యవధిలేదు. ఆయుధాలు పైకెత్తండి. శత్రుసైనికుల నేలగూల్చుతూ, వారిమధ్యనుండి దారిచేసుకుంటూ వెళ్దాము. లేదా భగవదిచ్ఛ మరోలాగ ఉంటే హుతాత్ముని మరణము పొందుదాము. మన చివరి నిద్రలోకూడ ఢిల్లీకి కొనిపోయే మార్గాన్ని ముద్దిడుకొనవలసిందని మన సైనికులతో చెబుదాము ఢిల్లీ మార్గమే స్వతంత్రతకు మార్గము. ఢిల్లీ చలో: ఢిల్లీ చలో."

## సుభాష్‌బాబు దివ్యజీవనము

బాబు సుభాష్ చంద్రబోస్ కటక్‌లో 1897 జనవరి 23వ తేదీన ఒక శ్రీమంతులైన కులీనుల వంశంలో జన్మించాడు. ఆయన తల్లి ప్రభావతీదేవి పవిత్రశీల, శ్రద్ధాళువు. ధార్మిక ప్రవృత్తిగలది. తండ్రి సుప్రసిద్ధుడైన వకీలు. సుభాష్‌బాబు బాల్యమునుండి తెలివిగలవాడు, చురుకైనవాడు; ఆవేశపరుడు. పాఠశాల, కళాశాల విద్యలో ఎల్లప్పుడు ప్రథముడుగా ఉండేవాడు. 192 లో ఆయన ఐ సి.యస్. లో కృతార్థుడైనాడు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో నీతిశాస్త్రము, మనస్తత్వశాస్త్రము లలో ఉన్నత స్థానాన్ని అందుకున్నాడు.

ఆ రోజుల్లో ఐ.సి.యస్. రావడం ఒక గొప్ప పురుషార్థముగా భావించేవారు. కాని, ఈ పురుషార్థము దాస్యపు సంకెళ్ళను చేజేతుల తమ పాదాలకు బిగించుకోవడమే. స్వాతంత్ర్యాన్ని కోరే సుభాష్ మనసు సంకెళ్ళను స్వయంగా తగిలించుకోవడానికి సిద్ధంగాలేదు. ఆయన తన రాజీనామా పత్రాన్ని భారత మంత్రికి పంపించాడు. దేశబంధు చిత్తరంజన్ దాస్ మార్గదర్శనంలో రాజకీయ జీవితంలో అడుగు పెట్టాడు.

సుభాష్‌బాబు సహజంగానే ఆవేశపరుడు. ఛత్రపతి శివాజీ సంప్రదాయాన్ని ఉపాసించేవాడు. విప్లవకారుల ఆందోళనకు ప్రోత్సాహము, సహకారము, సమర్థన ఇచ్చేవాడు. ఆయన రాజకీయాలలో ప్రవేశించిన కాలము విప్లవ భావాలకు ప్రతికూలమైన కాలము. ప్రథమ ప్రపంచ యుద్ధకాలములో భారతీయ విప్లవకారులు విలక్షణమైన ఆవేశముతో బ్రిటిషు ప్రభుత్వముతో పోరాడారు. కాని ఆ యుద్ధములో వారు పరాజయాన్ని పొందారు. దేశంలో వైఫల్యపు నీలినీడలు వ్యాపించాయి ఆ సమయంలో మహాత్మాజీ ముందుకువచ్చారు. సహాయ నిరాకరణ, సత్యాగ్రహము అనే నూతనాస్త్రాలను మనకిచ్చారు.

## స్వాభిమాన భారతదేశానికి అలంకారము

ఇదే సమయంలో ఆంగ్లదేశ యువరాజు భారత దేశానికి వచ్చాడు. ఆ సందర్భంలో దేశంలో ప్రచండమైన ఆందోళన తుఫానులాగ లేచింది. సుభాష్‌బాబు ఆ ఆందోళనకు నాయకుడు. ఈ సమయంలో మొదటి సారిగా ఆయన జైలులో అడుగుపెట్టాడు. అటు తర్వాత జైలే ఆయన యిల్లైపోయింది. దేశబంధు దాస్ కలకత్తా కార్పొరేషన్‌కు అధ్యక్షుడుగా ఎన్నిక కాగానే ఆయన సుభాష్ చంద్రుని కార్పొరేషన్‌కు ఛీఫ్ ఎగ్జిక్యూటివ్‌గా నియమించాడు. ఈ పదవికి రాగానే సుభాష్‌చంద్రుడు చేసిన పనులు రెండు. మొదటిది : ఆంగ్లేయులకు సమ్మాన పత్రాలు సమర్పించడము ఆపివేసి, దానికి బదులు దేశభక్తులను సమ్మానించే సదాచారాన్ని ప్రారంభించాడు. రెండవది : ఉచిత ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టాడు.

సుభాష్ బాబు గట్టి పట్టుదల గల విప్లవకారుడని ప్రభుత్వము యొక్క దృఢ విశ్వాసము, కాని ప్రభుత్వము వద్ద దానికి తగిన ఆధారాలు లేవు. చివరకు ఒక చిన్న విషయంలో సుబాష్ బాబును బంధించి మాండలేలోని కారాగృహానికి పంపించింది ప్రభుత్వము. సుభాష్ బాబు అది గౌరవంగా భావించాడు. లోకమాన్యుని నివాసముచేత పవిత్రమైన ఆ స్థానానికి నమస్కరించి అక్కడ ప్రవేశించాడు. ప్రజలు ఆయన విముక్తికోసము బ్రహ్మాండమైన ఉద్యమము సాగించారు. విధిలేని పరిస్థితులలో ప్రభుత్వము ఎటువంటి షరతులు లేకుండానే ఆయనను విడుదల చేసింది

## చెరసాలే స్వగృహము

జైలు నుండి విడుదలకాగానే కాంగ్రెసు కార్యక్రమాలలో ఆయన విశేషశ్రద్ధ చూపించసాగాడు. యువకుల ప్రియతమ నాయకుడాయన. 1929 సంవత్సరములో మహారాష్ట్ర ప్రాంతీయ సభకు ఆయన అధ్యక్షత

వహించాడు. అధ్యక్షస్థానమునుండి ఆయన సంపూర్ణస్వరాజ్య ఆకాంక్షను ప్రకటించాడు. లోకమాన్యునిపట్ల ఆయనకు అత్యంత భక్తిభావ ముంది. ఛత్రపతి శివాజీ ఆయన యిష్టదైవము. స్వాతంత్ర్యమునకు శివాజీ చూపిన మార్గ మొక్కటే సరియైన సోపానమని ఆయన విశ్వాసము. ఆయన శివాజీని తన ఆదర్శానికి ధ్రువతారగా ఎంచుకున్నాడు.

ఆ కాలములో కాంగ్రెసు మహాసభలలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము మాటిమాటికి వస్తూ ఉండడము సుభాష్ బాబు ప్రోత్సాహము వల్లనే. మోతీలాల్ నెహ్రూ మొదలైన పెద్దనాయకులు అధినివేశప్రతిపత్తితోనే తృప్తిపడ్డారు. కాని, యువతరము వారికి సంపూర్ణ స్వాతంత్ర్యము తప్ప ఇతరము అంగీకారముకాదు. పం॥ జవాహర్లాల నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షుడు కాగానే ఆయన సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదింపజేసి శాసనోల్లంఘన ఆందోళనను ప్రకటించాడు. ఆనాటి ఆందోళనలన్నిటిలో సుభాష్ బాబు అగ్రేసరుడుగా ఉండేవాడు. అయితే మహాత్మాజీతో ఆయనకు సరిపడేదికాదు. గాంధీ ఇర్విన్ ఒడంబడికకు సుభాష్‌చంద్ర తీవ్రమైన అసమ్మతి తెలియజేసాడు. 1931 లో శాసనోల్లంఘన ఆందోళన విరమింపజేయడానికి గాంధీజీ నిశ్చయించినప్పుడు, సుభాష్ బాబు తీవ్రంగా వ్యతిరేకించాడు. ఇంతేగాక బెంగాల్‌లో శాసనోల్లంఘన ఉద్యమాన్ని తీవ్రతరం చేసే కార్యక్రమములో ఆయన నిమగ్నుడైనాడు. ఫలితంగా బంధింపబడగా, చెరసాల గోడలు ఆయనకు దక్కాయి.

చెరసాలతో ఆయన ఆరోగ్యము చెడింది. ప్రభుత్వము ఆయనను వదలివేయవలసి వచ్చింది. దేశాన్ని వదలి వెళ్ళవలసిందనే షరతుమీద విడుదల లభించింది. సుభాష్‌బాబు యూరోపుకు వెళ్ళాడు. అక్కడ జర్మనీ నాయకుడు హిట్లర్‌ను కలుసుకున్నాడు. ప్రపంచ రాజకీయాల విషయమై ఈ ఇద్దరు నాయకులు సుదీర్ఘమైన చర్చలు జరిపారు. సుభాష్‌బాబు దూర

దృష్టి కలవాడు. ప్రతిభా సంపన్నమైన ఆయన దృష్టికి ఆ సమయంలోనే రెండవ ప్రపంచ యుద్ధ ఛాయలు స్పష్టంగా గోచరించాయి. ఈ అవకాశాన్ని లాభదాయకంగా మనం ఉపయోగించుకోవాలి అని ఆయన మనస్సులో నిశ్చయించుకున్నాడు. భారతీయ స్వాతంత్ర్య సంగ్రామము చర్చలు, సంప్రతింపుల జాలంలో చిక్కుకొనిపోయింది. ఈ సంగ్రామ బాధ్యతను వహించిన కాంగ్రెసు నాయకత్వమును తాను స్వయంగా చేతిలోకి తీసుకోవాలి అనేమాట అప్పుడే ఆయన మనస్సులో నిశ్చయించుకున్నాడు. వెంటనే ఆయన భారతదేశానికి తిరిగివచ్చాడు.

కాని ప్రభుత్వము ఆయనను భారతదేశంలో ఉండనీయడానికి ఒప్పుకోలేదు. హిట్లర్, ముసోలినీ, డీవెలరా మున్నగు వివిధ జాతీయ నాయకులతో సమాలోచనలు జరిపే ఈయన సామాన్య నాయకుడు కాడని ప్రభుత్వానికి చక్కగా తెలుసు. వెంటనే అది ఆయనను బంధించివేసింది మరల చెరసాల మరల అనారోగ్యము, మరల విడుదల కాని, ఆయన భారత దేశాన్ని వదని వెళ్ళే షరతుమీద, మరల యూరోపు వైపుకు ప్రయాణము కట్టాడాయన

## కాంగ్రెసు అధ్యక్ష స్థానములో

ఈ రెండవ యూరోపు పర్యటనలో ఆయన మార్గాన్ని నిశ్చయించు కున్నాడు. గాంధీజీమాటలకు 'ఔనౌను' అంటూ 'కాంగ్రెసు జిందాబాద్' అని కేకలువేస్తూ ఉంచేనే భారత్‌లో ఉండగలనని ఆయన తెలుసుకున్నాడు తన భావాలు మార్చుకున్నట్లు చూపించి ఆయన భారతదేశానికి తిరిగివచ్చి గాంధీజీ ప్రశంసకులలో ప్రవేశించాడు. ముంగిట నిలచియున్న రెండవ ప్రపంచయుద్ధము తలుపు తట్టకముందే దేశానికి ప్రతినిధి సంస్థయైన కాంగ్రెసు నాయకత్వము తన చేతిలోనికి తీసుకొనే ఉద్దేశ్యముతో ఆయన

కార్యశీలుడైనాడు. 1938 లో హరిపుర కాంగ్రెసు అధ్యక్ష స్థానము ఆయనకు అప్పగించబడింది. అప్పుడు తన అధ్యక్షోపన్యాసములో

"రాబోవు సంకట స్థితిని ఉపయోగించుకుని, భారతజాతియొక్క సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్షను బ్రిటిషు ప్రభుత్వము మన్నించక తప్పనట్లుగా చేయాలి. బ్రిటన్ భారతదేశపు కోర్కెను మన్నించకపోతే, దానితో యుద్ధము చేయడానికి సిద్ధమై ఆ రోజును ప్రకటించాలి." అని హెచ్చరించాడు.

సుభాష్ చంద్రుని ఈ పలుకులు భవిష్యత్తును సూచిస్తున్నాయి. గాంధీజీ తన దృష్టిలో ఈ మాటలకు విలువకట్టి, తీవ్ర భావాలుకల సుభాష్‌ను కాంగ్రెసుకు దూరంచేయడానికి నిశ్చయించుకున్నాడు. మరుసటి సంవత్సరము త్రిపురలో కాంగ్రెసు మహాసభ జరగవలసిఉంది. ఈ కాంగ్రెసు సభలకు అధ్యక్షస్థానానికి డాక్టర్ పట్టాభి సీతారామయ్య పేరును మహాత్మాజీ సూచించాడు. ఇది అత్యంత ప్రాముఖ్యముగల కాలము. బ్రిటిషువారికి కలుగగల ఆపదను ప్రయోజనకారిగా చేసుకునే దృష్టితో సుభాష్‌బాబు కాంగ్రెసు నాయకత్వముతానే వహింప దలచాడు. ఆయన స్పష్టంగా ఎదురు తిరిగి అధ్యక్ష పదవికి తానుకూడా పోటీలో నిలిచాడు.

ఈ అధ్యక్షుని ఎన్నిక బాగా ప్రచారమైంది. సుభాష్‌బాబు అధిక సంఖ్యాకుల బలంతో ఎన్నుకోబడినాడు కాని అనారోగ్యమువల్లను, కాంగ్రెసులోని పెద్దనాయకుల అవరోధములు కల్పించే విధానమువలనను, ఈ అధ్యక్ష పదవిని ఆయన ఉపయోగించుకొనలేకపోయాడు. ఆయన కాంగ్రెసుకు రాజీనామాయిచ్చి బయటకువచ్చి 'ఫార్వర్డు బ్లాక్' ను స్థాపించాడు. ఒక మహాయుద్ధానికి సన్నాహాలను ఆయన ఒంటరిగానే ప్రారంభించాడు.

## అనారోగ్యంతో ఒక్క సంవత్సరము

సుభాష్‌చంద్ర బోసు ఎంతో వ్యాకులతతో 1940వ సంవత్సరమంతా గడిపాడు. దేశ స్వాతంత్ర్య యుద్ధము విజయవంతము కావడానికి ప్రపంచయుద్ధ కాలాన్ని ఉపయోగించుకొన దలచిన ఆయన ప్రణాళికలోని మొదటి అడుగే విఫలమయింది. కాంగ్రెసు తన చేతిలోకి రాలేదు. రాజకీయాలన్నా, జీవితమన్నా విసిగిపోయాడు ఇంతలో లండన్‌లో ఉధామ్‌సింహ భారతీయ అసంతోషానికి చిహ్నమైన తూటా ఒకటి సర్ ఓ డాయర్‌పై ప్రయోగించి జాతీయ స్వాభిమానాన్ని ఉత్తేజముచేసాడు

## భవ్య, దివ్య స్వప్నము

సుభాష్ మనస్సు వికసించింది. నిరాశా మేఘాలు తొలగిపో సాగాయి. మసక వెలుగులు కనిపించసాగాయి. ఆ వెలుగు క్రమంగా తెంజాయగా మారింది. అరుణకాంతులు ఆకసాన్ని పూర్తిగా ఆవరించాయి, అప్పుడెక్కడనుండో మంత్ర ఘోష ఘన గంభీరధ్వని వినిపింప సాగింది. ఎఱ్ఱరంగు కాషాయవర్ణముగా మారింది. అక్కడ ఒక పతాకము ఎగురుతూ ముందుకు వస్తున్నది. యజ్ఞ జ్వాలలు కనుపించసాగాయి. యజ్ఞ కుండము కనుపిస్తున్నది. ఒక్కొక్క ఆకారము స్పష్టంగా కనపడు తున్నది. నానాసాహెబ్ పీష్వా రక్తకమలము చేతిలోకి తీసుకొని నిలచి యున్నాడు. సేనాపతి తాత్యాటోపే, వీరసాధ్వి ఝాఁసీరాణి లక్ష్మీబాయి, న్యాయమూర్తి రానడే, వాసుదేవ బలవంత్, రామసింహ కూకా, లోక మాన్య తిలక్, మహర్షి పట్వర్ధన్, ఛాపేకర్ సోదరులు, మదన్‌లాల్ ధీంగ్రా, సరదార్ భగత్‌సింహ, చంద్రశేఖర ఆజాద్ – వీరంతా నిలిచి యున్నారు. యజ్ఞవేదికకు ఎదురుగా సంకెళ్ళలో చిక్కియున్న మాతృదేవి చరణాలు కనుపిస్తూ ఉన్నాయి. దానిపైన కన్నీటి పూలజల్లుకురుస్తున్నది ఈ తల్లి సంకెళ్ళు ఎవరు త్రెంచి పారవేస్తారు? దోపిడి గుంపులు కురి

పించే మూలుకును ఎవరు త్రుంచివేస్తారు? మృత్యుదేవత కౌగిలితో ఎవరు ఆడుకుంటారు? రణ చండిని ఎవరు ప్రసన్నురాలిని చేస్తారు?

దేశ స్వాతంత్ర్య సంగ్రామంలో ఒక మహోద్యమంలో ఒక ఆహుతి తర్వాత మరొక ఆహుతి వేస్తూ ఉండవలసిందే, రక్తవర్ణ జ్వాలలు సర్వదా పైకి లేవవలసిందే జ్వలించే అగ్నిని ఇనుమిక్కిలిగా జ్వలింపచేయవలసిందే హృదయము లోని అగ్నిచే సంతప్తమైనప్పుడు మన పాపాలు పరిహారమౌతాయి. పౌరుషం పైకుబుకుతుంది. భీకర పరాక్రమము ప్రకటిత మౌతుంది. మంటలను విరజిమ్మే అగ్నికుండము మాత్రమే మృత్యువాహినిని ప్రవహింపజేస్తుంది. అప్పుడు ప్రళయమెంత ప్రచండంగా ఉంటుందో, ఖడ్గధారి అయిన భారతదేశ తేజ మెటువంటిదో ప్రపంచానికి ప్రత్యక్షమౌతుంది.

## భీష్మ ప్రతిజ్ఞ

ఆ అద్భుత దృశ్యాన్ని సుభాష్‌బాబు అవలోకించాడు. అది కల కాదు. నిజము అది సాక్షాత్కారము. అది సవికల్ప సమాధి. సుభాష్‌బాబు ఆ సమాధిలో నిమగ్నుడైనాడు. ఆయన మనస్సు ఏకాగ్రమయింది. ఆయన నానాసాహెబ్ వైపుకు చేతులు చాచి పరమ పవిత్రమైన ఆ రక్త కమలాన్ని అర్థించాడు-

"నానాసాహెబ్, ఆ రక్తకమలము నాకు ఇచ్చివేయండి, దేశ స్వాతంత్ర్యము కోసము శత్రువులను వారి నెత్తుటి మడుగులో ముంచి వేయడానికి నేను నిశ్చయించుకున్నాను సర్వశక్తిమంతుడైన భగవంతుని సాక్షిగా నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను నా మాతృదేశ స్వాతంత్ర్యము కోసము హిందుస్థాన్‌లోని 38 కోట్ల సోదరుల విముక్తి కోసము సుభాష్ చంద్రబోసు అనబడే నేను, నా కంఠంలో చివరి ఊపిరి ఉన్నంతవరకు ఈ స్వాతంత్ర్య యజ్ఞాన్ని సాగిస్తాను. నేను ఎల్లప్పుడు భారతదేశ సేవకుడు



ఆ అద్భుత స్వప్నములో, మెరిసిపోతున్న అగ్నికుండం ఎదురుగా సుభాష చంద్రబోసు, నానాసాహెబ్ పీష్వానుండి స్వాతంత్ర్య సమరప్రతీకమయిన రక్తకమలాన్ని తనచేతిలోకి తీసికున్నాడు

గానే ఉంటాను. నా దేశ బాంధవుల హితాన్ని గూర్చియే ఆలోచిస్తాను నా పరమాదర్శమిదే. స్వాతంత్ర్యము లభించిన తర్వాత గూడ దేశ స్వాతంత్ర్య సంరక్షణకై నా శరీరములో చివరి నెత్తుటిబొట్టు ఉన్నంత వరకు పోరాడడానికి సిద్ధంగా ఉంటాను. ఇవ్వండి, ఇవ్వండి నానా సాహెబ్ ఆ పవిత్ర రక్తకమలాన్ని నాకందించండి"

## తన స్మృతిపథంలో డాక్టర్ హెడ్గేవార్

నానాసాహెబ్ ఆరక్తకమలాన్ని సుభాష్‌బాబుకు అందిస్తున్నాడు భారతమాతాకీ జై, జై హింద్ నినాదాలతో ఆకాశము మారుమ్రోగుతోంది. వీరత్వ తేజము నరనరాల్లో పొంగులు వారుతోంది. రూపెత్తిన త్యాగము సాటిలేని సాహసము తీవ్ర తపస్య అవిరళసాధన. సుభాష్‌చంద్రుని మీద

తేజస్సును వర్షిస్తున్నాయి వెలుగు- వెలుగు- వెలుగు; ఎటుచూచినా వెలుగే, సుభాష్‌బాబు ధ్యానమునుండి మేల్కొంటున్నాడు. తెలివిలోకి వస్తున్నాడు అంతటా వెలుగు నిండిపోతున్నది. హుతాత్ముడు ఉధామ్ సింహ చేసిన వీరకార్య పరిణామమే యిదంతా ఆ నరపుంగవుని కార్యముద్వారా భారతదేశ అంతఃకరణలోని భావము ప్రపంచపుటంచులలో ప్రతిధ్వనించింది. దాని పరిణామమే యిది. సుభాష్‌బాబు లేచి నిలచాడు. తర్వాతి ప్రయత్నాలతో నిమగ్నుడైనాడు. భారతదేశంలోని ఒక్కొక్క నాయకుని సామర్థ్య కేంద్రాన్ని ఆయన మనస్సున తెచ్చుకుంటున్నాడు. ఎవరి సలహా పొందాలి; ఎవరితో సమాలోచనలు జరపాలి అన్నది ఆయన యెదుట నిలిచిన ప్రశ్న. మొట్టమొదట ఆయన మనస్సుకు తోచిన వ్యక్తి పరమ పూజనీయ డాక్టర్ హెడ్గేవార్. డాక్టర్‌జీ, సుభాష్ బాబులకు ఇంతకు పూర్వమునుండే దృఢమైన సంబంధమున్నది. కలకత్తాలో డాక్టర్‌జీ గడిపిన జీవితము అసాధారణము. యువక వర్గానికి ఆదర్శ మాయన. అనుశీలనసమితిలో ప్రతిజ్ఞాబద్ధుడైన సభ్యుడు. ఆయన గడచిన 15 సంవత్సరాలనుండి నెత్తురు నీరుగా మార్చి రాష్ట్రీయ స్వయం సేవక సంఘ కార్యాన్ని బలశాలిగా నిలిపాడు. రాష్ట్ర పునరుద్ధరణకు సంఘ కార్య నిర్మాణము తప్పనిసరి. ఇందులో ఎక్కడకూడా డాంబికము ప్రదర్శన లేదు. అందరిలాగా బాజాలు వాయించి ప్రచారము చేయడము లేదు. పనిచేస్తున్నామనే అహంకారము లేదు. కాని, దూరదృష్టితో కర్తవ్యబుద్ధితో ఆయన మౌలికమైన కార్యాన్ని ప్రారంభించాడు. సుభాష్ బాబు వెంటనే బయలుదేరి డాక్టర్‌జీని కలుసుకోడానికి నాగపూర్‌కు ప్రయాణమైనాడు. సుభాష్‌బాబు నాగపూర్‌కు వచ్చాడు. కాని ఆ సమయములో డాక్టర్‌జీ తన ప్రాణాహుతులను యజ్ఞవేదికమీద అర్పిస్తూఉన్నాడు. ఆహుతి యజ్ఞకుండంలో అర్పింపబడింది. సుభాష్‌బాబుకు కేవలము ఆయన తేజస్సు మాత్రమే దర్శనమిచ్చింది.

## ఇరువదవ అధ్యాయము

# సుభాష్‌చంద్రుని అద్భుత సీమోల్లంఘనము

ఆ కర్మయోగి తేజోమూర్తి దర్శనంతో సుభాష్‌చంద్రుని రోమ రోమము నవచైతన్యముతో పులకితమయింది. డాక్టర్‌జీకి ప్రణమిల్లి ఆయన అక్కడనుండి వెనుదిరిగాడు. డాక్టర్‌జీ జీవనజ్యోతి చైతన్య రూపమై నిలిచింది.

1940 వ సంవత్సరము జూన్‌నెల 21 వ తేదీ ఉదయం తొమ్మిది న్నర గంటలవేళ, వార్ధాలో సుభాష్‌చంద్రబోసు ఒక బహిరంగ సభలో ప్రసంగించవలసి ఉంది. అపార జనసముద్రము సుభాష్‌బాబును దర్శించి ఆయన సందేశము వినడానికి ఆసక్తితో వచ్చి నిలిచింది. పదిగంటలైనా సుభాష్‌బాబు జాడ తెలియలేదు. అందరూ ఆలోచనలో పడ్డారు. ఇంతలో సుభాష్‌బాబు వచ్చాడు. సభ ప్రారంభమైంది. సుభాష్‌బాబు ఆనాడు ప్రసన్న హృదయంతో ఉన్నట్లు కనిపించలేదు. ఏవో తీవ్రదుఃఖఛాయలు ఆయన ముఖంమీద స్పష్టంగా గోచరిస్తున్నాయి. ఆయనగొంతు పూడి

పోయింది. ఆయనకళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. డాక్టర్ హెడ్గేవార్ మరణించిన దుఃఖవార్తను విన్నప్పుడు ఆయన నోటినుండి మాటలే పెగిలి రాలేదు. ఆనాటి ఉదయమే తొమ్మిదింబావుకు డాక్టర్‌జీ దివంగతుడైనాడు. అందువలననే సుభాష్‌బాబు నాగపూర్‌నుండి బయలుదేరి రాటానికి ఆలశ్యమైంది.

డాక్టర్‌జీ అమరులైనారు. చైతన్యమూర్తి అయిన డాక్టర్‌జీ దర్శనంతో సుభాష్‌బాబుకు నవచైతన్య లాభము కలిగింది. ఆయన హృదయాంతరాళంలో నవోత్సాహము పరవళ్ళు త్రొక్కింది. సుభాష్‌బాబు స్వయంగా విప్లవభానుడు. ఒక మహాయుద్ధానికి ఆయన నాయకత్వము వహించవలసి ఉంది. ఈ సమయంలో రాజనీతి నైపుణ్యము నూటికి నూరుపాళ్ళు చూపించవలసిన అవసరముంది. అనుక్షణము మెలకువతో ఉండవలసిన అవసరముంది. సుభాష్‌బాబు చింతాక్రాంతుడైనాడు. ఎదుట మరల ఆదేప్రశ్న నిలిచింది. ఎవరి సలహాపొందాలి? ఎవరితో ఈ విషయమై చర్చించాలి?

## బొంబాయిలో స్వాతంత్ర్య వీరునితో

మరునటిరోజు జూన్ 22వ తేదీన సుభాష్‌బాబు బొంబాయి వెళ్ళాడు. విప్లవయుద్ధకాలమునాటి యుగప్రవర్తకుడు, జ్ఞాని, స్వతంత్రతా గానంచేసిన మహాకవి బొంబాయిలోనే ఉంటూ ఉన్నాడు. సుభాష్‌బాబు ఈ ప్రతిభాశాలిని దర్శించి ఆయన వలన మార్గనిర్దేశము పొందదలచాడు.

తిన్నగా సావర్కార్ సదన్ వైపుకు సుభాష్‌చంద్రుని అడుగులు సాగినాయి. ఈ యుగపురుషుని సమ్ముఖములో మరొక యుగపురుషుడు వెళ్ళి నిలిచాడు. వినమ్రుడై నమస్కరించాడు. వారిద్దరి చురుకైన చూపులు కలుసుకున్నాయి. నరనారాయణులు రహస్యచర్చలుసాగించారు. ఆర్యచాణక్యునికి చంద్రగుప్తుడు లభించాడు.

స్వాతంత్ర్య వీర సావర్కార్ మొదటి వాక్యములోనే ప్రధాన విషయాన్ని ప్రతిపాదించాడు. "ఈ యుద్ధకాలములోనే భారత స్వాతంత్ర్య సంగ్రామము సాగించాలి. దానికి సైన్యమే శక్తిసంపన్నమయిన కేంద్రము. దాని సహాయంతోనే సాయుధ సంగ్రామము నడిపించాలి" అని ఆయన స్పష్టంగా చెప్పాడు.

## అవును, సాయుధసంగ్రామమే

'సాయుధ సంగ్రామము' అను మాట చెవిన బడగానే సుభాష్‌బాబు మనస్సు నూతన సాక్షాత్కారముతో కంపించిపోయింది. సావర్కార్‌జీ ఇంకా ఇలా అంటూనేఉన్నాడు:

"ఈ కాలములో దేశములో అడుగడుగున అడ్డంకులు కల్పించే విధానముతో సాధించిన ప్రయోజనాన్ని స్థిరముగా ఉంచుకొనగల దేశభక్తుల పక్షమొకటి అవసరం. అదనుకోసము వేచియుండే పక్షమొకటి సేనలో ఉండాలి. బయటనుండివచ్చే సాయుధసహకారమునకు నేతృత్వము వహించే మూడవపక్షముకూడ ఉండాలి. దానికి నాయకత్వము వహించడముకూడ ప్రధానమైనదే."

"అవును. ఆ నాయకత్వము ఎవరు ఎలాగ వహిస్తారు" సుభాష్‌చంద్ర అన్నాడు.

"ఎలాగ? ఎవరు?" సుభాష్‌చంద్రుని మాటలనే రెట్టించి పలికి, 1857 నుండి భారతీయ విప్లవకారులు చేస్తూ ఉన్న అటువంటి ప్రయత్నాల సంపూర్ణ చరిత్రను వినిపించి, వీరసావర్కార్ ఇలాఅన్నాడు:

"ప్రస్తుత మహాయుద్ధము వలన బ్రిటన్ క్లిష్టపరిస్థితిలో చిక్కుకొని ఉంది. ఈసమయంలో మీవంటి దూరదృష్టి గల నాయకులు హిందుస్థాన్‌లోనే ఉండిపోయి, పేదులలోని బ్రిటిషువారి విగ్రహాలు పెక

లించడము వంటి అల్పవిషయాలపై అందోళన చేసి బ్రిటిషువారి చెరసాలలో క్రమ్మగిపోవడంలో అర్థమేమైనా ఉందా?"

అప్పుడు కొద్దిగా నిరాశా స్వరముతో సుభాష్‌చంద్ర అన్నాడు ; "ఏదో ఒకటి చేసి ప్రజలలో బ్రిటిషువారికి విరుద్ధంగా అసంతుష్టి నిర్మాణము చేస్తూ ఉండాలి. లేకుంటే మరేమి చేయగలను?"

అంతట స్వాతంత్ర్య వీర సావర్కార్ ఇలా అన్నాడు. "మీ ఆవేదన నాకు తెలుసు. కాని మిమ్ములను ఒక్కమాట అడుగుతాను. గవర్నర్ జనరల్ మొదలైన వేలాది అంగ్లేయ పాలకులు ఈనాడు దేశాన్ని పీడిస్తూ ఉండగా, హాల్‌వెల్ వంటి గతించిపోయిన బ్రిటిషు దౌర్జన్యకారుల శిలావిగ్రహాలు తీసివేయించడములో వ్యయమైపోయే ప్రజల అసంతృప్తి వ్యర్థంకాదా? మీవంటి నాయకులు చెరసాలకు వెళ్ళడం మనకు మనమే శత్రువులుగా తయారై పనిచేసినట్లు కాలేదా? సాధ్యమైనంత వరకు శత్రువులను బందీలుగా చేయడంలో నిజమైన రాజనీతి ఉన్నది కాని, తమ్ము తాము బందీలుగా చేసుకోవడంలోకాదు చూడండి సుభాష్‌బాబు, మీకు విప్లవకారులతో చిరకాలంగా సంబంధాలున్నాయి. రహస్యాన్ని కాపాడగలరు. ఒక్క విషయము మీతో చెప్పాలనుకుంటున్నాను. నేను దేశవ్యాప్తంగా సాగించిన, చాలవరకు సఫలమైన సైనికీకరణ ఆందోళనకు మూలం విప్లవోద్యమమే."

## భారత సరిహద్దులు దాటి వెళ్ళండి

అటుతర్వాత స్వాతంత్ర్య వీరసావర్కార్ ప్రథమ ప్రపంచ యుద్ధ కాలములో సాయుధ విప్లవకారులు జర్మనీతో చేసుకున్న సమయోచిత సంధి, బ్రిటిషువారి తరఫున పోరాడి జర్మనీ చేతిలో చిక్కిన భారతీయ సైనికులతో స్థాపింపబడిన క్రాంతిసేనల స్ఫూర్తి దాయకమైన చరిత్ర సవివరంగా చెప్పి, ఒక కాగితము అయన ముందుంచుతూ,

"రాస బిహారి బసు ఇటీవల వ్రాసిన ఈ ఉత్తరము చూడండి. దీనివలన జపాన్ ఈ సంవత్సరములోనే యుద్ధము ప్రారంభించడానికి పూర్తి అవకాశముందని అనిపిస్తుంది. (వాస్తవానికి సావర్కార్ జీ చెప్పినట్లుగానే ఆ తర్వాత జరిగింది). ఈ విధంగా జరిగితే మన దేశ స్వాతంత్ర్యము కోసము జర్మనీ, జపాన్‌ల నూతన ఆయుధాలతో, పోరాటములో కాకలుతీరిన వేలాది భారతీయ సైనికులతో, హిందూస్థాన్‌లోని ఆంగ్లేయ పాలకులమీద బయటనుండి దండెత్తి రావడానికి మీకు చక్కని అదను లభింపబోతున్నది. ఈ వంటి సమయాన్ని స్వదేశంలో కేవలము చిన్న చిన్న ఆందోళనలతో వ్యర్థపుచ్చి మీవంటి నాయకులు స్వయంగా దుర్జనులైన ఆంగ్లేయుల చేతజిక్కి, తెలిసి తెలిసి చెరసాలలో చిక్కుపడి క్రుంగిపోవుట అన్నివిధాల హానికరము. రాసబిహారి వంటి అనేక విప్లవ నాయకులు హిందుస్థాన్ నుండి బ్రిటిషువారి కళ్ళలో దుమ్ముచల్లి జపాన్, జర్మనీల వంటి దేశాలకు వెళ్ళినట్లుగానే మీరుకూడ ప్రభుత్వము కళ్ళుగప్పి దేశంనుండి వెళ్ళిపోండి. అక్కడ ఇటలీ, జర్మనీ చేతుల్లో చిక్కిన వేలాది భారతీయ సైనికులకు మీరు పూర్తిగా నేతృత్వము వహించండి. హిందుస్థాన్ సంపూర్ణ స్వాతంత్ర్యము పొందినదని ప్రకటించండి. జపాన్ యుద్ధములో దిగడంతోటే అనువైన మార్గంద్వారా, బంగాళాఖాతము ద్వారా గాని, బర్మానుండిగాని హిందుస్థాన్‌లోని బ్రిటిషురాజ్య శక్తిపై బయటనుండి దాడిచేయండి. ఇటువంటి సాయుధ సాహస విక్రమము లేకుండా మనము హిందూదేశాన్ని స్వతంత్ర మొనరింపలేము. ఇటువంటి పరాక్రమము సాహసము చూపగల సామర్థ్యముగల వ్యక్తులు ఇద్దరు ముగ్గురు నా దృష్టిలో ఉన్నారు. వారిలో మీరొకరు. వారందరిలోకూడ నా దృష్టిలో మీకు ప్రత్యేకమైన యోగ్యత ఉన్నది."

సుభాష్ ఆశ్చర్య చకితుడై వింటున్నాడు. ఇంతటి దివ్యప్రతిభను ఆయన అప్పటివరకు దర్శించి ఉండలేదు. చాలసేపటివరకు ఒకరినొకరు రెప్పవాల్చకచూస్తూ ఉండిపోయారు. అటుతర్వాత సుభాష్‌బాబు హఠాత్తుగా



స్వాతంత్ర్య వీరుని సందేశమును ఆశ్చర్యచకితుడై వింటున్న సుభాష్‌బాబు

లేచినిలిచాడు. కృతజ్ఞతా పూర్వకంగా స్వాతంత్ర్య వీరసావర్కర్‌కు నమస్కరించి గద్గద స్వరముతో ఇంతమాత్రమే అన్నాడు: "నేను

ఇప్పుడు మొదట కలకత్తావెళ్ళి, తర్వాత ముందటి కార్యక్రమము నిశ్చయించుకుంటాను."

## శివాజీయే మన ఆదర్శము

సుభాష్‌బాబు కలకత్తాకు ప్రయాణమైనాడు. ప్రయాణంలో ఆయన మనస్సులో ఒకే ఒకమాట, "సాయుధ సమరము". దానికోసము ఇప్పుడు హిందూదేశందాటి వెళ్ళాలి. ఏ నెపంమీద ఇప్పుడు దేశం వదిలి వెళ్ళగలను అని ఆయన ఆలోచిస్తున్నాడు. ఆలోచన చక్రంలాగే ఆ రైలు చక్రాలు పరుగెత్తుతున్నాయి. సుభాష్‌బాబు కలకత్తా చేరాడు. స్టేషన్‌లో 'ఫార్వర్డు బ్లాక్' కార్యకర్తలు ఆయనకు స్వాగతం చెప్పాడానికి సిద్ధంగా ఉన్నారు సుభాష్‌బాబు త్వరత్వరగా లేచాడు. స్టేషన్‌లో దిగాడు. అప్పుడాయన ముఖంలో ఒక అపూర్వ తేజను ప్రకాశిస్తూ ఉంది.

అనుకున్నట్లుగా త్వరలోనే 'హాల్‌వెల్' స్మారక కాండలో సుభాష్‌బాబును బంధించి జైలులో వేసింది ప్రభుత్వము. కారాగారముంటే దేశభక్తులు చింతన చేసుకోడానికి ఏర్పాటైన ఏకాంత గుహ. చింతన తర్వాత జైలునుండి పలాయనము. ఇది వీరుల కాహ్వానము. ఛత్రపతి శివాజీ ఆగ్రానుండి విముక్తి పొందినతీరు సుభాష్‌బాబుకు గుర్తువచ్చినది.

గతంలో 1937 లో విజయరత్న మజుందార్ అను బెంగాలీ సాహిత్యవేత్తతో సంభాషిస్తూ సుభాష్‌బాబు బెంగాలీ సాహిత్యంలో శివాజీ మీద మంచి పుస్తకము ఒక్కటిగూడ లేదా? అని అడిగాడు.

అందుమీదట నిషేధించబడిన ఒక పుస్తకము విషయము ఆయన చెప్పాడు. అంతట ఆలోచనాధీనుడై గంభీరంగా సుభాష్‌బాబు ఇలా అన్నాడు.

"భారతీయులు తమ స్వాతంత్ర్య సమరములో శివాజీ మహా రాజును మరలమరల అనుకరించవలసిన రోజు త్వరలోనే వస్తుంది. విదేశీ శక్తిని తరిమికొట్టడానికి మనము ఆయన మార్గంలోనే వెళ్ళాలి."

"హింస ద్వారానా, అహింస ద్వారానా." అని మజుందార్ ప్రశ్నించాడు.

"మీకు తోచినవిధంగా." అని సుభాష్‌బాబు సమాధానము నేను చెప్పదలచింది చాల స్పష్టంగా చెప్పాను. శివాజీ ! శివాజీ'!! శివాజీ!!! శివాజీయే మన ఆదర్శము, ధ్రువతార కావాలి. మీవంటి సాహిత్యవేత్తలు అట్టి విద్యాప్రసారమును కర్తవ్యముగా భావించి నిర్వహించాలి."

శివాజీ ఆగ్రానుండి తప్పించుకొని పోయిన విషయములో అయన ఆ సందర్భంలో స్పష్టంగా ఇలా చెప్పాడు. "అది కుక్కకాటుకు చెప్పు దెబ్బ. పిశాచాన్ని మోసపుచ్చవలసిందే. అది మోసపుచ్చబడిందికూడ. శివాజీ మహారాజు ఎదుట ఒక ఉన్నతమైన, ఉదాత్తమైన, భవ్యమైన జీవనకార్య మున్నది. అయన స్వదేశమును దాస్యమునుండి 'విముక్తి నొందించాలి. శివాజీ మహారాజు ఈ మహత్కార్యాన్ని పూర్తిచేసితీరాలి"

జైలులో రేయింబవళ్ళు సుభాష్‌బాబుకు ఛత్రపతి శివాజీ కన్పిస్తు న్నాడు. అయనతో శివాజీ మాట్లాడుతున్నాడు. మంతనాలు చేస్తున్నాడు. విముక్తిని గూర్చి అనేక విషయాలు చెప్పాడు. సుభాష్‌బాబును శివాజీ ఆవేశించాడు. తాను ఈ మహత్కార్యాన్ని పూర్తిచేయాలి. అతనికి మరొక మాటయే తోచడంలేదు. శివాజీ తేజమే ఆయన రోమరోమంలో నిండిపోయింది. ఆయనకు దారి దొరికింది.

## అజ్ఞాతశక్తి ఆకర్షణ అనే నాటకము

ఆ నాటినుండే ఆయన అన్నము మానివేసాడు. జైలు లోపల, వెలుపల ఆందోళన వ్యాపించింది. ప్రజలలోని ఈ అలజడి కారణంగా ప్రభుత్వము సుభాష్‌బాబును విడుదల చేసింది. కాని ఆయన స్వంత ఇంటి నుండి కదలకుండా నిర్బంధాలు విధించింది. అది 1940 డిశంబర్ 5వ తేదీ కావచ్చు. సుభాష్‌బాబు అస్వస్థత కారణంగా ఇంటికి వచ్చాడు. కొంచెము బాగానే ఉన్నట్లు డాక్టర్లకు అనిపించింది. కాని ఆయన ప్రవర్తన బట్టి ఆయనను ఆరోగ్యము రాజకీయాలు, జీవితము వీటన్నిటి మీద విసుగుపుట్టినట్లు తోచింది. ఆయనను అజ్ఞాతశక్తి ఏదో పిలుస్తున్నాది. ఆయన ధ్యానం చేయడానికి కూర్చుండసాగాడు. రోజుల తరబడి ఆయన గది తలుపులు మూయబడి ఉండేవి. తర్వాతిరోజుల్లో ఆ గది పూర్తిగా మూతబడిపోయింది. భోజనపు పళ్ళెము గది తలుపు క్రింది సందుగుండా లోపలికి పంపబడుతుండేది. ముందుముందు అదిగూడ రెండేసి రోజుల తర్వాత తీసుకొనబడుతుండేది.

జనవరి 16వ తేదీని రోజూలాగే భోజనపు పళ్ళెము తలుపు క్రింద సందుగుండా లోపలికి పంపబడింది. [illegible] గడిచింది. రెండు, మూడు నాల్గు...పదిరోజులు [illegible] గే ఉంది. ఇంట్లోవాళ్ళు కంగారుపడ్డారు. ప్రభుత్వ [illegible] గున వచ్చిచేరారు తలుపులు బ్రద్దలుకొట్టి లోపలచూడగా అక్కడ ఎవరూ లేరు. సుభాష్ రహస్యంగా వెళ్ళిపోయాడు.

జనవరి 27 నాడు దేశము ఆశ్చర్యచకితమైంది. సుభాష్‌బాబు రహస్యంగా వెళ్ళిపోయాడని వార్తాపత్రికలలో చదివి ప్రతియొక్కడు తమకు తోచిన విధంగా ఊహించ నారంభించారు. ఆయన భగవంతుని నూతనావతారంగా భావించ నారంభించారు. ఇది యోగసిద్ధియొక్క చమ

త్కారంగా తలపోసి ప్రజలు సుభాష్‌బాబు ఎదుట విస్రమ్ములైనారు. కాని ప్రభుత్వము చాల భయపడిపోయింది. అనాడే రెండవ ప్రపంచయుద్ధంలోని అగ్రశ్రేణి నాయకులు జర్మనీ నియంత హెర్ హిట్లర్‌తో మంతనాలు సాగిస్తూ ఉన్నట్లు గూఢచారుల ద్వారా ప్రభుత్వానికి విశ్వసనీయంగా తెలియవచ్చింది. రాజహంస ఇప్పుడు తీరసీమనుండి దూర భూములకు ఎగిరిపోయింది.

భవిష్యత్తును సూచించే, సాహసోపేతమైన ఈ పలాయనము ఛత్రపతి శివాజీ, స్వాతంత్ర్య వీర సావర్కర్ అడుగుజాడల్లో నడిచిన పరిధు లెరుగని పరాక్రమ గాథ.



ఇరువది ఒకటవ అధ్యాయము

# ఆజాద్ హింద్ ప్రభుత్వము

ఇక చేతులు నలుపుకుంటూ కూర్చోడము తప్ప ప్రభుత్వము మరేమీ చేయలేకపోయింది. ఔరంగజేబును వంచించడంలో శివాజీ ప్రదర్శించిన అలౌకిక చాతుర్యమును, అపార సాహసమును జిత్తులమారి బ్రిటిషు సామ్రాజ్యశక్తిని మోసపుచ్చడములో సుభాష్‌బాబు చూపించాడు. పిచ్చిదానిలాగా తెల్ల దొరతనము తెల్లబోయి సుభాష్‌బాబు పరాక్రమము వింటూ కూర్చుంది దాని మస్తిష్కము శూన్యమైంది. అది తలపట్టుకు కూర్చుంది.

## అద్భుత సీమోల్లంఘనము

ప్రపంచ చరిత్రలోనే సుభాష్‌బాబు చేసిన ఈ సీమోల్లంఘనకు సాటి కనిపించదు. కలకత్తా నుండి బెర్లిన్ వరకు ఆయన చేసిన యాత్ర యొక్క చరిత్ర శరీరాలను పులకింపజేస్తుంది. 1941 సంవత్సరము జనవరి 16వ తేదీ రాత్రి 8 గంటలవేళ నలుగడలా అంధకారం ఆవరించి ఉంది. గూఢచారులుగూడ మత్తులోబడి ఏమరి ఉన్నారు. సుభాష్‌బాబు

ఇంటినుండి ఒక పఠాన్ బయటికి వచ్చాడు. అక్కడ సిద్ధంగా ఒక లారీ నిలబడి ఉంది. దాంట్లో అతడు కూర్చొని త్వరగా పెషావర్ వైపుకు ప్రయాణము సాగించాడు. అతడు జియాఉద్దీన్ అని పేరుపెట్టుకున్నాడు అతని స్నేహితుడు భగత్‌రామ్ కూడ వెంట ఉన్నాడు. ఇద్దరూ కాబూల్ వైపుకు సాగిపోతున్నారు. ప్రయాణంలో భాషవిషయంలో ఇబ్బంది కలుగసాగింది. దానితో జియాఉద్దీన్ ఒక్కసారిగా మూగవాడు,చెవిటివాడు అయిపోయాడు ఇద్దరూ కాబూల్ నది ఒడ్డుకు చేరుకున్నారు. ఇక నదిని దాటాలి. ఎన్నో కష్టాలు ఎదుర్కొంటూ నదిని దాటి కాబూల్ నగరము చేరారు. అప్పటికి బయలుదేరి అయిదు రోజులయింది. కాబూల్‌లో లాల్ ఉత్తమ్‌చంద్ ఈ పఠాన్‌కు ఆశ్రయ మిచ్చాడు. అక్కడి ఇటలీదేశ రాయబారి కార్యాలయముతో సంబంధ మేర్పరచుకొని, దాని సహకారముతో మాస్కో మార్గముగా జర్మనీ చేరుకున్నాడు మన పఠాన్-సుభాష్‌బాబు.

## "నేతాజీ" అయిన సుభాష్‌బాబు

బెర్లిన్ హాంబర్గుల మధ్య హిట్లర్ సుభాష్‌బాబును కలుసుకున్నాడు. సమావేశ స్థలానికి సుభాష్‌బాబు వస్తూఉండగానే హిట్లర్ ఆయనకు గౌరవ సూచకముగా ఎదురు నడిచాడు. 'హిస్ ఎక్సలెన్సీ సుభాష్‌బాబుకు నేను స్వాగతము పలుకుచున్నాను' అంటూ ఆయనను ఆహ్వానించాడు. దేశ గౌరవ పాత్రుడైన సుభాష్‌చంద్ర నేతాజీ సుభాష్‌చంద్ర అయినాడు. ఆ మహాసాహసి, ప్రతిభాశాలి అయిన నాయకునికి జర్మన్ జాతి మహోదాత్త స్వాగతము సమర్పించింది. జర్మన్ వార్తాపత్రికలు సుభాష్‌బాబు సాహసము, త్యాగమయ జీవనములగూర్చిన రచనలతో నిండిపోసాగాయి.

ఆ కాలములో స్వదేశమునుంచి పారిపోయిన దేశభక్తుడు, భగత్ సింహ పినతండ్రి అయిన అజిత్ సింహ అక్కడ నివసిస్తూ ఉన్నాడు

ఆయన, సుభాష్‌బాబు కలుసుకున్నారు. భారతీయులసంఘటన నొకదానిని ఏర్పరచారు. దీనిలోనుండే ఆజాద్ హింద్ ఫౌజ్ (స్వతంత్ర భారత సైన్యము) నిర్మించవలసి ఉంది. అందుకోసము యుద్ధములో జర్మనీ



నేతాజీ సుభాష్‌చంద్రబోసు - హిట్లర్‌ల సమాగమము

చేతిలో చిక్కిన బ్రిటిష్ సైన్యములోని భారతీయ సైనికులను సుభాష్‌బాబు సమావేశపరచాడు. ఆజాద్ హింద్ సేన నిర్మించే ఆలోచన వారి ముందుం చాడు. భారతీయ సైనికులు దానికి ఉత్సాహంతో సహకరించారు. జైహింద్ గర్జనలతో ఆకాశము మార్మ్రోగిపోయింది. ఆజాద్ హింద్ సేన స్థాపన జరిగింది చూస్తూ ఉండగనే వేయిమంది సైనికులుగల బెటాలియన్‌లు ఎనిమిది తయారైనాయి. డ్రెస్‌డెన్‌లో ప్రధాన సైనిక కార్యాలయము స్థాపింప బడింది. కార్యకలాపాలు ప్రారంభమైనాయి. స్వయంగా హిట్లరు ఈ సేనను కలిసికొని ఆశీర్వదించాడు

## యుద్ధంలో జపాన్ ప్రవేశం

1941 డిసెంబర్ 7వ తేదీ ఒక పెద్ద మార్పు తెచ్చింది. ఆనాడు గొప్పగొప్ప ఆశలతో జపాన్ యుద్ధరంగంలో దుమికింది. జపాన్ సాగించిన దాడిలో పెరల్ హార్బర్, మలయా, డచ్, తూర్పు ఇండియా దీవులు దెబ్బతిన్నాయి. అందుమీదట అమెరికా, బ్రిటన్, చైనా, డచ్ ప్రభుత్వాలు కలసికట్టుగా జపాన్‌ను ఎదుర్కొనడానికి సన్నద్ధ మయినాయి. కాని, ఒక్క దెబ్బలో ఆ సంయుక్త సంఘటన ధ్వంసమైపోయింది. వారము రోజుల లోపల సింగపూర్ జపాన్ హస్తగతమైంది. తర్వాత మలయా సంపూర్ణంగా జపాన్ ఆధిపత్యంలోకి వచ్చింది. ఈ యుద్ధములో 50 వేల మంది సైనికులు జపాన్ చేతిలో చిక్కి బందీలైనారు వారిలో భారతీయులు 32 వేలమంది.

జపాన్ యుద్ధములో దిగడము నేతాజీకి ఆనందము కలిగించింది. ఏ మహత్తర శుభఘడియలకోసం తాను ఉత్సుకతతో ఎదురుచూస్తూ ఉన్నాడో, ఆ క్షణము రానే వచ్చింది. భారతీయ స్వాతంత్ర్య స్వర్ణ శిఖరము ఆయన కనులకు గోచరించినట్లే అయింది. ఆయనకు ఢిల్లీలోని లాల్ ఖిల్లా (ఎఱ్ఱకోట) కనుపింపసాగింది. ఆ కోట కొమ్మున 'విజయీ విశ్వతిరంగా ప్యారా' సగర్వంగా ఎగురుతూ కన్పింపసాగింది. అకస్మాత్తుగా ఢిల్లీ చలో అని అయన నోటివెంట ఒక శబ్దము వెలువడింది. సాక్షాత్తుగా అది ఒక మహాకావ్యము.

జపాన్ యుద్ధంలో ప్రవేశించినందుకు మరొకరి మనస్సుకూడ ఆనంద తరంగితమైంది. ఆయన రాసబిహారి బసు. ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో ఆయన చూపిన సాహసము సఫలము కాలేదు. భారత దేశమునుండి పారిపోయి అయన జపాన్ ఆశ్రయంలో ఉండవలసి

వచ్చింది. 24 సంవత్సరాలపు పైగా ఆయన రేపలను కలలు కంటూ ఉన్నాడు. మాతృభూమి స్వాతంత్ర్యము కోసము ఆయన ప్రతినపట్టి ఉన్నాడు. మాతృభూమి చరణ స్పర్శకై ఆయన తహతహలాడి పోతు న్నాడు. అయనకూడ ప్రపంచ రాజకీయాలను నిశితంగా పరిశీలిస్తుండే వాడు. సుభాష్ చంద్రుని వంటి ప్రతిభాశాలి బ్రిటిషువారి పంజరమునుండి తప్పించుకొని రావడము అయనకు శుభశకునముగా తోచింది. రూపములేని కలలు రూపెత్తిన నిజాలు కాబోతున్నాయి. అందుకోసము రెండవ స్వాతంత్ర్య సమరము సాగించడానికి సరియైన అదను ఇదే అని ఆయనకు తోచింది.

తిన్నగా ఆయన మలయాకు వెళ్ళాడు. మలయాలో మూడు లక్షల మంది భారతీయులున్నారు. జపాన్‌వారి బందీలుగా 88 వేలమంది భారతీయ సైనికులున్నారు. వీరందరు స్వాతంత్ర్య సమరంలో సంఘటితంగాపాల్గొన డానికి సన్నద్ధంచేసే కార్యాన్ని రాసబిహారి స్వీకరించాడు. రాసబిహారి కార్యశక్తి నిరుపమానము ఒక జపాన్ రచయిత దానిని ఇలా వర్ణిస్తాడు.

"ఫిబ్రవరిలో జపాన్ సింగపూర్ మీద అక్రమణ ప్రారంభించింది. బ్రిటిష్ సేనలు ఈ అక్రమణను పటిష్టంగా ఎదుర్కొన్నాయి. రాసబిహారి బసు ఒంటరిగా అగ్రశ్రేణి యుద్ధరంగంలోకివెళ్ళి నిలచాడు. బ్రిటిష్ సేన లోని భారతీయ సైనికులను నకిలీ దేశభక్తికి బలికావద్దని హెచ్చరించాడు. విశుద్ధమైన భారత స్వాతంత్ర్య భావనతో నిండిన ఆయన మనస్సు హృద యాలను కదలించే మాటలనే పలికింది. ఆ మాటలొక అద్భుతాన్ని సృష్టిం చాయి. కాల్పులు ఆగిపోయాయి రాసబిహారి ప్రసంగము పూర్తిఅవుతూ ఉండగానే జైహింద్ నినాదాలుచేస్తూ భారతీయ సైనికులు వచ్చి ఆయన వెనుక నిలిచారు.

# స్వాతంత్ర్య సంఘస్థాపన

రాసబిహారి ప్రయత్నాలు తీవ్రగతిని సాగడంచ్చాయి. మార్చి 28 నుండి మార్చి 30 వరకు ఆయన టోక్యోలో ఒక సమావేశము ఏర్పాటు చేసాడు ఆ పరిషత్తులో జపాన్, చైనా, మలయా, థాయిలాండ్ (సయాం)ల లోని భారతీయులు పాల్గొన్నారు. ఈ పరిషత్తులో "భారతీయ స్వాతంత్ర్య సంఘము" స్థాపింపబడింది. ఈ సంస్థ ఉద్దేశ్యము విదేశీ అధిపత్యము, నిర్దేశనము, నియంత్రణలేని పూర్ణ స్వాతంత్ర్యము అని ప్రకటింపబడింది. బెర్లిన్‌లో నేతాజీ సుభాష్‌చంద్రబోసు స్థాపించినట్లుగా అజాద్ హింద్ ఫౌజు స్థాపించడానికి నిశ్చయింపబడింది అటు తర్వాత కేవలము మూడు నెలలకు, అనగా జూన్‌లో బాంకాక్‌లో ఇటువంటిదే భారతీయుల భారీ సమావేశము జరపడానికి నిశ్చయించుకొని, ఆ సమావేశము ముగిసింది.

తూర్పుదేశాలలోను, జపాన్‌లోను రాసబిహారి భారతీయ స్వాతంత్ర్యముకోసము కార్య నిమగ్నుడైనట్లుగానే చైనాలో ఆనందమోహన సహాయ్ "ఇండియన్ నేషనల్ అసోషియేషన్ ఇన్ చైనా" అను పేరిట ఒక సంస్థను స్థాపించాడు. సయాంలో స్వామి సత్యానందపురి ఇదేవిధంగా ఒక సంస్థను స్థాపించాడు. పూర్వ నిర్ణయము ననుసరించి జూన్‌నెల 14వ తేదినుండి 23వ వరకు బాంకాక్‌లో భారతీయుల రెండవ సమ్మేళనము జరిగింది. ఈ మహాసభకు జావా, సుమత్రా, ఇండో చైనా, బోర్నియో మంచూరియా, హాంకాంగ్, బర్మా, మలయా, జపాన్ మొదలగు దేశాల నుండి ప్రతినిధులు వచ్చారు. "భారతీయ స్వాతంత్ర్య సంఘా"నికి అందరి ఆమోదము, సమర్థన లభించాయి. "అజాద్ హింద్ ఫౌజు" స్థాపనకు మరొక్కసారి అందరి అంగీకారము లభించింది. సర్వజనామోదముతో

నేతాజీ సుభాష్‌చంద్ర బోసును ఈ పరిషత్తు నాయకునిగా ఎన్నుకున్నది. వెంటనే బయలుదేరి రావలసినదిగా ఆయనకు ఆహ్వానము పంపబడింది.

నేతాజీ ఈ ఆహ్వానముచూచి ఆనందంతో పొంగిపోయాడు. మాతృభూమి సేవలో సర్వోన్నతమైన గౌరవ స్థానము ఆయనకు లభించింది. భావోద్విగ్నమైన హృదయంతో ఆయన అజాద్ హింద్ సేన నుండి సెలవు తీసుకున్నాడు. వారి ఆశీస్సులను అర్థించాడు. అనిశ్చిత పరిస్థితి దృష్ట్యా ఆయన సహచరుల హృదయాలు ఒదలిపోయాయి. ఎంతో సాహసికులు, శూరులు, రణధీరులు అయినప్పటికీ తమ ప్రియతమ నాయకుని దూరప్రాచ్యదేశాలకు పంపవలసి ఉన్నదనే భావన మెదలగానే వారి గుండెలు కొట్టుకున్నాయి. ఏమాటలతో, ఏవిధంగా ఆశీస్సులివ్వాలి. వారి కన్నెదుట కాలుని కరాళదంష్ట్రి విస్తృతమై కనిపిస్తున్నది. హాలాహల విషసిక్తమైన ఆ నాలుక, ఆ వాడి కోరలు వారిని భయకంపితులను చేస్తున్నాయి. బెర్లిన్ నుండి టోక్యో వరకు సుభాష్‌బాబు ప్రయాణము వాస్తవానికి మృత్యుముఖములోనికి తమ ప్రియతమ నాయకుని తమంతతాము నెట్టడమే అవుతుంది. సహచరులు వికల మనస్కులైనారు. వారు తలలు పైకెత్తలేకపోయారు. వారి నోటినుండి మాటలే రాలేదు.

## మృత్యుసాగర యాత్ర

సుభాష్‌బాబు చలించిపోయాడు ఆయన కళ్ళలో నీరు తిరిగింది. ప్రపంచమంతా అసూయపడదగినంత అపారప్రేమ తనకు లభించింది. 'ఈ స్నేహ ఋణాన్ని నేనెలా తీర్చగలను?' అని నేతాజీ తన మనస్సులోనే ఆలోచింపసాగాడు. ఆయనకు సమాధానము దొరికింది. మాతృభూమి స్వాతంత్ర్యము మాతృభూమి విముక్తికోసము తాను ఆవులించిన మృత్యుముఖములోనుండి పయనించాలి. సహచరుల అపార ప్రేమయే తనకు అజేయత నిస్తుంది. ఆయన దానినే హారినుండి ఇలా అర్థించాడు. "మిత్రు

లారా! మీరు మనదేశము కోసము సర్వస్వము అర్పించారు. నేను కూడ నా సర్వస్వ మర్పించి స్వాతంత్ర్యమనే కోటికాంతుల కోహినూర్ తెచ్చి మీకి స్తాను. మీరు నన్ను నాయకునిచేసారు. నాయకుని యోగ్యమైన పరాక్రమము ప్రకటించే అవకాశము నాకు ఇవ్వండి. నాకు వీడ్కోలు ఇవ్వండి. నన్ను దీవించండి. నేను క్షేమంగా ఈ సంకటాన్ని గడచి స్వతంత్రతా కోహినూరు తెచ్చి మీ చేతుల్లో ఉంచుతాను."

వీడ్కోలు గ్రహించి, ఒక సహచరుడు వెంటరాగా సుభాష్‌బాబు ఒక జలాంతర్గామిలో ప్రయాణము సాగించాడు. అనుక్షణము అపాయాన్ని గూర్చిన శంక, ఎటుచూచినా తాండవ నృత్యంచేసే తరంగ పంక్తులు. మనస్సులో భరతమాతృ పాదపంకేజములు. ఆస్థితి అద్భుతము. రమ్యము. రోమహర్షకము. ఆ ప్రయాణము సాహసోపేతము. దానిని వర్ణించడము మాటల కసాధ్యము. ఈ యాత్ర పూర్తిచేసి జూన్ 20వ తేదీన సుభాష్ బాబు టోక్యో చేరుకున్నాడు. అపార విశ్వాసాన్ని మాటలలో నింపి టోక్యో ఆకాశవాణిపై ఆయన ఇలా ప్రసంగించాడు.

"ఈ ప్రపంచ యుద్ధకాలమువంటి అదను మరల ఒక వంద సంవత్సరాలలోగూడ బహుశా రాదేమో. కాబట్టి భారతీయ స్వాతంత్ర్యము కోసము దానిని పూర్తిగా ఉపయోగించుకొనాలని మన నిశ్చయము. మన స్వతంత్రతకు మూల్యము మనరక్తంతోనే చెల్లించడము మన కర్తవ్యము కత్తిపైకెత్తిన శత్రువును కత్తిదూసి ఎదుర్కొనడమే సముచితము".

ఇప్పటికి 'స్వాతంత్ర్య సంఘము' బాగా విస్తరించింది. కేవలము మలయాలోనే ఆ సంఘ సభ్యులసంఖ్య లక్షా ఇరవై అయిదు వేలు. "ఆజాద్ హింద్ సేన"లో స్వయం స్ఫూర్తితో వచ్చి చేరిన సైనికులు 60 వేలమంది. నేతాజీ టోకియోకు రాగానే ముందుగా యుద్ధరంగంలోని సైనిక మిత్రులను కలుకోడానికి వెళ్ళాడు. సింగపూర్‌లో సైనికుల వద్దే

గించి మాట్లాడుతూ "మిత్రులారా! సైనికులారా! మీ యుద్ధ నినాదము ఒక్కటే "ఢిల్లీ చలో, ఢిల్లీ చలో." హిందుస్థాన్ స్వతంత్రము కావ డానికి అన్నివిధాల యోగ్యతను పొందిఉన్నదని నాకెప్పుడూకూడ అని పిస్తుండేది కాని ఒక్క విషయములోనే లోపము; అది స్వాతంత్ర్య సేన లేకపోవడము " అని అన్నాడు.

## స్వాతంత్ర్య సేన స్థాపన

1943 అక్టోబరు 21వ తేదీ భారతదేశపు స్వతంత్ర ప్రభుత్వము-అనగా స్వతంత్ర హిందుస్థాన్ ప్రభుత్వము స్థాపింపబడింది. ఆ ప్రభుత్వ మునకు స్వాతంత్ర్యసేన నిర్మింపబడింది, ఆ ప్రభుత్వంలో ప్రధాన మంత్రిత్వము, యుద్ధ విదేశ వ్యవహారాల మంత్రిత్వము స్వయంగా సుభాష్‌చంద్ర వహించాడు. మహిళావిభాగానికి ప్రధానాధికారి కెప్టెన్ లక్ష్మి, సైన్యము ప్రతినిధులుగా కర్నల్ జగన్నాధరావు భోంస్లే మొద లైన సైనికాధికారులు నియమింపబడినారు. విప్లవవీరుడు రాసబిహారి ఈ ప్రభుత్వానికి ప్రధాన ప్రచారకుడుగా, సలహాదారుడుగా నియమింపబడి నాడు. సేనాపతి తాత్యాటోపేనుండి ఉధామ్‌సింహ వరకు గల వేలాది దేశభక్తుల, హుతాత్ముల ఆకాంక్ష ఈ క్షణముతో సాకారమైంది. ఈ స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని జపాన్, జర్మనీ, కొరియా, ఇటలీ చైనా, ఐరిష్ రిపబ్లిక్ రాజ్యాలు గుర్తించాయి.

## స్వతంత్ర భూమిపై మొదటి అడుగు

ఇప్పటికి ఆజాద్ హింద్‌సేన, ఝాంసీరాణి సేనా విభాగము, ఆజాద్ హింద్ ఆకాశవాణి, ఆజాద్ హింద్ వార్తాపత్రిక ప్రారంభింప బడినాయి. ఈ సమయములోనే జపాన్ దేశపు జనరల్ టోజో టోకియోలో విశాల ప్రాచ్య ఆసియా దేశాల సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. ఈ సమా

వేశములో స్వతంత్ర భారత ప్రభుత్వానికి అందరి ఆమోదము, సమర్థన లభించాయి. బ్రిటిష్ అధికారమునుండి విముక్తి చేయబడిన అండమాన్ నికోబార్ దీవుల రెంటిని ఆజాద్ హింద్ ప్రభుత్వానికి అప్పగిస్తూ జపాన్ ప్రభుత్వము తరపున జనరల్ టోజో ప్రకటన చేసాడు. మహాభారతంలో శ్రీకృష్ణుడు రాజయిన సంఘటన వంటి ఉదాత్తము సమయోచితము అయిన సంఘటన ఇది. స్వతంత్రభారత ప్రభుత్వానికి ఇప్పుడు దేశముకూడ లభించింది. ఈ సన్నివేశము సుభాష్‌బాబుకు రోమాంచము కలిగించింది. ఆయన హృదయం ఆనందంతో ఉక్కిరి బిక్కిరైంది. కంఠము రుద్ధమైంది. కృతజ్ఞతను ప్రకటిస్తూ సుభాష్‌బాబు ఇలా అంటాడు.

"స్వతంత్ర్యమైన ఈ ద్వీపాలు బ్రిటిష దాస్యము నుండి విముక్తమైన మాతృదేశ ప్రథమ ప్రదేశంగా భారతీయుల దృష్టిలో విశేష ప్రాముఖ్యాన్ని అర్జించుకున్నాయి. ఈ భూమివలన "ఆజాద్ హింద్ ప్రభుత్వము" పేరుకుమాత్రమేగాక ప్రత్యక్షంగాకూడ రాష్ట్రీయ అస్తిత్వాన్ని పొందింది. అండమాన్ విముక్తిలో అగాధమైన అర్థము ఇమిడివుంది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని పెకలించి పారవేయడానికి కుట్రపన్నినారన్న నేరానికి ఆజన్మ కారాగారశిక్ష విధింపబడిన రాజకీయ ఖైదీలందరు దాదాపుగా ఈ ద్వీపంలోనే చెరసాలలో ఉంచబడినారు. ఫ్రెంచి విప్లవములో విముక్తి పొందిన పారిస్ నగరంలోని బాస్టిలీ లాగానే హిందుస్థాన స్వాతంత్ర్యసమరములో మన దేశభక్తులు అంతులేని యాతనలపాలైన అండమాన్ ద్వీపము ప్రప్రథమంగా విముక్తిపొందింది. అక్కడ మరణించిన హుతాత్ముల జ్ఞాపకార్థము అండమాన్ ద్వీపము "హుతాత్ముల (షహీద్) ద్వీపము" అని, నికోబార్ ద్వీపము "స్వరాజ్య ద్వీపము" అని ఇకమీదట పిలువబడుతాయి.

1943 డిసెంబరు 30వ తేదిన స్వతంత్ర హిందుస్థాన్‌కు ప్రధాన మంత్రి అయిన నేతాజీ ఈ స్వతంత్ర ద్వీపము మీద కాలుపెట్టాడు. అక్కడి సెల్యులర్ జైలును చూడగానే ఆయనకు స్వాతంత్ర వీర సావర్కర్ మొదలైన దేశభక్తులు, హుతాత్ములు జ్ఞప్తికి వచ్చారు. ఆ హుతాత్ములను స్మరించి ఆయన కృతజ్ఞతాపూర్వకముగా ప్రణమిల్లినాడు. ఆనాడే అక్కడ స్వతంత్ర భారత ధ్వజమును ఎగురవేసాడు. శరీరాలు పులకరింపజేసే సన్నివేశ మది. 1857 సంవత్సరమునుండేగాదు-అంతకు పూర్వము వంద సంవత్సరాలనాడు 1757 బెంగాల్ గడ్డమీద భారతీయులకు ప్రథమ పరాజయము సంభవించిననాటి నుండి ఈనాటి వరకు స్వాతంత్ర్య ప్రయత్నాల చరిత్ర ఈ పతాకము రూపంలో ఎదుట నిలబడి ఉంది. అద్వితీయ శౌర్యము, అసామాన్య త్యాగము, అపార స్వాతంత్ర్య కాంక్షల పర్యాపళి ఆకాశంలో విముక్తమై విహరింపసాగింది. స్వాతంత్ర్య సంగ్రామ సందేశాన్ని దశదిశలలో ప్రసరింపజేయసాగింది. అంతిమ సమరముకోసము ఈ పతాక ఛాయలో భారతీయ ప్రజలు శౌర్య శ్రద్ధా సమన్వితులై, దీర్ఘ ప్రయత్నశీలురై, సంఘటితులై నిలువవలసిందని ఆరక్త జ్వాలలు ఆహ్వానించాయి. శత్రువును దేశ సరిహద్దుల కావలకు దాటగొట్టి హిందుస్థాన్ స్వతంత్ర మయ్యేంతవరకు భయంకరయజ్ఞాన్ని ప్రజ్వలింపచేయడానికి వారు తీసుకున్న శపథ మది.



## ఇరువది రెండవ అధ్యాయము

# అద్భుత పరాక్రమ గాథ

స్వతంత్రమైన అండమాన్‌ద్వీపానికి ప్రథమ పాలకుడుగా సేనాపతి లోకనాథన్‌ను నేతాజీ నియమించాడు. కాని కార్యక్రమ సన్నద్ధత కోసము ఆయన రంగూన్‌కు వెళ్ళాడు. రంగూన్‌లో జనవరి 26వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవము మహా వైభవముతో జరుపబడింది. ఈ ఉత్సవంలో లక్షలాది భారతీయులు సమావేశమైనారు. అప్పుడు నేతాజీ వారి నుద్దేశించి ప్రసంగిస్తూ, ఆర్థిక సహాయాన్ని అర్థించాడు. ఆయన ఒక పూలమాలను వేలములో అమ్మజూపాడు. మహాశ్చర్యముగా వేలకొలది మంది వెను వెంటనే పెద్దపెద్ద మొత్తాలు ఇవ్వడానికి సిద్ధమైనారు. హారము ఖరీదు ఏడులక్షల రూపాయలవరకు పెరిగింది. ఇంతలో ఒక యువకుడు ముందుకువచ్చి "నేను నా యావదాస్తిని ఈ పూలమాలకు బదులుగా ఇస్తాను" అన్నాడు. ఆ యువకుడు సంపన్నుడు. అతని దేశభక్తికి నేతాజీ ఆనందంతో ఉప్పొంగిపోయాడు. అపారమైన ప్రేమతో ఆలింగనము చేసుకొని మాలను అతని చేతి కిచ్చాడు.

ఆ సమయంలో అక్షరాలా ధనరాసులు కురిసాయి. స్త్రీలు తా మలంకరించుకొన్న విలువైన సొమ్ములను ఒలిచి అక్కడికక్కడే రాష్ట్రి కార్యం నిమిత్తము అర్పించారు. నేతాజీ ప్రజా హృదయాలపై సంపూర్ణ విజయము సాధించాడు. అందువలన వారు తను ధనసంపత్తిని మాతృదేశ చరణకమలములవద్ద సమర్పించారు. ఇక మనుష్యశక్తి; అక్కడ గుమి కూడిన 56 వేలమంది యుద్ధ ఖైదీలలో 50 వేలమంది అప్పటి కప్పుడే తమంతతాము అజాద్ హింద్ సేనలో చేరారు. వారిలో సాధారణ సైనికుల నుండి ఉన్నతాధికారులు వరకు అన్ని స్థాయిలకు చెందిన సైనికులున్నారు.

## ఢిల్లీ దిశగా

విజయోత్సవము ఎల్లలను దాటినప్పుడే పూర్తి అవుతుంది. వెంటనే నేతాజీ ఢిల్లీవైపుకు ప్రయాణము సాగించాడు. అజాద్ హింద్ సేనలోని అగ్రగామి దళము బర్మాదేశానికి చేరింది. అక్కడకు దాపుననే భారత్-బర్మా సరిహద్దులలోఉన్న బ్రిటిష్ సేనమీద అది దాడి చేసింది. అది ఫిబ్ర వరి 4వ తేదీ. ఆ సమయంలో స్వాతంత్ర్య సేనలోని 2, 000 మంది సైనికులు యుద్ధరంగంలో ఉన్నారు. కెప్టెన్ షానవాజ్ దానికినాయకుడు. యుద్ధము ప్రారంభమైంది. స్వతంత్ర సేన సాటిలేని పరాక్రమాన్ని ప్రదర్శించి ఆ బలాఢ్యమైన బ్రిటిష్ సేన పరాజయము పాలైంది. స్వతంత్ర సేన సీమోల్లంఘనముచేసి మార్చి 18వ తేదీన మణిపూర్ జయించింది. పరమ సౌభాగ్యకరమైన క్షణమది. సైనికుల అభిమానము వర్ణనాతీతము వారు సగర్వంగా తలలు పైకెత్తారు. ఇప్పుడు వారు తమ మాతృభూమికి విముక్తి కలిగించారు పరమపవిత్రమైన ఈ స్వతంత్ర భూమికి సగౌర వముగా ప్రణమిల్లిన పిమ్మటనే వారక్కడ అడుగిడినారు. అది అపూర్వ వైభవముతో విరాజిల్లిన క్షణము.



కదం కదం బఢాయే జా...

ఈ సమయములో ఇంఫాల్, మోరాయీ, కోహిమా మొదలైన అనేక స్థానాలలో యుద్ధము జరుగుతున్నది. ఆజాద్ హింద్ సేన విజయ పరంపరను సాధిస్తూ ఉన్నది. 'కదమ్ కదమ్ బఢాయే జా'–ఈ రణగీతాన్ని సగర్వంగా ఆలాపిస్తూ ముందు ముందుకు సాగిపోతున్నది. వేలాదిఖైదీలు-భారతీయ సైనికులు–తమంత తాము ఆజాద్ హింద్ సేనలో చేరి పోతున్నారు.

## రాష్ట్రీయ బ్యాంకు స్థాపన

ఇంఫాల్ విజయం తర్వాత ఆజాద్ హింద్ ప్రభుత్వానికి నూతన విశ్వాసము చేకూర్చింది. రంగూన్‌లో నేతాజీ రాష్ట్రీయ బ్యాంకు స్థాపన చేసాడు. స్వతంత్రంగా రూపాయి నాణెములు, కరెన్సీ ముద్రించి

చలామణి చేసాడు. ఈ రాష్ట్రీయ బ్యాంకుకు తూర్పు ఆసియాలోని వ్యాపారస్థులు బాగా సహకరించారుకూడ. చూస్తూఉండగానే 50 లక్షలు సమకూర్చాలన్న లక్ష్యాన్ని అది సాధించింది.

భారత్‌కు వెలుపల సుభాష్‌బాబు ద్వితీయ స్వతంత్ర సమరము ప్రారంభించి, విజయ పరంపరను సాధించి కీర్తి నార్జించాడు. లక్షలాది భారతీయులు తన, మన, ధన, సంపత్తులతో నేతాజీ వెనుక నిలచారు ఆజాద్ హింద్ ప్రభుత్వము ఏర్పడింది. ఈ ప్రభుత్వానికి దేశము ఉంది స్వతంత్రమైన సేన ఉంది. రాష్ట్రీయ నిధి కూడ ఉంది కాని ఈ ప్రయత్నాలను అప్రతిష్ఠపాలు చేయడానికి బ్రిటిష్ వాళ్ళు ఒక కపట నాటక మాడారు. వారు భారతీయ నాయకులకు చాడీలు చెప్పి వారి మనస్సు విరిచారు. "సుభాష్‌చంద్ర బోసు దేశద్రోహి. జపాన్ రక్కసుల చెలికాడు. జపాన్‌కు భారతదేశాన్ని కట్టబెట్టడానికి దేశద్రోహము చేస్తున్నాడు" అని వారి నోటగుండా బ్రిటిష్ వారు పలికించారు.

## వివేకము విషాదాన్ని జయించింది

ఇది చాల సిగ్గుచేటైన విషయము. మహాత్మాగాంధీ జవాహర్లాలు నెహ్రూవంటి జాతీయ నాయకులు సుభాష్‌బాబును దేశద్రోహి అనీ, జపాన్ వారి బానిస అనీ సంబోధించసాగారు. దీనికి నేతాజీ తీవ్ర మనోవ్యధతో కుమిలిపోయాడు. ఆయన ఈ అఘాతాన్ని కూడ సహించాడు. ఒక సభలో ఆయన "జపాన్ మన మిత్రులకు శత్రువుగా ఉన్నంత వరకు నేను జపాన్‌కు రాలేదు. జపాన్, బ్రిటన్, అమెరికాలకు వ్యతిరేకంగా యుద్ధము ప్రకటిస్తూ నిర్ణయము తీసుకున్న తర్వాతనే నేను ఇక్కడకు వచ్చాను. బ్రిటిష్ వారికి విరుద్ధంగా పోరాడిన నావంటి వానిని ప్రపంచంలో మరొక రాజనీతిజ్ఞుడెవ్వరైనా మోసము చేయగలడా?" అని స్పష్టంగా ప్రశ్నించాడు

ఇది భారతదేశ నాయకుల నుద్దేశించి చేసిన ప్రసంగము, దీనికి సత్ఫలితమే లభించింది. గాంధీజీ, పండిత నెహ్రూల భ్రాంతి దూరమైంది. (అనంతర కాలంలో ఆజాద్ హింద్ సేనను రక్షించడానికి పండిత నెహ్రూ వకీలు దుస్తులు ధరించి ఎఱ్ఱకోటలోని న్యాయస్థానములో నిలబాడు కూడ ) నేతాజీ ప్రయత్నాలకు అన్ని వైపులనుండి పూర్తి సహకారము లభించింది. నలువైపులా ఉత్సాహము పొంగులువారింది. ఇంతలో వర్షాకాలము సమీపించింది. నేతాజీ కొంతకాలము పోరాటము ఆపుచేయవలసి వచ్చింది.

## హుతాత్మల స్మారక దినము

ఈ సమయములో సెప్టెంబర్ 22 వ తేదీన విముక్తి చేయబడిన ప్రదేశములో చాలా పెద్దఎత్తున 'హుతాత్మల దినోత్సవము' జరుపబడింది. శ్రీమంత్ నానాసాహెబ్, తాత్యాటోపే, రాణీ లక్ష్మీబాయి నుండి భగత్ సింహదత్త, చంద్రశేఖర ఆజాద్‌ల వరకు వందలకొలది హుతాత్మల స్ఫూర్తిదాయకమైన జీవిత చరిత్రలు వివరిస్తూ వక్తలనేకులు ప్రసంగించారు. వారి స్మృతులకు శ్రద్ధాంజలిఘటించారు. ఈ ఉత్సవసమయంలో నేతాజీ చెప్పిన మాటలొక మహాకావ్యము. అది స్వతంత్రతా మహాయజ్ఞ తేజోమయజ్వాల. ఆయన ఇలా అన్నాడు ;

"మన మాతృభూమి స్వాతంత్ర్యాన్వేషణలో ఉన్నది. స్వాతంత్ర్యము లేకుండా నేడది జీవించి ఉండడము అసంభవము. అందుకోసము శత్రువులను వారి నెత్తుటి మడుగులో ముంచివేయగల విప్లవము కావాలి. మీరు నాకు రక్తదానము చేయండి. నేను మీకు స్వాతంత్ర్య ప్రదానము చేస్తాను; ఇది స్వాతంత్ర్యదేవి అభిలాష "

నేతాజీ చేసిన ఈ ఉత్తేజపూరిత ప్రసంగము వినగానే యువకుల మనస్సులు ఉప్పొంగాయి. వెంటనే వారు ముందుకు వచ్చారు. "అందుకు

మేము సిద్ధంగా ఉన్నాము; కావాలంటే ఇప్పుడు తీసుకోండి" అని అనేకుల రక్తతుషారము నేతాజీ శరీరముపై చిందించారు. ఒకరి తర్వాత ఒకరుగా ముందుకువచ్చి తమ నెత్తుటితో ప్రతిజ్ఞా పత్రాలు వ్రాసారు.

## పులకరింపజేసే సన్నివేశాలు

ఆజాద్ హింద్ సేన చరిత్ర యావత్తు శరీరాలను పులకరింపజేస్తుంది. ఎదురుపడి చేసే సంకుల సమరములో మన సైన్యానికి దిరుగు లేదు. ఆరకాన్, ఇంఫాల్, పాలేల్ యుద్ధములలో దానికి లభించిన విజయాలను, మన వారు చూపించిన సాహసానికి విదేశీ సేనానులే చకితులై పోయారు.

ఆజాద్ హింద్ సేనలోని మహిళా విభాగానికి సాటిలేదు. ఈ సేనకు నాయకత్వం వహించిన వీరాంగన కెప్టెన్ లక్ష్మి ఈ సేన చూపించిన వీరత్వానికి ఎవ్వరైనా ఆశ్చర్య చకితులుకాక తప్పదు. దూరము నుండి తుపాకులు ప్రేల్చడమే కాదు. శత్రువుకు ఎదురుపడి కేవలము బాయొనెట్ల సహాయముతోనే నిలిచి పోరాడింది ఈ సేన.

ఆజాద్ హింద్ సేన అంటే స్వాతంత్ర్యసేన. దానిలోని ఒక్కొక్క సైనికుడు స్వాతంత్ర్యవీరుడు. బర్మా యుద్ధములో మన సైనికులు పీపున బాంబులు కట్టుకుని, ఆంగ్లేయుల టాంకుల క్రింద తమంత తాము పడి పోయి వానిని నాశనముచేసిన సంఘటన లెన్నో ఉన్నాయి. ఈ త్యాగానికి, వీరత్వానికి, బలిదానానికి సామ్యము ఉన్నదా? సోదరులారా! ఈ మహా వీరులకు అభివాదన శతము అర్పిద్దాము పదహారేసి గంటలు నిర్విరామముగ మహిళా సేనకూడ బ్రిటిష్ సేనను ఎదుర్కొన్నది. ఆజాద్ హింద్ సేన వీరగాథలు వింటుంటే మనస్సు మురిసి పోతుంది. వీరత్వంతో భుజాస్ఫాలనము చేయాలనిపిస్తుంది. ఒక నూతన తేజము శరీరములోని కణకణములో పైకుబుకుతుంది.

## మొదటి అణుబాంబు ప్రేలింది

కేవలము వర్షాకాలము కారణంగా ఇంఫాల్‌పై మన దాడిని కొంత కాలము ఆపుచేయవలసి వచ్చింది. ఇంతలో అంతర్జాతీయ రంగంలో జర్మనీ ఒక పెద్ద పొరపాటు చేసింది రష్యాకు విరుద్ధంగా అది సేనలను నడిపి ఒక కొత్త యుద్ధరంగాన్ని ప్రారంభించింది. రష్యన్ సేనల తీవ్ర ధాటికి జర్మన్ సేనలు వెనుకంజ వేయవలసిన అవమానకర పరిస్థితి యేర్పడింది. యూరోపు రణాంగణములో జర్మనీ ఓడిపోతూ ఉండగానే తూర్పున జపాన్‌కూడ వెనుకడుగు వేయడం మొదలైంది. మేనెల 7వ తేదీన జర్మనీ పూర్తిగా లొంగిపోయింది. దానితో జపాన్‌కు మరింత సంకటస్థితి ఏర్పడింది. మిత్రరాజ్యాలు తమ పూర్తిశక్తి ప్రయోగించి జపాన్‌ను మట్టిలో గలప జూచాయి. కాని జపాన్ మీద ఆ శక్తి నిరుపయోగమైంది. అప్పుడు అమెరికా అణుబాంబును బయటికి తీసింది. 1945 ఆగష్టు 18వ తేదీ అణుబాంబుయొక్క ప్రథమ విశ్వ సంహారక విస్ఫోటము జరిగింది. నాగసాకి, హిరోషిమా నగరాలు వాని పరిసరాలు పూర్తిగా బుగ్గి అయిపోయినాయి. అవాంఛనీయమైన, అత్యంత శక్తి సంపన్నమైన ఈ ఆయుధము ఒక నూతన విధ్వంసక యుగాన్ని ప్రారంభించడం చూచి జపాన్ చక్రవర్తి హిరోహిటో సర్వనాశనమునుండి తన ప్రజలను కాపాడడానికి పరాజయాన్ని అంగీకరించి, యుద్ధము నిలిపివేస్తూ ప్రకటన చేసాడు.

## విజయవంతంగా తిరోగమనము

జపాన్ వెనుకడుగు వేయడం ప్రారంభం కాగానే, నేతాజీకి ఒక పెద్ద చిక్కుసమస్య ఎదురైంది. రంగూన్ వదలి వెనుకకు వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడింది. అప్పుడు నేతాజీ ఎంతో వ్యాకుల పడాడు. ఆయన సేనను సంబోధించి హృదయాన్ని కదలించే ప్రసంగము చేసాడు. ఆయన మాటల్లో-

"మిత్రులారా; మనము కొద్ది రోజులపాటు వెనుకకు తగ్గవలసిన పరిస్థితి ఏర్పడింది. కాబట్టి వీరులలాగా ఉన్నత స్వాభిమాన ధ్వజాన్ని ఎగురవేస్తూ మీరు తిరోగమించండి. నాకు సంబంధించినంత మట్టుకు నేను 38 కోట్ల దేశబాంధవుల స్వాతంత్ర్యం కోసము ఇక ముందు కూడ పోరాడుతూనే ఉంటాను. భారత దేశము త్వరలోనే స్వాతంత్ర్యము పొందక తప్పదు"

బర్మా వదలి బాంకాక్ వెళ్ళే సమయంలో నేతాజీ హృదయావేదనతో బర్మా ప్రజల వీడ్కోలు గ్రహించాడు. "భారత్ స్వాతంత్ర్యము కోసము నేను బర్మా వదలి వెళ్ళవలసి వచ్చింది" అని చెప్పేటప్పుడు ఆయన కంఠం కృతజ్ఞతాభావంతో బొంగురుపోయింది. ఆయన బర్మా ప్రజలకు, ప్రభుత్వానికి మనః పూర్వకముగా ఋణపడినట్లు భావించాడు. స్వతంత్ర హిందుస్థానము ఈ అపార సహకారానికి కృతజ్ఞతా బుద్ధితో: నిండు హృదయంతో అవశ్యము ప్రత్యుపకారము చేయగలదని వారికి వాగ్దానము చేశాడు. 'విప్లవము వర్థిల్లాలి' అనే వేదనాపూర్ణ రణగర్జనతో వారినుండి సెలవు తీసుకున్నాడు.

## అమరమైన బలిదానము

ఈ సంఘటన జరిగిన నాలుగు నెలల లోపలనే జపాన్ లొంగిపోయింది. నేతాజీకి మిన్ను విరిగి మీదపడింది. నేతాజీ బాంకాక్ నుండి టోక్యోకు సంప్రదింపులకై బయలుదేరాడు. ఆయన కోసము ఒక ప్రత్యేక విమానము విమానాశ్రయములో తయారుగా ఉన్నది. డిప్యూటీ ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ కర్నల్ హబిబుర్రహమాన్‌తో కలిసి నేతాజీతో విమానాశ్రయానికి వచ్చాడు. విమానములో ఎక్కాడు. విమానము కదిలింది. సైగాన్ చేరుకున్నది. అక్కడ మరొక విమానం సిద్ధంగా ఉంది. అందులో రెండే స్థానాలు ఖాళీగా ఉన్నాయి. నేతాజీ, హబిబుర్రమాన్ ఆస్థానాలలో కూర్చు

చ్చారు. విమానము కదిలింది. పుణ్యాత్ములను దేహంతో వైకుంఠానికి తీసుక వెళ్ళడానికా అన్నట్లు ఆ విమానము ఆకాశంలో ఎగురసాగింది. ఫార్మోజాద్వీప సరిహద్దులోకి అది వచ్చింది. ఆ సమయంలో విమానంలో మంటలెగసినట్లు చెపుతారు. నేతాజీ శరీరముతోనే వైకుంఠానికి వెళ్ళాడు. ఆనాటినుండి నేతాజీ జాడఏమాత్రము తెలియ రాలేదు. నేతాజీ బలిదానము చేసాడనే మన జాతి అంతా నమ్ముతున్నది. కృతజ్ఞతాభావంతో ఆయనకు శ్రద్ధాంజలి అర్పిస్తున్నది. నేతాజీ సుభాష్ బలిదానము మీదనే ఒక మహా భారతము నిర్మింపబడింది. ఆయన చనిపోయారంటే నేటికీ ఎవరికి నమ్మకం కలగడం లేదు. నేడు ఆయన మనమధ్య లేడన్నది నిశ్చయము. కాని స్మృతిరూపంలో, స్వాతంత్ర్యము రూపంలో ఆయన చిరంజీవి అయి నాడు. భారతదేశ స్వాతంత్ర్యము నేతాజీ సుభాష్ చంద్రుని వీరబలిదానము వలననే సిద్ధించింది. సుభాష్‌బాబు జీవితము ఆయన కీర్తి పతాకస్థాయి నందుకున్న సమయంలోనే సమాప్తం కావడము ఎంత అదృష్టము.

1945 అగస్టు 18 ఆ పరమ పవిత్ర దినము ఆనాడే భారత దేశానికి దేదీప్యమానమైన స్వాతంత్ర్య కిరణము మొదటిసారి కన్పించింది అటుత్వరాత ఆజాద్ హింద్ ఫౌజులోని స్వాతంత్ర్య సైనికులను బందీలుగాచేసి వారిని ఢిల్లీలోని ఎఱ్ఱకోటకుతెచ్చి వారిపై రాజద్రోహ నేరము ఆరోపించి విచారణ నడిపించారు. 'ఢిల్లీ చలో' అని నేతాజీచేసిన రణగర్జన సత్యమేఅయింది. 'ఆజాద్ హింద్ సేన' ఢిల్లీలోని ఎఱ్ఱకోటపై దండెత్తి వచ్చింది ఇప్పుడు పోరాటము ఆయుధాలతోగాదు, చట్టసమ్మతమైన అస్త్రముతో జరగాలి. ఇందుకోసము భారతదేశమందలి సంఘర్ష శీలుడైన నాయకాగ్రణి జవాహర్లాలు నెహ్రూ వకీలు దుస్తులు ధరించి ముందుకు వచ్చాడు.

## ఇరువది మూడవ అధ్యాయము

# పాకిస్తాన్ కోసం జిన్నా మొండిపట్టు

నేతాజీ సుభాషచంద్రబోసు స్వాతంత్ర్య సమరములో నేల వ్రాలాడు. అమర బలిదానంతో చిరంజీవి అయినాడు. ఈనాటి స్వాతంత్ర్యము ఆయన ఉజ్వల స్మృతి పతాక. ఎందుకంటే, ఆజాద్ హింద్ సేన సాగించిన యుద్ధము భారత స్వాతంత్ర్య సమరములో పరిణామదాయకమైన ఘట్టము. ఈ యుద్ధములో మనము ఓడిపోలేదు. ఏ దృష్టితో జూచినా, మనమీ యుద్ధంలో జయించాము. "గఢము చిక్కింది; కాని సింహము పోయింది" అన్న విధంగా "స్వాతంత్ర్యము వచ్చింది; కాని **నేతాజీ వెళ్ళిపోయాడు**" అని అనవలసి వచ్చింది.

భారతీయ స్వాతంత్ర్య యుద్ధ చిహ్నము రక్తకమలము సాయుధ సంగ్రామము ద్వారానే స్వాతంత్ర్యము సిద్ధిస్తుందని నానాసాహెబ్ పీష్వా నుండి సుభాష్‌చంద్రబోసు వరకు గల ప్రతి స్వాతంత్ర్య వీరుని దృఢ విశ్వాసము. రణయజ్ఞంలో అన్నిటికంటె తేజోమయమైన, తీవ్రమైన, అత్యద్భుత పరిణామదాయకమైన "ఆజాద్ హింద్ సేన" యొక్క సాయుధ విప్లవజ్వాల దీనిని సిద్ధింపజేసింది. ఈ విప్లవము వలన భౌమిక

హిందూదేశాన్ని సైన్యబలంతో అణచివేసి తన ఆధీనములో ఉంచుకొన జాలమని బ్రిటిషు పాలకులకు తెలియపర్చింది. ఇదే మన విజయము. విదేశీ శక్తియొక్క అభేద్యమైన కోటగోడను మనము పగులగొట్టాము.

## ఎఱ్ఱకోటలో న్యాయ విచారణ

నేతాజీ బలిదానము తర్వాత "ఆజాద్ హింద్ సేన" లోని లక్ష లాది సైనికులను యుద్ధ ఖైదీలుగా చేసి. వారిపై యుద్ధనేరము మోపి విచారణ ప్రారంభించారు. బ్రిటిషువారి దృష్టిలో "ఆజాద్ హింద్ సేన" రాజద్రోహము చేసింది. దానికి శిక్ష మరణదండనే. సైనికశిక్షాస్మృతి నను సరించి ఢిల్లీలోని లాల్ ఖిల్లాలో నేతాజీ సైనిక సహచరులపై విచారణ నడిచింది. స్వయంగా పండిత్ జవాహర్లాలు నెహ్రూ న్యాయవాదుల నల్ల గౌను ధరించి వారి రక్షణకై ముందుకు వచ్చాడు



ఎఱ్ఱకోటలో ఆజాద్ హింద్ ఉన్నతాధికారులపై నడపబడిన కేసులో నల్లగౌను ధరించి న్యాయవాదిగా నిలబడిన పండిత నెహ్రూ

దేశమంతా అజాద్ హింద్ సేనలోని సైనికులను విడుదల చేయ వలసిందని ఒక్కమాటగా కోరింది. వారి తరఫున వాదించి, వారికి విముక్తి కల్పించడానికి ఒక ప్రత్యేక సమితి నియమింపబడింది. ఈ సమితిలో పండిత జవాహర్లాలు నెహ్రూ, శ్రీ బులాభాయి దేశాయి, సర్ తేజ్ బహాదుర్ సప్రూ, డా॥ కైలాసనాథ కట్జూ, శ్రీ ఆసఫ్ ఆలీ, శ్రీ రఘునందన శరణ్ మొదలైన న్యాయశాస్త్రవేత్తలు రాష్ట్రభక్తులు అయిన నాయకులున్నారు. శ్రీ బులాభాయి దేశాయి న్యాయస్థానములో వాదిస్తూ అంతర్జాతీయ పౌర సైనిక శిక్షాస్మృతులను అతిసూక్ష్మంగా పరిశీలనచేసి చివరకు ఈ సైనికులు చేసినపని దేశభక్తి ప్రేరణ వలన గనుక వీరిని విడుదలచేయవలసి ఉంటుందని సతార్కికముగా నొక్కి చెప్పాడు.

దేశంలో ఈ సమయములో నేతాజీ సుభాష్‌చంద్ర బోసు యెడ, అయన సైనిక సహచరుల యెడ అపార గౌరవము అపూర్వాభిమానము నిర్మాణమైంది. నేతాజీ యొక్క "జై హింద్" నినాదము రాష్ట్రీయ సోదర భావనకు చిహ్నమైంది.

ఈ మార్పు ఎలాగ వచ్చింది? ఈ స్వాతంత్ర్య సమరము భారత దేశానికి వెలుపల జరుగుతున్నప్పుడు, భారతదేశంలో ఏమి జరుగుతూ ఉన్నది? కొంత వెనుకకువచ్చి ఆ విషయాలు అర్థం చేసుకొందాము.

## సింహావలోకనము

1939 లో రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమైంది. ఈ యుద్ధము వలన ఇంగ్లండు గొప్ప సంకటస్థితిలో చిక్కుకుంది. సహాయము కోసము బ్రిటిషు ప్రభుత్వము భారతీయ ప్రజలను అర్థించింది. దీనికి తగిన ప్రత్యుత్తరము ఇవ్వబడుతుంది; కాని ముందుగా బ్రిటిషు ప్రభుత్వము హిందూ దేశము స్వతంత్రమైనది అని ప్రకటింపవలెనని కాంగ్రెసు కోరింది. కాంగ్రెసులోని తీవ్రవాదులైన సుభాష్ బాబు వంటివారు

సంపూర్ణ స్వాతంత్ర్యాన్నే కోరారు. అందుకోసము మంతనాలు, సంప్ర తింపులు జరపడానికికూడ వారు సుముఖంగా లేరు.

స్వాతంత్ర్యవీర వినాయక దామోదర సావర్కార్ దూరదృష్టిగల నాయకుడు. ఆంగ్లేయులతో సాయుధ సంఘర్షణ జరుపక తప్పదనే దృష్టితో ప్రత్యేక శిక్షణ, అభ్యాసము, అదను దొరికినప్పుడు విప్లవము తేగల సామర్థ్యము సంపాదించుకొనడము కోసము ఈ యుద్ధాన్ని ఉపయో గించుకునే ప్రయత్నం చేశాడు. ఆయన సుభాష్‌చంద్రునకు తగిన సలహాయిచ్చి స్వతంత్ర సమర సన్నద్ధత కోసము విదేశాలకు పంపించాడు.

మహాత్మాగాంధీ ప్రభుత్వముతో మంతనాలు ప్రారంభించాడు. కష్టాలు తల మునకలుగా ముంచుకు వచ్చినప్పుడుకూడా పేరాశగల మాన వునికి వివేకము కలుగదు. బ్రిటిషువారి స్థితి ఆ విధంగా ఉంది. యుద్ధా నంతరము హిందూదేశానికి స్వాతంత్ర్యము ఇవ్వడానికి ప్రయత్నిస్తామని కూడ నోరార అనడానికి వారు సిద్ధంగాలేరు. చివరకు అంతిమ ఆందోళన ఆరంభించడానికి గాంధీజీ నిశ్చయించి, 1942 ఆగష్టు 8వ తేదీ "క్విట్ ఇండియా" అన్న మాటలతో బ్రిటిషు ప్రభుత్వానికి తమ నిర్ణయము తెలియచేసాడు.

"క్విట్ ఇండియా" అన్న మాటలు వినగానే బ్రిటిషు ప్రభుత్వము కోపంతో కంపించిపోయింది. ఏ మాత్రము ఆలోచించకుండానే గాంధీజీని, ఇతర కాంగ్రెసు నాయకులను చెరసాలపాలు చేసింది. దేశంలో హాహాకా రాలు ప్రబలాయి గాంధీజీ దేశ ప్రజల నుద్దేశించి ఈ విధంగా చెప్పాడు.

"హర్తాళ్‌గాని, అడ్డంకులు కల్పించే విధానముగాని, అహింసా త్మకమైన మరి యే యితర మార్గముగాని అనుసరించి ఆందోళన సాగించ డానికి ప్రతి వ్యక్తికీ స్వేచ్ఛ ఉంది. అందులో మృత్యువే ఎదురైతే

సత్యాగ్రహి దానినికూడ స్వీకరించాలి. వ్యక్తి స్వేచ్ఛగా, శాంతంగా మృత్యువును ఆలింగనము చేసుకున్నప్పుడే రాష్ట్రము జీవించి ఉంటుంది మనము మన ధ్యేయాన్ని సాధిస్తాము. లేదా మరణాన్ని వరిస్తాము. "పని చేయడమో-చనిపోవడమో".

## అపూర్వ ప్రజా విప్లవము

"పనిచేయడమో - చనిపోవడమో" అను సంకల్పముతో దేశమంతా ఆవేశపూరితమైంది. సామాన్య వ్యక్తులు నాయకులైనారు. తమ శక్తికొలది ఆందోళన నారంభించారు.

సాయుధ బ్రిటిషు ప్రభుత్వాన్ని ఎదిరించి నిరాయుధ భారతీయ ప్రజలు తీవ్రమైన పోరాటము ప్రారంభించారు. ఉద్రేకించిన ప్రజావిప్లవ మహా సాగరములో తుఫాను చెలరేగింది. ప్రభుత్వము దమననీతిని అనుసరించేకొలది దానిని తారుమారు చేయడానికి ప్రజలు ప్రయత్నింప సాగారు. దేశమంతటిలో ఇండ్లలోఉండగానే బంధించడము, భాష్పవాయు ప్రయోగము, లాఠీచార్జి, తుపాకికాల్పులు, అత్యాచారములు, మరణశిక్షలు, బలాత్కారము మొదలైన రాక్షస కృత్యాలను ప్రభుత్వము ప్రారంభించింది. ఇక ప్రజలు తెల్లవారు కనిపిస్తేనే చంపడానికి పూనుకున్నారు, ప్రభుత్వ సంపదను ధ్వంసము చేయడముకూడ తీవ్రంగా సాగింది. పోటీ ప్రభుత్వాలు ప్రతిచోట వెలిసాయి. మహారాష్ట్రలో శ్రీ అచ్యుతరావు పట్వర్ధన్ నాయకత్వములో ప్రజావిప్లవము సుసంఘటిత రూపాన్ని ధరించింది. దేశంలోని ప్రజావిప్లవ నాయకులలో శ్రీ జయప్రకాష్ నారాయణ్ ఒకరు. జైలునుండి తప్పించుకొని ఆయన బయటపడి ఒక విప్లవ సేనను తయారు చేయాలని సాహస ప్రయత్నం చేసాడు. కాని దురదృష్టవశాత్తు మరల పట్టుబడినాడు

## గాంధీజీ ఉపవాసము

'క్విట్ ఇండియా' ఆందోళన హింసాత్మకముగా మారినట్లు గాంధీజీకి అనిపించింది. అప్పుడాయన జైలులో ఉన్నారు. ప్రభుత్వము ఒళ్ళు తెలియకుండా దమననీతిని ప్రయోగిస్తున్నది. ప్రజలుకూడ ప్రతీకార ప్రయత్నాలను తీవ్రతరం చేస్తున్నారు. ఇది సహజమే. కాని, ఈ ఆందోళనలో సంభవించిన హింసాత్మక కార్యాలను, ప్రభుత్వ దమననీతిని నిరసిస్తూ మహాత్మాజీ 21 దినముల ఉపవాసం ప్రారంభించాడు. ఈ ఉపవాసానికి మరొక ఉద్దేశముకూడ ఉంది. ఈ హింసాత్మక కార్యాలకు బాధ్యత ప్రభుత్వము కాంగ్రెసుమీద ఆరోపించింది. అందువలన పరోక్షంగా ఈ హింసాచారానికి బాధ్యత గాంధీజీమీద కూడ పడింది. ఇది ఒక కళంకము. ఈ కళంకాన్ని గడిగివేసుకోడానికి గాంధీజీ ఉపవాసము చేయాలని నిశ్చయించుకున్నాడు.

ఆ ఉపవాసకాలము 1940 ఫిబ్రవరి 10వ తేదీనుండి మార్చి 3 వరకు. ఈ కాలములో గాంధీజీ ఆరోగ్యము బాగా దెబ్బతిన్నది. దేశమంతా ఆయన విడుదలను కోరింది. కాని ప్రభుత్వము ఈ కోరికను మన్నించడానికి సిద్ధంగాలేదు.

చూస్తూ ఉండగానే 1943 అక్టోబరునెల వచ్చింది. యుద్ధము మిత్ర రాజ్యాలకు అనుకూలంగా లేదు. అయినప్పటికీ హిందూదేశ దృష్టిలో జపాన్ ఆక్రమణ భయము కేవలము కల్పితమే యుద్ధ ప్రయత్నాలలో ప్రభుత్వానికి భారతీయుల సహకారము కావాలి. కాని, ప్రభుత్వము సంధి మాటలకు విముఖంగా ఉండడము దాని దమన విధానము కారణంగా రావలసిన సహకారము దూరంగా తొలగిపోతున్నది. ఆ స్థితిలో లార్డ్ వేవెల్ భారతదేశానికి వచ్చాడు. అతడు ప్రభుత్వ పక్షము నుండి ప్రయత్నాలు ప్రారంభించాడు.

## జిన్నా హఠము

ముస్లిము లీగు నాయకుడు మహమ్మదాలీ జిన్నా జైలు వెలుపల ఉన్నాడు ఆయన బ్రిటిషువారి గారాల మొలక. 1943 డిశంబర్‌లో ముస్లిములీగు మహాసభ జరిగింది. అందులో ఆయన గాంధీజీ ప్రకటనకు మరొకమాట పలిపాడు. 'భారతదేశానికి స్వాతంత్ర్యము ఇచ్చేముందుగా దేశాన్ని విభజించబడి. తర్వాత ఇక్కడనుండి వెళ్ళండి.'

భారతదేశానికి స్వాతంత్ర్య ప్రదానము చేయడం ప్రభుత్వానికి అసలు ఇష్టములేదు. దానికితోడు ముస్లిమ లీగుపక్షమునుండి ఇటువంటి ఆటంకము వచ్చినందువ సమస్యను త్రోసిపుచ్చదానికి ప్రభుత్వానికి చక్కని క్రొత్త కారణము దొరికింది. ఈ సమయములో కాంగ్రెసు నాయకుడు రాజగోపాలాచారి ముందుకువచ్చి, "దేశ విభజనను అంగీకరించి, ముసల్మానులకు భాగము పంచి, స్వాతంత్ర్యము తెచ్చుకుందాము" అని సూచన చేశాడు. కాని దేశవిభజన మనే ఆలోచన స్వచ్ఛమైన భారతీయ రక్తము ప్రవహించే వ్యక్తి కలలోనైన సహింపలేని విషయము.

దేశ విభజన జరగాలనే జిన్నా మొండిపట్టు రోజురోజుకు ఎక్కువ కాసాగింది. ఆయన బహిరంగంగా పచ్చిగా స్వతంత్ర పాకిసాన్ కోరికను ప్రకటింపసాగాడు. 1870 నుండి వస్తూవున్న ముసల్మాను నాయకుల స్వతంత్రజాతి వాదము రూపము ధరిస్తూ ఉన్నట్లు కనుపింపసాగింది. జిన్నాను నిరోధించదానికి ప్రయత్నాలు జరిగే కొలది అతని మొండితనము రెండింతలుగా సాగింది.

## గాంధీజీకి దారుణాఘాతము

చెరసాలలో ఉన్న మహాత్మాజీ మనస్సు కలవరపడింది. హిందూ ముసల్మాను సమాజాల మధ్య ఐకమత్య భావన నిర్మించడానికి ఆయన

జీవితమంతా అపార త్యాగము చేసాడు. దేశముచేతకూడ త్యాగము చేయించాడు. పూర్తిగా చేరువకు వచ్చిన స్వాతంత్ర్యము జిన్నా మొండిపట్టు కారణంగా దూరమైపోతున్నది. ఈ విషయము ఆయనకు తీవ్ర మనోవ్యథ కలిగించింది తాను కన్న కొడుకువలె చూచుచున్న అంతరంగిక కార్యదర్శి మహాదేవ దేశాయి, తన సహధర్మచారిణి కస్తూరిబాయి మరణించడముతో ఆయన స్థితి మరింత దయనీయమైపోయింది. కాని, ఆయన నిజమైన యోగి. కోరికల కంటని జీవితము గడిపే సమర్థుడు. ఆయన ఆరోగ్యము మరీ దెబ్బతిన్నది. చివరకు విధిలేక ప్రభుత్వము ఆయనను చెరసాలనుండి విడుదల చేసింది.

## జిన్నా ఉన్మాదము

విడుదల కాగానే గాంధీజీ జిన్నా బంగళాకు వెళ్ళాడు. ఇంతటి గొప్ప జాతీయ నాయకుడు తన యింటికి వస్తే, సామాన్య మానవ సహజమైన రీతిలో జిన్నా ఆయనను ఆహ్వానించి ఉండవలసింది కాని, ఆ మాత్రము ఉదార స్వభావాన్ని జిన్నా చూపలేకపోయాడు దానికి బదలు ఉన్మత్తుడై ఆయన గాంధీజీతో ఇలా అన్నాడు:

"ఈ దేశంలో హిందువులు, ముస్లిములు రెండు విభిన్న జాతులు. వారు ఒకటి కావడం ఏనాటికి సాధ్యముకాదు దేశంలో శాంతి స్థిరంగా ఉండాలంటే, దేశవిభజన జరిగి తీరవలసిందే."

ఈ విషయములో రాష్ట్ర హితాన్ని కోరి, దేశ స్వాతంత్ర్యము కోసము మహాత్మాజీ వ్యక్తిగత అవమానాలన్నిటినీ సహించి శాంతంగా, సౌజన్యంతో ఆ అర్థంలేని మొండిపట్టు వదులుకోవలసిందని జిన్నాకు అనేక విధాల నచ్చచెప్ప జూచాడు. కాని జిన్నా విభజన జరగాలనే మొండిపట్టు విడిచిపెట్టడానికి ఏమాత్రం సుఖముంగా లేను

## వైస్రాయి పరుగులు

ఈ చిక్కుతో లార్డ్ వేవెల్‌కు దిక్కు తోచలేదు. దేశానికి వెలుపల నేతాజీ సుభాష్‌చంద్రబోసు స్వతంత్ర సేనను తయారుచేసిన విషయము ఆయనకు బాగా తెలుసు. ఆజాద్ హింద్‌సేన బ్రిటిషు సేనను తీవ్ర అఘాతాలకు గురి చేస్తున్నది. ఏ సైనికశక్తి ఆధారంగా బ్రిటిషు ప్రభుత్వము కొనసాగుతున్నదో, ఆ సేన నేడు కేవలము పొట్టపోసుకోడానికి తయారైన బానిసగాలేదు. దేశంలోని స్వాతంత్ర్యోన్మాదము నేడు దానిని కూడ గట్టుకుంది. తుపాకులను పైకెత్తజేసింది. వెంటనే చెరసాలలోని దేశ నాయకులను వేవెల్ విడుదల చేయించాడు హిందూ దేశ రాజకీయ సమస్యకు అంతిమ పరిష్కారమును ఏ విధంగా చేయాలి అని నిర్ణయము చేయడానికి 1945 మార్చిలో తానే ఇంగ్లాండుకు వెళ్ళాడు అక్కడ బ్రిటిషు మంత్రిమండలి సభ్యులతో చర్చించిన మీదట ఒక పథకము తయారు చేశాడు. దీనికే 'వేవెల్ పథకము' అని పేరు. ఈ ప్రణాళికా ఆశయము-

"వైస్రాయి నూతన కార్యవర్గాన్ని నియమిస్తాడు. అందులో వైస్రాయి, సర్వ సైన్యాధిపతి తప్ప మిగిలిన సభ్యులందరు భారతీయులుగానే ఉంటారు. నూతన కార్యవర్గములో ప్రముఖ భారతీయ సంస్థల ప్రతినిధులుంటారు. ఇందలి ప్రతినిధులలో సవర్ణ హిందువులు, ముస్లిములు సమాన సంఖ్యలో ఉంటారు. విదేశ వ్యవహారాలతో సహా అన్ని విభాగాల బాధ్యత వారికి అప్పగించబడుతుంది. యుద్ధ విషయికమైన నిర్ణయాలు మాత్రమే సేనాపతి తీసుకుంటాడు. వైస్రాయికి వీటో అధికారము (దేనినైనా త్రోసిపుచ్చే హక్కు) ఉంటుంది అయినప్పటికి ఎప్పుడోకాని అది ఉపయోగింపబడదు. ఈ పథకము కేవలము బ్రిటిషు పరిపాలనలోని హిందూదేశానికేగాని, స్వదేశసంస్థానాలకు వర్తించదు."

## ఇంగ్లాండుకు విజయమా, పరాజయమా?

ఢిల్లీ ఆకాశవాణి నుండి లార్డ్ వేవెల్ ఈ పథకాన్ని గూర్చి చాల ఉత్సాహ పూరితమైన ప్రసంగము చేసాడు. జూన్ 25వ తేదీన వివిధ రాజకీయ పక్షాలనుండి ఎన్నిక చేయబడిన 22 మంది నాయకులు సిమ్లాలో సమావేశము కమ్మని ఆహ్వానము పంపబడింది. ఈ సిమ్లా సమావేశము వలన రాజకీయ పరిస్థితి కొంచెమైనా మెరుగుపడడంకాని, దిగజారడం కాని జరుగలేదు. లార్డ్ వేవెల్ నిరాశ చెందాడు. ఇంతలో జపాన్ పరాజయము పాలైంది. ద్వితీయ ప్రపంచ యుద్ధము పరిసమాప్తమైంది. మన శత్రువైన ఇంగ్లాండు జయించింది. కాని ఈ విజయము నిజానికి ఇంగ్లండుకు పరాజయమే. ఈ యుద్ధంలో ఇంగ్లండుకు విజయాన్ని సంపాదించిన మహా నాయకుడు చర్చిల్ కూడ ఎన్నికలలో ఓడిపోవలసి వచ్చింది. కార్మికపక్ష నాయకుడు అట్లీ ప్రభుత్వాధికారంలోకి వచ్చాడు. ఈ నూతన పరిస్థితిలో భారత స్వాతంత్ర్య సమస్యను గూర్చి పునరాలోచన జరపడానికి లార్డ్ వేవెల్ తిరిగి ఇంగ్లాండుకు వెళ్ళాడు.

   

# ఇరువది నాల్గవ అధ్యాయము

# స్వాతంత్ర్య సమరములో చివరి ఘట్టము

నేతాజీ చేసిన 'జైహింద్' నినాదము దేశమంతటిలో మారు మ్రోగింది. దేశము ఒకే మాటగా అజాద్ హింద్ సైనికుల విముక్తిని కోరింది. ప్రభుత్వము కూడ భయపడింది. వణికిపోయింది. ఆసమయంలో భారతదేశ సర్వసైన్యాధిపతి అయిన అకిన్‌లెక్‌కు ఈ సమస్యను అంద జేసింది. ఆయన సైన్యంలోని తనసహచరులతో సంప్రదించి, వారి సలహా తీసుకుని, అప్పటి తీవ్ర పరిస్థితి అర్థము చేసుకుని చివరకు ఆజాద్‌హింద్ సేనలోని సైనికులను విడుదల చేయవలసిందని సలహా యిచ్చాడు.

## కలకత్తా విప్లవము

ఈ సర్వసైన్యాధిపతి ఎంతో ఉదార హృదయంతో ఈ సలహా యిచ్చాడని అనుకోరాదు. ఆయనకు గత్యంతరంలేకపోయింది. ఇంతవరకు సేనలోని స్వాతంత్ర్య పిపాస అనే లావాద్రవము తుక తుక ఉడికిపోతూ ఉన్నది. జ్వాలాముఖి ఎప్పుడు బ్రద్దలౌతుందో ఎవరికి తెలియదు. దేశం

లోని విప్లవవాదులైన యువకులు మరల చెలరేగసాగారు. 1945 నవంబర్ 21 వ తేదీన వారు 'ఆజాద్ హింద్ దినోత్సవము' జరపడానికి నిశ్చయించారు ఈ వార్తతో ప్రభుత్వానికి గుండె దడ పుట్టింది. ఆనాడు కలకత్తాలో విద్యార్థులు ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు లేవదీసారు. ఈ ఊరేగింపు మీద పోలీసులు అకస్మాత్తుగా తుపాకి గుళ్ళ వర్షము కురిపించారు. రామేశ్వర్ అను విద్యార్థి కాల్పుల కాహుతి అయి హుతాత్ముడైనాడు, అరవైమంది ప్రజల రక్తము మాతృభూమిపై ప్రవహించింది.

ఈ అత్యాచారానికి విద్యార్థులు మరింత రెచ్చిపోయారు. వారు ప్రభుత్వాన్ని లొంగదీయాలని నిశ్చయించుకున్నారు. వారు వీధులలోనే కదలకుండా, నిర్భయంగా కూర్చున్నారు. ప్రొద్దు గ్రుంకింది. చీకట్లు అవరించాయి. అర్ధరాత్రి అయింది. తెల్లవారింది. ఇంకా విద్యార్థులు వీధులలోనే కూర్చుని ఉన్నారు. వారి తల్లులు, అక్కచెల్లెండ్రు అక్కడకు పరుగెత్తుకుంటూ వచ్చారు. సూర్యాస్తమయము తర్వాత కలకత్తా నగరమంతా అక్కడ గుమికూడింది. చిత్రమైన దృశ్యమది. ప్రభుత్వము చిక్కులో పడింది. రుసరుసలాడింది. మండిపడింది. వివేకాన్ని కోల్పోయింది. అది మరల కాల్పులు సాగించనారంభించింది. ఇప్పుడు ప్రజల వివేకము కూడ తుదిముట్టింది. ప్రజలలో క్రోధజ్వాల లెగసాయి. ప్రతీకార భావన చెలరేగింది. వీధులలోనే వీరవిహార మారంభమైంది.

ఒక్క దినములో ప్రభుత్వము 15 పర్యాయాలు కాల్పులు జరిపింది. ఈ కాల్పులలో 13 మంది చంపబడ్డారు. నూటయాభైమంది గాయపడ్డారు. రెచ్చిపోయిన ప్రజానీకము యాభై సైనిక శకటాలు ధ్వంసం చేసింది. ఆనాడు జ్యోతిర్మయి గంగూలీ అనే వృద్ధమాత వీరమరణము పొందింది. ఆ తల్లి హుతాత్మురాలై యువకులకునూతనోత్సాహాన్నిచ్చింది.

మూడవరోజు కూడ ప్రజలలో అలజడి తీవ్రంగానే ఉంది. ఆనాడు కూడ అనేక పర్యాయాలు కాల్పులు సాగాయి. ఏడుగురు ప్రదర్శకులు మరణించారు. అనేకులు గాయపడ్డారు. ప్రజాందోళనా తరంగము కలకత్తా సరిహద్దులు దాటి దేశమంతటా వ్యాపించింది. బొంబాయిలో ఒక తీవ్ర ప్రదర్శన జరిగింది. ప్రభుత్వాధికారులు జాగ్రత్త పడ్డారు. ఇప్పుడు వారికి బుద్ధి వచ్చింది. వారు వెంటనే ఆజాద్ హింద్ సేనలోని ముగ్గురు ఉన్నతాధికారులను–మేజర్ జనరల్ షానవాజ్, లెఫ్టినెంట్ కర్నల్ సైగల్, కర్నల్ ధిల్లన్‌లను–విడుదల చేసారు.

## వైమానిక దళంలో విప్లవము

ఈ ముగ్గురు వీరులను విడుదల చేయడంతో ప్రజా సంక్షోభము చల్లారేదికాదు. అగ్ని పర్వత ముఖము మూసివేయడం వంటిది ఈపని. ప్రజలలో మాత్రమేగాక సైన్యమంతటిలో స్వాతంత్రపిపాస రగుల్కొన్నది. పదాతి బలము, వైమానిక దళం, నౌకాదళము ఈ మూడు సైనిక విభాగాలలో ప్రతీకార భావన కార్చిచ్చులా వ్యాపించింది. వైమానిక దళాన్ని అణచి ఉంచడం అసంభవమైపోయింది. 1946 జనవరి 20 వ తేదీన కరాచీలో ఈ అసంతుష్టి మొదటిసారిగా ప్రకటితమైంది. వైమానిక దళంలోని అధికారులు హర్తాళ్ చేసారు. ఈ వాతావరణము బొంబాయి, లాహోర్, ఢిల్లీ మొదలైన స్థానాలకు గూడ వ్యాపించింది. రాయల్ ఏర్ ఫోర్స్ [R.A.F.] లోని 52 వేలమంది సైనికులు ప్రభుత్వానికి విరుద్ధంగా చప్పట్లు చరచి నిలువబడ్డారు.

కలకత్తాలోని నూతన ప్రజాందోళన ఈ వైమానికదళ విప్లవానికి చేయూత నిచ్చింది. ఫిబ్రవరి 11 వ తేదీన కలకత్తాలో మరల తుఫాను చెలరేగింది. కోరిక అదే–'ఆజాద్ హింద్ సేనలోని సైనికులను విడుదల చేయండి.' ఈసారి పోలీసు కాల్పులకు కాల్పులతోనే సమాధానము

వచ్చింది. ప్రజలు సైనిక శకటాలను దోచుకున్నారు. తపాలా బండ్లు ధ్వంసం చేయబడినాయి. ట్రాము బండ్లు అగ్గిపాలైనాయి. ఈ జన సంక్షోభము బడబాగ్ని రూపము ధరించింది. చూస్తూ చూస్తూ ఉండగానే ఈ అగ్ని దేశమంతా వ్యాపించింది. అన్ని వైపుల నెత్తుటి జల్లు వర్షింప సాగింది.

## నౌకాదళంలో విప్లవము

ఈ సంఘటనతో సైన్యవిభాగములో ఆత్మవిశ్వాసము బలపడింది. నౌకాదళములోని సైనికులు విప్లవము లేవదీసారు. స్వాతంత్ర్యప్రియులైన ఈ సైనిక విప్లవ కారుల కోర్కె-"క్విట్ ఇండియా" ఈ సైనికులు అధికారులను అయిదు కోర్కెలు కోరారు. ఆజాద్ హింద్ సేనలోని సైనికుల విడుదల; విదేశీ అధికారులను సైన్యంలో చేర్చుకొనడాన్ని ఆపి వేయడం; సైనిక అత్యాచారాలు వెంటనే నిలుపుదల చేయడం; తెల్ల అధి కారులు తమ ప్రవర్తనను సరిదిద్దుకోవడం; వారి తిట్టుబోతు వ్యవహార మును గూర్చి సైనిక న్యాయస్థానము ఎదుట కమాండర్ కింగ్' ద్వారా విచారణ జరిపించడము-ఇవి ఆ కోర్కెలు.

ద్వితీయ ప్రపంచయుద్ధ ప్రారంభంలో నౌకాదళ సైనికుల సంఖ్య 1200 వరకు ఉండేది. యుద్ధకాలములో ఈసంఖ్య పెరిగి5000అయింది. క్రొత్తగా చేరిన వారిలో స్వాతంత్ర్య వీరసావర్కార్ రాజనీతిని ఒంట బట్టించుకున్న యువకులున్నారు. అధికారులు తమ కోరికలను త్రోసిపుచ్చ జూడడం గమనించి సైనికులు విప్లవము ప్రకటించారు. 'బ్రిటిష సామ్రా జ్యము నశించాలి' ఇది వారి నినాదము 'ఆంగ్లేయులారా హిందుస్థాన్ వదలి వెళ్ళండి' ఇది వారి అంతిమ ఆదేశము.

## బొంబాయి యుద్ధమైదానమైంది

ఫిబ్రవరి 18 వ తేదీన యుద్ధనౌక 'తల్వార్'పై విప్లవజండా,కాదు స్వాతంత్ర్య సంగ్రామము యొక్క జ్వాజ్వల్య మానమైన చిహ్నము-

ఎగురవేయబడింది. సైనికులందరు "ఆజాద్ హింద్ సేన" గౌరవ చిహ్నాన్ని సగర్వంగా గుండెలపై ధరించారు. జై హింద్ నినాదాలు చేసి స్వాతంత్ర సైనికులు బయటికి వచ్చారు. నౌకా సైనిక స్థావరములో చూస్తూ చూస్తూ ఉండగానే అనేకమంది సైనికులు యుద్ధ సన్నద్ధులై మువ్వన్నె పతాక ఛాయలోకి వచ్చి నిలిచారు.

ఫిబ్రవరి 19వ తేదీ భారత స్వాతంత్ర్య చరిత్రలో రోమాంచము కలిగించే గౌరవదాయకమైన పుట. ఈనాడు బొంబాయి నగరము యుద్ధ మైదానమైంది. ఒకవైపు నౌకాదళములోని భారతీయ స్వాతంత్ర్య సైనికులు, మరొకవైపు ఆంగ్లేయ అధికారులు, సేన, నౌకాదళ సైనికులు సాయుధులై బయటికి వచ్చారు. వారు మొదటనే యూనియన్ జాక్‌ను (బ్రిటిషువారి జండా) క్రిందికి దింపివేసారు. ఆ స్థానములో త్రివర్ణ పతాకము ఎగురవేస్తారు. ఆ జండాను సాక్షిగా నిలిపి తెల్ల అధికారులను చంపివేయ నారంభించారు. నౌకాదళ సైనిక స్థావరాన్ని ఆంగ్లేయ సేన చుట్టుముట్టింది. కాని కొంతమంది నేర్పుగా ఆ ముట్టడినుండి తప్పించుకొని బయటకు వచ్చి ఆంగ్లేయ సేనపై దాడిచేసి తమ సోదరులకు విముక్తి కల్పించారు. యుద్ధము ప్రారంభమైంది. ప్రజలు చాల పట్టుదలతో ఉన్నారు. వారు తమంత తామే ఈ స్వాతంత్ర్య సైనికుల కోసము ఆహార భాండాగారపు వాకిళ్ళు తెరచారు. శిబిరములోని సైనికుల ఆహార పరిస్థితి క్లిష్టమైంది. వాళ్ళు నలువైపులా జూచారు. తమమీద తమ సైనిక సోదరులే తుపాకులు గురిపెట్టి నిలవడం, వారిలోకూడ మరాఠీ సైనికులే ఉండడం గమనించారు. అప్పుడు క్రాంతికారుల శరీరాలతో ఒక అద్భుత చైతన్యం ప్రసరించింది.

ఛత్రపతి శివాజీకి జై అని వారు నినాదాలు చేసారు. ఈ స్వతంత్ర సమరములో సహకరించవలసిందని మరాఠా సైనికులకు విజ్ఞప్తి చేసారు.

అంతా తలక్రిందైంది. మంత్ర దండము త్రిప్పినట్లుగా అంతా మారి పోయింది. మరాఠా సైనికులు కత్తులు ఒరలలో దింపివేసారు. తాము కాల్పులు సాగింపజాలమని స్పష్టంగా వారు తమ అధికారులకు చెప్పి వేసారు.

## కత్తికి కత్తి ఢీ

ఈ నూతన పరిణామముతో అధికారులు మరింత కంగారుపడ్డారు. వారు తుపాకీ కాల్పులకు ఆజ్ఞ యిచ్చారు. ఆంగ్లేయ సైనికులు మాత్రమే కాల్పులు ప్రారంభించారు కాని, ఎదురుగా నిలబడి ఉన్నది కాల్పులకు భయపడిపోయే నిరాయుధ ప్రజలుకాదు. అది సాయుధసేన. నౌకాదళము లోని సైనికులు కాల్పులకు జవాబుగా కాల్పులు సాగించారు. పోరు ప్రారంభమైంది. సైనిక శిబిర మంతా యుద్ధోత్సాహంతో లేచి నిలిచింది. పైపైకివచ్చే తెల్లసేన జంకి వెనుకకు మరలింది. జయించిన స్వాతంత్ర్య సైనికులు కేసల్ సైనికస్థావరముమీద విరుచుకపడ్డారు. అక్కడి యంత్ర సామాగ్రిని తమ అధీనములోకి తెచ్చుకున్నారు. రక్షణకోసముఉంచబడిన మరాఠాసేన తిరిగి వెళ్ళిపోవడానికి అనుజ్ఞ ఇవ్వబడింది. ఇంతలో మరాఠా సేన స్థానాన్ని ఆంగ్లేయసేన ఆక్రమించింది ఒకవైపున నౌకాదళ సైని కులు మరొకవైపు ఆంగ్లేయసేన, భయంకర యుద్ధము ప్రారంభమైంది. బొంబాయి నగరంలోని ఫోర్టు ప్రాంతము రణరంగమైంది. సింధు సాగరములో (పడమటి సముద్రములో) చెదురుమదురు పోరాటాలు ప్రారంభమైనాయి "సింధ్" అను పేరుగల యుద్ధనౌక సముద్రములో నిలిచి ఉంది. ఆ నౌక నుండి సైనికులు కురిపించిన తుపాకిగుళ్ళ జల్లుకు కేసల్ సైనికస్థావరములోని ఆంగ్లేయ సైనికులు భయంతో పరుగులెత్తారు. ఆంగ్లేయుల మందుగుండు సామగ్రి భాండాగారము స్వాతంత్ర్య సైనికుల హస్తగతమైంది.

ఈ సమయములో మన స్వాతంత్ర్య యోధులవద్ద ఇరవై యుద్ధ నౌకలు ఆరు నెలలపాటు యుద్ధములో పాల్గొనడానికి తగినంత మందు గుండు సామగ్రి ఉంది. ఆయుధ సంపదకుతోడు అపారమైన ఆత్మ విశ్వాసముకూడ ఉంది. ఆ సమయములో "సింధు" నౌకతోపాటు "కలావతి" మరిమూడు అటువంటి యుద్ధనౌకలు ఉండినవి. ఈ నాల్గు నౌకలు మొదటి దాడిలోనే విప్లవకారుల హస్తగతమైనాయి. పెషావర్, అంబాలాల లోని విమాన సైనిక స్థావరాలనుండి సహాయముకోసము పిలుపు అందింది "కృష్ణా" "గోదావరి" "కావేరీ" "సట్లెజ్" - ఈ నాల్గు యుద్ధ నౌకలు హాంకాంగ్ మార్గములో దూరాన సముద్రంలో ఉన్నాయి. ఆ నౌకలనుండి "భలే? మేముకూడ మీ సహాయానికి హిందుస్థాన్‌కు తిరిగి వస్తున్నాము" అని సందేశమందింది.

## ఏడుగంటల పోరాటము

ఏడుగంటలపాటు పోరాటము జరుగుతూనే ఉంది. నౌకాదళ సైనికులు నగరములోకి చొచ్చుకొనివచ్చి ఆంగ్లేయులను ఏరియేరి చంపడానికి ప్రారంభించారు. ఆ ఒక్క రోజులోనే ఫోర్టు ప్రాంతములో చూస్తూ చూస్తూ ఉండగానే ఏడువందలమంది ఆంగ్లేయులు హతులైనారు. చివరకు "రాత్రి పన్నెండు గంటల లోపల తిరుగుబాటుదారులు లొంగిపోకుంటే విమానాలలో నుండి బాంబుల వర్షము కురిపించబడుతుంది; నౌకాదళ స్థావరమే గాక, బొంబాయి నగరము పూర్తిగా బుగ్గిచేసివేయబడుతుంది" అని ప్రభుత్వము వారిని బెదిరించింది.

బొంబాయి నగరము బుగ్గిపాలౌతుందన్న బెదిరింపుతో నాయకులు కలవరపడ్డారు. కాని ప్రజలు అణుమాత్రమైనా భయపడలేదు. నావికాదళ సైనికులు సరేసరి. భయము వారిచెంతకే చేరలేదు.

పరిస్థితి చాలా క్లిష్టంగా ఉంది. ఈ సమయములో 'ఉక్కు-మనిషి' సర్దార్ వల్లభభాయి పటేల్ ముందుకువచ్చాడు. ఆయన నౌకాదళాధికారులను కలుసుకున్నాడు. వారి శౌర్యాన్ని, స్వాతంత్ర్య పిపాసను ప్రశంసించాడు ఆయన వారికి నచ్చచెప్పుతూ ఇలా అన్నాడు :

"స్వాతంత్ర్య సంపాదనకు ఇప్పటికి మీరు కలిగించిన వెరపు చాలు. ఇంకా రక్తపాతము అవసరములేదు. గత రెండు దినాలలో పాశవికమైన బ్రిటిషు కాల్పులకు గురిఅయి నిరాయుధులయిన ప్రజలు 250 మంది చనిపోయారు. ఇంకా అధిక సంఖ్యలో హుతాత్ములు కావడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు ప్రజల ప్రతినిధిగా, నాయకుడుగా ఆయుధాలు



బొంబాయితో తిరుగుబాటు చేసిన నౌకాదళ సిబ్బంది అధికారులతో వల్లభభాయి పటేల్

క్రింద పెట్టవలసిందని మిమ్ములను కోరుతున్నాను. ఇప్పుడు ఆయుధాలు లేకుండానే మనము ఆంగ్లేయులను లొంగదీయగలము."

సర్దార్ పటేల్ సలహాను నౌకాదళ సైనికులు అంగీకరించారు. ఎటువంటి షరతులు లేకుండానే ఆయుధాలు క్రిందపెట్టారు. ఫిబ్రవరి 23వ తేదీ ఉదయము బొంబాయి ప్రశాంత పరిస్థితికి వచ్చింది.

## కరాచీ పరాక్రమము

కాని ఈ నౌకాదళ స్వాతంత్ర్య యుద్ధజ్వాల కేవలము బొంబాయికే పరిమితము కాలేదు. స్వాతంత్ర్య యుద్ధ విప్లవ సందేశము నలువైపులకు వ్యాపించింది. కరాచీ రేవులో ఉన్న "హిందుస్థాన్" పేరిటి యుద్ధనౌక రణభేరిని మ్రోగించింది, నగరముమీద దాడిచేసి నగరాన్ని తన అధి కారములోకి తెచ్చుకుంది. "బహాదుర్", "హిమాలయ" నౌకలనుండి సైనిక పటాలాలను ప్రభుత్వము "హిందుస్థాన్" పైకి పంపింది. జన సామాన్యము నౌకాదళాన్ని సమర్థించింది. ప్రభుత్వము అక్కడికి సైన్యాన్ని తరలించింది. తుపాకి కాల్పుల జడివాన ప్రారంభమైంది. కాని స్వాతంత్ర్య సైనికులను ఈ సామ్రాజ్యవాద సైనికులు ఏమీ చేయలేక పోయారు. చివరకు బ్రిటిష్ సేన ముట్టడివేసింది. మందుగుండు సామా గ్రిలో చిట్టచివరి తూటావరకు స్వాతంత్ర్య సైనికులు ఎంతో జాగరూ కతతో పోరాడారు. కాని చివరకు లొంగిపోవలసి వచ్చింది. ఇక్కడకూడ స్వాతంత్ర్యయోధుల పరాక్రమం పరాకాష్ఠ నందుకున్నది.

## భయద దావానల స్వరూపము

నౌకాదళ విప్లవమువలన విమానదళానికి నూతన స్ఫూర్తి లభిం చింది. అంబాలా విమానదళము రణభేరి మ్రోగించి నిలిచింది. చూస్తూ ఉండగానే బొంబాయి, మద్రాసు, కలకత్తా, ఢిల్లీలలో కూడ చిచ్చు రగి

లింది. క్రమంగా ఈ జ్వాలలు రంగూన్ వరకు వ్యాపించాయి. ఇక ముందు ఇంతటి విశాల దేశాన్ని కేవలము ఆంగ్లేయ సైనికుల శక్తిమీద పరిపాలించడము అసంభవమని బ్రిటిషు వారు గుర్తించారు. నాల్కాలు చూస్తూ పైపైకి ఎగసే ఈ విప్లవమహాగ్ని రేపు ఈ గడ్డమీద ఆంగ్లేయుల ఊరు పేరు లేకుండ చేస్తుంది. కాబట్టి తెలివిగా ఇక ఇక్కడనుండి తప్పు కోవడమే మేలు. ఏ సముద్రపు కెరటాల్లో తేలుతూ తాము భారతభూమిని చేరుకున్నారో, ఆ సముద్ర తరంగాలే మరల తమను తమ మాతృభూమికి చేర్చగలవు. బ్రిటిష్ ప్రభుత్వ నౌక విప్లవ డాకకు ప్రీలిపోయి సాగర గర్భంలో సమసిపోకముందే తమంత తాము విప్లవశక్తి శరణుజొచ్చి, క్షేమంగా తమ మాతృభూమికి తిరిగిపోవాలి అని ఆంగ్లేయు లనుకున్నారు. వివేకముగల ఈసమయోచిత నిర్ణయము బ్రిటిషు ప్రభుత్వము తీసుకుంది, 1947 ఆగస్టు 15వ తేదీన స్వతంత్ర భారత ధ్వజానికి గౌరవాభి వందనము చేసి భారత ప్రవేశ ద్వారము నుండే - బొంబాయి నుండే - అది తిరిగి వెళ్ళిపోయింది.



## ఇరువది ఐదవ అధ్యాయము

# స్వతంత్ర భారత అవతరణము

భారతీయ స్వతంత్ర సమరములోని చివరి ఘట్టాన్ని నౌకా దళము, విమానదళము జరిపిన తిరుగుబాటును వెనుకటి అధ్యాయంలో పరిచయము చేసుకున్నాము.

ఈ సమయములో పంజాబులోని 15 వ సైనిక పటాలము 'జై హింద్' రణగర్జన చేసింది. సైనికులు నగరములో ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు జరిపారు. అప్పుడు ఆంగ్లేయులైన ఉన్నతాధికారులు వారిపై కాల్పులు జరుపవలసిందని ఆజ్ఞాపించారు. కాని ఆ ఆజ్ఞను మన్నించే దెవరు ? ఆంగ్లేయుల, రాజ్యమే అంతిమ ఘడియల్లో ఉంది. అది అద్భుతమైన, భవిష్యత్ సూచకమైన సంఘటన.

అటుతర్వాత 1946 డిశంబర్ 21 వ తేదిన జబల్‌పూరులో తిరుగుబాటు జరిగింది. అక్కడ ఒక పెద్ద ప్రభుత్వ కార్ఖానా ఉంది. ఆ కార్ఖానా మూతబడింది. బెంగాల్‌లోని హైడ్రాబాలో సైనికులు స్వయంస్ఫూర్తితో

ప్రభుత్వాన్ని ధిక్కరించారు ఈ సమయంలోనే పోలీసులు తిరుగుబాటు చేసారు. ఢిల్లీ, బీహార్‌లోని పోలీసులు సహాయనిరాకరణ రణభేరిని ప్రయోగించారు. బ్రిటిష్ ప్రభుత్వ పరిస్థితి విడ్డూరంగా తయారైంది. ఏ సైనికశక్తి, పోలీసు బలగము ఆధారంగా బ్రిటిషు ప్రభుత్వము నిలచి ఉన్నదో, ఆ శక్తులే కాలిక్రింది ఇసుకలాగా కదిలిపోతున్నాయి. ప్రభుత్వము బెదరిపోయింది.

ఈ సంఘటన భారతదేశ చరిత్రలో అపూర్వము. సైనిక విప్లవము అత్యంత స్ఫూర్తిమంతము. ఈ విప్లవ సైనికుల వెనుక ఏ రాజకీయ నాయకుడుగానీ, సంస్థగాని లేదు. కాని ఈ సమరము ప్రారంభింపబడి నప్పుడు యువక విద్యార్థులు తమంత తామే ఈ సైనిక దళానికి సహాయము చేయడానికి ముందుకువచ్చారు. ప్రజలుకూడ నిర్భయంగా ముందుకు వచ్చారు. సైనిక, సైనికేతర రక్త ప్రవాహాల సంగమము నిర్మాణమైంది.

ఆంగ్లేయులనుండి రాజకీయాధికారము లాగుకొనడానికి ఇంత మంచి అదను లభించింది. కాని మీదకురికి ఒడిసిపట్టి లాగుకునే అవకాశం లేకపోయింది. ఇకముందు భారతదేశముపై తమ ప్రభుత్వము సాగనేరదని బ్రిటిషు ప్రభుత్వము గుర్తించింది. భారతీయుల తాపు తిని దేశమునుండి బయట పడడం కంటె స్వయంగా, గౌరవంగా, విజయవంతంగా తిరోగమించడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. పెద్దదొర తానే ఇంగ్లండు వెళ్ళాడు. అక్కడకూడ మంత్రిమండలిలో మార్పు వచ్చింది. అక్కడ కన్సర్వేటివ్ పార్టీ అధికారమునుండి వైదొలగి కార్మిక పక్షము అధికారములోకి వచ్చింది. ఈ క్రొత్త ప్రభుత్వము అప్పటి భారత మంత్రి లార్డ్ పెథిక్ లారెన్సు, సర్ స్టాఫర్డు క్రిప్సు, మి. అలెగ్జాండర్ అను ముగ్గురు మంత్రులను హిందుదేశ స్వాతంత్ర్య

సమస్య పరిష్కరించడానికి భారత్‌కు పంపింది. ఈ ముగ్గురు కాంగ్రెసు, ముస్లింలీగు, హిందూమహాసభ ప్రతినిధులను, ఇతర నాయకులను కలుసుకొని చర్చలు సాగించారు. ఈ చర్చలలోకూడ ముస్లిములీగు దేశవిభజన జరగాలని మొండపట్టుబట్టి కూర్చున్నది. మరల ఈ ముగ్గురు మంత్రులు 1946 మే 16 వ తేదీన ఒక పథకాన్ని ప్రకటించారు. అందులో నూతన రాజ్యాంగము అమలులోకి వచ్చేంతవరకు, భవిష్యత్ రాజ్యాంగము రూపొందించడానికి, మధ్యకాలంలో ప్రభుత్వ స్థాపన జరపడానికి ఏర్పాటు చేయబడినాయి. ఈ పథకము స్వరూపము—

## మంత్రిత్రయ ప్రణాళిక

1 బ్రిటిషు పరిపాలిత హిందుదేశము, స్వదేశ సంస్థానములు కలిసి ఒక సంఘరాజ్యముగా నిర్మించబడాలి. మధ్యకాలంలో నడిచే సంఘరాజ్య ప్రభుత్వము విదేశ వ్యవహారాలు, రక్షణ, రవాణా వ్యవహారాలు చూస్తుంది. అందుకు అవసరమైన డబ్బు సమకూర్చుకునే అధికారము సంఘరాజ్య ప్రభుత్వానికి ఉంటుంది.

2. బ్రిటిషు పరిపాలిత హిందుదేశమునకు, స్వదేశ సంస్థానాలకు ప్రాతినిథ్యమువహించే విధానసభ సంఘరాజ్యానికి ఉండాలి. విధానసభలో ఏదైనా ముఖ్యమైన జాతీయ సమస్య వచ్చినపుడు దానినిగూర్చిన నిర్ణయము హిందు, ముస్లిము ఉభయవర్గాలలో అధికసంఖ్యాకుల ఆమోదము లభించిన మీదటనే చేయబడుతుంది.

3. సంఘరాజ్యానికి అధికారమున్న విషయాలుతప్ప తక్కిన అన్ని విషయాలపై అధికారము, శేషాధికారము ప్రాంతీయ ప్రభుత్వాలకే ఉంటుంది.

4. విభాగ రాజ్యాలు వానికి సంబంధించిన విధానసభ కార్య నిర్వాహక వర్గముల నిర్మాణానికి ప్రాంతాలకు అధికారము ఉంటుంది.

5. సంఘరాజ్యానికి అధికారమున్న విషయాలు తప్ప అన్ని విషయాలలో స్వదేశ సంస్థానాలకు అధికారముంటుంది.

6. పది సంవత్సరముల తర్వాత తమ విధానసభలోని అధిక సంఖ్యాకుల ఆమోదముతో రాజ్యాంగములోని నియమాలను మార్పుచేసే అధికారము ప్రాంతాలకు ఉంటుంది. సంఘరాజ్యము, విభాగరాజ్యము విషయంలో కూడ అటువంటి ఏర్పాటు ఉండగలదు.

దీనితోబాటు రాజ్యాంగ సభను ఎన్నుకోవడానికి ఈ మంత్రులు ముగ్గురు తమ ప్రణాళికలో ఈ క్రింది సూచనలు చేసారు—

1. పదిలక్షల జనసంఖ్యకు ఒక ప్రతినిధి చొప్పున ప్రతి ప్రాంతంలో కూడ ప్రతినిధిత్వము ఏర్పాటు చేయబడాలి.

2. ప్రతి ప్రాంతములోని ప్రముఖ వర్గాల జనసంఖ్యనుబట్టి సభాసదుల వర్గీకరణము జరగాలి.

3. మద్రాసు, బొంబాయి, సంయుక్త ప్రాంతము (ఉత్తరప్రదేశ్) బీహార్, మధ్యప్రదేశ్, ఒరిస్సా ప్రాంతాలను ఒక వర్గముగాను, పంజాబు, వాయవ్య సరిహద్దు ప్రాంతము, సింధు రెండవ వర్గముగాను బెంగాల్ అస్సాము మూడవ వర్గముగాను విభజించి ఆవిధముగా ప్రాంత ప్రతి నిధులు ఎన్నుకొనబడాలి. ప్రతి విభాగములోని ప్రతినిధులు తమ విభాగములోని ప్రాంతముల రాజ్యాంగము తయారుచేయగలరు.

4. ప్రాంతముల, విభాగముల రాజ్యాంగము నిశ్చితమైన తర్వాత ఘటనాసమితి' లోని మూడు విభాగాలు, స్వదేశ సంస్థానాల ప్రతినిధులు కలసి 'సంఘరాజ్యము' యొక్క రాజ్యాంగము: తయారు చేయగలరు.

పైన వివరించిన ప్రణాళిక అమలులోకి వచ్చేవరకు గల మధ్య కాలములో ప్రభుత్వాలు ఏర్పాటు చేయడము ముస్లిములీగుకు తప్ప అంద రికీ సమ్మతమే, ముస్లిములీగు భారతదేశ విభజనము జరిపించి ప్రత్యేక

రాజ్యము తీసుకొనగోరుతున్నది. స్వతంత్ర పాకిస్తాన్ కావాలని మొండి కెత్తి కూర్చున్నది. ఆ మాట భారతమాత సుపుత్రుడెవ్వరూ కలలోనైన అంగీకరింపజాలని విషయము. కుటిలురైన ఆంగ్లేయులు పై ప్రణాళికలో మత ప్రాతిపదికమీద ప్రాంతములను మూడు విభాగములుగా తయారు చేసి పరోక్షంగా ముస్లిములీగు కోరిన దేశ విభజనకు మార్గము సుగమం చేసారు. చివరకు కొన్ని విషయాలు అమోదయోగ్యంగా ఉన్నవవే సాకుతో ముస్లిములీగు ఈ ప్రణాళికను అంగీకరించింది.

## జిన్నాపట్ల అపార ప్రేమ

ఇప్పుడు తాత్కాలిక ప్రభుత్వము స్థాపించే సమస్య ఎదురైంది. ఈ విషయంలో కూడ జిన్నా గారాబు బిడ్డలాగా మొండికెత్తి కూర్చున్నాడు. పాకిస్తాన్ నిర్మాణానికి అనువైన మనోభావాలు నిర్మాణం చేసిన జనకులైన బ్రిటిషు ప్రభుత్వానికి మాత్రమే ఆయన అనుచరుడు. జిన్నా గవర్నరుతో మాత్రమే మాట్లాడేవాడు. ఆయన మాటలనే మన్నించేవాడు. మహాత్మాజీ, పండిట్‌జీలు అతని దృష్టిలో పసిబాలురలాగా వికసించని బుద్ధిగల నాయకులు. అతని మెదడులో కేవలము ఒక్కటే విషయము – స్వతంత్ర రాజ్యము, ప్రత్యేక పాకిస్తాను నిర్మాణము-పీఠము వేసుక కూర్చుంది. అందుకై అనేక విధాలైన నాటకాలాడుతూ తన ఆశయము వైపుకు పురోగమించసాగాడు. ఇక ఎదుట పక్షములో భారతీయనాయకులు కంగారుతో, కలవరపాటుతో ప్రవర్తింపసాగారు. 1946 జూలై 18 వ తేదీన లార్డ్ పెథిక్ లారెన్సు బ్రిటిషు పార్లమెంటులో స్పష్టంగా ఇలా చెప్పాడు:

"కాంగ్రెసుకు అఖండ, అవిభాజ్యమైన హిందుస్థానము కావాలి. హిందుస్థాన్, పాకిస్తాన్ అని రెండుగా దేశము విభజింపబడాలని ముస్లింల కోరిక."

హిందుస్థాన్‌కు మనము స్వాతంత్ర్యము ఇస్తూఉన్నాము. కాని అక్కడి ప్రజలు దానినికూడ ఒద్దికతో తీసుకోడానికి సిద్ధంగాలేరు అని ఆంగ్లేయ ప్రభుత్వము చెప్పినట్లే అయింది ఆజాద్ హింద్ కాలి తాపుకు కలత బారి బ్రిటిషు ప్రభుత్వము నడుము ఓర్చుకోలేనంతగా నొప్పి పెడు తున్నమాట వాస్తవము కాని దానిని పైకికన్పించనీయకుండా అది మరొక లాగ చూపిస్తున్నది. "ఈ రెండు వర్గాలు ఏకాభిప్రాయానికి రానంతవరకు తాత్కాలిక ప్రభుత్వ స్థాపన ఎంత అవసరమైనప్పటికీ మేము దానిని ఆపివేసాము" అని చివరకు ప్రభుత్వము ప్రకటించింది.

అంతా ముగిసింది. కాదు కూడదు అనకుండానే ప్రజలు అంగీక రించిన ఆ ప్రణాళిక ననుసరించి ఇప్పుడు జరుగవలసిన తాత్కాలిక ప్రభుత్వ స్థాపన బ్రిటిషు ప్రభుత్వము ఆపి వేసింది. ఇది తెలు సుకొని ముస్లిము నాయకులు కోపముతో మండిపడ్డారు. చేతిలోకి వస్తూ ఉన్న పాకిస్తాన్ దూరమై పోతున్నదన్న ఆవేశంతో వారు పాకిస్తాన్ సాధించడానికి 'ప్రత్యక్ష కార్యాచరణ' (Direct action) ప్రారంభించా లని నిశ్చయించుకున్నారు.

'మేము పాకిస్తాన్ కావాలని అడిగి అడిగి అలసిపోయాము. హిందు వులు, మేము కలిసి ఉండడము జరగనిపని. మాకు ఎన్నో మార్గాలు కని పిస్తున్నాయి. మేము అహింసకు బద్ధులముకాము."—అని ముస్లిములీగు అసందిగ్ధంగా తీర్మానము చేసింది. ప్రతిచోట వేలకొలది ముస్లిములు సమా వేశము కాసాగారు. రహస్యంగా కుట్రలు పన్నసాగారు. వీధివీధిన రహస్య సమావేశాలు జరుగ సాగాయి. 1946 ఆగస్టు 16 వ తేదీన కలకత్తాలో హిందువుల భీషణ సంహారము ప్రారంభమైంది. లక్షలాది నిరపరాధులయిన హిందువుల రక్తము వీధులలో ప్రవహింపసాగింది. బెంగాల్‌లో ముస ల్మాను ప్రభుత్వము ఉన్నది. అది ఇళ్ళకు నిప్పుపెట్టడానికి బహిరంగంగా పెట్రోలు డబ్బాలు సరఫరాచేసింది. ఇతరవిధాల కూడ ముసల్మానుల

కుట్రలో సహాయము చేసింది. ఎటుచూచినా అమానుష మానవ సంహారము. ఏ వైపుజూచినా దగ్ధమైపోతున్న ఇళ్ళనుండి మిన్నంటే మంటలు. హిందూ స్త్రీలు, బాలురు, వృద్ధులు, తల్లిదండ్రులు నిరాధారులయి పోతున్నారు. యువకులు అతిక్రూరంగా కత్తి వాదరకు బలి చేయబడుతున్నారు. యువతుల మాన మర్యాదలు నిండు బజారులో దోచుకోబడుతున్నాయి. ప్రపంచ యుద్ధములో నైనా కలకత్తా వీధుల్లో జరిగినంతటి నరహత్యలు జరిగి ఉండవు. పాశవిక అత్యాచారము నీచాతినీచ స్థాయి నందుకున్నది.

## "ప్రత్యక్ష కార్యాచరణ"కు ప్రతీకారము

ఒకటి, రెండు, మూడురోజులిలాగే నడచిపోయాయి. ఇక ఇప్పుడు తమ సంరక్షకులు తామే అని హిందువులు గుర్తించారు. ప్రతీకార చర్యలు జరపడానికి పూనుకున్నారు. అత్యాచారానికి జవాబు అత్యా చారంతోనే చెప్పడానికి నిశ్చయించుకున్నారు. కలత్తాకు బదులు బీహారు తీర్చింది. ముసల్మానుల ఊచకోత ప్రారంభం కాగానే ముస్లిములకు, ప్రభుత్వానికి, కాంగ్రెసు నాయకులకు కళ్ళు తెరపిడి పడ్డాయి. సైన్యము పిలిపించబడింది. అదికూడ హిందువులను అణచివేయడానికి మాత్రమే ఉపదేశ తీర్థము గ్రుక్కమీద గ్రుక్క త్రాగించనారంభించారు. మహాత్మాజీ అక్కడకు పరుగు పరుగున వెళ్ళాడు. ఆయన హిందువులను శాంతింప జేయడానికి ప్రయత్నం చేశాడు, కాని హిందువులను నిలువునాహత్య చేసే ముసల్మానులను అడ్డుపెట్టడానికిగాని, భయపెట్టడానికి గాని ఎవ్వరుకూడ ముందుకు రాలేదు. హిందువులను చంపివేసి వారి సంఖ్య తగ్గించడము, వారిని మతము మార్చి ముసల్మానులను చేసి ముస్లిముల సంఖ్య పెంచడమూ, ప్రతాపము చూపించి నాయకులను పాకిస్తాన్ కోరికకు సమ్మతింప జేయడము-ఈ కొట్లాటల ఉద్దేశ్యము.

# నౌఖాలీ పాదయాత్ర

కలకత్తాలో జరిగినటువంటి భీషణహత్యాకాండ నిర్ణీత పథకము ప్రకారము తూర్పు బెంగాల్ అంతటిలో ప్రారంభమైంది. నిరాధారులైన హిందువులు భయభ్రాంతులై పారిపోసాగారు. ఇల్లూ వాకిలి, డబ్బు దస్కము, పొలము పుట్ర అన్నీ పోగొట్టుకొని నిర్భాగ్యులై దీనులై, నిర్వాసులై పోయారు. దొరికిన బండిమీద, ఏదీ లేకపోతే కాలినడకను వారు హిందువులు ఎక్కువగా ఉన్న పట్టణాలవైపుకు ఆశ్రయముకోసము అంగలార్చుతూ పరుగెత్తారు. ఒంటరిగా పట్టుబడిన స్త్రీలకు జరిగిన అవమానాలకు పోలిక మానవ చరిత్రలోనే లేదు. నౌఖాలీ, త్రిపుర జిల్లాలలో హిందువులపై జరుపబడిన అత్యాచారాలకు, అక్కడ జరిగిన భయంకర హిందూ మారణానికి, ఆ నాడు రాళ్ళుకూడ గుండెలవిసేలాగ ఏడ్చాయి. కాని, ఆనాటి పైశాచిక ప్రభుత్వము, శిఖండి నాయక బృందము చూస్తూ ఊరుకున్నాయి. కాని, గాంధీజీ ఊరుకోలేకపోయాడు. ఆయన ఒంటరిగా నౌఖాలీకి వెళ్ళాడు. దుఃఖితుల కన్నీళ్ళు తన చేతితో తుడిచాడు. తిన్నగా ఒంటరిగా ముసల్మానుల పేటకు వెళ్ళేవాడు. పిన్నలను పెద్దలను సమావేశపరచి నిర్భయంగా ఇలా అడిగేవాడు—

"మీరు నిన్నటివరకు హిందువులతో సోదరుల లాగా కలిసిమెలసి ఉన్నారు. ఈనాడు వారి ప్రాణాలు తీసుకోవడానికి ఎందుకు సిద్ధమైనారు? ఇది మీకు కీర్తినిస్తుందా? హిందువులను బలవంతాన ముసల్మానులుగా చేయవలసిందని మీ ఖురాన్‌లో వ్రాసి ఉందా?"

అలాగే ఆ రోజుల్లో హిందువుల పేటల్లోకూడతిరిగేవాడు. భయంతో ప్రాణాలు అరచేతిలో పెట్టుకున్న హిందువులకు ధైర్యం చెబుతూ, దుఃఖితుల కన్నీరు తుడుస్తూ, నిర్భయంగా వారితో ఇలా అనేవాడు—

"మీరు పిరికిపందలలాగా పారిపోవడము ఎందుకు? మీరు ఎదు ర్కొంటూ ఉంటే ఈపరిస్థితి వచ్చేఉండదు. మీరుతిరిగి మీమీ ఇళ్ళకువెళ్ళి పనిపాటలు చూచుకోండి."

## రణరంగంనుండి వెనుకంజ

స్వాతంత్ర్య యుద్ధంలో ఈ కొట్లాటలు ఒక భాగమే. యుద్ధంలో జయాపజయాలనుగూర్చి ఆలోచించ నక్కరలేదు. బెంగాల్‌లోని నర హత్యలకు, బీహార్‌లోని నరమారణం జవాబిచ్చినమీదట అది కొంచెము అదుపులోకి వచ్చింది హిందువులుకూడ జాగ్రత్త పడ్డారు. ఎదురు దెబ్బ తీయడానికి సిద్ధమైనారు. కుక్క కాటుకు చెప్పుదెబ్బగా జవాబు రాగలదని ముసల్మానులు అర్థం చేసుకున్నారు. అంతకంటెకూడ అధికంగా, హిందూ జాతి తాననుకున్నంత పిరికిపందగాదని బ్రిటిషువారికి అర్థమైంది. వారు ఈ మత కలహాల పెట్టుబడితో లాభాలు సంపాదించడానికి ఇప్పుడు పూనుకున్నారు. నౌఖాలీ కలహాలు అణచివేయడానికి తగిన సమయము ఇప్పుడు వచ్చిందనుకున్నారు. ఇప్పటికే అక్కడ విశేష సంఖ్యలో హిందువుల హత్య జరిగిపోయింది. కాని ఇదంతా బీహార్ హిందువులు గుర్తించనే గుర్తించారు. వడ్డీతోసహా వారక్కడి ముసల్మానులను చంపి వేసారు. లక్షలకొలది ముస్లిములు అక్షరాల గడ్డికరచి పరుగెత్తసాగారు. మరల కాంగ్రెసు నాయకులకు చైతన్యము కలిగింది. ప్రభుత్వము తుపా కులు తీసికొని పరుగెత్తింది. నాయకులు సాత్విక క్రోధముతో ఉపదేశ తీర్థము త్రాగించడానికి పరుగు పరుగున వచ్చారు. మహాత్మాజీ ఉపవా సాస్త్రము బయటికి తీసాడు. బీహార్‌లో ముసల్మానులను భయపెట్టి, అత్యాచారాలవి ఖబురులు తీర్చడం కొంతకాలం తర్వాత ఆగిపోయింది. కాని, ఇది ఒకవైపు శాంతించడమే. ఈ దేశాన్ని ముక్కలు చేయడానికి పూనుకున్న అజగరము నడుము విరుగగొట్టడానికి ఇది ఒక పద్ధతి.

దేశద్రోహకరమైన ఈవిషవల్లి ఆ సమయంలో పూర్తిగా పెకలించవేయబడి ఉండేది. కాని...పరిస్థితి "భగవంతుడు సత్యసంకల్పదాత" అని జపిస్తూ కూర్చునే హిందువులమీద పగతీర్చుకుంది. ఆ సమయంలో పండిట్ నెహ్రూ పెషావర్‌కు వెళ్ళడం తటస్థించింది. అప్పుడు అక్కడ విమానాశ్రయంలో 5000 సైనికులు నల్లజండాలు పట్టుకొని 'కాంగ్రెస్ నశించాలి'. అని నినాదాలుచేస్తూ ప్రదర్శన చేస్తారు. ప్రతివాని చేతిలో బల్లెము. బరిసె మొదలైన ఆయుధాలున్నాయి. ఈ దృశ్యముచూచి పండిట్‌జీకి మూర్ఛ వచ్చినంత పని అయింది.

## తాత్కాలిక ప్రభుత్వ స్థాపన

తాత్కాలిక ప్రభుత్వము భారతదేశంలో పండిట్ నెహ్రూ నాయకత్వంలో స్థాపింపబడింది. మొదట్లో ముస్లిములీగు ఈ ప్రభుత్వములో చేరడానికి అంగీకారము చూపలేదు. "లడకే లేంగే పాకిస్తాన్" (పోరాడి పాకిస్తాన్ తీసుకుంటాము) అని కొట్లాటలు ప్రారంభించింది. కాని, కొట్లాటలకు జవాబుగా తీవ్రతరమైన కొట్లాటలు రావడం జూచి లీగ్ వెనుకకు తగ్గింది. అయిదుగురు ప్రతినిధులను అది ఈ మంత్రిమండలికి పంపింది. కాంగ్రెస్, లీగ్‌ల సంయుక్త మంత్రిమండలి ఏర్పడింది. కాని అక్కడ సమరస భావము లేదు. తీవ్రమైన రాష్ట్రాభిమానము. నీచమైన రాష్ట్రద్రోహము-ఈ రెండు భావనలు ఒద్దికగా ఒకచోట ఉండడము సాధ్యం కాదు. పులిని ఆవును ఒకేబోనులో ఉంచినట్లుగా ఉన్నదది, కొంచెము శాంతి కనుపించగానే పులి గాండ్రించ నారంభిస్తుంది. పంజావిప్పి గోళ్ళు కనబరుస్తుంది. పండిట్‌జీకి ప్రభుత్వము నడపడము కష్టమైపోయింది.

## రాజ్యాంగ నిర్ణాయక సభకు ఏర్పాటు

1946 జూలై నెలలో ముందు నిశ్చయించుకున్నట్లుగానే రాజ్యాంగ నిర్ణాయక సభకు ఎన్నికలు జరిగాయి. డిశంబర్ 9వ తేదీన ఢిల్లీలో డా॥ సచ్చిదానంద సిన్హా అధ్యక్షతన ఈ సభ ప్రథమ సమావేశము జరిగింది. ఈ సభనుకూడ ముస్లిములీగు బహిష్కరించింది ఈ బహిష్కారాన్ని లెక్కచేయకుండా 'ఘటనా సమతి' కార్యము ప్రారంభింపబడింది. డిశంబర్ 11వ తేదీన రాజ్యాంగ నిర్ణాయక సభకు శాశ్వత అధ్యక్షుడుగా డా॥ రాజేంద్రప్రసాద్ ఎన్నుకొనబడినాడు. డిశంబర్ 13 వ తేదీన జవాహర్లాలు నెహ్రూ "హిందూదేశము స్వతంత్ర సార్వభౌమ రాష్ట్రము" అని మన దేశ రాజకీయ ధ్యేయాన్ని నిశ్చయించే తీర్మానమును ఆమోదింపజేసాడు.

## లీగ్ సహాయ నిరాకరణ

ఇప్పటివరకు ముస్లిములీగు మంత్రుల సహాయ నిరాకరణ విధానము వలన చాల కష్టము కలిగింది. పండిత్‌జీ క్రుద్ధుడైనాడు. మంత్రి మండలి ప్రముఖుడుగా లీగ్ సభ్యులు తమ స్థానాలు వదలుకొనునట్లు చేయవలసిందని ఆయన వైస్రాయిని కోరాడు. కాని తాత్కాలిక ప్రభుత్వము నుండి తమ స్థానాలను వదలుకొనడానికి లీగ్ ఏమాత్రం సిద్ధంగా లేదు. పాకిస్తాన్ సంపాదించుకోడానికి వారికి అక్కడే మంచి అనుకూలము ఉంది వైస్రాయి లార్డ్ వేవెల్ బుద్ధికూడ భ్రమించింది. అతనికి సంధి ప్రయత్నాలతో అణుమాత్రమైనా సఫలత కనుపించలేదు. విఫలుడై ఈ సేనాని వైస్రాయి పదవిని వదలుకొనవలసి వచ్చింది.

## రాజ్యత్యాగ ప్రకటన

1947 ఫిబ్రవరి 20వ తేదీ. బ్రిటిష్ పార్లమెంటులో ప్రధాన మంత్రి అట్లీ ఒక ముఖ్య ప్రకటన చేసాడు. అది తాము హిందుదేశముపై

రాజ్యాధికారాన్ని వదలుకుంటున్నట్లు ప్రకటన. పరాజయాన్ని అంగీకరించే ప్రకటన. స్వాతంత్ర సమరంలో మన విజయాన్ని సూచించే ప్రకటన. కాని జాగ్రత్తగా స్వీకరించిన పరాజయమది. ఈ తిరోగమనము ప్రణాళికాబద్ధము. ఈ ప్రకటన చేస్తూ అట్లీ ఇలాగ అన్నాడు :

"హిందుదేశ పరిస్థితి చాల గంభీరంగా ఉన్నది. హిందుదేశపు క్లిష్టసమస్య పరిష్కారం కావాలనే ఉద్దేశంతో మేము 1948 జూన్ లోపల రాజ్యాధికారాన్ని వదలుకుంటున్నాము. ఆ అధికారము భారతీయులకు ఏవిధంగా అప్పగించబడవలెనో, దానికి తగిన ఏర్పాటు చేయబడుతుంది. అందుకొరకు లార్డ్ లూయీమౌంట్ బాటెన్ నియామకము జరుగుతుంది."

ఈ ప్రకటన ప్రకారము మౌంట్ బాటెన్ నెల రోజుల లోపలనే, అనగా మార్చి 24 వ తేదీన హిందుదేశానికి వచ్చాడు. వెంటనే వివిధ నాయకులతో చర్చలు ప్రారంభించాడు. పంజాబులోని హిందూ, ముస్లిము సంఘర్షణల తీవ్రస్వరూపమును, బెంగాల్‌లోని భీషణ హత్యాకాండను ఆయన అర్థం చేసుకున్నాడు. భారతీయ నాయకులతో సుదీర్ఘమైన చర్చలు జరిపి, వెంటనే సంప్రదింపులకై ఇంగ్లాండుకు వెళ్ళాడు.

ఈ సమయంలో భారతదేశ పరిస్థితి చాల క్లిష్టంగా ఉంది. దేశంలో హింసాత్మకమైన వాతావరణాన్ని ముస్లిములీగు బుద్ధిపూర్వకంగా నిర్మిస్తూఉంది. బెంగాల్ పంజాబులలో విభజనకొరకు ఆందోళన ప్రారంభమైంది. హిందూదేశము అఖండంగా ఉండడముకోసము ఆర్థిక ధార్మిక, చారిత్రక, సాంస్కృతిక, సైనిక దృక్కోణాలనుండి కారణాలు చూపి జిన్నా మనస్సు మార్చడానికి భారతీయ నాయకులు ప్రయత్నాలు చేస్తున్నారు. కాని తమ స్వార్థంకోసము ఈ దేశాన్ని విభజించి ముసల్మానులకు ప్రత్యేకంగా పాకిస్తాన్ ఇవ్వగల సామర్థ్యశాలి అయిన శక్తి జిన్నాకు వెనుక ఉన్నది. ఇటువంటి పరిస్థితిలో అతడెందుకు అంగీకరిస్తాడు !

ఈ వాతావరణంలో మౌంట్‌బాటెన్ ఒక పథకము తీసుకొని భారత దేశానికి తిరిగి వచ్చాడు. ఆయన 1947 జూన్ 3వ తేదీన ఈ పథకాన్ని ప్రకటించాడు.

## మౌంట్ బాటెన్ పథకము

ఆ పథకము యొక్క స్వరూపమిది; 1948 జూన్‌లో ఆంగ్లేయులు హిందుదేశమునుండి వెళ్ళిపోతారు. అందుకోసము 1947 ఆగష్టు 15వ తేదీన ఈ మార్పిడి కాలములో ప్రభుత్వము నడిపేందుకు ఒక తాత్కాలిక ప్రభుత్వము స్థాపింపబడుతుంది. ఈ ప్రభుత్వానికి అధినివేశ ప్రభుత్వస్థాయి అధికారాలు ఇవ్వబడగలవు. హిందుదేశము వీలైనంత మటుకు అఖండంగా ఉంటుంది. అది సాధ్యం కాకపోతే పంజాబు, బెంగాల్ ప్రాంతాలు విభజింపబడగలవు. పశ్చిమ పంజాబు- తూర్పు బెంగాల్‌లో ముసల్మానులు అధిక సంఖ్యలో ఉన్నందున పాకిస్తాన్‌లో కలిసిపోగలవు. ఇదిగాక సింధు ప్రాంతముకూడ అందులో ఉంటుంది. వాయవ్య సరిహద్దు ప్రాంతము, బెలూచి స్థానము తమ ప్రజల యిష్టాను సారము స్వతంత్రంగా ఉండడం కాని, పాకిస్తాన్‌లోనైన, హిందుస్థాన్‌లో నైన చేరడంగాని చేయవచ్చు. అస్సాములోని ముస్లిములు హెచ్చుగా నున్న సిల్హెట్ జిల్లా తూర్పు బెంగాలో కలిపివేయబడుతుంది. ఆంగ్లేయులు ఇక్కడనుండి వెళ్ళిపోయిన మీదట స్వదేశ సంస్థానాలు స్వతంత్ర ప్రతిపత్తిని పొందగలవు. అని స్వతంత్రంగా ఉండవచ్చు; లేదా పాకిస్తాన్‌లోనైన, హిందుస్థాన్‌లోనైన చేరవచ్చు.

## పాకిస్తాన్ పెనుభూతము పైకిలేచింది

ఈ ప్రణాళిక ప్రకటింపబడడంతో, హిందుదేశ సమైక్య స్వరూపము విచ్ఛిన్నమైంది. భారత మాతృ విముక్తి కోసము మనము

90 సంవత్సరాల సుదీర్ఘ సఫరం సాగించాము. మనము ఈనాటివరకు హిందుదేశ సమగ్రతయొక్క సుందర స్వప్నాన్ని దర్శిస్తూ ఉన్నాము. ఆ కల కరిగిపోయింది. రాష్ట్రద్రోహులైన ముసల్మానుల కొట్లాటల యెదుట మనము తలవంచాము. దేశాన్ని ముక్కలుచేసి స్వాతంత్ర్యము తెచ్చు కోవలసిన పరిస్థితి ఏర్పడింది. మరొక మార్గమేమీ లేదు. మహాత్మాజీ మనస్సు కలవరపడింది. ఇది యేమి స్వరాజ్యమని ఆయన స్పష్టంగా అడుగసాగాడు. "ఈ దేశంలో కలిసిమెలిసియున్న ఇద్దరు సోదరులు స్వాతంత్ర్యము కోసము కలిసికట్టుగా పోరాడిన ఇద్దరు సోదరులు, స్వాతంత్ర్యము గుమ్మము దగ్గరికి వచ్చిన సమయంలోనే ఒకరిపై ఒకరు కత్తిదూసి, దేశాన్ని ముక్కలు చేయగోరడం స్వాతంత్రయోధులకు కీర్తిదాయకమా ?" అని అడిగాడు.

## హిందుస్థాన్ స్వతంత్రమైంది

లార్డ్ మౌంట్‌బాటెన్ ప్రణాళిక ప్రకారము భారత స్వాతంత్ర్య తీర్మానము బ్రిటిష్ పార్లమెంటులో 1947 జూలై 4వ తేదీన ప్రవేశ పెట్ట బడింది. 1947 జూలై 18వ తేదీన పార్లమెంటు దానిని ఆమోదించింది ఇంగ్లాండుదేశపు రాజుకు 'భారతదేశ చక్రవర్తి' బిరుదు తీసివేయబడింది. హిందుస్థాన్, పాకిస్థాన్‌లలో స్వతంత్ర ప్రభుత్వాలు నెలకొన్నాయి. జూలై 19వ తేదీన 12గంటలకు హిందూదేశ విభజనము ప్రకటింపబడింది. జిన్నా పాకిస్తాన్‌కు మొదటి గవర్నర్ జనరల్ అయినాడు కరాచీ పాకిస్తాన్ రాజధానిగా నిర్ణయింపబడింది. లార్డ్ మౌంట్‌బాటెన్ హిందుస్థాన్ గవర్నరు జనరల్ అయినాడు. ఆగష్టు 14-15 మధ్య రాత్రి పన్నెండు గంటలకు పాకిస్తాన్, హిందుస్థాన్‌లు స్వతంత్రమైనట్లు ప్రకటింపబడింది. హిందుదేశము మీద ఇంగ్లాండు పెత్తనము ముగిసింది. త్రివర్ణ పతాకము దుఃఖముతోనే అయినా సగర్వంగా ఢిల్లీలోని లాల్ ఖిల్లాపై



1947 ఆగష్టు 15 న భారతదేశము స్వతంత్రమైంది. ఢిల్లీలోని ఎఱ్ఱకోటపై త్రివర్ణపతాకం ఎగురవేయబడింది.

ఎగిరింది. ఇప్పుడు దానికి చెందిన గంగాయమునలు మాత్రము స్వతంత్రమైనాయి మరి సింధు? సింధును రాష్ట్రద్రోహులైన ముసల్మానులు మననుండి వేరుచేసారు. అది హృదయ శల్యమై గుచ్చుకుంటూ ఉంది. ఇప్పుడు శతశరత్తుల పుణ్యఫలము లభించింది. హుతాత్మల బలిదానము ఫలించింది. అశోకుని కాలమునుండి నేటివరకు భారతదేశ చరిత్రలో ఇంతటి అదృష్టదాయకమైన దినము మరొకటి లేదు. భారత స్వాతంత్ర్య చరిత్రలో సువర్ణాక్షరాలతోలిఖింపదగిన క్షణమిది. 'ఖడ్గము, కమలము', 'పౌరుషము-పవిత్రత' ఈ క్షణములో సగర్వంగా తలలు పైకెత్తాయి, దివంగుతులయిన దేశభక్తుల ఆత్మలు సంతోష భాష్పాలు రాల్చాయి. ఆ అశ్రుపుష్పాలు నిర్భయతా సుగంధాన్ని దశదిశలలో వ్యాపింపజేసాయి, పితృతుల్యులైన పెద్దలు ఆనందంలో పరవశులైనారు. వారి ఆనందాశ్రు

వులు స్వాభిమానాన్ని ఇలా వ్యక్తంచేసాయి: "నేడు మేము తల ఎత్తుకో గలుగుతున్నాము. ఇప్పుడిక ఎవరికీ మేము తలవంచము మమ్మల నెవరూ కూడ లొంగదీయలేరు. అవమానం పాలైన మా జీవనము నేడు స్వాభి మానంతో నిలడింది."

భారతీయ స్వాతంత్ర్యసమరము ఈనాడు ఒక మహత్తర విజయాన్నిసాధించి పూర్తి అయింది. మాతృభూమి చిత్రపటములో ఉన్న భూమి సంపూర్ణంగా బ్రిటిషు దాస్యమునుండి విముక్తి పొందింది. కాని అది విభజింపబడింది. అఖండ హిందుస్థానము రెండుగా ఖండింపబడిందని మనస్సు బాధపడుతుంది.పాకిస్తాన్ కంటె ముందుగా మనము బర్మా, సింహళము భూభాగాలను పోగొట్టుకున్నాము. స్వరాజ్యము వచ్చింది. ఇప్పుడు సురాజ్యము సమృద్ధి, స్వశక్తి సంపాదించుకోవలసిఉంది. వీని బలము మీద ఒకనాడు పోగొట్టుకున్న ప్రదేశాన్ని మనము తిరిగి సంపాదించుకుంటాము. భారతదేశాన్నితిరిగి అఖండము చేస్తాము. ఇప్పుడు జ్ఞాత- అజ్ఞాతవీరులకు నమ్రతా పూర్వకంగా అభివాదనము చేద్దాము. వారి త్యాగంతోనే ఈ స్వాతంత్ర్యము రూపుదాల్చింది. వారికి సగౌరవంగా శ్రద్ధాంజలి అర్పిద్దాము.

మనదేశము స్వతంత్రప్రతిభతో పరమవైభవ శిఖరానికి చేరు కుంటుంది. ప్రపంచానికి అజేయమైనశక్తిని, సచ్ఛీలాన్ని ప్రసాదిస్తుంది. మిత్రులారా! కోట్లకొలది కంఠాలతో భారతమాతకు జేజేలు చెపుదాము భారత మాతాకీజై.

# ఉపసంహారము

# పూర్వవైభవం ఆధారంగా ఉజ్జ్వల భవిష్యత్తు

**1947** ఆగష్టు 15 శుభదినాన మనదేశము స్వతంత్రమైంది. కుటిల రాజనీతి. ఉన్మత్త ఖడ్గశక్తి సహాయంతో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించిన బ్రిటిషు సామ్రాజ్య శక్తి భయభ్రాంతమై క్రిందికి దిగింది. కిమ్మనకుండా దేశము వదలి వెళ్ళిపోయింది. స్వాతంత్ర్య వీరసావర్కార్ ఈ సంఘటనను శరీరాలు పులకరించేలా వర్ణించారు ఆయన మాటల్లో—

"కత్తిబలంతో సామ్రాజ్యాన్ని జయించి, కత్తిబలంతోనే పరిపాలిస్తానని మదోన్మత్తమై గర్జించిన బ్రిటిషు సామ్రాజ్యశక్తి, ఏ పడమటి సముద్రమునుండి హిందూదేశము మీదికి దండెత్తివచ్చి, ఏ ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించిందో, ఆ ఢిల్లీ సింహాసనం మీదనుండి దానిని క్రిందికి పడలాగి, దాని గర్విష్ఠ గర్జనను తుత్తునియలు చేసి, మరల అదే పడమటి సముద్రమువరకు దానిని తరిమి తరిమి ఆపడమటి సముద్రములోనే ముంచివేసాము. పరాజితులైన బ్రిటిషు సైనికులు మనకు వెన్నుచూపి,

తలవంచుకొని, ఆ పడమటి సముద్రము నుండే తిరిగి వెళ్ళడము మనము కళ్ళారా చూదాము."

స్వాతంత్ర్య వీరసావర్కర్ భావావేశము ఎంత అర్ధవంతము ఎంతస్వాభిమానపూరితము: బ్రిటిష ప్రభుత్వాన్ని ఓడించడంలో ఆయన పాత్ర నిరుపమానము. ఇంతెందుకు? ఆయన జీవనమే స్వతంత్రసమరానికి రూపెత్తిన చరిత్ర. అక్షయమైన ధ్యేయనిష్ఠ. ఎనలేని త్యాగము అపార మైనకష్ట సహిష్ణుత, ఆజన్మ సేవావ్రతము- ఈ శ్రేష్ఠగుణాలు ఆ మహా పురుషునిలో మూర్తీభవించి ఉన్నాయి. ఆయన స్వతంత్ర్య సమరానికి మహామంత్రద్రష్ట, వీరసేనాపతి, ఆయన ప్రతిభ దర్శించిన సుందర స్వప్నము-"ఈ దేహముతోనే, ఈ కళ్ళతోనే" ప్రత్యక్షంగా చూడగల అదను రాగలదని కలలోనైనా అనుకోని ఆ రూపులేని చిత్రము— రూపాన్ని ధరించి, కలలు నిజమైన ఆ క్షణాన ఆయన ఆనందము వర్ణనాతీతము, ఆ పవిత్రదినాన ఆయన తన మేడమీద స్వతంత్ర భారత విజయపతాకను సగర్వంగా ఎగురవేసి, కృతజ్ఞతాభివందనము చేసారు.

## స్వతంత్రతా మహాయజ్ఞము

ఈ క్షణము రావడంకోసము మన పూర్వులు ఎడతెరపు లేకుండా వంద సంవత్సరాలు అపూర్వమైన ఉగ్ర సంగ్రామము నడిపారు. రణ యజ్ఞము నిరంతరము ప్రజ్వలిస్తూ ఉండునట్లుగా చూచారు. తమప్రాణాల ఆహుతులను అనవతరము అర్పించారు. రణచండి కోరినవాని నన్నిటిని సమర్పించారు ఈ ఉగ్రసాధన వారెందుకు చేసారు? హౌతాత్మ్యమనే అఖిలజ్వాలలను వారెందుకు కౌగలించుకున్నారు? 'స్వవంశాన్ని నశింప జేసి అఖండ వంశములో జీవిస్తాము' అను ప్రేరణ వారికిచ్చినదెవరు? "విప్లవ వేదికమీద అర్పించడానికి మేము మా యౌవన సుగంధాన్ని తెచ్చాము." అనే సమర్పణ భావాన్ని వారిలో మేల్కొలిపిందెవరు?

అసంఖ్యాకంగా విఘ్నాలు అడుగడుగునా ఎదురైనప్పటికీ తమ నిశ్చయాన్నుండి ఆవంతయైనా వెనుకంజవేయని వజ్ర కఠోరత వారిలో నిర్మించినదెవరు? యుద్ధోత్సాహము, దేదీప్యమానమైన స్వాతంత్ర్యాకాంక్ష, వారి రోమరోమంలో నింపినదెవరు? ఈ విషయాలన్నిటియొక్క యథార్థ జ్ఞానము పొందడానికే మనము భారత స్వాతంత్ర్య సమరచరిత్రను పరిచయము చేసుకున్నాము.

## స్వాతంత్ర్య ప్రాప్తికి కారణము

ఇంతటి తీవ్ర ప్రయత్నాలద్వారా, అపారమైన కష్టాల ద్వారా మనము సంపాదించుకున్న స్వాతంత్ర్యము ఒక మహోదర్యానికి ప్రాథమిక సాధనము. "కృణ్వంతో విశ్వమార్యమ్" అన్నది మన అచంచల ఆదర్శము.

ఐదువేలు-కాదు, ఏడువేల సంవత్సరాల అఖండ అమర సంస్కృతి మనది. నరుని నారాయణుని చేయడానికి ఆశావాదమును వ్యక్తిలో అణపరాని చైతన్యమును నిర్మాణముచేసే స్ఫూర్తి కేంద్రమగు హిందుధర్మము మనది. ప్రపంచము అసూయపడ దగినంతటి ప్రాచీనతమమగు భారతభూమి మనది. శ్రీరామచంద్రప్రభువు, శ్రీకృష్ణభగవానుడు యుగపురుషుడు శివాజీవంటి తేజోమూర్తుల పరంపర మనది. ఈ పరంపర ఈ భూమి ఈ సంస్కృతి పరమ వైభవశాలి కావడానికి, 'కర్తవ్యము కోసము కర్తవ్యము, శీలముకోసము శీలము' అను ఉజ్జ్వల భారతీయ ఆధ్యాత్మిక జీవనదృష్టి సర్వమానవులలో ఉదయింపజేయడానికి మనవారీ స్వాతంత్ర్యము సంపాదించారు. భారతవర్షము మరల స్వతంత్రమైంది. ఇప్పుడీ స్వాతంత్ర్యమును మనము తన, మన, ధన, ప్రాణాలు ఒడ్డి సంరక్షించాలి. గ్రీకులు వెళ్ళిపోయారు. హూణులు వెళ్ళిపోయారు.

శకులు వెళ్ళిపోయారు. ఆంగ్లేయులు వెళ్ళిపోయారు. కాని ఇకముందు మరెవ్వరుకూడ రావడానికి సాహసించలేని పరిస్థితి మనము నిర్మించాలి.

## ఆత్మ విస్మృతి అనే నివురు

ఈ పరిస్థితి ఏ విధంగా నిర్మించబడుతుంది? ఈ ప్రశ్నకు సమాధానము స్పష్టమే. ఆత్మవిస్మృతి అనే నివురు తొలగించడంతో, ఎప్పుడెప్పుడు మనలో 'స్వ' మరపుకు వస్తుందో అప్పుడంతా మనము సర్వము పోగొట్టుకొని కూర్చున్నాము. వాస్తవానికి స్వధర్మము మానవునికి సహజంగా లభిస్తుంది. మానవుడు స్వాభావికంగానే దానిని ఆచరించాలి. ఈ విషయంలో వినోబాజీ ఇలా వ్రాస్తారు— "స్వధర్మ సిద్ధాంతము కర్తవ్యరూపమైనది. స్వధర్మము మనకు స్వాభావికంగానే లభిస్తుంది. స్వధర్మముకోసము వెదకనవసరంలేదు. మనము ఆకాశము నుంచి ఊడిపడి, నేలమీద నిలవడములాంటిది జరగలేదు. మనము పుట్టక ముందే ఈ సమాజమున్నది. మన తల్లి దండ్రులున్నారు. ఇరుగు పొరుగువారున్నారు. ఇటువంటి ప్రవాహంలో మనము జన్మించాము. ఏ తల్లిదండ్రుల వెచ్చని ఒడిలో పుట్టిపెరిగానో, వారి సేవ చేయవలసిన ధర్మము నాకు పుట్టుకతోనే లభించింది. ఏ సమాజములో జన్మించానో ఆ సమాజసేవచేసే ధర్మము నాకు స్వాభావికంగానే లభించింది. మన పుట్టుకతోనే స్వధర్మముకూడ పుడుతుంది; గాక పుట్టుకకు ముందే మన కోసము సిద్ధంగా ఉంటుందనికూడ చెప్పవచ్చు. ఎందుకంటే, అది మన జన్మకు కారణము. దానిని పూర్తిచేయడానికే మనము జన్మించాము.'

మిత్రులారా! స్వధర్మము మనతల్లి. స్వదేశము మనతల్లి. ఈతల్లి పట్ల అపార గౌరవభావన నిరంతరము మన మనస్సులలో నిండి ఉండాలి. మన పూర్వులు స్వదేశ, స్వధర్మ విముక్తికోసము ఈయుద్ధం చేసారు.

కాబట్టి మనము ఇకముందు 'స్వ'ను ఎప్పుడుకూడ మరపునకు రానియ్య మని హృదయ పూర్వకంగా ప్రతిజ్ఞ తీసుకోవాలి.

## నేను భారతమాత సుపుత్రుడను

మనదేశము భారత్. ఇది మన మాతృభూమి ఈ భూమియే మన పాలన, పోషణ చేస్తున్నది. ఈ భూమి అంకసీమలోనే మనము ఆడుతూ పాడుతూ ఉన్నాము ఈ భూమిపై ప్రవహించే నదులు, ఇందలి పర్వతాలు ఇక్కడి వృక్ష లతాదులు, ఇక్కడి వనచరాలు, ఈ భూమిపై ప్రసరించే వాయువీచికలు పరమ పవిత్రమైనవి. ఈభూమిలో ప్రతి అణువూ పవిత్రమే. ఈ భూమి నా తల్లి. నేనామె బిడ్డను బిడ్డ అని పిలిపించుకో గానే మనతల్లి సుఖము కోసము అన్నిపనులు చేయవలసిన బాధ్యత మనదే అవుతుంది. మన తల్లి యోగక్షేమాల సర్వ బాధ్యతలు కేవలము మనవే అవుతాయి.

1947 అగస్టు 15వ తేదీన భారతమాత స్వతంత్రమైంది. ఈ గడ్డ మీదినుండి బ్రిటిషు ప్రభుత్వము కాలు కదిపింది. కాని వెళ్ళుతూవెళ్ళుతూ మనదేశాన్ని విభజించి పాకిస్తాన్ రూపంలో దేశ సరిహద్దుల్లో తలనొప్పి సృష్టించి మరీ వెళ్ళింది. దేశంలోని 568 సంస్థానాలకు స్వయం నిర్ణయాధి కారము ఇచ్చి ఈదేశాన్ని ముక్కలుముక్కలుచేయడానికి కుట్రపన్నింది. అయితే సర్దార్ వల్లభభాయి పటేల్ ఈ పన్నాగాన్ని ఎంతో నేర్పుతో విఫ లము చేసి దేశ సమైక్యతను కాపాడాడు. అందుకోసము ఆయన అవ సరాన్ననుసరించి బల ప్రయోగముకూడ చేయవలసి వచ్చింది. కాని దురుద్దేశంతో నిలచిన పాకిస్తాన్ ఈ భూమిలోని భాగాలు ఆక్రమించడానికి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నది. చివరకు లాల్ బహాదుర్ శాస్త్రి దానిని దారికి తేవడానికి బలప్రయోగము చేయవలసివచ్చింది. మిత్రులారా! ఈ భూమి సరిహద్దులకు ఆపద రాకుండుటకై కోసము మనము సామర్థ్యాన్ని

ఆరాధించాలి. ఈ భూమిలోని ప్రతి అణువును రక్షించడం కోసము ఎల్లప్పుడు సిద్ధంగా ఉండాలి.

## దివ్యలోకము సాకారమవుతుంది

మన ఈ ప్రియతమ దేశము ఒకనాడు సువర్ణభూమి. జ్ఞానులకు, మహాత్ములకు, శరవర్తులకు జనని. మానవ ధర్మానికి మహా ప్రవక్త. ఆమె పూర్వ వైభవాన్ని మరల ఆమెకు సంపాదించిపెట్టవలసినబాధ్యతను నేడు మనము సగర్వంగా స్వీకరించాలి. విశ్వకవి రవీంద్రుని స్వతంత్రతా దివ్యలోక వాతావరణంలో కొంచెముకూడ భయానికి తావులేదు. ఆ భూమిమీద తలయెత్తి తిరగడానికి సంకోచము కలుగదు. ఆ భూమిలో జ్ఞాన సంపాదనామార్గంలో అవరోధాలుండవు. అక్కడ సంకుచిత స్వభావము మచ్చుకైనా కన్పించదు అక్కడ శుద్ధ సత్యము తప్ప ఇతర శబ్దమే నోటినుండి వెలువడదు. అక్కడ అవిరళ క్రియాశక్తి చేతులను పూర్ణత్వము వైపుకు విస్తరింపజేస్తుంది. అక్కడ నిర్మల వివేకధారా స్రవంతి పాడుపడిన ఆచారాల భయంకర మరు భూమిలో మరుగుపడి పోదు. అక్కడ నివసించే ప్రజల మనస్సులు ఎల్లప్పుడు విస్తరించే భావాలవైపుకు, ప్రయత్నాల దెసకు మొగ్గుతాయి. అటువంటి స్వర్గసమానమైన దివ్యలోకానికి, ఆ స్వప్నానికి మాతృభూమిలో మనమే రూపురేఖలు తీర్చిదిద్దాలి. సాకారం చేసుకోవాలి. ఆ నిర్భయ వాతావరణము ఆ స్వాభిమాన సంపన్నత, ఆ జ్ఞానపిపాస, ఆ సత్య ప్రియత్వము, ఆ క్రియాశీలత, విజ్ఞానాధిష్ఠితమైన ఆ పూర్ణప్రజ్ఞ, ఆ ఉన్నత భావాలు, ఆ సత్ప్రవర్తన మనమే ఈ భారత భూమిలో నిర్మాణము చేయాలి. అన్ని విషయాలలో మనము ఈ దేశాన్ని స్వతంత్రము చేయాలి.

## రాష్ట్రధర్మ మహత్త్వము

ఈ దేశముయొక్క ఉత్కర్ష, వైభవము, ఐశ్వర్యము నేడు మన మీదనే ఆధారపడి ఉన్నాయి. వ్యక్తి వికాసముమీద రాష్ట్రవికాసము ఆధారపడి ఉంటుంది. కాబట్టి మనము రాష్ట్రధర్మము రూపంలో విజయాకాంక్ష, అపార త్యాగానికి సంసిద్ధత, అద్భుత సాహస ప్రవర్తన, నిరంతర జాగరూకత, మొదలైన సద్గుణాలు మనలో ఒక్కొక్క వ్యక్తిలో వికసింపజేసుకోవాలి. అందుకై పరిశుద్ధమైన ప్రవర్తన, స్త్రీలు, పెద్దలపట్ల గౌరవభావన. ప్రతి విషయంలోను నిజాయితీ, నిరంతరము కృషిచేయడానికి సంసిద్ధత, చిన్న చిన్న పనులుకూడ సకాలములోచేసే అభ్యాసము ఇటువంటి అలవాట్లు మనలో నిర్మాణము చేసుకోవాలి. నేను దేశంకోసము. నేను సమాజముకోసము అనే భావన మన ప్రతి కార్యంలోను ప్రతి ఫలించాలి. చదువుకునే సమయంలో, ఆడుకునేవేళల్లో, ఇంట్లో ఉన్నప్పుడు సమాజంలో సంచరిస్తున్నప్పుడు, మనముచేసే ప్రతి పనిలోను, నేను మహనీయుల పరంపరకు చెందినవాడను, ఈ పరంపరలో ఏ మాత్రం లోపము రానియ్యను అనే భావన కనిపించాలి. మనస్సులో ఈ విధమైన అనుభూతి పొందడమే అంతర్బాహ్య రూపాలలో రాష్ట్రీయుడు కావడం. రాష్ట్రీయ దేవత్వము మనలో నిర్మాణంచేసుకోవాలి. స్వార్థము, లోభము. మోహము, చివరకు మరణముకూడ రాష్ట్రహితమందు తుచ్ఛంగా కనపడే స్వభావమే రాష్ట్రీయ స్వభావము. ఇటువంటి శీలమే రాష్ట్రీయ శీలము. ఈ శీలముయొక్క తేజోప్రభావము అపరిమితము. స్వతంత్ర సమర చరిత్ర మనకీతేజస్సును అందిస్తుంది.

### ఖడ్గము-కమలము

భారత స్వాతంత్ర్య చరిత్ర ఉన్నత త్యాగాల వీరగాథ. శ్రేష్ఠతమ కర్తవ్య భావనం. పుణ్య బలిదానాలగీత. చిరంతన స్ఫూర్తికి గంగ్రోత్రి,

ఆదర్శ కిరణాలకు దేవతాత్మ హిమాలయము. ఖడ్గము-కమలము ఈ సంగ్రామానికి సంకేతాలు. పౌరుషము-పవిత్రత, ధర్మము – సంస్కృతి, వీని సాకార ప్రతీకలు. ఈ ఖడ్గ కమలము ఉపాసనతో అనేక తరాల వారికలలు రూపు దాల్చాయి. కోట్లకొలది హుతాత్ముల బలిదానము సార్థకమైంది. భారతదేశము ఖండితమే అయినప్పటికీ స్వతంత్రమైంది. ఈ అజేయ ఖడ్గము, పుణ్య సలిల కమలములే భారతదేశాన్ని పరమ వైభవ స్థితికి కొనిపోగలవు; ఖండిత భారతదేశాన్ని అఖండం చేయగలవు. ఇవే విశ్వతారకమగు ఏకాత్మతను, పరమోచ్చమగు త్యాగమును, శక్తి సామర్థ్యాలను, తీవ్రతమగు దేశప్రేమను ప్రతి వ్యక్తిలోను మున్నెన్నడు లేనంతగా మేల్కొల్పగలవు. సకల మానవులలో కర్తవ్యము కోసమే కర్తవ్యము, శీలము కోసమే శీలము' -అను మహత్తర ఆధ్యాత్మిక జీవన దృష్టిని ఉదయింపజేయగలవు.

భారత మాతాకీ జై.

  